శ్రీ

మేధాదక్షిణామూర్తయే నమః.

# శ్రీ సీతామాహాత్మ్యము

అను పేర పెద్ద ప్రబంధమై

# శ్రీ అద్భుతోత్తర రామాయణము

అనబడు చిన్నపురాణము

దీనిని

బందరు హిందూ బ్రాంచ్ స్కూల్ హెడ్మాస్టరగు

## నాదెళ్ల పురుషోత్తముడు

రచియించి

చెన్నపురి కపాలీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటించెను.

1907

 [దీని వెల రూ. 1-8-0.

# విజ్ఞాపనము.

1. పండితోత్తములారా! ఎట్టులయిన నిందలిపదములన్నియు సార్థకములుగ జేయనేదయజూడుడీ. దాన తమయోర్పును యోగ్యతయుం బ్రకాశింపగా తాము నిలువబెట్టుటనే నా గ్రంథము శోభించు నన్న సంతోషలాభము నాకబ్బు. ఎంతమాత్రమును స్వాధీనముకాని తప్పుమాటలున్న దయచేసి నాకే తెలియపఱుపుడు. అభివందన పూర్వకముగా నందికొని దిద్దికొనెదను.

2. కవీశ్వరులారా! మాయాకృతిపతి యొక్కరినేలినయ్య కాడు. లోకసామాన్యప్రభుడు. కాన నేనెవ్వరి యాస్థానగౌరవములకు నడ్డమువచ్చినవాడనుగాను. సద్భావముతో జిత్తగించి యాదరింపనే చూడుడు. పరశ్రేయసహనము త్తమ ధర్మమని మీరును గ్రంథములందు వ్రాయుచునేయుందురుగదా. ఇందు తప్పులున్నపట్లు దిద్దుబాటువిధము నాకే వ్రాయింపుడు. మీ యుపకారమును చెప్పికొనుచు దిద్దికొనెదను.

3. విద్యార్థులారా! ముందిందలి విషయసూచికను చదివి కథ యవగాహన జేసికొని యాపయిని గ్రంథముంజదువ మొదలిడుడు. తెలియనిమాట యొక్కడనేనొక్కటిరావచ్చు. ఏ డిక్షనరీచూచినను సులభముగానె యర్థముకానేవచ్చు. నేనును మీమాత్రపు చదువరినే కాన పండితకవులుచేసిన కబ్బములందువలె మిమ్ముల ద్రిప్పుల బెట్టు మాటలిందుగుప్పలేదు. ఇంతగ్రంథములోను అక్కడక్కడ ఏ అరడజనోతప్ప మిమ్ముబెడమార్గములబెట్టు శృంగారపద్యము లట్టిలేవు.

వీలయినంత యెక్కువగా మిగుల ముఖ్యములగు నీతులున్నవి. ఇది విశ్వసనీయమని నమ్మి చదువుడు.

4. వైష్ణవులారా! కథయెల్లను విష్ణువిలాసాభివర్ణనమేయాయె. మీ రెంత యాదరమున జూడనగునో అట్లె చిత్తగింపుడు.

5. శాక్తేయులారా! ఇది సీతామాహాత్మ్యమను పేరిటనొప్పు గ్రంథము. పర్యవసానమున పరాశక్తిప్రభావము తేలి యాపై శ్రీరామాభివర్ణితమైన విషయమాయె. ఇంక నేమి మనవి చేయవలె? బహువిసక్తిం జిత్తగింపుడు.

6. శైవులారా! ఇది శివుడనంతవిధముల నభివర్ణింపంబడుచు నానందముతో విన్న ప్రియకథ. దీనిని మీరును అట్లె ప్రియమింప నాయన యానందమింత యంతయన నగునా?

7. వేదాంతులారా! దివ్యజ్ఞాన మలవరచుకొని యహంకారమును నిర్మూలపఱచుట జీవికి బరమధర్మమని తెలుపు నీగ్రంథము తమకును మిగుల విశ్వసనీయమే కదా.

8. భక్తులారా! మీచిత్తము వచ్చినంత యుల్లాసమున హరిహరశక్తుల భజింపం బాడికొనదగినట్లు ఏర్పడిన చిత్రవిచిత్రపద పద్యములపుట్ట. అయ్యా దీనిని మన సాధనములబుట్ట యనికొనవచ్చుగా!

9. ధర్మపరులారా! ప్రవర్తన కర్త్యావశ్యకములైన నీతులున్న దీనిం బ్రీతిం జూడరా!

10. హాస్యప్రియులారా! ఎన్నెన్ని పట్ల నవ్వుదురో ఎన్నికొనుచు మఱి చదువుడు. ఇంతయుత్సాహకరమైన కథమీకు ప్రీతియేయనరా!

11. గాయకులారా! మీకును విశ్వసనీయములగు నంశములు చాలనున్నవి. యుక్తములేమొ చిత్తగింపుడు.

**12.** రసికులారా! వర్ణనాంశములందు కొద్దిగా క్రొత్తపోకడ లగపడును. ప్రేమతో పరిశీలింపుడు. బాగుగనే యుండవచ్చును.

**13.** కవిత్వప్రియుల్లారా! అల్లికవివరమును ఆదరభావముననర యుడు. కష్టప్రయత్నమున నొనగూడినట్లు బహుశః మీకేతోచును.

**14.** నాగరికులారా! విపరీతార్థబోధకములు విశేషార్థద్యోతకములగుచును విషయములన్నియును పీలయినంతవరకు సయుక్తికములుగానున్నవన వచ్చునేమో సద్భావమున జిత్తగింపుడు.

ఓ భువన శోభితులారా!

ఇపుడు భోజరాజులేదు కృష్ణదేవరాయలునులేడు. అంతకును మీరేయున్నారు. మీయానందమేనాకు బహుమానము. మిమ్ము అంతవారితోబోల్చి నేనన్నందులకు మెచ్చి యుదారసాహసములే చూపజూతురేని మీమీహితుల నెచ్చరించి నా యీపుస్తకములను వ్యాపింపజేయ దయజూడుడు. మీకృపయుంటే దీనిని భారతమువలె ధర్మములు బోధించునందురు. భాగవతమువలె భక్తిగల్గించునందురు. రామాయణమువలె సత్కథవినుచునందురు. లేకుంటే లల్లాయపదము లందురు. ఏమైననను మీచేతనుంచితి. నాప్రాప్తమెట్లుండునో చిత్తగింపుడు.

బుధవిధేయుడు,

నాదెళ్ల పురుషోత్తముడు.

బందరు,
ది 1 సెప్టెంబరు 1906.

# What Sri Swami Vivekananda Says about Sita.

"And what to speak of Sita? You may exhaust the literature of the world that is past, and I may assure you, will have to exhaust the literature of the world of the future, before finding another Sita, Sita is unique; that character was once depicted and once for all Ramas have been perhaps, several, but Sitas never. She is the very type of the Indian woman as she should be, for all the Indian ideals of a perfected woman have got around that one life of Sita, and here she stands, these thousands of years commanding the worship of every man, woman or child throughout the length and breadth of the land of Aryawarta. There she will always be, glorious Sita, purer than purity itself, all patience and all suffering. She who suffered that life of suffering without a murmur, she the everchaste, the ever pure wife, she the ideal of the people, the ideal of the Gods, the great Sita, our national God she must always remain' And every one of us knows her too well to require much delineation. All our mythology may vanish, even ovr Vedas may depart, and our Sanskrit language may vanish for ever, but as long as there will be five Hindus living here speaking the most vulgar 'patois' there will the story of Sita be present, mark my words; Sita has gone into the very vitals of our race. She is in the blood of every Hindu man and woman; we are all children of Sita."

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

# శ్రీసీతామహాత్మ్యమను శ్రీమదద్భుతోత్తర రామాయణముపైని పండిత కవివరాభిప్రాయములు.

1. ఈగ్రంథమందే చేర్కొన్నమద్గురువరులగు

మహారాజశ్రీ కస్తూరి గోపాలరావు పంతులుగారు కరుణించినది.

చ. పురుషవతంసనీకునొక ♦ పూటఁగవిత్వము నేర్పదానినీ
వరమతివృద్ధిచేసి బుధ ♦ వర్గము మేల్భళియంచు మెచ్చఁగా
ధరణిసుతామహత్త్వము సు ♦ ధామధురోక్తులనాంధ్రభాషశ్రీ
కరముగఁజేసినాఁడవది ♦ గాంచికరంబుఁబ్రమోదమందితిన్.

మ. కవితాధోరణికల్గుటబ్బురమహో ♦ కాలక్రమప్రాప్తదుః
ఖవికల్పాదులధైర్యవృత్తిఁదొలఁగం ♦ గాఁద్రోచికావ్యాళిఁగా
కవిలోకంబుననొప్పఁజెప్పుటమహా ♦ త్కృష్టంబుయుష్మత్కవి
త్వవిశేషంబులఁబూరుషోత్తమవచిం ♦ పంజాలునెవ్వాఁడిలన్?

చ. పదములకూర్పునందనును ♦ బద్యవికల్పితచారుగర్భితా
స్పదకవితాధురీణతయు ♦ వంశకుశస్థల ధర్మవర్ణనా
విదితనవార్థసంపదయు ♦ వీనులకింపొదవింప వస్తమి
ష్టిదినిగమంబులందనము ♦ హింజెలువొందదెపూరుషోత్తమా?

తే. ఆదిమాంతిమపద్యద్వ ♦ యంబనీదు । గణితశాస్త్రవివేకాధి ♦ గణ్యతయును
గ్రంథరచనానుకూలధా ♦ రాప్రయుక్త । కవనచాతురియునుదెల్పుఁ ♦ గాదెయరయ

ధృవ. ప్రకృతకాలపుంగావ్యకర్తల ♦ పాకముల్పదగుంభనా
దికవితారసముల్లాసంబున ♦ ధీనిధుల్పరికింపనో
సుకవితావకనవ్యకావ్యము ♦ శుద్ధమైచెలువొందినా
టికరిణంబయిపండితాళిను ♦ తింగనందగియొప్పెడిన్.

2. బందరు హిందూహైస్కూలునందు 46 వత్సరములు ప్రధానాంధ్రోపాధ్యా
యులుగనుండి యిపుడు విశ్రాంతిగొనియున్న విద్యావయోవృద్ధులగు
బ్రహ్మశ్రీ కాశీనాథుని బ్రహ్మయలింగారాధ్యులవారు కటాక్షించినది.

శ్లో. నాదెళ్లవంశదుగ్ధాబ్ధి। యోగలేపేశభూరుహ।
శ్రీదక్షిణాస్యపాదాబ్జ। షసలాయితమానస॥

2. వేదశాస్త్రోక్తపదవీ। సంచారకరణోత్సుక।
ధీరేధ్యకవితాయుక్త। పూరుషోత్తమకోవిద॥

వ. భవత్ప్రణీత ప్రేషిత కృతిరత్నంబును శాణోల్లీఢ రత్నంబుమాడ్కిఁ బరిశీలింపుచు నవలోకించి యపారసంతోషామృతపారాంనిధి వీచికా పరంపరలనవగాహక్రీడల నోలలాడఁ జరించెడి డెందంబుకలవారమైతిమి.

అందువిదగ్ధ జనశ్లాఘాస్పదంబులగు పదంబులును విబుధజనమానసాలంకారంబులగు నలంకారంబులును విపశ్చిచ్ఛ్రవణ కుతుకశ్రవణపుట పర్ణంబులగు వర్ణంబులును సుధీంద్రశ్లోక్యంబులగువాక్యంబులును బరిపుష్టాఖిల విద్వద్గణమ్ములగు శ్లేషాదిగుణమ్ములును సరసార్థచయావాసంబులగు సమాసంబులును హృద్యానవద్య విద్యావచ్చాతురీ గద్యంబులగు నానాపద్యగద్యంబులును గలిగియుంట నవర్ణనీయంబు.

కావుననీ సీతామాహాత్మ్యంబను కావ్యరత్నంబు శివానుగ్రహాతిశయంబున నాచంద్రస్థాయిగా వర్ధిల్లుత.

3. చల్లపల్లి సంస్థానోద్యోగియు అష్టావధానియునగు
బ్రహ్మశ్రీ అద్దేపల్లి సోమశేషయ్యగారొసంగినది.

కం. భూవిశ్రుత కవితావి! ఖ్యావయశస్సాంద్ర! గర్భ ♦ బంధవిరచనా
భావిత కోవిదజనను! త్యావళితచరిత! పూరుషోత్త ♦ మాఖ్యకవీంద్రా!

మ. శరమోత్కృష్టకవిత్వబంధరచనా ♦ ప్రావీణ్య! నీయద్భుతో
త్తరరామాయణసత్ప్రబంధము ప్రశ ♦ స్తంబై జనస్తుత్యమై
కరమాశ్చర్యదమైమహోన్నతినిద్రా ♦ క్షాపాకమై ప్రౌఢమై
వరసాహిత్యమైముముక్షుజనహ ♦ ర్షాయత్తమైయొప్పెడిన్.

చ. ధీరమహిమాభిజ్ఞతము ♦ ధీరసభాంతరయోగ్యతామణీ
హారసరసార్థగుంభనము ♦ హాలలితంబు ప్రబంధవాచకా
భరణము వాక్సతీచరణ ♦ భాసితనూపురరమ్యనాదని
ర్భరచతురత్వవాగ్రథన ♦ భావితమానుభవప్రబంధమే.

ఉ. పాయనిసీతికిన్గథకుఁ ♦ బ్రాకటభక్తికి భారతంబు రా
మాయణ మల్లభాగవత ♦ మైపాలుపొందెడినీదుగ్రంథమ
త్యాయతకీర్తిఁ బండితజ ♦ నాదరణీయము నైసలక్షణం
బైయుసమానచాతురిస ♦ మంచితమయ్యెరసంబులొప్పఁగాన్.

ఉ. ఒక్కనికేమి! వేయితల ♦ లుండుటయే! ఫణిపల్కువారలిం
దొక్కటిరెయ్యైన సీసమున ♦ నుండినపద్యములన్గణించినం
బెక్కులువల్కఁబోరుపలు ♦ వృత్తములన్నునుగాంచియుండిన
న్నిక్కరణిన్మకొందుఁగను ♦ పించెనె? తెక్కువమిక్కుటంబుగన్!

కం. ఇమ్మగసీతామాహా | త్మ్యమ్ముగభీరాతిసరస ♦ మాధుర్యకళా
సమ్మతచాతుర్యకవి | త్వమ్మునవిజయుశమునించు ♦ దశదిశలందున్.

4. బందరు హిందూహైస్కూల్ సంస్కృతోపాధ్యాయులగు
బ్రహ్మశ్రీ పరిమి నరసింహశాస్త్రులుగారు ప్రసాదించినది.

శ్లో. ఆసీద్భేర్నికటే మహతీ బృందావనాభిధానగరీ |
అస్త్యేతస్యాంకాంచనశాఖా శ్లాఘ్యామహార్యపాఠశాలాయాః ||

2. తస్యాంగురుపదముత్తమ మారోహన్భాసురోఽగ్రగణనీయః |
నాదెళ్లవంశకేతుః పురుషోత్తమ నామధేయకవివర్యః ||

3. కతిచిద్గ్రంథాన్ పూర్వం రచయామాసైవతాంస్తునాపశ్యం |
అమునామృద్వ్యశైల్యారచితం రామాయణాఖ్యకావ్యరత్నమిదం ||

4. అనిశ్వ్యమన్నికటం మిత్రతయాత్ప్రదర్శ్యమాంప్రమోదయితుం |
దృష్ట్వాతుసద్యఃస్వమనసా మిత్రోత్సవలాభసహజమేవైతత్ ||

5. శ్లేషస్య ప్రాచుర్యా చ్ఛబ్దాలంకారసంస్కృతేః ప్రాయః।
లోకోక్తిచిత్రితత్వా ద్ధృష్టిమత్త్వంయుక్తమస్య కావ్యస్య ॥

6. వృత్తానామతిశయతో మాహాత్మ్యాద్వర్ణ్యవస్తునోప్యత్ర।
కృతినాయకమాహాత్మ్యశ్రీ త్కృతిచాతుర్యా త్కథాస్యసుకవిమతేః ॥

7. ఉత్తమమాసీద్యస్మా దుత్తరపదవాచ్యతాస్య కావ్యస్య ।
పద్యేప్యేకస్మిన్ వృత్తానాం భూయసాం చ సంకలనం ॥

8. విస్మయజనకం నర్మ్యం నిక్షిప్తం తత్ర తత్ర యదముష్మిన్ ।
తస్మాదన్వర్థమభూ దద్భుతనామాస్య కావ్యరత్నస్య ॥

9. తస్మాదేతద్విదుషాం శ్లాఘాస్పదమస్తు సామ్యాత్ప్రకృష్టీనాం ।
ఆచంద్రతారకం ప్రఖ్యాతిం ప్రాప్నుయాచ్చ కావ్యరత్నమిదం ॥

10. ఇత్యాశిషమాశాస్తే స్థాలీపులాకవర్ణనన్యాయాత్ ।
దృష్ట్వా కాంశ్చిద్విషయాన్ కవిబుధ్యాశ్రితమిరనరసింహః ॥

5. పిఠాపురము హైస్కూల్ హెడ్మాస్టరువారగు

## మహారాజశ్రీ కూచి నరసింహముపంతులుగారు కృపచేసినది.

అయ్యా! తమరు వ్రాయించిన కార్డును గ్రంథమును జేరినవి. అవకాశము చూచికొని చదివి యానందింతునని యందుంచబడిన కార్డుమీద కృతజ్ఞతానందనములతో నిన్న వ్రాసిపంపితిని. త్వరలో నాయభిప్రాయము పంపవలయునని మీరు వ్రాసితిరి. అందుచే నచ్చటచ్చటమాత్రము చదువుటకు వీలయ్యెను.

కథ యెంతచదివినను దనివితీఱని పరమపావనపురుషులగు శ్రీసీతారాములచారిత్రమై యున్నది. విషయవైచిత్ర్యము గ్రంథనామమే తెల్పుచున్నది. శైలి మృదుమధురమై శబ్దాలంకారభూయిష్ఠమై యొప్పుచున్నది. పెక్కుస్థలములయందు మీకుంగలబంధకవిత్వ నిపుణత్వమును ఆంధ్రభాషా కుశలత్వమునుం గానవచ్చుచున్నది.

శీఘ్రకాలముననే యాంధ్రదేశమందు మీగ్రంథము వ్యాప్తమై బహుజనానందకరమై వెలయుంగావుత.

## 6. రాజమహేంద్రవరవాస్తవ్యులు అష్టావధానులునగు

## బ్రహ్మశ్రీ చల్లా సుబ్బారాయశాస్త్రిగారు పంపినది.

మ. సరసుల్పాచిబాసనన్గవులుమె ♦ చ్చంబండితాగ్రేసరు
ల్పరమానందమునొందగ్రంథమురచిం ♦ పందుత్తరంబద్భుతో
త్తరరామాయణమట్టిపైఖరులకుం ♦ దార్కాణమైయొప్పుచు
న్ధరణిన్రాజిలుచున్నదన్న నెవరై ♦ నంగాదనంజాల్లునే ?

తే. ప్రథితలక్షణమునకుభా ♦ రతమనంగ | గానధారాళతకునుభా ♦ గవతమనఁగ
నవరసములకురామాయ ♦ ణంబనంగ | దనరదేయిద్దియాచంద్ర ♦ తారకముగ !

## 7. శ్రీబొబ్బిలిసంస్థానాస్థాన కవీంద్రులగు

## బ్రహ్మశ్రీ మండలేముల సీతారామ శాస్త్రులుగారు అనుగ్రహించినది.

### గీతపద్యరత్నపంచకము.

1. పురుషోత్తమ కవివర్య ♦ మీరొనర్చి | ఘనదయామతినాకడ ♦ కనిచినట్టి
యద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యమైన | క్రొత్తపొత్తముముదమిగు ♦ రొత్తఁగంటి.

2. ముద్దుగులికెడుపదముల ♦ సుద్దిచేత | లసదలంకారములనుగ ♦ ల్పనలచేత
పూర్వగాథలనెంతయుఁ ♦ బోలిచినదుకు | పౌరులనపారసంతోష ♦ భరితులుగను
జేయునిదిసందియములేదు ♦ వేయునేల ? (ఇదిపంచపాది)

3. కవితయెంతయుమృదువయి ♦ కావ్యమెల్లఁ | గళలుదేరుచునున్నది ♦ కవివరేణ్య
పూర్వసుకృతమ్ముచేసియు ♦ పూర్వమైన | గ్రంథమబ్బెనుదనిగింపఁ ♦ గానుమీకు.

4. భూమికనుమీరువ్రాసిన ♦ పొలుపుమీర | నన్నివిద్దెలవారల ♦ యాదరంబుఁ
గొనఁగఁజాలెదునిద్దలోక ♦ మునఁబ్రసిద్ధిఁ | గాంచియెంతయుఖ్యాతిందు ♦ నంచితముగ.

5. కడుఁబ్రయాసమ్మునకునోర్చి ♦ కవితఁజెప్పి | యీశ్వరార్పితముగఁజేయ ♦ శాశ్వతముగ
యశముసుకృతమ్ముసేకురు ♦ టబ్బురంబె | పురుషోత్తమకవిచంద్ర ♦ పుణ్యసాంద్ర!

8. గుంటూరు మిషన్ కాలేజ్ సంస్కృతప్రధానోపాధ్యాయులగు

బ్రహ్మశ్రీ శిష్టాసీతారామ శాస్త్రులుగారు దయనంపినది.

శ్లో. శ్రీనాదెళ్లకులాబ్ధిసోమభవతా ప్రోక్తాంకృతిందృష్టవాన్
యద్యప్యత్రవిచారితేపిబహవ స్సర్వేగుణాః ప్రాస్ఫురన్
నోదోషాశ్చ్యుతసంస్కృతాదయఇహ శ్రీరామవిద్వన్మణే
ర్భాతిశ్రేష్ఠతరాకృతిశ్శ్రీభవతో మేగర్తపూర్వాసినః ||

శ్లో. ఆంధ్రాగీర్వాణమయ్యా రసగుణలహరీయుక్తయాత్వద్గిరోర్వాబ్ధం
సంతుష్టింకోనగచ్ఛేద్యదివిదితమతిః పండితోభూన్మనుష్యః
శ్రీనాదెళ్లాన్వవాయప్రభవకవివర త్వద్విధాస్సంతికేచి
ల్లోకేద్రాక్షాగుళుచ్ఛైరుపమితవచసః పండితాఃప్రాయఏవ.

9. బందరు నోబుల్కాలేజ్ సంస్కృతాంధ్రోపాధ్యాయులగు

బ్రహ్మశ్రీ శిష్టానృసింహశాస్త్రులుగారు కృపనొసంగినది.

శా. శ్రీనాదెళ్లకులావతంసపురుష ♦ శ్రేష్ఠాభవత్కావ్యము
న్నేనాద్యంతముఁగోరిచూచితిఁజుమీ ♦ నిక్కంబువేయేఁటికి
న్నానాలంకృతియుక్తపద్యరచనా ♦ నవ్యోక్తులన్మించుచు
జ్ఞానానీదుకవిత్వమెట్లురసినన్ ♦ శ్లాఘింపకెట్లుండెదన్ ?

చ. బుధవరులొప్పుతప్పరసి ♦ పూనికతోఁబరిశీలనంబొగిం
ప్రథితముగాఁగఁజేసినను ♦ బంధకవిత్వగుణాదివేదులై
క్రుధనుబరిత్యజించితగు ♦ కూరిమిమించకమానరోర్వున
న్మధురముగుల్కునీదగుస ♦ నాతనరామచరిత్రఁజూచుచోన్.

-. గరిమమృదుపదబంధంబు ♦ కలిమిమీటి | కవులకింపగుశయ్యల ♦ ఘనతఁజెంద
నచ్యుతోత్తరరామాయ ♦ ణార్థమొప్పి | నీదుకబ్బంబుగుణములు ♦ నియతిఁగనెడు
జోతిఁబురుషోత్తమాఖ్యస ♦ జ్జనవరేణ్య. (ఇదిపంచపాది)

10. రాజమహేంద్రవరము గవర్నమెంట్ కాలేజ్ పండితులగు

మ-రా-శ్రీ బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు

కరుణననిచినది.

తే. అద్భుతోత్తర రామాయ ♦ ణాహ్వయకృతి। యరయనాదెళ్లపురుషోత్త ♦ మాఖ్యరచిత
మహహశ్రీపక్షిణామూర్తి ♦ కల్పితంబు। ఘాంవసానందమగుఁగాదె? ♦ సర్వనుతము.

కం. కృతికర్తయొపురుషోత్తముఁ। డతిచతురతఁజేసెఁగృతిని ♦ నన్యులుపురుషుల్
స్తుతియింపఁగలరె? సీతా। పతిపురుషోత్తముఁడేకవికి ♦ వరములనిడెమక్.

11. చెన్నపట్టణము, మైలాపూర్, సెంట్ తోమస్ కాలేజ్ పండితులగు

బ్రహ్మశ్రీ వనం గురుస్వామిశాస్త్రులుగారు కటాక్షమున బంపినది.

ఈగ్రంథంబాముూలాగ్రంబుగా నవలోకనంబొనర్చితి. అద్భుతరామాయణంబను నామధేయంబు సార్థకంబుగనేయున్నయది. ఇందలి విషయంబులం బరికింప నేధానజ్ఞుల కాధానం బలవడియున్నది. వర్ణనీయాంశంబులు లోకానుభవమునకును శాస్త్రపద్ధతికిని విరుద్ధములేక చదువరులకు మనోరంజకముగ వర్ణింపబడియున్నవి. కవిత్వమన్నో నాతికఠినమై మొత్తముమీద ద్రాక్షాపాకముగా స్ఫురించును అక్కడక్కడ గర్భకవిత్వము బంధకవిత్వము మొదలగునవి కానంబడినను పండితులకును విద్యార్థులకు నది సమాదరణీయంబేకదా. పెక్కేల! ఈభాషాభివృద్ధికోరువారికి నీయద్భుతోత్తరరామాయణము పెక్కువిధముల జ్ఞానవృద్ధిగలుగఁజేయునని నొక్కివక్కాణించెద.

12. పెదకాంచీపురము హైస్కూల్ పండితులగు

బ్రహ్మశ్రీ దుర్భాల రామకృష్ణపండితులుగారు ప్రసాదించినది.

సీ. శ్రీకరంబుగనుచి ♦ స్మితకరంబుగబుధ ♦ స్తుతికరంబుగనువి ♦ శ్రుతకరముగ
భువిలోననద్భుత ♦ బుద్ధిసంపన్నుఁడు ♦ బుధమండనుండుబ్ర ♦ బుద్ధుఁడనని
వరకవినాదెళ్ల ♦ పురుషోత్తమాఖ్యుండు ♦ విరచింపఁగామించి ♦ వెలయుమూఁడు
సకలగుణంబుల ♦ న్సకలరసంబుల ♦ సకలవృత్తంబుల ♦ సత్పదముల

నద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యఁగనిన | వింతయగుసత్ప్రబంధంబు ♦ విమలమగుచు
సూరిజననికరంబులు ♦ చూచిమదిని | భూరిముద మొందఁగవిసువి ♦ భూతినొంది.

తే. పూర్వకవినాథసంఘసం ♦ ప్రోక్తనిఖిల | సత్ప్రబంధంబులనుబోలి ♦ జగములోలి
మెచ్చఁదగిశ్లాఘ్యపాత్రమై ♦ మెఱయుఁగొన్ని | తెలుఁగులందధికంబునై ♦ పరగుచుండు.

కం. పదములసొంపునురచనల | విధమునుబలుతెలుఁగులైన ♦ వృత్తంబులును
న్వదజల్లుచునానందము | నెదలనునలరించునిపుణు ♦ లెల్లారసినన్.

## 13. గుత్తిమిషన్ హైస్కూల్ పండితులగు
## శ్రీమాన్ ఉప్పుగ్లపల్లె రంగాచార్యులుగారు దయాపూర్వకముగా
## పంచినది.

తే. అద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యమిందు | నద్భుతంబగుకథలెల్ల ♦ నమరియుండు
నద్భుతంబద్భుతతమంబు ♦ ననఁగనొప్పు | సీసమనుచక్రవర్తిని ♦ చిత్రఫక్కి.

చం. అరుదుగసీతగాథనన ♦ యంబుగఁగూర్చెను దేటతెల్గునం
బురుషవరేణ్యుఁడీతఁడుసు ♦ పోషణతంజెలువొందుఁగావుతం
గరముగనీసుధీంద్రుకృతి ♦ క్రందుగనార్యులుయానివస్సటీ
సరసపరీక్షపాత్తముగఁ ♦ జయ్యనఁజేయుదురంచునెంచెదన్.

కం. శ్రీసీతామాహాత్మ్యం | బాసేతుహిమాద్రివఱకు ♦ నార్యాభినుతిన్
భాసిల్లిసూర్యచంద్రులు | భాసురముగనుండునన్నా ♦ ప్రబలుచునుండున్

## 14. వేంకటగిరి హైస్కూల్ పండితులగు
## బ్రహ్మశ్రీ వెంపటి రామనాథశాస్త్రులుగారు కటాక్షించినది

కం. లలితంబులైనపదములఁ | గలితంబై పెద్దనార్య ♦ కవనముబోలుం
బలుచోట్లనన్నపార్యుని | పలుకులకెనయంచురీతిఁ ♦ బలుకఁగవచ్చున్.

తే. అద్భుతోత్తరరామాయ ♦ ణాంతమందు | నుత్తమస్థితిఁదగుచిత్ర ♦ వృత్తములను
జూచినంతనెనామది ♦ చోద్యమంది | హర్షసంపూర్ణనిష్కల్మ ♦ షాబ్ధిమునిఁగె.

వ. మఱియు శ్రీమతీవసంతర్తువర్ణనలు మిక్కిలిశ్లాఘాపాత్రములుగనున్నవి.

15. కాకినాడపురవాసులును ఆంధ్రమున బహుబహుమతులందిన
మ-రా-శ్రీ నండూరిమూర్తిరాజుపంతులు బి. ఏ గారుదయచేసినది.

అవ్యాజకరుణమీర మీరునాకంపిన యద్భుతోత్తర రామాయణముం గృతజ్ఞతాపూర్వకముగనంది యొకతీరుగంజదివిచూచినాడ. తమవంటి పండితులగ్రంథములపై నాబోటి యల్పజ్ఞుల యభిప్రాయము లతిసాహసములయినను తమకుత్తరమీయకుండుట సరసముగా దనియెంచి నాతోచినయభిప్రాయ మీదిగువ వ్రాయుచున్నాడను.

తమయద్భుతోత్తరరామాయణము చిత్రబంధగర్భకవిత్వములచే నద్భుతమై యపూర్వపూర్వగాథలకిరవగుట లోకోత్తరమై మనోహరమైన శైలిగలిగి రామాయణమై సార్థకనామమున నొప్పుచున్నయది. అనువగునెల్లచోటుల నుచితరీతి నీతులుగ్గడింపబడినయవి. కవులకిందలిగాథలు వివిధరూపకవస్తుయోగ్యములై బాగుగనుపకరించును. ఈగ్రంథము సర్వజనసమాదరణీయమై వెలయుంగాక! లోకమాతయగు సీతపూతచారిత్రము రుచియింపనిహిందువులుందురా ?

16. తిరుపతి మిషన్ హైస్కూల్ పండితులైన
శ్రీమాన్ చక్రవర్తి రాఘవాచార్యులవారికై తత్పుత్రులు
రంగాచార్యులుగారు వ్రాసియంపినది.

I thank you very heartily for the pains you have taken in sending the copy. I have gone through it. The words are all very simple and the book is written in an easy and fluent style. It contains very beautiful and choice Vrittams, with full of morals. It is written according to the modern fashion. This ought to be read by every telugu student. The author has done much service for the telugu literature by bringing out such an excellent work as this. He deserves encouragement from the hands of the University.

## 17. కాంచీపురం మిషన్ హైస్కూల్ పండితులు
## శ్రీమాన్ కవితార్కికసింహ వేంకటవరదచక్రవర్తి
## ఆచార్యులుగా రనుగ్రహించినది.

శ్లో. శ్రీహస్తిశైలవిలసత్సకలామరేశ । సంస్తూయమానవిభవం ప్రణతేషుశాంతం ।
శత్రుప్రదాహకమనంతసుపూజ్యమానం । బ్రహ్మాశ్వమేధభవమస్తుమహఃశ్రియైవః ॥

2. వృత్తాభిలాషిణోయేరమ్యాలంకారకాంక్షిణోయేచ ।
ఆంధ్రజ్ఞానవివృద్ధిం యేప్రేప్సుంతేచపఠ్యశైలీంచ ॥

3. నైషమ్యేనవినాయే పఠితుంవాంఛంతికంచనగ్రంథం ।
చిత్రంరామచరిత్రం పఠితుంవాంఛంతియేనతాభక్త్యా ॥

4. శ్రీనాదెళ్లకులీనశ్రీకవి పురుషోత్తమార్యకృతమేతత్ ।
అద్భుతముత్తర రామాయణమేవముదావలోకనీయంతైః ॥

5. శ్రీకవితార్కికసింహశ్రీవేంకటవరద చక్రవర్త్యార్యైః ।
పురుషోత్తమప్రణీతం సీతామాహాత్మ్యమాదరాదస్తౌత్ ॥

## 18. రాజమహేంద్రవరమున కవిరాజ బిరుదాంకితులును కళావతీ వందేమాతరం పత్రికాధిపతులునగు,
## బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు కృపతో బంపినది.

మ. నరనాదెళ్లకులాబ్ధిసోమ! సుకవి ♦ వ్రాతాంచనాథామ! నీ
పరిపూర్ణప్రతిభ న్రచింపఁబడినీ ♦ శ్వవ్యాప్తమౌనద్భుతో
త్తరరామాయణకావ్యరత్నమహిమ ♦ తర్కార్యులయాలంక్రియో
గరిమంగైకొనె జూచిమోదభృతులై పం ♦ గౌతూహలంబంపఁగన్.

మ. పరికింపంబరమాద్భుతప్రకరమై ♦ భవ్యప్రబంధప్రథో
త్తరమై రామకథానిధానమయి వి ♦ ద్వద్రాజసంవేద్యమై
గరిమంగాంచుటకీప్రబంధమదిలో ♦ కఖ్యాతి నైనద్భుతో
త్తరరామాయణమున్యసార్థకమునై ♦ తత్వార్థవృత్తంబునై.

కం. పురుషోత్తముఁడవుగానం । బురుషోత్తమనీకవిత్వ ♦ మ్ముప్రశస్తంబై
పురుషోత్తమసంస్తుతిగై । పురుషోత్తములకునొసంగు ♦ ముదమునుసుగతిన్.

చ. వ్యసనదినంబులందుఁగడు ♦ భక్తిమెయిన్భగవంతునెంచుచు
న్మసలకమీరుచేసిరను ♦ మాటయెకానిపరిశ్రమాధిక
ప్రసరమునందునైనబహు ♦ భంగులవర్ణనలిందుసత్కవు
ల్వసగలవంచునెంచుగతి ♦ భాసిలునీదుకవిత్వమగ్రజా.

తే. నాతికఠినంబుమృదుమధు ♦ రాధికంబు । శాస్త్రబద్ధంబునిర్దోష ♦ సన్నుతంబు
మీకవిత్వంబుసుకవిమో ♦ దాకరమని । కృతులవర్ణింతు శ్రీపాద ♦ కృష్ణమూర్తి

19. విశాఖపట్టణము లండన్ మిషన్ హైస్కూల్ పండితులుగనుండిన
శ్రీమాన్ తిరుమల వల్లేరు మూడి రామస్వామి ఆచార్యులుగా
రనుగ్రహించినది.

మహారాజశ్రీ నాదెళ్లపురుషోత్తమ పండితులవారు రచియించిన శ్రీమత్ అద్భుతోత్తర రామాయణము ఇతిశ్రీగాచదివినాడను. ఇందు మహాప్రబంధమునకు ఉండదగిన వర్ణనాదులన్నియును నాకుమిగుల హృద్యములుగానున్నవి. అచ్చటచ్చట గొన్నికొన్ని యంశములు మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద, కవికర్ణరసాయనము మొదలగు ప్రబంధములను బోలియున్నయవి. గాన నాగ్రంథకర్తలశక్తి యొక్క నాదెళ్లపురుషోత్తమ పండితులవారియందే యున్నట్లు నొక్కి చెప్పగలను. ఈ గ్రంథము నాకుమిగుల నానందము కలుగ జేయుచున్నది.

20. గుంటూరు మిషన్ కాలేజ్ ఆంధ్ర గీర్వాణోపాధ్యాయులగు
బ్రహ్మశ్రీ పెరవలి పార్వతీశ్వర శాస్త్రులుగారు కటాక్షించినది.

ఉ. కంకణమున్వెలుంగుమణిఁ ♦ గైకొనియమ్మణిజెల్లుదానిచేఁ
గంకణరత్నయోగమిలఁ ♦ గ్రాలుగదేకరసంశ్రయంబున
న్వంకయె? యట్లనీదుకృతి ♦ శస్తగుణంబులయూనివర్సిటీ
కుంకవనాఁగశ్లాఘ్యయున ♦ మెంచెదుకాలలనుండనిమ్మగున్.

ఉ. భావరసార్థకావ్యగుణ ♦ పద్ధతిభవ్యవిచిత్రవృత్తము
ల్పావనమైనయీపరమ ♦ భాగవతార్థకథాప్రసక్తులుం
జేవఁదలిర్పఁజెప్పితిరి ♦ చేకొనరెందఱుభక్తిముక్తులం?
గావునఁబాఠశాలలను ♦ గైకొనుబాలురకేమిచెప్పెడిన్?

ఉ. ఇప్పటికాలమందిటుల ♦ నింపునహింపఁగవిత్వమెంతయో
యొప్పుగనబ్బురంపుఁగత ♦ లోలిననీతివిభాగపుంగ్రియ
న్మెప్పునునొప్పఁజెప్పితిరి ♦ మేకొనబాలురకెల్లనీతులుం
గొప్పగుతెల్వితేటలొనఁ ♦ గూర్పవెత్వత్కృతికావ్యపద్యముల్!

తే. అద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యకృతిని | జిన్నపదములలంకృతిఁ ♦ జెన్నుమీఱ
నర్థవతిగానుజేసితి ♦ రరయనిట్లు | బుధజనవిధేయనాదెళ్ల ♦ పురుషవర్య!

శ్లో. భవత్కృతిర్గాస్యతిధీప్రకర్షణాం | సదేహముక్తింపరతోఽనివార్యకాం |
జనాయసత్యంఖలుసేవితాయసా | సుధారుచించామరతాంయథాముదా ||

## 21. అమలాపురము హైస్కూలు పండితులు

### బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రులుగారు ప్రసాదించినది.

అయ్యా! నమస్కారములు. భవద్విరచితమై ప్రేషితమైన యద్భుతోత్తర రామాయణము వందన పూర్వకముగా నందుకొని పూర్ణమైన యవకాశము లేమిచే నందు 2 ఆశ్వాసములు మాత్రము ఇప్పటికిఁ జదివితిని. కథచదువుటకి నభిరుచి కలిగించునదియైనను గనము (గఠినపదములుగలదికాకపోయినను) శ్లిష్టాన్వయము గలదిగా నుంటవలన. సర్వసామాన్యముగాఁ దాత్పర్యావగాహనము కాదేమోయని తోఁచెడును. కాముకని రసనోపన్యాసాదులు మిక్కిలి యనుభవ యుక్తములైన భావములతో మనసున నాటఁ బగియున్నవని చెప్పగలిగినందులకు నానందించుచున్నాను. అక్కడక్కడ ప్రయోగములు వ్యాకరణమునకు దూరమగుచుం గనుపట్టుచున్నవి. చివరనున్న చిత్రకవనము శ్లాఘ్యము. తోఁచిన యభిప్రాయము నిజముగా వ్రాసితి. క్షమింపుడు.

22. పెదపులివఱ్ఱు సంస్కృతపాఠశాలోపాధ్యాయులును శతావధానులును నగు
బ్రహ్మశ్రీ వేమూరి నృసింహశాస్త్రులుగారు సానుగ్రహులయి
వ్రాయించియంపినది.

శ్లో. కవ్యుత్తంస! సదద్భుతోత్తరమహారామాయణంపశ్యతాం
భావత్కంబహుబంధచిత్రకవితా వృత్తప్రభేదోక్తితః
భక్తిజ్ఞానవిరాగధర్మకథనా దాముష్మికంచైహికం
జ్ఞానంస్యాదితిమన్మహే ధ్రువమతః కోపక్రియాఽస్యాఽధికా.

2. విజ్ఞప్తాభవతాయదత్రలిఖితుం సత్పండితాదీన్బహూం
తత్సంబోధ్యప్రసమంబహూపకరణా ద్దృశ్యత్వమత్యాదరాత్
తత్సర్వంధ్రువమేవనోనిజకృతి ప్రాగల్భ్యసంస్థాపకం
మన్యేశ్రీపురుషోత్తమాహ్వయకవి శ్రేష్ఠ! ప్రతుష్టోస్మ్యహం.

3. ఇతివేమూరివంశోత్థ। నరసింహమనీషిణా।
శతావధానినాదత్తా। ప్రశంసాపత్రికాకృతా.

23. పర్లాకిమిడి శ్రీరాజావారి కాలేజీ పండితులు
బ్రహ్మశ్రీ పాలనంది రామశాస్త్రులుగారు కరుణతో బంపినది.

అయ్యా! తమపుస్తకమును సావధానచిత్తముతో జూచినాడను. అందు స్థాలీపులాక న్యాయముగా జూచినవానిలో నాకుతోచిన యభిప్రాయమును విశదపఱచుచున్నాడను గ్రంథము నామమునకనుగుణముగానే కథకలిగియున్నది. శైలి సులభము రమ్యము అయియున్నది మొత్తముమీద నది యాధునిక కవిసమ్మతి ననుసరించి వ్యాకరణాది నిర్బంధమంతగాలేక లౌకికన్యాయయుక్తులు గలిగియున్నది. కథపోషకమున్ను అగుటచే సహృదయాదరణీయమగుట కేమియును సందియములేదు నాయందలి యాదరముతో దాము పుస్తక మంపించినందుకు తమయెడల మిగుల కృతజ్ఞతతో వందనపూర్వకముగా దానింబరి గ్రహించినాడను పఠింపనుంచినవాఁడను.

24. విజయనగరముమహారాజావారి కాలేజ్ ఉపాధ్యాయులు హూణాంధ్ర

గీర్వాణభాషా పాండిత్యముచక్కఁగ గల

ఎమ్ శివరామయ్యగారుకృపాయత్తులయిపంపినది.

## సగర్భమత్తేభ కందసీసము.

విరచితానేకన ♦ వీనకావ్యవినుత ♦ ప్రజ్ఞావిశేషప్ర ♦ భన్వెలుంగు
సురుచిరానూనవి ♦ శుద్ధపూర్వనవచా ♦ రుప్రక్రియన్వేమ ♦ రుంజెలంగు
ప్రవచనీయోజ్జ్వల ♦ భాషితాంకితగుణ ♦ వ్యాపారధీరంబు ♦ లైమెలంగు
రసచమత్కారవి ♦ రాజమానములునీ ♦ సద్గ్రంథముల్బల్వ ♦ సందులంగు
కవిజనమనోజ్ఞనృత్తుల ♦ నవిరళముగ । మెరయఁజేయుదంతటనెల ♦ మిన్వడినిడి
భువినిబురుషోత్తమార్యసు ♦ కవితవెలయు । దతులకీర్తిగౌరవమొన ♦ యంచలిర్ప

## ఇందలి మత్తేభ కందములు.

మ. రచితానేకనవీనకావ్యవినుత ♦ ప్రజ్ఞావిశేషప్రభ
స్రుచిరానూనవిశుద్ధపూర్వనవచా ♦ రుప్రక్రియన్వేమరు
న్వచనీయోజ్జ్వలభాషితాంకితగుణ ♦ వ్యాపారధీరంబులై
సచమత్కారవిరాజమానములునీ ♦ సద్గ్రంథముల్బల్వసన్.

కం. కవిజనమనోజ్ఞనృత్తుల । నవిరళముగమెరయఁజేయు ♦ దంతటనెలమి
న్భువినిబురుషోత్తమార్య! సు। కవితవెలయుదతులకీర్తి ♦ గౌరవమెనయన్

25. బెజవాడ మిషన్ హైస్కూల్ పండితులగు

బ్రహ్మశ్రీ జానపాటి కామయ్య శాస్త్రులుగారు కరుణతో నంపినది.

కం. శ్రీసీతామహాత్మ్యము । బాసంగనిచదినాఁడ ♦ నద్భుతచరితల్
దోసములుగానుపింపకి । దేసరియాదీనికనఁగ ♦ నిదియింపయ్యెన్.

26. బొబ్బిలి, శ్రీమండపాఁక పార్వతీశ్వరకవీంద్రుని మేనల్లుడు
బ్రహ్మశ్రీ, గుమ్మలూరి లక్ష్మీనృసింహశర్మగారు పంపినది.

ఆ. మాననీయనాకు ♦ మేనమామయునింక | మండపాకవంశ ♦ జుండునైన
పార్వతీంద్రకవికి ♦ బంపఁగఁబడినమీ | సీతమహితకథను ♦ స్వీకరించి.

తే. చదివియుంటినిసగమంత ♦ చదువలేదు | నాదిపైగ్రామమాటనై ♦ ననుజదివిన
యంతవఱకెంతయోవింత ♦ వింతనిచ్చు | కల్పనాంశంబులెన్నియో ♦ కలవు హెచ్చు.

తే. భళిర! భక్తులకొనగూర్చు ♦ భక్తిరసము | కవులకందఱికొనగూర్చుఁ ♦ గైతరసము
బాలురకుఁగూర్చుమృదునయ♦పదరసంబు|నరసిపొగడంగవశమెబ్ర ♦ హ్మకునుగూడ.

27. నెల్లూరు శ్రీవేంకటగిరి రాజాగారి హైస్కూలుపండితులు
శ్రీమాన్, ఆసూరి నృసింహాచార్యులుగారు ప్రసాదించినది.

మీరు ప్రీతి చేసనిచిన అద్భుతోత్తర రామాయణము నాకరంబు కరంబలంకరించి నా మనంబును నమందానందంబునొందించె. అందలి యపూర్వవృత్తాంతమును వృత్తములును తమ చతుర్విధ కవితాచాతురిం బ్రకటీకరించుచుఁ బూర్వపుఁ దెనాలి రామలింగాదులగు కవులకన్నా కులస్ఫురింపంజేయుచున్నవి. అయినం గొన్ని యపూర్వప్రయోగంబు లగు పడెడును. వానినిఁకఁ గవులంగీకరింతురుగాక.

28. విశాఖపట్టణము మిషన్ హైస్కూల్ పండితులు
బ్రహ్మశ్రీ, మారేపల్లి రామచంద్రశాస్త్రులుగారు కటాక్షించినది.

తే. మీరుపంపినపొత్తంబు ♦ మిగులవేడ్క | జదివినాఁడనుమిక్కిలి ♦ సంతసంబు
చెందినాఁడను దేనెలు ♦ చిలుకునుడుల | రసములొలుకఁగవెలసెడు ♦ రమ్యశైలి.

తే. బంధగర్భకవిత్వస ♦ త్ప్రౌఢిఁగాంచి | యద్భుతకథాప్రకల్పన ♦ నలరెడుభవ
దద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యకావ్య | మొప్పుఁగావుతలోకంబు ♦ మెప్పునొంది.

తే. కవితచెప్పసమర్థత ♦ గలుగుఫలము | జనులకుపకృతిచేయుట ♦ యనియెఱింగి
గ్రంథములువ్రాయుచుండెడి ♦ ఘనులనెన్న | వలెనెవారలమేల్గోర ♦ వలయుఁగాక.

**29.** చిత్తూరు బోర్డుహైస్కూలు పండితులగు

బ్రహ్మశ్రీ చావలి వేంకటశాస్త్రులుగారు కరుణతో బంపినది.

యుష్మత్ప్రేషితంబగు నద్భుతోత్తరరామాయణంబను గ్రంథాలోకనంబుచే నామనం బమందానందసందోహతుందిలంబయ్యె. ఇమ్మహాగ్రంథం బద్భుతంబగు శ్రీరామకథాప్రతిపాదకత్వముచేతనే యత్యాశ్చర్యసంపాదక మగుటయేకాక భవదీయ రచనానైపుణ్యముచే నత్యద్భుతాపూర్వవృత్తాది గ్రథితంబయి యత్యద్భుతత్వవిశిష్టంబై నన్నయభట్టారకాది పూర్వకవికృతితుల్యంబయి సకలసూరిజనాదరణీయంబయి యున్నయది. ఇప్పొత్తంబీవర్తమానకాలమం దాంగ్లేయభాషాధ్యేతలగుబాలురకు మెట్రిక్యులేషన్ మొదలు ఎమ్. ఏ. పరీక్షలవఱకు నధ్యేతవ్యంబైయుండెడు నని తోఁచెడిని.

**30.** కడప భూమానందప్రకాశికా లేఖకులును, వివేకచూడామణీ ముఖానేక

గ్రంథకర్తలునగు

మ-రా-శ్రీ కోవూరి పట్టాభిరామయ్యగారు కృపతో బనిచినది.

శా. అన్నా నన్నొకపెద్దఁజేసి భవదీ ♦ యంబైనసద్గ్రంథమం
పన్నా పైఁగలనీదుకూరిమియన ♦ ల్పంబంచునాకంతకు
న్మన్నేయున్నముదంబువొంగెనపుడే ♦ పొత్తంబునీక్షించితిం
గన్నారన్మఱిమాఱువ్రాయరుజచేఁ ♦ గాకుండెమన్నింపవే!

తే. కొన్నినాళ్లూరలేమిని ♦ గొంతతడవు | పనులఁదీరకయునుజ్వర ♦ భాధవలన
నప్పుడే వ్రాయననువుగా ♦ దయ్యెజాబు | గానమన్నింపుతమ్ముఁడఁ ♦ గానెనీకు ?

కం. వ్రాసితిఁబద్దియమిదిగో | వాసిగనీకృతినిఁకొంత ♦ వర్ణించిననా
యాసకుఁజాలదదేమో | వ్రాసెననకచిత్తగింపు ♦ ప్రార్థనసేతున్.

సీ. పోతనపోకలఁ ♦ బోయియొక్కకచోటఁ ♦ దిక్కనజాడలఁ ♦ దెలిసియొకఁట
తిమ్మనవైఖరిఁ ♦ దీరిచియొకచోటఁ ♦ బెద్దనమర్యాదఁ ♦ బెంచియొకఁట

సూరననిపుణతఁ ♦ జూపియొక్కఁ కచోటఁ ♦ నారనతీరున ♦ నడచియొకఁట
సింగనభంగివి ♦ జృంభించియొకచోట ♦ మల్లనపోలిక ♦ నల్లియొకఁట
లలితనియమితసముచితా ♦ శ్లథగభీర | విపులసంపుల్లసారస్య ♦ వివిధగతుల
నరసినాదెళ్లపురుషోత్త ♦ మార్యసుకవి | యద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యఁజేసె.

## 31 నర్సాపురము టెయిలర్ హైస్కూల్ పండితులగు
## బ్రహ్మశ్రీ దర్భా జగన్నాథ శాస్త్రులుగారు దయచేసినది.

కవివర్యా! తాముదయతో నంపిన శ్రీసీతామాహాత్మ్యంబను నామాంతరము గల శ్రీమదద్భుతోత్తర రామాయణంబను ప్రబంధంబు నందియత్యంతానంద జలధిని మగ్నుండ నైతి. తామురచియించిన యీగ్రంథ రాజంబు మృదుమధుర పదఘటితమై రసవంతంబై నాతికఠినంబగుచుఁ జదువరులకు హృదయరంజకంబై విరాజిల్లుచున్నయది.

ఈ కావ్యతిలకమును జదువు విద్వద్బృందములకెల్లఁ దమనిరుపమానవైదుష్యంబును చిత్రబంధాది కవిత్వ పటుత్వ సంపదయు నపారమగు పరమేశ్వర భక్తియు సర్వమత సమాదరంబును దెల్లముగాక యుండనేరవు.

ఇట్టి గుణరత్నాకరులగుటంజేసి నాదెళ్లకులపయోరాశి శీతకరులగు తమ పురుషోత్తమాభిధానం బన్వర్థమై యొప్పుచున్నయది.

తామురచియించిన గ్రంథములనెల్లం బరమేశ్వరుని కంకితంబుగా సమర్పించి యశోవిహారులగు తమకృతకృత్యతను వర్ణింప మముబోంట్లకు శక్యంబుగానేర్చునే?

తే. వరరసప్రసాదసమృద్ధి ♦ వన్నెకెక్క | సకలకవులకునానంద ♦ సమితిఁగూర్చు
తమప్రబంధతరంగిణి ♦ ధ్వనులమెఱసి | ధరణివర్ధిల్లునాచంద్ర ♦ తారకముగ.

తే. ఎన్ననిర్దుష్టకవితను ♦ నన్నపార్యుఁ | దెనుఁగుపదగుంభనంబునఁ ♦ దిక్కయజ్వఁ
దేటమాటలకల్మిని ♦ దిమ్మకవిని | బోలియుండితివయ్యయో ♦ పురుషవర్య!

**32.** చల్లపల్లి సంస్థానపండితులు తర్కవ్యాకరణసాహిత్యములందప్రతిమానులగు

## బ్రహ్మశ్రీ అద్దేపల్లి సోమనాధశాస్త్రులుగారు సదయులై యంపినది.

మీసీతామాహాత్మ్యము మహదానందముతోఁజూచితిని. శ్రీవాల్మీకమహర్షి దానికిం గథాచమత్కృతిమాత్రముననే అద్భుతోత్తరరామాయణమని పేరుంచెను. అది దైవయోగమున మీరు తెనిగింపఁబూనినందున మఱియెదువిధములఁ దన్నామమును సార్థకపఱచితిరి. ముద్దుపదముల యమకమెక్కడఁజూచినను బ్రబలియున్నది. అంత్యనియమఘటితములుగ నఖిలవృత్తములును శోభిల్లుచున్నవి. స్వభావోక్తిప్రధానముగాఁ బ్రబంధానుకూలవర్ణనలన్నియుం జేయఁబడియున్నవి. అనుభవమునకును శాస్త్రమునకు ననుకూలముగా విధాయకధర్మములన్నియు విరజిమ్మితిరి. ఇంతవఱకుఁగల యాంధ్రగ్రంథములందింతగ నెచ్చటను లేదన్నంతగా గర్భకవిత్వమును మఱియు జిత్రబంధకవిత్వములునుగుప్పితిరి. వర్ణనీయులగు పూర్వకవివరుల సామ్యమునొందదగిన యోగ్యతతో మీపురుషోత్తమనామము సార్థకపఱచికొంటిరి.

బహుపండితజనాభివర్ణితమై భారతభాగవత రామాయణములట్లు జగద్విఖ్యాతినొందఁగల యింతటిమహాకావ్యమును శ్రీపరమేశ్వరార్పణము చేసినందున నాచంద్రార్కముగ నిష్కల్మషయశస్సును పొందగలవారైతిరి.

**33.** కాకినాడ ఆర్యమతబోధినీ పత్రికావిలేఖకులు బహుసమర్థులునగు

## బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు కరుణంబంపినది.

మీ యద్భుతోత్తరరామాయణ మద్భుతముగ నేయున్నది. కవిత్వము మృదుమధురధారకలిగి చక్కఁగానడచుచున్నది. ఊహలు మనోహరముగానున్నవి. ప్రస్తుతకాలపు రుచికనుకూలముగ నేయున్నది. పెక్కేల? మీగ్రంథము విద్వాంసులకును విద్యార్థులకును గూడపఠనీయముగానున్నది.

34. చెన్నపట్టణము విద్యావతీ పత్రికాధిపతులును విచారసాగరాద్యనేక గ్రంథకర్తలునగు

## శ్రీమాన్ ఓ. వై. శ్రీ. దొరసామయ్యగారు కృపతో నొసంగినది.

చ. వివిధవిచిత్రబంధముగ ♦ విజ్ఞులు మెచ్చ రచించినట్టి మీ
కవితను గాంచినంత బహు ♦ కావ్యపరిశ్రమబోధమౌ మహా
కవులకు రామచంద్రుకథ ♦ కావున భక్తులకిష్టసిద్ధియౌ
నవరసకల్పనాకలిత ♦ నాదెళ శ్రీపురుషోత్తమాహ్వయా.

కం. ఉత్తరరామాయణము౯ । ఉత్తదిగాఁ జెప్పనద్భు ♦ తోత్తరమగునే?
ఉత్తములపృచ్ఛలకుఁదగు । నుత్తరములనొసఁగితిపురు ♦ షోత్తమనామా!

35. చెన్నపట్టణము తొండమండలము హైస్కూలు పండితులును
భగవద్గీతా భాష్యార్థచంద్రికా నిర్మాతలునగు

## బ్రహ్మశ్రీ నోరి గురులింగశాస్త్రులుగారు కృపచేసినది.

శ్రీమదద్భుతోత్తరరామాయణమనియెడు నవీనాంధ్రమహాకావ్యమును నాశక్తికిఁ దగినటులఁ బరిశీలించిచూడఁగా నీమహాకావ్యమునందు నాకుఁగలిగిన యభిప్రాయము నీవిధముగా వెల్లడి చేసికొనుచున్నాఁడను. వాస్తవముగ నీమహాకావ్యము సకలవిషయములందును కవిత్రయమువారి గ్రంథములతోఁ బోల్పఁదగినదికాకున్నను ప్రకృతకాలీనాంధ్రకవులచేతఁజేయఁబడి యాధునికపండితవర్యులచేత శ్లాఘింపఁబడుచున్న నవీనగ్రంథములకంటె మెండుగ నిండలిపదలాలిత్యపాకశయ్యాగుణాలంకారాదులచేత శ్లాఘింపఁదగినదిగా నామనంబునకుఁ బొడకట్టినది. ఇంతయకాక యీమహాకావ్యమునందలి పద్యములు శ్రీమదాంధ్ర మహాభాగవత పద్యములవలె నర్థజ్ఞానరహితులకుఁగూడ వినవిన నత్యంతాసక్తింబుట్టించుచున్నట్లు నేనునమ్ముచున్నాఁడను మఱియునిండలి శబ్దాలంకారాంతర్భూత రథబంధాదిబోధక చిత్రకవిత్వమే యీగ్రంథకర్తృపాటవాద్భుత మహిమంజూపుచు నీమహాకావ్యమున కీయఁబడిన యద్భుతవిశేషణమత్యంత సమాదరణీయమైయున్న దని యేఁగకిని వప్పుకొననీక తప్పదని నిశ్చయించుచున్నాఁడను.

36 మచిలీపట్టణము నోబుల్ కాలేజ్ పండితులగు
బ్రహ్మశ్రీ కోరాడ దుర్గానాగేశ్వర శాస్త్రులుగారనుగ్రహించినది.

తే. తామురచియించిప్రకటన ♦ ధాత్రిఁజేసి । నట్టిసీతామహాత్మత ♦ నమరుదాని
నద్భుతోత్తర రామాయ ♦ ణాద్భుతకృతి । సంతసమ్మునఁజూచితి ♦ సాధుమతిని.

కం. అందలిచిత్రమునందున । మందగతింజెప్పినట్టి ♦ మాన్యపురీతిన్
బొందుగనమరినగర్భపు । టందపుఁగబ్బములనెన్న ♦ నానందమగున్.

కం. కబ్బమదెంతనియననగు । నిబ్బరముగఁగవితసేయ ♦ నెవ్వగసేరుం
జెబ్బరలెంచకలేనివి । యబ్బురమందుచునుజదువ ♦ నాకృతిసతియా.

37 బందరు హిందూహైస్కూలు పండితులును శతావధానులునగు
బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులుగారు కటాక్షించినది.

అయ్యా! తమగ్రంథము చాలభాగము చదివితిని. రమణీయముగనున్నయది. సంస్కృతాంధ్రమ్ములయందుఁ గొన్నియపూర్వ ప్రయోగములున్నవి. కాని వానికన్నిటికిని దాము తగిన యాధారములను జూచుకొనియే యుందురని తలఁచెదను. అదిగాక భగవత్కథ కట్టి ప్రశంస యక్కర నేలేదని యనేకులు వ్రాసియున్నారు. మీకింకను నిట్టిసద్గ్రంథములను వ్రాయు పూనికను పరమాత్ముఁడు వృద్ధినందించి లోకోపకార మొనరించుగాక.

38 రాయవేలూరు శ్రీమహంతు హిందూ హైస్కూల్ పండితులు జ్యోతిష్కులు
బ్రహ్మశ్రీ పాకాల ఆలూరు వాసుదేవశాస్త్రులుగారు కరుణించినది.

కం. వరనాదెళవంశార్ణవ । పరిపూర్ణమృగాంక ! సుజన ♦ పద్మాకరభా
స్కర ! సద్గుణరత్నాకర ! । పురుషోత్తమనామధేయ ! ♦ బుధజనగేయా !

## ప్రణామపూర్వకవిజ్ఞాపనంబులు.

వ. తాము దయాపూర్వకంబుగాఁబంచిన సీతామాహాత్మ్యమను నామాంతరముగల శ్రీమదద్భుతోత్తర రామాయణంబంతయు నామూలాగ్రంబుగం జదివి సంతోషాయత్త చిత్తుండనైతి. ఇందు బహువిధరగడ కందగర్భితబంధవృత్తాదినిరవద్యపద్యంబులు హృద్యంబుగఁ దుఱంగలింపుచు, సందర్భసముదిత సరసపదప్రయోగ వైచిత్ర్యముగల్గి మృదుమధురశైలితో సుబోధముగాఁబట్టి పరీక్షవఱకుఁబఠనీయగ్రంథమై బహునీతులొప్పారుచు శబ్దాలంకారాదులతో విలసిల్లుచున్నది. ఇందలి కొన్ని పద్యంబులకుమాత్రము తాముదయచేసి టిప్పణము వ్రాసిచేర్చినచో మిగులబాగనితోఁచెడిని.

ఆ. మున్ను తాము కొన్ని ♦ చిన్న పొత్తంబులు । వ్రాసియున్నవారు ♦ వానికంటెఁ
బరగ దీనిఁ జూడ ♦ బాగుగనున్నది । సుపదకలితమగుచు ♦ సూరివర్య !

కం. నూతనపదాళిఁగూర్చిపు । రాతనగ్రంథములువోలె ♦ రమణీయముగా
నీతీరునరచియించుట । భూతలమునవింతగాదె ? ♦ బుధజనమిత్రా !

తే. సకలశాస్త్రంబులెల్లనుఁ ♦ జదువవచ్చుఁ । గానికవితాచమత్కృతి ♦ గల్గుటరుదు
కల్గికావ్యంబురచియించు ♦ కవికిగరిమ । తనరకుండునెకుకవులే ♦ మనినఁగాని ?

### 39 అమలాపురము బోర్డుహైస్కూల్ పండితులగు
### బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు దయతోనంపినది.

బ్రహ్మశ్రీ నాదెళ్ల పురుషోత్తమ కవిగారిచే రచింపఁబడి ముద్రింపఁబడిన యద్భుతోత్తర రామాయణమును జదివితిని. కథసుప్రసిద్ధమగుటచే రసవంతముగానున్నదని వేఱె చెప్పనక్కఱలేదు. సందర్భానుసారముగాఁ గథను బెంచి చిత్రవృత్తబంధాదులతో నింతపెద్ద గ్రంథమును వ్రాయుటలోఁ గవిగారికిఁ గలిగినకష్టము చదువరులకే విశదము. వీరింకను సరసాన్వయసమూపేతముగా గ్రంథరచనకుఁ దొడంగుటకు వీరికవితాదరమే నిదర్శనము.

(షరా - నెం 21 రున వీరియభిప్రాయమనియున్నది పొరపాటు.)
అది రాజమహేంద్రవర రాజకీయోపాధ్యాయ
శిక్షాపాఠశాలోపాధ్యాయులగు

మ. రా. శ్రీ. వడ్డాది సుబ్బారాయడు పంతులుగారు దయచేసినది.

40 వేలూరు కలాశాలాంధ్రోపాధ్యాయులును కావ్యకంఠబిరుదాంకితులునౌ
బ్రహ్మశ్రీ ఏ. గణపతి శాస్త్రులుగారనుగ్రహించినది.

శ్లో. యన్నృశంబంధిపురుషోత్తమత్వయా । జానకీచరితమాంధ్రభాషయా ।
చిత్రచారుమధురేవిపశ్చిత । శ్చిత్తమత్రనర మేతకస్యవా ॥

శ్లో. మతిమండనపండితమౌళిమణే । పురుషోత్తమ తేలలితాకవితా ।
సరసాసగుణాసదలంకరణా । దయితేవసతీవిదధాతిముదం ॥

41. ప్రొద్దుటూరు డిస్ట్రిక్టు మున్సిఫ్‌గారును శ్రీవిద్యారణ్య చరిత్రాది గ్రంథకర్తలునగు
బ్రహ్మశ్రీ మ-రా-రా-శ్రీ వావిలాల వేంకట శివావధానులు
పంతులు బి ఏ గారు దయాపూర్వకముగా బంపినది.

I sent herewith my neice's opinion of your work of Sree Ramachendra's life. I agree with her opinion. I am glad that you have written an able work and enriched our poetical literature.

కం. శ్రీరామచరితయందెను । సారపురాణంపుఘక్కి ♦ సంతసమయ్యెం
బ్రారంభముకాదిదిశై । లీరమ్యతయచ్చుబాటు ♦ లీలచెలంగెన్.

ఆ. మేటిరామచరిత ♦ మేల్మినంటిదియాట । నెన్నిరూపులైన ♦ నేమికొదువ ?
యంతకంతకధిక ♦ మైనన్నెమీఅదే । భక్తిసత్కవిత్వ ♦ పటిమమెఱయ ?

తే. మొనటిసప్తశ్రంతములుచాల ♦ ముదమొనర్చె । శంకరునిభక్తినేనోర్లు ♦ జాటుచుంట
జిహరసీసంబుమదికిన ♦ చ్చెరువొనర్చె । వివిధవృత్తంబులందునా ♦ విర్భవిలుట.

**42.** బురంపురము కల్లికోటకాలేజ్ సంస్కృతాంధ్ర పండితులు అష్టావధానులునగు బ్రహ్మశ్రీ కాకరపర్తి సూర్యనారాయణ శాస్త్రులుగారు సానుగ్రహులై యంచినది.

అయ్యా! తాముపంపించిన యద్భుతోత్తరరామాయణముంజూచి యానందించితిని. ఇయ్యది మృదుమధుర పదగుంభనగలిగి పెక్కులనీతులం దెల్పుచు నానందమొసఁగు చున్నది. ఇందలికొన్ని నీతిపద్యములు ముఖ్యముగా హూణభాషా పాఠశాలలలోఁ జదువుబాలురు చదువుటకుఁ దగినవియని నాయభిప్రాయము. ఆధునికులు పెక్కులు గ్రంథములురచించి నాయందలి దయచే నాదరికిఁ బంపిరికాని నానావిధవృత్తములను జిత్ర కవిత్వము నింత తఱచుగాఁ బ్రకటించిన వారెవ్వరునులేరు.

ఉ. పెక్కులలంకృతుల్ శ్రవణ ♦ పేయములైతగుసత్కథావళు
ల్చక్కనికబ్బపుంబటిమ ♦ సాధుపదప్రకరంబుఁగల్గు నీ
ఫక్కికయెల్లఁజూచితిన ♦ పారముదంబును జెందుచుంటినా
తిక్కనకింతకాఱునకు ♦ ధిక్కృతికల్గెనటంచు నెంచితిన్.

ఉ. భారతమాదిగాఁగలుగు ♦ ఫక్కికలెంతయునీతిరీతులం
జేరిచిచెప్పుటంగదవి ♦ శేషముగౌరవమొందెడిప్రసో
దారపదార్థచిత్రకవి ♦ తాసునయాద్భుతవృత్తజాతికా
ధారముగావిరాజిలెడు ♦ త్వత్కృతిసూబుధమాన్యయెయ్యెడన్.

# విషయసూచిక.

పుట. విషయము.

## ప్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

## పంచమాశ్వాసము.

## షష్ఠాశ్వాసము.

## సప్తమాశ్వాసము.

---

# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 4 | 14 | సూన | నూన | ,, | 20 | పొంక | పొండ |
| 7 | 20 | వేని | లేని | 122 | 16 | బూని | బూన |
| 14 | 1 | నగు | నను | 123 | 9 | సెమ్మ | నెమ్మ |
| 15 | 14 | దార్డ్య | దార్ఢ్య | 126 | 11 | ఉందు | అందు |
| 18 | 9 | వంద | నంద | 129 | 6 | రోర్క్యట | రోక్క్యట |
| 21 | 2 | గతి | సంగతి | 130 | 5 | జట్టు | జుట్టు |
| 22 | 27 | విణ | విణ్ణ | ,, | 17 | ఆట్ల | అట్ల |
| 28 | 1 | తమట | యుదమ | 131 | 4 | మిఱు | మింఱు |
| ,, | 10 | దోదెన | దోన | 135 | 28 | మిక్కిడి | మక్కిడి |
| 50 | 19 | దరల | వరల | 140 | 11 | జెల | బెద్దల |
| 60 | 20 | చను | చమ | 141 | 20 | దయు | దద్దయు |
| 71 | 6 | సంతస | సంతన | 157 | 1 | సీతా | సీత |
| 94 | 2 | తలంపు | తలఁపు | ,, | 22 | బైరవ | భైరవ |
| 105 | 14 | ఁటిఁజే | త్రిఁగాం | 168 | 12 | రక | రక్త |
| 114 | 8 | బుట్ట | బుట్టి | 176 | 15 | కంబో | కంజో |
| ,, | 23 | జగతి | జగతి | ,, | 24 | మునికీ | ముకీ |
| 117 | 3 | మాధు | మూధు | 177 | 14 | రోర్ఛ | రోచ్ఛ |
| 119 | 1 | యొగ్న | యొన్న | 179 | 14 | భవి | భువి |
| ,, | 14 | కంటె | కంటె | 201 | 15 | నుడెద | డెదను |
| 120 | 8 | డన | దన | 204 | 19 | నుత | నుతి |
| ,, | 11 | పటిను | పటిమ | 208 | 17 | నడుమనున్న దరహాతీసి | |
| ,, | 17 | స్వచ్చ | స్వచ్ఛ | | | ముందు వేసిచదువవలెను. | |

శ్రీమేధాదక్షిణామూర్తయే నమః

# శ్రీమదద్భుతోత్తర రామాయణము.

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాగురుప్రార్థనము.

శా. శ్రీమంతున్నిజదక్షిణాంకగతునా ♦ సేనానియౌసూనుని
న్వామాంకస్థసతీగళాచ్ఛనపర ♦ త్నస్థాపితాలంకృతి
న్సామోదంబుగఁగాంచియెన్నజపసం ♦ ఖ్యార్థాస్యముల్గన్పడం
బ్రేమన్మ్రొక్కులుగొంచునొప్పుశివుఁడా ♦ ప్రీతిన్నమ్ముంగాచుతన్. ౧.

ఉ. తోరపుబొజ్జవేలుపల ♦ దొడ్డమహాత్ముఁడుబిడ్డయాత్మవా
మోరుపునన్వసించిమహి ♦ మోన్నతవల్లభహారనాగము
ల్వారిజనాళపంక్తియని ♦ వానిఁగిరంబుననంటియాడఁగా
నారసికేళిసల్పుముద ♦ మందెడిశాంకరిమమ్ముఁబ్రోచుతన్. ౨.

ఉ. నల్లనిగడ్డముల్గలుగు ♦ నారదముఖ్యులుపౌత్రులైకడుం
దెల్లనిగడ్డమొప్పువిధి ♦ దేవరపుత్రకుఁడైయొసంగసం
ఫుల్లసరోజలోచనలు ♦ భూతనునీళలుఁదానుఁజూడరం
జిల్లువిలాసపుందరుణ ♦ చిహ్నలనొప్పుహరిన్నుతించెదన్. 3.

చం. తలఁచినభక్తరక్షణకుఁ ♦ బామునువెల్వడివారివారియిం
డులఁగలమూలమూలలఁగ ♦ డుంజొరనంపగియాంధ్రబిడ్డల
న్వెలయనలంకరించిపశు ♦ భృత్యసుహృద్వరబంధుయుక్తులై
యలరఁగఁజేయుపద్మము ♦ నాదరభావముతోడఁజూచుతన్. ౪.

చం. తపతపశబ్దమొందువిని ♦ తానొకవేయమరాబ్దముల్మహా
త్తపమొనరించిసార్థకతఁ ♦ దానఁగనుంగొనిసృష్టికర్తయై

విపులమహత్త్వమొప్పనల ♦ వేదమనారతబోధనంబునం
దపసులకిచ్చుదాతముని ♦ తాతవిధాతకను న్నముంగృపన్. ౫.

మ. శుకరాజంబు సుపుస్తకంబలరుచే ♦ జోడొప్పఁగావల్లకిం
బ్రకటించున్నిజభర్తృవిద్యమహిమా ♦ ప్రాగల్భ్యమొప్పారఁగా
సుకవీంద్రస్ఫుటవాక్కులన్నటనము ♦ లోచ్చెద్యంబుగాఁజేయుచు
న్వికచాంభోరుహనేత్రభారతిమము ♦ న్విద్వాంసులంజేయుతన్. ౬.

మ. గిరికెల్లప్పియుముండ్లకంపచివురు ♦ ల్గాంతాకులుంగుప్పియుం
దొరబాబాయనిమ్రొక్కఁప్రీతిపడునే ♦ దొడ్డప్పవిఘ్నేశుఁడే
బరువేనెత్తకమోద్దుఁగేల్చిరమునం ♦ బ్రార్థింతునవ్వారిగా
నిరతంబున్నముఁబెంపుసేయుశుభము ♦ ల్నిర్విఘ్నతంజెందఁగన్. ౭.

మ. వరనాదల్లకులాబ్ధిపూర్ణశశిసు ♦ బ్రహ్మణ్యబ్రహ్మణ్యమ
ద్గురునిన్సోదరునన్నపూర్ణపతిఁబా ♦ ధోరాశిగంభీరునిం
గరుణాసాగరుసాదరున్విమలులో ♦ కస్తవ్యులోకాప్తుని
న్నిరతాన్నప్రదునిత్యమోదుమహితు ♦ న్నిష్ఠన్నదిన్నిల్పెదన్. ౮.

కం. త్వరఁదారకమంత్రము నా | కరయఁగనుపదేశమొసఁగు ♦ నసమున్లోకో
త్తరుఁడగుమల్లావఝ్ఝుల | వరవేంకటగురునిహృదిని ♦ వర్ణింతుసదా. ౯.

తే. చిఱుతపాయంపునాటలఁ ♦ జెవియటొడ్డి | చెప్పుమంత్రము నాకునో ♦ యప్పనాఁగ |
దీపికాంబికనుపదేశ ♦ మోపికనిడెఁ | జెఱుకునరసింహగురుమది ♦ గుఱుతుపఱుతు. ౧౦.

కం. ఒకప్రాఁటఁగవితనేర్పిన | సుకరుంగస్తూరిగోప ♦ సుకవిఁదలఁతు నే
నిఁకనేరికడను నేరమి | నకళంకుఁడుదక్షిణాంగుఁ ♦ డాదరువగుటన్. ౧౧.

ఉ. తిన్నగరానిఫాక్సియును ♦ దిండికిఁజాలినయింగిలీషు నే
కొన్నినెలల్లతింపుఁగనఁ ♦ గొందఱు సెప్పిరిజ్యోతిషంబునీ
వన్నెస్వభాషఁజెప్పుగురు ♦ వర్యులులేరిఁకనేరినెంతునం
దిన్ననిప్రేమఁగాంచెడిసు ♦ ధీమణులన్గురులంచుమ్రొక్కుదున్. ౧౨.

కం. ఈకవితవిద్యభువిలో | శ్రీకరమైరంజిలంగఁ ♦ జేసినయావా
ల్మీకింబ్రాజ్ఞాసోకా | నేకాల్లోకిన్నివేకి ♦ సేవాకొనుదున్. ౧౩.

కం. ఘననిగమార్థముభువన | మ్మునఁబదునెనిమిదిపురాణ ♦ ములుఁజేసినయ
య్యెనరుచుకృష్ణద్వైపా | యనముని స్మరియించుచుందు ♦ ననిశముఁబ్రీతిన్. ౧౪.

తే. దండిభవభూతిఁగాళిదా ♦ సుమాఘుఁ | జోరుశంకరుశ్రీహర్షు ♦ భారవిశివ [౧౫.
భద్రుజయదేవుభోజభూ ♦ పాలుబాణు | ఘనమయూరాదిగీర్వాణ ♦ కవులఁదలఁతు.

తే. నన్నయార్యునిభీముఁది ♦ క్కన్నశంభు | దాసుశ్రీనాథుమాన్యుఁబో ♦ తన్నభాస్క-
రకవిఁబెద్దన్నభట్టుమూ ♦ ర్తికవిఁదిమ్మ | నాదితెలుఁగుకవీంద్రుల ♦ నాత్మఁదలఁతు.

సీ. చూతఫలంబొండు ♦ చేతఁగొంచుభుజింపఁ ♦ బైతోలులోటెంకి ♦ పారవైచి
రసమింతయేఁగ్రోలి ♦ పసనెన్నుచంద్రుఁస ♦ జ్జనఘర్మమిద్దియై ♦ వినుతిఁగాంచు
నట్టిమత్కృతములౌ ♦ చిట్టికబ్బంబులు ♦ పండితుల్లనియల్ల ♦ బెండులందుఁ
గొంచెమురసమున్నఁ ♦ గొంచెచ్చరింత్రున ♦ ్కంచఁగనదివారి ♦ మంచితనమె
కానితత్పాదసేవకు ♦ నైనఁబగని | వాఁడనేనేఁడదన్నుతి ♦ జాడయేడ
అలచయామతులౌరస ♦ జ్ఞాలసహనము | జెప్పికొందురువేయేండ్లు ♦ మెప్పిదేకద. [౧౭

సీ. సరసావయనములు ♦ సదలంకృతంబులై ♦ యాపాదమస్తక ♦ మందునున్న
గజ్జిపాకట్టైనఁ ♦ గలదొక్కొయనిరోసి ♦ వొంకినటఁజేరుఁ ♦ దుంటరీగ
అట్టిసన్నుతిపాత్ర ♦ మాకృతిఁగన్నను ♦ శమమాప్పికొనిప్రమా ♦ దమునఁబడ్డ
దోసమింతైనను ♦ దూసిగంతేసియు ♦ రోసముల్వ్యాల్కుదు ♦ రీసడింపు
గాంద్రుమనీచపుఁబుట్టువు ♦ ఘనతమూప | నేమముక్కలునట్లైన ♦ నాచదువునఁ
బరువుమాలిసరస్వతోఁ ♦ బురుపువారి | తప్పిదమ్ములునేయేండ్లు ♦ చెప్పికొంద్రు.

కం. అనియిష్టదేవతాప్రా | ర్థనమునుగురువినుతిసంస్కృ ♦ తకవులకుఁదెయుం
దెనుఁగుకవులఁజేర్కొనుటయు | ఘనభూషణనీచనిందఁ ♦ గావించితినేన్. ౧౯.

## కవివంశానుక్రమణిక.

సీ. ఇక్ష్వాకుకులమునం ♦ దెన్నికమునుగాంచి ♦ కీర్తికెక్కెనచక్ర ♦ వర్తియైయు
నంగిరసుండను ♦ నన్యనామముఁగన్న ♦ మాంధాతమావంశ ♦ మహితుఁడరయ
నాతనిపుత్రుఁడై ♦ యంబరీషుండొప్పు ♦ హరిభక్తిమేటిప్ర ♦ ఖ్యాతిఁగనియె
నా స్వజుండతనికి ♦ యౌవనాశ్వుండగు ♦ హారితుఁడాతనిపట్టి ♦ యతులనిష్ఠ

నతేఁడుయతులకుగతిసూపె ♦ నాత్మబోధ | హరితగీతలనద్ధరఁ ♦ బరగునవియె
అధికతపముననతఁడుబ్ర ♦ హ్మర్షియగుటఁ | గుంభినీదేవతలముత♦ద్గోత్రజులము. ౨౦.

కం. వైదికులాపస్తంబులు | నాదెళ్లయనంగఁబరగు ♦ నగరమువార
ల్మీదవెలనాఁటివారనఁ | గాఁదగుతెగలేరుపడియెఁ ♦ గాలమునరుసన్. ౨౧.

సీ. నరసింహభట్లోడ్డు ♦ నాదెళ్లవెలునడి ♦ చేరెఁగృష్ణానదీ ♦ తీరమునను
దగినసీతారాము ♦ నగరాగ్రహారంబు ♦ నార్జించెభూభాగ ♦ మందుఁగొంత
నాగేశ్వరుండుత ♦ న్నందనుండతనికి ♦ వేంకటసిద్ధాంతి ♦ విదితయశుఁడు
సుతుఁడాతనికిజ్యేష్ఠ ♦ సూనుఁడౌసుబ్బయా ♦ హ్వయుఁడుపితామహుఁ♦డగునుమాకు
ధనికుఁడైనెఱదాతనా ♦ వినుతిఁబడసె | నేగెనిరుమార్లుకాశిరా ♦ మేశ్వరముల
కామహాలక్ష్మివరియించి ♦ కామయార్యుఁ | గొమరుఁగాంచెనుమాజనకుండతండె.

సీ. నేరిచెవైదిక ♦ నియతవిద్యలుచాల ♦ లౌకికవిద్యయు ♦ శ్రీకరముగఁ
గూరిచెధనధాన్య ♦ గోగణంబులవెల్ల ♦ గ్రంథరాజంబులు ♦ గరిమమెసఁగఁ
దీరిచెఁబైతృక ♦ దేవతాఋణములఁ ♦ బ్రారబ్ధకర్మము ♦ ల్వనియెయదిగఁ
జేరిచెమమ్మునం ♦ సారభారముసూనఁ ♦ జిన్మయునందును ♦ జిత్తముఁదగఁ
గలిమిబలుములుగలిగినఁ ♦ దొలఁగిచనిన | నిత్యనిష్ఠలుపెక్కండ్లు ♦ నియతినడపి
నిలిచెఁబరమునఁదరుగని ♦ మెలఁకువగని | లేరుకామార్యుతీరువా ♦ రారయనెట.

కం. మాజననిలోకజననికి | నౌజతతాఁబ్రభలవేంక ♦ టార్యాత్మజయై
పూజితపతిపదసాధ్వి | పూజితపదసుబ్బమాంబ ♦ పూతచరితయా. ౨౪.

తే. పరగుఁదజ్జ్యేష్ఠసూనుఁడు ♦ ప్రథితగుణుఁడు | దక్షిణామూర్తిసన్మంత్ర ♦ దానమునను
గురుఁడునాకయ్యనాతని♦కూర్మిఁగన్న | తమ్ముఁడనునన్నుఁబూరుషో♦త్తముఁడటండ్రు.

సీ. పదియైదవాబ్దంబు ♦ మొదలుగాఁగవినయి ♦ పపద్యవచనసం ♦ పదలఁబొదలు
కబ్బములెన్నెక్కులు ♦ ఘనముగానాంధ్రహిం ♦ దుసానభాషల ♦ దోహలమున
రచియించిప్రకటించి ♦ యుచితకీర్తిదొఱసి ♦ ప్రబలమాహేంద్రపు ♦ రాణరంగ
దాసీయములుమేల్మిఁ ♦ దనరుశ్రీసోమేశ్వ ♦ రీయాదులేనుసం ♦ ప్రీతితోడ
నిప్పుడొప్పారువిద్వత్క ♦ వీంద్రులకును | బంపివారలుతగుననఁ ♦ బ్రముదమంది
గాంగుఁగొందఱీగాననిం ♦ కంద్యమైన | కావ్యమొక్కండురచియించుకాంక్షనున్న.

## గ్రంథసంప్రాప్త్యాదివివరణము.

కం. మాతండ్రిపూజనిడికొని । చేతస్సంతుష్టిఁబరగ ♦ చేసినగ్రంథ
వ్రాతములనారయంగా । సీతామాహాత్మ్యమిద్ది ♦ సేకుఱఁగంటిన్. ౨౭.

తే. ఎనుబదెనిమిదియేడుల ♦ మునుపుశ్రీని । వాసులకులీనుఁడైనసు ♦ బ్బయ్యవార
ణాశియందల్లగ్రంథంబు ♦ నాశయంబు । గాంచిలిఖియించినట్టిలఁ ♦ గానుపించు.

తే. మేటిరామాయణౌజవా ♦ ల్మీకమునియె । యోజఁబ్రార్థించితనుభర ♦ ద్వాజుఁడడుగ
రామకథరానిచోద్యవి ♦ రచనచేసె । నద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యనిద్ది.

కం. ఆతెలుఁగునమ్మనేమన । సీతారామాంజనేయ ♦ చిత్రోక్తులకై
చేతఃప్రీతిపొసఁగునిం । కేతీరునన్నైనసీత ♦ కిచ్చొప్పెడినే. ౩౦.

కం. ఇదినేఁదెనుఁగించినప । త్పదమొదవెడిఁగాదెయట్టి ♦ భాగ్యమువలయుం
గదమదభీష్టపరాత్పరుఁ । డుదయన్మదిఁగుదురువెట్టు ♦ డున్నదుకూరున్. ౩౧.

కం. హిందుస్థానపుభాషను । ముందలరామాయణంబుఁ ♦ బూర్తిగవ్రాయం
గందుఁగదకొంతప్రతిభము । సందేహంబేలనిద్ది ♦ సాగెడినాకున్. ౩౨.

సీ. మావంశకర్తయౌ ♦ మాంధాతృనకుఁబౌత్రి ♦ యంబరీషునిపుత్రి ♦ యంటసీత
ఆపట్టునమదానిఁ ♦ జేపట్టినట్టియా ♦ యనుబంధమునవల్లుఁ ♦ డంటరాముఁ
డంతటఁదద్వంశ ♦ మందేదశరథున ♦ కాత్మజుండునుగోడ ♦ లైరివార
అట్లిరుతేఁపల ♦ త్యనుగతసంప్రవే ♦ శతఁజొచ్చిపుట్టినం ♦ శముననేను
బుట్టిలోకంబులెల్లను ♦ బట్టికొలుచు । నట్టిఘన్యులసత్కథ ♦ నధికనిష్ఠ
వ్రాయకున్ననుజన్మము ♦ వ్యర్థమగును ♦ నాకునిర్వృత్తియిద్దనియా ♦ త్మీకరింతు.

కం. ఇదివఱకేనొనరించిన । పదులకొలందులగుకావ్య ♦ పంక్తిసుతతతి
న్నదిముదమొదవఁగనేలెం । గదశివుఁడీకృతికిభర్త ♦ గాకన్యుండే.? ౩౪.

సీ. పలుకులపరిపాటి ♦ తెలియకయున్నను ♦ దప్పుమాటలెచాల ♦ గుప్పుచున్న
సార్థకకాలేక ♦ వ్యర్థతనున్నను ♦ బెడయర్థములెచాలఁ ♦ బ్రేలుచున్న
లక్షణవతిగాక ♦ లక్షణగానున్న ♦ సాలంకృతయుఁగాక ♦ యడలుచున్న
గోప్యమింతయులేక ♦ గోలనాఁబడుచున్న ♦ బహుకృశాంగికయయి ♦ బడలుచున్న

రసనతియొకాకపసలేక ♦ విసుగుచున్న | విధులెఱుంగకననుకూల ♦ పథముఁగన్న
నాదుకృతికన్యకలనెల్ల ♦ నాదుకొనియె | నిద్దియగుఁబ్రౌఢశివునకే ♦ యిత్తుమెచ్చ.

౯౦. రాముఁడుతనదేవుండఁట | రామునకును దేవుడంట ♦ రహించాననే
రామాయణమొనరించియి | దీమెయిఘటియింపమెత్తు ♦ రీశ్వరరాముల్. ౩౬.

## షష్ఠ్యంతములు-ఉత్సాహములు.

శ్రీరమేడ్యధాతృముఖ్య ♦ చింతితాచ్ఛకీర్తికిఁ
వారిరుట్సుహృద్విరోధి ♦ వహ్నినేత్రమూర్తికిఁ
భూరిభూమిభృద్వరేణ్య ♦ భూరిచాపపాణికిఁ
దారితారిపీరధీర ♦ దానవేట్కృపాణికిఁ. ౩౭.

వాసవాదిసేవమాని ♦ వశ్యసాధుభర్తకుఁ
భాసమానలక్షణప్ర ♦ పంచసృష్టికర్తకుఁ
కాసరాసురాగ్నివారి ♦ గౌరివహ్నివాసికిఁ
దాసలోకచాతకాంబు ♦ దస్వభానభాసికిఁ. ౩౮.

రాజితాద్రిశృంగరమ్య ♦ రత్నపీఠవర్తికిఁ
భూజసన్నిధానసక్త ♦ భూనిషణ్ణమూర్తికిఁ
రాజరమ్యసజ్జటాక ♦ రప్రభాకిరీటికిఁ
నైజసత్కృపావిశేష ♦ నందితార్థకోటికిఁ. ౩౯.

నిత్యనిర్వికల్పనిష్ఠ ♦ నిర్గుణస్వరూపికిఁ
సత్యమోదచిత్ప్రకాశ ♦ సత్వదృక్కలాపికిఁ
స్తుత్యమానరూపవేద్య ♦ సుందరాంగజారికిఁ
దైత్యఖండనప్రశస్త ♦ దారుణాస్త్రధారికిఁ ౪౦.

పూతముద్రికామృతప్ర ♦ పూర్ణకుంభధారికిఁ
సూతనాక్షమాలికాము ♦ నోజ్జ్వకోశసూరికిఁ
వీతరాగయోగిలోక ♦ వేద్యమార్గదానికిఁ
ధాతృవిష్ణుశంభురూప ♦ దక్షిణాస్యమానికిఁ ౪౧.

వ. సోత్సాహసమర్పణంబుగ నాయొనర్పంబూనిన శ్రీమద్వాల్మీకీయాద్భుతోత్తర రామాయణంబను మహాకావ్యంబునకుం గథావిధానం బెట్టిదనిన. ౪౨.

## కథానుబంధము.

## వాల్మీకమహాముని వర్ణనము.

ఉ. శ్రీకరమైమహర్షిజన ♦ శేఖరసంశ్రితవాసయోగ్యసౌ
ఖ్యాకరమైసమస్తసృపి ♦ హంగిపశుక్రిమికీటకాదభూ
తాకరమైబుధప్రకర ♦ హానికరాసురవీరవారహృ
ద్భీకరమైతపఃప్రథితిఁ ♦ దేజరిలుందమసాతటంబిలన్. ౪౩.

చం. అలనదివారిలోజలక ♦ మాడిననాఁడ నెవీఁడుఁదోడనే
జలజలతోంటిపుట్టువులఁ ♦ జాలఁగఁజేసినదోషపుంజము
ల్కాలముపవిత్రమామనుజ ♦ కోటికిఁబాటనమెచ్చుభూరుహా
వళికినిజంతుసంతతికి ♦ వన్నెలుఁజిన్నెలుఁగూర్చునన్నదే. ౪౪.

కం. ఆయొడ్డునభూవినుతం | బైయొప్పెడిపవనమొకండు ♦ హైమాద్రిగతిన్
శ్రేయోర్థులాడఁగూడుట | నాయజునెలవునకునద్ది ♦ యద్దాసుద్దిన్. ౪౫.

సీ. ఫలభరితంబులై ♦ పల్లవావృతములై ♦ హర్షదాయకములౌ ♦ నవనిజములు
ఫలపల్లవాపేక్షఁ ♦ బరగిభక్షింపుచు ♦ స్తుతిపాఠకతనొప్పు ♦ శుకపికములు
వికసితముఖములై ♦ మకరందమయములై ♦ పరిమళదంబులౌ ♦ పలుసుమములు
మధుపానమత్తతఁ ♦ బథమెఱుంగకయాడి ♦ పీడనిరాగము ♦ ల్వాడునళులు
నవతృణావళియెల్లెడ ♦ నననవదగఁ | దవిలిమేయుచుఁదనిపెడి ♦ వివిధపశువు
లాడఁగన్పట్టుఁజూడమా ♦ యేడవేని | జాడనూడలమ్రాకుల ♦ నీడకూడ. ౪౬

కం. ఆవనమాశ్రయముగఁదగు | నావనరుహగర్భసమమ ♦ హర్షీశ్వరుఁడౌ
పావనుఁడురామనామ | శ్రీవిభవుఁడువామలూరు ♦ చిరవాసియటన్. ౪౭.

చం. పరమతపఃఫలప్రమితి ♦ బ్రహ్మకునీడితఁడేయనంగఁద
త్పరిసరశిష్యమానులకు ♦ బ్రహ్మముఁధ్యానరచేతఁబెట్టుచుం
జరమరహస్యమొక్కయెడఁ ♦ జాటువుగామహిఁజాటుచుండున
చ్చరువగువామలూరుభవు ♦ చిన్మహిమంబుజగత్ప్రసిద్ధమై. ౪౮.

సీ. రామ రామయనెడి ♦ నామరాజంబును ♦ బలుమాఱుతననోటఁ ♦ బలుకుచుండు
రామనామంబున ♦ సామరస్యముఁ దెల్పు ♦ మూర్తిత్రయాత్మిక ♦ మూలమునకు
రామసత్కథవిన్కి ♦ కామార్థసిద్ధికి ♦ నాదికారణమని ♦ యాదిచెప్పు
రామమాహాత్మ్యంబు ♦ శ్రీమహేశ్వరుఁడొండ ♦ యాథార్థ్యమెఱుఁగునం ♦ చనునిశము
రామయంచేరునుడివినఁ ♦ దాఁకుదపడు | రామునీక్షించుమన్నట్టి ♦ రహినెసంగు |
రామమయమెల్లజగమఖి ♦ రామమగుచు | రామునందొప్పునదియనునామునిపతి.

మ. సకలార్థంబులెఱుంగఁజేసిమునుల ♦ న్సంప్రీతులంజేయుచో
నిఁకసీతామహిమంబుఁబన్నగకులా ♦ ధీశాబ్జగర్భాదులుం
బ్రకటింపంబడఁబాటునొందుదురనం ♦ బ్రాగల్భ్యముల్దక్కనె
న్నికవాల్మీకమహామునీంద్రుమదిలో ♦ నిత్యంబుఁదద్ధ్యానమే. ౫౦.

తే. అట్టిమహనీయునకునగు ♦ ననుఁగుఛాత్రుఁ | డలభరద్వాజుఁడానంద ♦ కలితుఁడగుచు |
మౌనికంజలిపుటలస ♦ న్మస్తకుఁడయి | భక్తిజోహారులొనరించి ♦ పలికెనిట్లు. ౫౧.

## భరద్వాజాదులసంప్రశ్నము.

మ. విలసన్నైజకృపావిశేషమునినీ ♦ శేస్త్రైత్వమెల్లారికిం
గలుగంజూతుమహాత్మదీనవరదా ♦ గంభీరవాగ్భూషణా
జలజాతప్రభవోపమానిరుపమ ♦ శ్రద్ధాన్వితాగోప్యబో
ధలవాల్మీకమహర్షిసత్తమమము ♦ న్ధన్యాత్ములంజేయఁగాఁ ౫౨.

సీ. ఒక్కొక్కయక్కఱ ♦ మక్కఱనుమనంగఁ ♦ బెక్కుఘుమ్ములఁబట్టి ♦ ప్రసుక్కడంచు
నట్టియక్షరకోటు ♦ లమరెనసర్వలో ♦ కావనరామాయ ♦ ణార్ణవంబు
మహితగాయత్రిస ♦ న్మంత్రాక్షరాదిగా ♦ నిరువదినాల్గువే ♦ లరిదిశ్లోక
ములునుసన్మంత్రకు ♦ క్షులమాడ్కినారుకాం ♦ డములొప్పరచియించి ♦ తమితరక్తి
నట్టిసద్గ్రంథరాజమి ♦ ట్లబ్జసూతి | సమ్ముఖమ్ముందునొప్పుహి ♦ తమ్ముతోడ [౫౩.
నతెఁడుయతులఁబితరులదే ♦ వతలఁగూడి | నగుమొగంబులవినుచుండ ♦ నగునుగాదె.

ఉ. ముందొనరించునప్పుడుస ♦ మూలముగాభవదీయవాక్సుధా
బిందువులంగ్రహించినయ ♦ పేతదురంతమహాఘపంక్తిమే
మందఱమద్దిపల్మఱుమ ♦ హాస్థవినందముకింతుమెల్లెడ
న్విందదిమాకగున్మహృదయ ♦ వీక్ష్యముఁలొందఁదుపేతలక్ష్యముల్. ౫౪.

ఉ. కన్నులఁగట్టినట్టులల ♦ గ్రంధకథావిశరంబుమాకగుం
జెన్నువహించునద్దిముని ♦ సింధురబంధురభావమొప్పగం
దెన్నని చోద్యమున్నవిన ♦ నెంతయుమంతనమందుఁగోరెమీ
సన్నిధిఁజేరినట్టిమము ♦ ఛాత్రులఁబాత్రులనాదరింపవే. ౫౫.

కం. ఏరీతిమినిన్నైతగెవని | చేరితిమీడన్మహార్తిఁ ♦ జెవులొడ్డుచునిం
గోరితిమి రామకథకుఁగఁ | దీరితిమోయయ్యనీవు ♦ దేశికుఁడవుగాన్. ౫౬.

కం. హితులముకథనశ్రవణా | యితులముత్వత్పాదసన్ని ♦ హితులమునియత
వ్రతులముయతులమమేముసు | గతులముగాఁజేయుమయ్య ♦ కరుణాంభోధీ. ౫౭.

వ. అనియిట్లు బహుప్రకారంబుల భయభక్తివినయసంభ్రమంబులుపెనంగొన నధఃకృతా
నేకముని రాజుండగు భరద్వాజుండువలుక నటఁగలజటిపటలంబునటులనెయనుట
యుం బరమాహ్లాద రసార్ద్రీకృతాంతఃకరణుండయి తద్వర్షసారలేశంబులు నిజాక్ష
నీరజాంకురస్మరందబిందు సందోహంబులయందంబునొందించుచు మందస్మితాస్యార
విందుండగుచు మెల్లననగుచుఁ దొల్లితావెల్లడించినయల్లరామాయణంబెల్లను హృల్లక్ష్య
మాణంబగుటం దెల్లముచేసికొని తల్లుప్తశేషంబు వెల్లివిరియఁజేయుసముల్లాసంబున
నెల్లరంగాంచియిట్లనియె. ౫౮.

## వాల్మీకమహామునిప్రత్యుత్తరము.

సీ. మునులారభువనపా ♦ వనులారవినుఁడయ్య ♦ మునునేనొనర్చురా ♦ మునిఘనకథ
నసనుగాకుండంగ ♦ నజినపలితినిష్ఠ ♦ విదితంబునేసెద ♦ ముదమెసంగ
రాముఁడుసుగుణాబ్ధి ♦ రాముఁడైముసబరం ♦ ధాముండుజగపబ్ధి ♦ రాముఁడుగద
సీతయాతనినాతి ♦ పూతయంద్రాలోక ♦ మాతచరిత్రంబు ♦ లోతెఱుఁగక,
మూలమాయన్వముగ్గురు ♦ మూర్తులకును | ప్రాపులోకంబులకునెల్ల ♦ నాపెయెయగు
సర్వసృష్టియురక్షణ ♦ సంహరణము | లాకెసేతలెయోజుఁడీ ♦ వీఁకఁదెలియు. ౫౯.

సీ. ఏతల్లియలరెడి ♦ నెన్నద్విరేఫమై ♦ బ్రహ్మవిష్ణ్వీశహృ ♦ త్పద్మములను
ఏయుంబసెలఁగెడి ♦ నెన్నవేదతదంత ♦ వీధులనాట్యముల్ ♦ ప్రౌఢముగను
ఏయవ్వవెలసెడి ♦ నెన్నమహర్షీంద్ర ♦ మానసప్రాంచితో ♦ ద్యానములను
ఏమాతకలిగెడి ♦ నెన్నబ్రహ్మాండంబు ♦ నందదితనలోనఁ ♦ గ్రందుకొనను
ఏజగజ్జననికిరారో ♦ యీడెవారు | ఎన్న నేశక్తిమదిలోనఁ ♦ నిడఁగలేరు [౬౦.
ఏమెయాబ్రాహ్మివైష్ణవి ♦ యీశ్వరియగు | నెన్ననామెయెరాముని ♦ యన్నయితెగు.

కం. ప్రకృతియుఁ బురుషుండనఁగా | సుకరంబైయొప్పుచుండు ♦ జోడయ్యదియే
తికమకలుబడ్డవిడదు | ప్రకటితమిది రాముసీత ♦ పాయుటకల్లా. ౬౧

కం. అలసీతారాములచిం | తల బ్రాహ్మణుఁడగుసుబండి ♦ తెనరుఁడు రాజో
బలియుఁడు విట్పతియగునని | కులగణ్యుఁడు శూద్రుఁడగును ♦ గుంభినిలోనన్. ౬౨

తే. అందు రామపరంజ్యోతి ♦ కాదరూపగు | నాదికారణశక్తి యనఁ ♦ గాదెసీత
ఆపెమహామాయవిధిహరి ♦ హరులలరెప | రింతెనిక్కంబయది లేమి ♦ నెఱయొనరదు.

సీ. అంబరీషజయాయి ♦ యవతరించెనుదొల్లి ♦ నారదపర్వతు ♦ ల్గోరిశాపె
వారికిఁగాకుండ ♦ నారాయణుండుగొనె ♦ నారదాగ్రహమున ♦ నరులగుచిల
వారలుపుట్టిరి ♦ శ్రీరామసీతలై ♦ యొండొరువులఁబాసి ♦ యుండనయ్యె
నారదుండశపింప ♦ నారమనడికూడె ♦ నతఁడు గానముసేచి ♦ యాప్తుఁడయ్యె
రామచారిత్రమునఁగల ♦ రావణవధ | యైనవెన్కసహస్రాస్యుఁ ♦ డాహవమున
రాముఁబరిమార్పనవ్వీరు ♦ నామెత్రుంచె | విధికృతంబుగఁబతిలేచి ♦ వినుతిసేసె.

కం. అలరామవినుతినొప్పెడి | పలునామసహస్రములను ♦ బ్రకటింపఁబడుం
బలెరామరామనామ | జ్వలితమహత్త్వెన్నవశమె ♦ జడులకుమనసున్. ౬౪

చం. అనవుడుఁద్రుళ్లివక్త్రముల ♦ హాయనివిచ్చియుమాయలక్ష్యమే
పానరకమిట్టుచూచుటలఁ ♦ బోయినచిత్తములొప్పబొమ్మలై
మనములుచెప్పికొంచునొక ♦ మట్టునగట్టునకెక్కితెప్పరి
ల్లినవ్పుటులైననద్దిరబ ♦ లేయనియిట్లనిరామహర్షితోన్. ౬౬

సీ. అంబరీషుండెవ్వఁ ♦ డామెఁగనుటయెట్లు ♦ నారదపర్వతు ♦ లెక్కరిశెట్లు
వారికిఁగామికేఁ ♦ గారణంబెయ్యది ♦ హరియాపెనెబ్బంగి ♦ నంపఁగల్గె
వారిశాపంబెట్లు ♦ లారమపదియెట్లు ♦ మునికేలనెటగాన ♦ ములభియించె
నారదశాపంబు ♦ ననుశక్తిమూర్తులు ♦ నరులయియుఁకవధూ ♦ వరులయిపెడ
బాయనైనట్టివిధమెట్లు ♦ ప్రబలుఁడైన | రామునొంచుసహస్రాస్యుఁ ♦ డేమహితుఁడు
ఆహవంబెట్లుపొసఁగెసీ ♦ తాంబవానిఁ | ద్రుంచినదియెట్లు తెలుపవే ♦ దోహలదము.

చం. బలియుఁడురాముడంటతద ♦ పాయమొనర్చుసహస్రకంఠునిం
గలనవధించెరాముసతి ♦ కామినియేనిగమాంతగామినిన్
బలుమఱురాముఁడట్టులనె ♦ ప్రస్తుతిచేసెడినంటిమాయెడం
గలకృపవిస్తరింపునిది ♦ కల్పనచాతురినీకయొప్పెడిన్. ౬౭

వ. అని యామూలాగ్రంబుగ వినఁగోరి మహాసక్తితో నడుగుటయు. ౬౯.

## కథాప్రారంభము.

కం. శ్రీకైలాసనివేశా । స్వీకృతపద్మాలయేశ ♦ విజితరతీశా
ప్రాకృతపాపవినాశా । నాకేశమునీశముఖ్య ♦ నతలోకేశా. ౭౦.

వ. అవధరింపు మహమ్మహితవైభవుండు నపరాంభోరుహభవుండు నగు నవ్వల్మీకభవుండు
భరద్వాజాది మహర్షీంద్రుల కిట్లని చెప్పందొడంగె. ౭౧.

## అయోధ్యాపురవర్ణనము.

ఉ. శ్రీకరవస్తుసంచయవి ♦ శేషములం జెలువైనదీయశో
భాకరవైభవంబునఁ బ్ర ♦ భాకరమండలిఁ ధిక్కరించు నుం
బ్రాకటరక్షణాప్తినది ♦ ప్రాజ్యమకాననపుణ్యమావహ
ద్భీకరమైన యయోధ్యయనఁ ♦ బేరిట నేతఁగు బట్టణం బిలన్. ౭౨.

కం. ఆపురము విజయలక్ష్మికిఁ । గాపురము సమానమహిల ♦ కాపురమునకు
న్గోపురము నకన్నఁగహరి । దాపుర మహాపురము నకగు ♦ దాపురమాప్తిన్. ౭౩.

సీ. కమ్మని తెమ్మెర ♦ లిమ్ముగా వ్యాపింప ♦ సన్మతినందొప్పు ♦ సరసపరిమళ
మాటలఁ బాటల ♦ నళులు గోయిల లొప్పు ♦ మాటలఁ జిలుకలు ♦ పాటి కెక్కఁ
బలుతెఱంగులఁ బూగ ♦ ఫలపుష్పతరులుగు ♦ ల్మములు మనోజ్ఞగు ♦ చ్ఛములనొప్పఁ
బ్రసవలతాగృహ ♦ ప్రతతులసికతామ ♦ యస్థలంబులఁ దటా ♦ కాంగణములఁ
జలువతేజోద్రివహలైనవ ♦ శిలలఁ బూన్చి । ఘటితములు సేయు వేదికా ♦ పటలి తనర
శ్రమము వారించి హిమించు ♦ సరణిఁ బౌరజము । ఘనము గాఁ జూడ నుద్యాన ♦ వన
ములాడ. ౭౪.

సీ. లీలగాఁ బైఁబాడు ♦ జోలలఁ గనిపట్టి ♦ డోలలూఁచెడి నళి ♦ జాలములను
శేలబైలాడమి ♦ జాలిగాలోఁ బడ్డ ♦ దామము విడిచెడిఁ ♦ దామణులను
రాజహంసలనంగ ♦ రాజిల్లుఁ గావున ♦ నంచలంబులు పట్టి ♦ యాడఁ జేయుఁ
బరమహంసలు నాఁగఁ ♦ బరగెడు నితను ♦ పద్మాసనములయి ♦ పరిణమించు
నట్టియుత్పలకమలంబు ♦ లమరసమత । జీవనముచిక్కకేవారు ♦ చేరఁ జనినఁ
జల్లగాఁ జేర్చి చోరవరం ♦ జిల్లఁ జేయు । నమలభావముగలవారె ♦ సమసరసులు. ౭౫.

ఉ. కంటికిఁ జూడ వేడుకలు ♦ గ్రమ్ముట ఖేచరపంక్తిడిగ్గి పే
రంటము నచ్చియేగినగు ♦ రమ్యము శాబహుధాన్యజాతుల

న్వంటుగనీనుచుం బ్రజల ♦ వానికినాపశశస్మృద్ధికష్టమా
పంటలెపండుభూములట ♦ భాసిలునెన్నలంబైడిపన్నెలన్. ౭౬.

సీ. ప్రాకారమత్యున్న ♦ తాకారముననొప్పు ♦ దేవతల్విహరించు ♦ త్రోవయగుచు
గోపురమాపుగా ♦ దాపరించుటదక్షి ♦ ణోత్తరాయణగతు ♦ లొందురవియు
అట్టాలకంబులు ♦ పెట్టినయండలై ♦ యూర్ధ్వలోకంబుల ♦ నూదియాగు
పరిఖరూపంబునఁ ♦ బాథోధిపాతాళ ♦ గామినియయ్యెడిఁ ♦ గాలుకొనుచు
నడుమఁదగుసౌధములకొప్పు ♦ పాడవుదీప్తి | మేరుకైలాసములతీరు ♦ గేరుచుండు
వానిశృంగంబులాచుట ♦ వనజవైరి | తడబడుంగడునెగుడుది ♦ గుడుగనడచు. ౭౭.

శా. సౌధభ్రాజితభిత్తిరత్నములలో ♦ స్వర్గస్థులానెల్లరుం
బ్రోదుల్గాఁబ్రతిబింబితాకృతులతో ♦ భూలోకమర్త్యాళికిం
గాదాబొమ్మలపంక్తియన్నగతులం ♦ గన్పట్టినత్రింత్రుత
ద్గాథల్లోకులకెల్లఁదేఁటపడెడుం ♦ గాంక్షించివీక్షించినన్. ౭౮.

ఉ. సల్లలితంబులైనమతఁ ♦ జక్కని మేడలిటట్టులొప్పభా
సిల్లెడియంగడుల్వివిధ ♦ చిత్రపవిత్రసువస్తుయుక్తము
ల్కొల్లగఁజందనాగరులు ♦ గూర్చుజలంబులుసల్లిముగ్గులా
తెల్లనికప్రపుంబొడులఁ ♦ దీర్పఁగనొప్పెడిరాజమార్గముల్. ౭౯.

చం. అధికతయున్నతింబ్రభల ♦ నందమునందుబలిష్ఠతంపగం
గుధవములట్టులొప్పికడుఁ ♦ గూర్చినగంటలగజ్జెలన్మహా
రధికులకెచ్చరింపెసఁగ ♦ రాజిలుచుండెడివీఁటిబాఁటల
న్రథములుజాలువంబసిడి ♦ రత్నములన్కుటియింపనొటచేన్. ౮౦.

తే. బొబ్బలెంతయుసన్నడి ♦ ప్రబ్బనేయ | గబ్బిమేనులఁబోషణ ♦ లబ్బునేయ
మబ్బులనుగేరిమదధార ♦ గొబ్బునఁదగ | నిబ్బరంబుగఁదగునేన్గు ♦ లబ్బురముగ.

కం. ముదుసలివాయువుగావునఁ | గదలునొకొక్కపుడవేగఁ ♦ గామేమట్లం
చెదగదురుముదమునన్వడి | నెదురెఱుఁగకఘోటకంబు ♦ లేగునయారే. ౮౨.

ఉ. మిత్తినినెత్తిమొత్తుదుము ♦ మేదినిగుట్టలుమిట్టవెట్టన
య్యెత్తునడంగఁద్రొక్కుదుము ♦ హేయమటౌలవణాబ్ధినింపునే
ర్లుత్తవినేసిపూడ్తుముమ ♦ హోదధిజాలునిగీలుమూలకుం
బుత్తుముకత్తినొంతుమరిఁ ♦ బోరులధీరతనంద్రుసప్పుటుల్. ౮౩.

ఉ. మంత్రులకార్యకార్యములు ♦ మర్మమెఱింగి ప్రబోధ చేసిత
త్తంత్రములన్ఘటింత్రు నిజ ♦ ధర్మవిశేషబుద్ధిఁ జైత్రభరిం
పింత్రు మహీంద్రుఁ డవ్యసన ♦ శీఘ్రమ వప్రతిబంధ రోగధ
న్వంత్రులు యంత్రవేదులయి ♦ నమ్మక మెచ్చఁగ సమ్మదమ్మునన్. ౧౪.

తే. ప్రథితగుణములు నందమా ♦ గధులు వాగడఁ | గృతులు కవిగాయకులు సేసి ♦ గీతి నెఱప
నాటపాటల వెలయాంధ్ర ♦ కూటము దగ | రాజవిభవంబు లిట్లొప్పఁ ♦ దేజ మెసఁగ.

సీ. అటుఁగల విశ్వంభ ♦ రాదిదేవులు నిగ ♦ మాష్టాదశాసంబు ♦ లలనఁ దుటను
వేదాంగశాస్త్రము ♦ ల్విపులంబుగా సేచి ♦ యుపనిషద్భాష్యంబు ♦ లొనరుపంగ
యజనాధ్యయనదాన ♦ యాజనాధ్యాపన ♦ గ్రహణంబులనెడిష ♦ ట్కర్మలందుగ
జపములుం దపములుఁ ♦ జాలఁ జేయుచుండెర ♦ బ్రహ్మంబునరచేతఁ ♦ బట్టిచూప
ధాతసురపతిమంత్రిప్ర ♦ దాతలైన | శీతులగుదురువాంత్రిప్ర ♦ ఖ్యాతిపినియు
యేతరంబులవారటు ♦ చూతు రెన్న | నాతరంబౌనెన్యాశ్రాధి ♦ నేతయడలు.

శా. గాంభీర్యోజ్జ్వలధైర్యసారములన ♦ క్కాంధిక్ష్మాభృద్ధరుల్
జృంభద్వైరివధోద్యమంబున నృసిం ♦ హోత్కంఠవోలంగ సం
రంభోత్సాహపరాక్రమంబున బుధా ♦ రాతిక్షయంజేస్ప్రి ప్రా
గంభీంత్రు త్తమరక్షణం బెసని గా ♦ రాజుల్కనత్తేజులై. ౧౬.

ఉ. పాసిఁగఁ బాశుపాల్యకృషి ♦ వర్తులమై క్రయవిక్రయంబుల
న్మోసము లేక కూర్చి ఘన ♦ ముష్టినము న్మహితంబు చేసిరా
యీసునమూలఁ బట్టెఁజన ♦ యెన్నిక లేక కుజేరుఁడా క్రియ
న్భాసిలు విట్కులాగ్రణులు ♦ బ్రాహ్మణపూజనతత్పరుల్సదా. ౧౭.

చం. బలముఁ బరాక్రమంబు బహు ♦ బంధురభూషలు గాఁగ నాజిరా
జులకును నైపుణంబొరిమ ♦ సూనృత మొప్పఁగ వైశ్యకోటికి
న్నెలసి సహాయులై పరగి ♦ మిన్నగొనంబుల వన్నె భూమి నిలిం
పులగృహమేధులం గొలుచు ♦ పుణ్యులు గణ్యులు సంఘ్రిజుల్వరిన్. ౧౯.

ఉ. బంగరుబొమ్మలో కొక్కయన ♦ భాసిలుచుండి మెలంగుజాడఁగా
నంగమెఱుంగుతీవెలయి ♦ నవ్యమనోహరమోహనాకృతు
ల్రంగుగ నంగజాంబకము ♦ లన్మరపించుచు మాటవాసిచే
రంగడుఁ డన్మయత్వమున ♦ రంజిల నుందురు వారకామినుల్. ౨౦.

సీ. పరసులఁగూడిన ♦ సంపత్తెనానగుఁ ♦ బున్నాగజాతులిం ♦ కెన్నొ లేవె
ఈసపసరమెంత ♦ వాసియేయవనమఁ ♦ దామాడమార్ట్లు ♦ గరసెఱుఁగవె
పైకమ్మదేలను ♦ బట్టపీడునుసంగ ♦ వీడునాడంబఱుఁ ♦ గూడెపరను
కనితెల్లఁబైటను ♦ గప్పురమ్మానాఁగఁ ♦ దావెంచులోఁగను ♦ పఱిఁపగుపును
ఘనతరంబౌనుగుఱివేఱు ♦ కలదెనాఁగ । మాటఁగలిగిననడుగరు ♦ మరువరులను
నమ్మికొందునసుష్మన్న ♦ నట్టెచూపు । నోజఁబనిఁగ్రుద్దుపుప్పులా ♦ పీజనములు. ౯౧.

కం. ఈయూపొందికలంపగు । నాయసమాయోధ్యపురికి ♦ నధినాథుండై
శ్రీయంబరీషభూపతి । పాయనిహరిభక్తిపేర్మిఁ ♦ బాలించెధరణ్. ౯౨.

## అంబరీష మాహాత్మ్యము.

ఉ. ఆతనిమాతభర్తృవిను ♦ లాంఛ్రిఁగిళీర్ఘనపాప్యభిందుసం
ఘాతపయూలసత్సుగుణ ♦ భూషణపుంజసమేతవితభీ
తాతతసత్వరూఢిసము ♦ పార్జితసంతతదివ్యపృష్టిసం
ఘాతయపేతపాతకస ♦ గౌరవవాక్సముపేతరైతగుణ్. ౯౩.

ఉ. ఆయమపెక్కులబ్ధముల ♦ హర్షిశలన్బహు భక్తినిష్ఠలం
బాయకయెల్లనోములును ♦ బర్వపునీమములాచరించియా
ప్యాయతనొందుచల్లనసు ♦ ధానరపర్యలఁదృప్తిఁ బుచ్చియా
యూయిఫలంబుశ్రీశునకు ♦ నర్పణచేసినలెంచెఁగేశవ్. ౯౪.

ఉ. ఓకరుణాపయోధిభవ ♦ దుత్తమభక్తికలాకితాపము
ల్ఛకరపాపముల్తుటిమి ♦ భృత్యులమైభరియించఁగాంతునం
చాకథలీకథల్వినఁగ ♦ నల్లనఁగన్పడుఁగల్గొనిక్కమో
చేపురఁజేయవేలనోకో ♦ చిత్తమునంగిలకోర్కులచ్యుతా. ౯౫.

ఉ. చేర్చితినీదుపాదముల ♦ చెంతనుజిత్తముఁబన్నిమిత్తమై
నేర్చితిసంతతాచరణ ♦ నిశ్చయసువ్రతముల్ఘటించఁగాఁ
దీర్చితివిన్నమెట్టునను ♦ దివ్యతరంబుగనీకుఁబ్రీతిగాఁ
గూర్చితిరమ్మనన్వినుతిఁ ♦ గూడనొనర్తుఁగృతార్థఁజేయవే. ౯౬.

శా. ఈవేదిక్కనినమ్ముకొందుఁగదనా ♦ కీవేమనోభీష్టము
ల్పొవేతొల్లిఁటినోసముల్విడిచినం ♦ బున్నెంబుతానంటదే

కావేరక్షణతత్పరుండవయయో ♦ కానన్ననుంజేరఁగా
రావేశ్రీధరసన్నుతేంద్రవరదా ♦ రాజీవపత్రేక్షణా. ౯౮.

కం. అనితనమనమునఘనమని | పనిఁబూనియనూనదీన ♦ భాషంబునబ
ల్కినిదురగదురఁగఁబవళిం | చినస్వప్నావస్థఁదెలియఁ ♦ జేసినవాఁడై. ౯౯.

సీ. కోమరారునవరత్న ♦ కోటీరదీప్తితోఁ ♦ గర్ణకుండలముల ♦ కాంతితోడ
మిసిమించిచెన్నొందు ♦ లసదంగదములతోఁ ♦ గనదురుకంకణ ♦ క్రమములతోడ
కౌస్తుభమణియుత ♦ కంఠహారములతో ♦ నాపాంతమలరుర ♦ మాంబతోడ
పచ్చనాకట్టిన ♦ పట్టుపుట్టములతోఁ ♦ గరములఁదగుశార్ఙ్గ ♦ గదలతోడ
చక్కనౌనెక్కివచ్చిన ♦ పక్కితోడ | వరుసవెనుకొనునలపరి ♦ చరులతోడ
నీటుతోడసుదగుపల్లె ♦ వాటుతోడఁ | గలనుమాంధాతృసతికిసా ♦ క్షాత్కరించె.

కం. అట్టులఁగనుపట్టినయా | దిట్టకుదండములువెట్టి ♦ గృతినుతియించెం
గట్టడిగిలపట్టుచల | ద్రెట్టించుచుదట్టమయిన ♦ ప్రీతిన్నతిక్. ౧౦౦.

చం. సరసిజసంభవాదులెవ ♦ సంధిలఁజేసియనేకవర్షముల్
స్థిరమగుచిత్తదార్ఢ్యములఁ ♦ జేయుతపంబులనైనఁగానఁగా
నెఱుఁగనిదివ్యరూపమిది ♦ యేర్పడెముంగలముంగలట్టినా
నిరుపమభాగ్యమెంతటిదొ ♦ నేనుతియింతుఁబ్రసన్నుఁడౌటకున్. ౧౦౧.

వ. అనికృతనిశ్చయయైయుత్సహించియిట్లనియె. ౧౦౨.

ఉత్సాహ. దేవతొల్లియేమిలేమిఁ ♦ దీఱిమిన్నహీజప | ర్ణావలంబబాలరూప ♦ మందినాభి
కంజమం, దావిధాతృసృష్టిచేసి ♦ యాతనిన్మహోత్తుఁగాఁ | బ్రోవఁద్రోవఁజూపియిట్టి ♦
పొందికల్ఘటించితో. ౧౦౩.

మత్తకోకిల. తల్లితండ్రివిధాతచక్రిసు ♦ ధామయూర్ధ్వధరుండునా -
నెల్లనీవెదినేశచంద్రది ♦ గీంద్రసన్మునిచంద్రులై
కొల్లగాఁగనుపట్టునెల్లరుఁ ♦ గూడనీవెమహేశ్వరం
జిల్లుదెచ్చుటఁగన్ననచ్చుటఁ ♦ జిన్మయాకరుణామయా. ౧౦౪.

మానిని. నాతరమానినుఁబ్రస్తుతిసల్పఁగ ♦ నారదముఖ్యులెనేరరనా
భూతరమత్ప్రతిభంబదినీదగు ♦ భూతియకాదెసమస్తజగ
న్నేతరమాహృదయాబ్జదివాకర ♦ నిత్యశుభాకరమూర్తిప్రపం
చేతరమైనటులొప్పుదుతప్పక ♦ యిందదియందదిపొందినదో. ౧౦౫.

కం. అనిసన్నుతింప మెచ్చుచు । ఘనమోదాయత్తచిత్త ♦ కలితుండౌచుం
జనవల్లభహృద్వల్లభ । ననయముమదిఁగోరునరము ♦ నడుగుమనంగన్. ౧౦౬.

ఉ. చక్కనిభక్తిఁగల్గినను ♦ సాంత్వవిధానమునన్భజించి పెం
పెక్కినభాగ్యముల్వడసి ♦ యెల్లభవద్వినియోగమాటకే
నెక్కొనుప్రీతిఁజేసితగు ♦ నిత్యవినిర్మలకీర్తిధన్యుఁడౌ
నొక్కసుపుత్రుమాకొసఁగు ♦ మోవరదాయనిదీనయైయనన్. ౧౦౭.

వ. ప్రసన్నుండైనహృషీకేశుండు హాసస్ముఖంబున సుసంజ్ఞికంబగు నాప్రసక్తివిని ససంభ్రమంబుగఁ బ్రసాదించువాఁడై ససారంబగు నొకరసాలఫలంబు వసుంధరేశుసతికొసంగి తిరోహితుండగుడు నాతలోదరిమేల్కాంచి చేతనున్నట్టి యాచూతఫలంబుఁ బ్రీతింబొడగాంచి భూతమయుండా తెఱంగునఁ బ్రీతుండై ఫలదాతయైనందులకు హర్షించి యాతటి నాతటి నిద్రించునేతం దచ్ఛ్రోతంగాఁజేతకయి మేలుకొలిపి యంత యుసవిస్తరంబుగా విన్నవించిననతండు. ౧౦౮.

కం. ధన్యవుమాన్యవుగణ్యవ । నన్యగుణాభరణసుపద ♦ మబ్బిననీసౌ
జన్యమునహైన్యముడుగుచు । ధన్యతనేఁగంటినంచుఁ ♦ దరుణిన్మెచ్చెన్. ౧౦౯.

వ. అంతనయ్యనంతాకాంతుండు నితాంతసంతోషాంతరంగంబునఁ గొంతతడవెంతయుఁ జింతించి కాంతంగాంచి సదాచరణపాత్ర సుముహూర్తంబునఁ బవిత్రవై జగత్త్రయపవిత్రకరచిత్ర చారిత్రుండగు నాపుండరీకనేత్రు నారాధించి ధారుణీసురులకు భూరిభోజనాది సత్కారంబులుతీర్చి శౌరిప్రసాదం బిదపుడారగింపుమని యానతిచ్చుటయు నాపెయట్లు చేసిన. ౧౧౦.

## అంబరీష జన్మకర్మవివరణము.

కం. గర్భిణియైయామెయుకనె । నిర్భయుఁడగునంబరీషు ♦ నిస్తులభాషు
న్దుర్భరనియమాన్వేషు । న్స్వర్భానుసమానరోషు ♦ సంస్కృతవేషున్. ౧౧౧.

వ. ఇష్టానందనీయుఁడగు బిందుమతికరవిందాక్షు ప్రసాదంబున నందనుండై యుద్భవించిన యాసుందరాంబరీషునకు శిష్టముని లోకగరిష్ఠుండగు వశిష్ఠుననుమతంబు బడయుచు మాంధాతృమహీరమణుండు తత్తత్కాలానురూపగతుల జాతకర్మ నామకరణ చౌలోపనయన విద్యాభ్యాసాదివిధుల మఱచి, యుద్వాహింపించి తదభిప్రాయానుసారంబుగ యువనాశ్వరాజ్యభారంబు మోపె నాచిన్నియన్న పిన్ననాఁటినుండియు నెన్నరానివిన్నాణంబున వెన్నునిపయిందిన్ననిభక్తి వెన్నుకొనియున్న యెన్నికఁగన్నవాఁడుగావున. ౧౧౨.

సీ. శ్రీనాథపాదరా ♦ జీవచింతనమంద ♦ చెదరనిగురినూన్చి ♦ చిత్తముంచు
నారాయణానేక ♦ నామసంస్మరణంబుఁ ♦ జిరభక్తిసల్పుచు ♦ జిహ్వఁదనుపు
ఘనవిగ్రహంబులు ♦ కైసేసియనయంబుఁ ♦ దృష్టిగాహర్షింప ♦ దృష్టినిలుపు
హరికథాగానంబు ♦ లాచరింపఁగఁజేసి ♦ వీడనితమిఁదీర్ప ♦ వీనులిచ్చు
విష్ణుభక్తులవర్ణింప ♦ విడువకుండు । వారలెదికోరనదిరహి ♦ మీరఁజేయు
విష్ణుమయమెల్లజగమని ♦ విస్తరించు । వైష్ణవునకన్న సర్వంబు ♦ వశపడునను. ౧౧౩.

## భక్తికర్మనిష్ఠలుయుక్తములనునీతి.

ఉ. భక్తులునిర్వికారపర ♦ వస్తుగతైకరహస్యసంగ్రహా
సక్తులులబ్ధశక్తులున ♦ సారగృహస్థదశావిరక్తులు
న్రిక్తులునైజగద్విదిత ♦ నిర్మలసత్వగుణానురక్తులై
ముక్తులుగారెసూక్తులుస ♦ మున్నతినేరఁగజ్ఞానయుక్తులై. ౧౧౪.

ఆ. భక్తితోఁటిమెట్టు ♦ భక్తిచేజ్ఞానంబుఁ । బడయవచ్చుదానఁ ♦ బడయవచ్చు
వర్ణనీయమైన ♦ వైరాగ్యమదిదాన । దొరకుముక్తిగాన ♦ వరముభక్తి. ౧౧౫.

కం. భక్తియొకండబ్బిననుగు । యుక్తులుపెడఁబాయుఁబాయు ♦ నుత్సాహంబు
ల్రక్తులరిక్తులఁగరుణా । సిక్తులనొనరింపఁజూచు ♦ సిద్ధుఁడుతానా. ౧౧౬.

చం. అనుచుబహుప్రకారముల ♦ స్వాశయముఁబ్రకటించితానన
ట్లనరయొనరించుధన్యుఁడయి ♦ డాలుగొనంబురుషార్థసంపద
ల్మనుకొనికూర్చుటుత్తమము ♦ మోవడమద్దియొపథ్యమంచుఁబో
లనమునుజేయుచుండెఁదన ♦ లావొకవంకనువన్నెకెక్కఁగన్. ౧౧౭.

తే. ధర్మకర్మలమూలంబు ♦ త్యాగముకద । త్యాగమునకన్ననెక్కుడై ♦ ధనమువలయు
ధనమునార్జింపఁదనకర్మ ♦ నొనరుపనగు । ననుచుభక్తినరక్తిఁదా ♦ ననుగమింప.

సీ. కువలయంబలరించి ♦ కూర్మినన్నతిఁజూపు ♦ రాజన్ననీతండె ♦ రాజనఁదగు
కవిబుధగురులను ♦ గ్రహసౌమ్యమునఁగను ♦ నినుఁడన్ననీతండె ♦ యినుఁడనఁదగు
సరసులకెల్లెడ ♦ సారసంపదనిచ్చు ♦ ఘనుఁడన్ననీతండె ♦ ఘనుఁడనఁదగు
ఎల్లభూభృత్తతి ♦ యెగిరిపాఁటున్నాన్చు ♦ నింద్రుఁడన్ననితండె ♦ యింద్రుఁడతగు
అనుచుఁబ్రజలెల్లఁదన్నెప్డు ♦ వినుతిసేయ । భూమిఁగలబుధసాధుల ♦ సేమమునకు
నంబరీషపటిష్ఠుఁడౌ ♦ నంబరీషుఁ । డగుచుఁబైటనలోనను ♦ బొదిగొనియెను । ౧౧౮.

ఉ. ఆతఁడుధీరతన్గిరుల ♦ నబ్ధిగభీరతబుద్ధిఁగంజజు
న్ఖ్యాతినుమేశ్వరున్స్మరునిఁ ♦ బొందికఁగాంతిశశాంకుదీప్తిచే
నాతరణిన్క్షితిన్నుచిత ♦ నయ్యమరేంద్రునిభోగసంపద
న్భూతులఁజేసిగెల్చియుఁక ♦ విష్ణునిభక్తినిలొంగనీడ్చెడిన్. ౧౨౦.

ఉ. అల్లసరస్వతీతటము ♦ నందొనరించెమహాశ్వమేధము
ల్కొల్లలుగాగదక్షిణలు ♦ కోరినయట్లుచలామురాశిక
స్థల్లననిచ్చిధేనువుల ♦ సాభ్యుపపత్తినొసంగెఁగోటులం
దల్లికృతార్థకాఁడగిన ♦ తాఁబరమార్థవిధిజ్ఞుఁడౌటచేన్. ౧౨౧.

కం. కురియంజేసెనురత్నము । లరయంజేసెనురమేశు ♦ వంచటివారి
స్సిరియంజేసెనుసంపద । మెరయంజేసెననిమేర ♦ మేవడినెక్కొన్. ౧౨౨.

సీ. అంబరీషునకుది ♦ గంబడియాకీర్తి ♦ కలిగితాఁజెలరేగి ♦ బలిసియెగసి
తనధీధితినిజగ ♦ త్త్రయమావరింపంగ ♦ దినపోదయాస్తమా ♦ ననియతివిడే
ఐరావతోచ్చైశ్ర ♦ వామరతరుధేను ♦ వజ్రముల్వ్యైదకెంగ ♦ వజ్రివెడలె
వాహనాన్వేషణో ♦ త్సాహిరైవేసరి ♦ చనినిజాసనమును ♦ గినఁడజుండు
అత్తవారియిండ్ల ♦ కరుగదారులునాన । నడిగికొనుచురోయ ♦ వెడలిపన్ని [౧౨౩.
యుండనిల్లుగాని ♦ పండమంచముగాని । దొరకకకడలిరంట ♦ హరుఁడుహరియు.

కం. శక్తియిటులద్భుతంబగు । భక్తిన్వర్ణింపనతని ♦ ప్రతియతఁడౌపరా
శక్తియిఁకనతనిసుతగా । యుక్తముగాకున్నెసరవ ♦ రోత్తముఁడుగదా. ౧౨౪.

కం. ఆతండిఁకనుగాళిం । దీతీరమునందొనర్చె ♦ దృఢతరనిష్ఠం
బ్రీతిమెయిఁదపములోక । త్రాతరమేశుండుమెచ్చి ♦ దాక్షిణ్యమునన్. ౧౨౫.

చం. గరుఁడునిదైవతేభముగ ♦ గల్పనచేసిమురారితానుసుం
దరతరవైభవాతిశయ ♦ దర్పములొప్పఁబురందరాకృతిం
బరగినఁగానకున్నయల ♦ భక్తునిఁగోరువరమ్ములన్న నే
సురపతినన్నమిన్నకటు ♦ చూడకయేచనుమన్నదెన్నడైన్. ౧౨౬.

తే. తనసుదర్శనమపుడిచ్చి ♦ తన్నుమెచ్చి । వినుతిసేయంగరహిఁజొచ్చి ♦ ఘనతఁబుచ్చి
మనుపమదివచ్చియాలచ్చి ♦ మగఁడుమెచ్చి । మచ్చికనుగ్రచ్చితగఁజక్ర ♦ మిచ్చిచనియె.

తే. తాసుదర్శనమతనిసు ♦ దర్శనముగ । నమ్మినెమ్మనమునఁబూజ ♦ నమ్మొనర్చు
సప్తమాకంబుద్వాదశీ ♦ వ్రతముసల్పుఁ । జేసియేకాదసులసుఖ ♦ నాసదీక్ష. ౧౨౭.

కం. పరమార్థప్రాప్తినఖిలముఁ | బరమేశాధీనమగుటఁ ♦ బనివడుటకుఁబు
ట్టిరకానఁబనిదొరంకొనఁ | బరువడియగునీషణంబు ♦ పామరతయనన్. ౧౨౯.

తే. సకలవిధములనాభాగ ♦ సత్సుతుఁడగు | నంబరీషుండయాతండ ♦ నంబరగను
దైనకృత్యములనైసర్గి ♦ కావిలముల | నించుమించేమిలేదువ ♦ చించుటకును. ౧౩౦.

## శ్రీమత్యవతారాభివృద్ధ్యాదులు.

ఆ. అట్టియంబరీషు ♦ పట్టియైయుపయించెఁ | బ్రకృతిలోకమాత ♦ భావిసీత
సకలలక్షణాప్తి ♦ నకళంకయగుచును | దూరయగుచునయవి ♦ చారయగుచు. ౧౩౧.

ఆ. సురలుపూలవాన ♦ గురిసిరిదిక్కులు | మెఱసెదివ్యకళల ♦ మేదినిఁగల
జనులకొదవనయ్యె ♦ సంతతోత్సాహంబు | పాడిపంటలెచ్చెఁ ♦ బదవిగ్రచ్చ. ౧౩౨.

కం. శ్రీమతినామంబునఁదగి | ధీమతిగుణవతిప్రథమమతి ♦ ధృతిమతియగుచు
న్సామారత్నమునాఁగాఁ | గామాంబకమట్టులొప్పెఁ ♦ గమనీయరుచిన్. ౧౩౩.

సీ. ఎల్లరరక్షించు ♦ నల్లజగన్మాత ♦ తల్లిసంరక్షణఁ ♦ దానుబడసె
పలుతొలిపలుకుల ♦ వెలయించెడిలలిత ♦ పలుకులొండొంటిగాఁ ♦ బలుకనేర్చె
ఆటకన్నిపాడిపి ♦ యాపిమాపెడియంబ ♦ తోటిబోటులతోడ ♦ నాటలాడె
విద్యలానవముని ♦ వేద్యయౌనలమాత ♦ హృద్యంబుగాఁగను ♦ విద్యఁజదివె
తానుదినదినమునువర్ధ ♦ మానకాఁగ | నెప్పుడెప్పునియొప్పిద ♦ మప్పుడద్ది ౧౩౪.
మాఱఁదమిలేరఁజెలువార ♦ నేరిచికొని | వన్నెకెక్కినకన్నెనా ♦ నెన్నికఁగనె.

ఆ. అంబరీషపుత్రి ♦ యైనందులకుఁజెచ్చు | విష్ణుభక్తిలోడ ♦ వెలయుచుండి
బొమ్మలాటలోను ♦ నమ్మాధవునెకొల్చు | గ్రంథపఠనతని ♦ కథలెఱుంగు. ౧౩౫.

కం. హరిభక్తిమనుఁడజనకుఁడు | హరిభక్తినిరక్తిమనయె ♦ హరిసమయమునోకో
హరివేణితహరివాణిత | హరివదనతహరిసుచితయు ♦ హరిమగ్యతకాన్. ౧౩౬.

సీ. హరికినివేదింప ♦ నట్టిదేదియుముట్ట ♦ దలరులుఫలములుం ♦ జెలులొసఁగిన
హరివిలాసపదార్థ ♦ మమరనిచోఁద్రొక్క ♦ దరయనద్దింకెంత ♦ పరగితగిన
హరికథావివరంబు ♦ లాడునాటకములు ♦ పెరయాటఁజొరదేరు ♦ ప్రీతిపడిన
హరినామసద్గ్రంథ ♦ మాస్థఁబఠించెడి ♦ నలదొండనునురస ♦ వంతమయిన
అంతరంగభక్తి ♦ నెంతయునిట్లున్న | బీజమునకుఁదగిన ♦ భూజమనుచు
నంబరీషపుత్రి ♦ నభినుతింత్రెల్లరు | మూలమెఱుఁగకున్న ♦ లీలఁగన్న. ౧౩౭.

గీ. అట్టికూతుర్గొక్క ♦ యాత్మజుఁడసుమావ | నాశ్వఘుఁడుకీర్తి ♦ శాశ్వతుండుఁ
బరగనంబరీష ♦ నరపతిసురపతి | యొప్పిపమునసుండ ♦ నొక్కనాఁడు. ౧౩౭.

## పర్వతనారదులంబరీషుంగనవచ్చుట.

ఉ. కట్టడికల్గిలోకముల ♦ గాఢలెఱుంగుచుబాధవీడిపోఁ
బెట్టెడిబోధసేయఁగన ♦ భీప్సితముల్సమకూర్పనూరకే
పట్టువలంబనింగొనెడి ♦ భాగవతాగ్రణులార్యవంద్యులా
పట్టునకేగుదెంచిరల ♦ పర్వతనారదమౌనిరాణ్మణుల్. ౧౩౮.

సీ. ఘనజటాజూటసం ♦ ఘటితమస్తకముల ♦ రమణీయఫాలపుం ♦ డ్రములతోడ
అమలతేజఃప్రభా ♦ వాంగకాంతులతోడఁ ♦ గరుణాకటాక్షవీ ♦ క్షణలతోడ
కమనీయకటిసూత్ర ♦ కౌపీనములతోడ ♦ నమరియుండినవల్క ♦ లములతోడ
చారుహస్తగ్రస్త ♦ జపమాలికలతోడఁ ♦ దమరక్షకైనదం ♦ డములతోడ
హరిహరాంచితనామసం ♦ స్మరణతోడ | శమదమోత్పన్నకరభాష ♦ ణములతోడ
తెలియకానరనారాయ ♦ ణులెయటంచు | మహిమపెంపునఁదలపంగ ♦ మహికిడిగ్గి.

ఉ. వచ్చినమౌనిచంద్రులకు ♦ వందనముల్పచరించితోడనే
మచ్చికనర్ఘ్యపాద్యములు ♦ మాన్యపదార్థసమర్పణంబులిం
పెచ్చఁగఁజేసిలక్ష్యముగ ♦ నేర్పరపించినరత్నపీఠము
లెచ్చియిడంగఁజేసియల ♦ దేవమునీంద్రులఁగాంచియిట్లనున్. ౧౪౧.

ఉ. మీరుమహానుభావులరు ♦ మేధగలారలువేదతుల్యులున్
భూరికృపావిశేషమొగిఁ ♦ బొందినమానసమెచ్చరింపఁగా
నూరకయస్మదాదులకు ♦ నున్నతిఁగల్పనఁజేయఁబూనియీ
తీరునఁజేరుచుందురను ♦ తింపఁగశక్యమెమీసమర్థతల్. ౧౪౨.

కం. కారేహరిహరులీరలె | రారేనామనికిపట్టు ♦ రంజింపంగా
నీరేగతులాప్తతఁగై | కోరేయాసనములనుచుఁ ♦ గూర్చుండంగాన్. ౧౪౩.

ఉ. పావనమయ్యెమద్గృహము ♦ బంధులుమంత్రులుఁగాంతలాప్తులు
న్సేవకులుందరింత్రుమదిఁ ♦ జేడ్పడుచింతలువాసిసర్వలో
కావనభద్రదాయకమ ♦ హామహిమాంచితదివ్యపాదసం
భావనమాకుఁగల్గెనిఁక ♦ భాగ్యముమృగ్యమెభోగ్యమౌసదా. ౧౪౪.

కం. జంగమతీర్థములైమా | ముంగిటికల్పకములట్టు ♦ మొగికొనియెడిమీ
గతిఁదెలిసెడిఁబోవను | లంగామముఁజేసికోర్కు ♦ లందీర్తురిలన్. ౧౪౫.

మ. ఒకపోరన్విధిప్రోలుమాధవపురం ♦ బొక్కంటఁగైలాసమిం
కొకఁటందాపసలోకమొక్కఁటసురేం ♦ ద్రోకస్సొకఁటన్నెల్లలో
కకుభృద్ద్వారయోగికాశ్రమములిం ♦ కంగొన్నిటన్నాగలో
కకరాళాలయమొంటమెట్టించుఁగనం ♦ గాంక్షింత్రుత్రోవన్మమున్. ౧౪౬.

మ. కలికాభుర్ధరణీవరాశ్వప్రతికి ♦ న్గర్వప్రమత్తాళికిం
గలకాలంబయిమీరలుంటనెకదా ♦ కౌటిల్యముల్గామియా
కలికాలంబటులీరలేరెఁగనమిం ♦ గాదేన్నలోకంబువ్యా
కులభూయిష్టమనిష్టకష్టదమహో ♦ ఘోరాఘసంతుష్టమున్. ౧౪౭.

కం. అనివినుతులుపొనరుచునా | జనపతియాసనముఁగనుచుఁ ♦ జనువునవుగా
మునిజనఘనగణ్యులుతమ | మనమునననురాగమొనర ♦ మనుపతితనరన్. ౧౪౮.

శా. రాజుల్కీరలనంగఁబుష్పఫలము ♦ ల్రాజిల్లఁగానోమహో
భూజంబుల్గనమిమ్ముఁగాంచుటలుమా ♦ భోజ్యంబపేక్షింపనే
వ్యాజంబేటికిమిమ్ముఁదీర్చుటయుమా ♦ వ్యామోహమేసుమ్మిగో
భూజానీమముఁగోరిమిమ్ముఁగనుచు ♦ న్బోధింతుమిష్టార్థముల్. ౧౪౯.

ఉ. సాధులువిప్రులున్యతులు ♦ సామ్యములండజపాళిగాఁగనే
బాధలనొందకుండమిముఁ ♦ బ్రాపుగఁగైకొనియుంటఁగాదెహ్రు
ద్రోధముఁబాసిసాధనచ ♦ తుష్టయసంపదసేకరింతు రా
రాధనవారిఁజేయుటన ♦ రంజిలమీకగుఁదెల్పమాకగున్. ౧౫౦.

చం. ఘనమదిమీదెలుంగకస ♦ గౌరవవాక్కులమ్మునంటనీ
ఘనమునుబెంపొనర్చునది ♦ కల్మషదూరతకాస్పదంబగు
న్వినుతులవేలనీక్రియకు ♦ నీవునుమాక్రియకేమునొదుమీ
యనువెకదాపరాత్పరుని ♦ యానయనన్నరనాథుఁడిట్లనున్. ౧౫౧.

డు. ఒకనాఁడైననుమమ్ముఁగోరరుగదా ♦ యొక్కింతయొక్కింతలో
నిఁకనీరేతమినీరెసర్వమునుమా ♦ యిచ్ఛానుసారంబుగా

సకలోత్కృష్టుబుసర్వశక్తులుమను ♦ న్నాకంగమీకేఁటికో
యిఁకవేఁకొపనిలేనియట్టులిదియే ♦ హేరాళహేవాకమా. ౧౫౨.

కం. స్థితినియతులునతికుతుకులఁ । జతురులుసతతాతిరక్త ♦ శతధృతిముతులా
యతులరితరులగతినిగని । యతిపథమునజతపలుతురి ♦ పతివేళమెనాన్. ౧౫౩.

ము. యతులెల్లరధర్మమిద్దిమియమే ♦ మాస్థంబ్రబోధింపమీ
రతిసంతృప్తిరివిప్రులన్మనుపవే ♦ దార్థంబువారోలమిన్
స్మృతిగుప్పంజగమెల్లఁబొందువడెడు ♦ న్మేఘుంబుఁగర్షింపఁగా
క్షితిప్రామాగుంపరులిచ్చుఁబండ్లవితిను ♦ క్షేత్రజ్ఞుఁడిద్దట్లనున్. ౧౫౪.

కం. హితమిదిపరమాత్మునకా । జతపడియొండొరులుసాయ ♦ సంగడులఁదగ
న్సతులఁగనిపితకుతుకపడు । గతినితరజపాదులకును ♦ ఘనమిదిసుమ్మా. ౧౫౫.

కం. మాచేయుజపతపస్సులు । మీచేసెడిక్రతువులెల్ల ♦ మేళనమైన
న్యోచింపఁగజగదుపకృతి । కైచేసెడిక్రియలకీడు ♦ కావనఁబతియున్. ౧౫౬.

కం. సాయముచేయునదెవ్వఁడు । సాయముఁగైకొనునదేఁడు ♦ సర్వంబొకఁడౌం
చేయెడనీరలెయందురె । యీయుక్తులవానిఁగూర్చి ♦ యెఱిఁగింపుఁడనన్. ౧౫౭.

## వర్ణాశ్రమధర్మనిర్ణయము.

తే. ఔనునిక్కమయీమాట ♦ యదియెతేఁట। తానునన్యుండనంచొండు ♦ దలఁచితొలఁగఁ
దప్పుతప్పనుచొప్పునఁ ♦ జెప్పుటకునె । సర్వమేకముసాయము ♦ సాజమనుట.

సీ. అక్షులుకర్ణంబు ♦ లంఘ్రులుంగరములు ♦ వాక్కునువక్త్రంబు ♦ వరలుమేన
కనుచునువినుచును ♦ జనుచునుబూనుచు ♦ ననుచునుదినుచున్న ♦ నంగమెసఁగు
కనుసెవులధికతఁ ♦ గాళ్ళేతులవటున ♦ నాల్కనోర్లదనాన ♦ నతినుతింగన
కనకయునివినకయుఁ ♦ జనకయుంబూనక ♦ యనకతినకయున్న ♦ నడలునొడలు
సాయమేదొనర్చు ♦ సాయంబునెద్దొందు । సాయమొదవకున్నఁ ♦ జచ్చుఁగలిసి
సాయమునకసాజ ♦ సంగడులనుకొని । పనులువలయుజగతి ♦ మనవదెగతి. ౧౫౯.

ఉ. బాలురవారిజాక్షులును ♦ ప్రౌఢులువృద్ధులునుండునిల్లువా
క్షాళనకార్యసంఘటన ♦ గాసిలికూర్చుటనీతినేర్పుట
ల్లీలగనున్న నేచెలఁగు ♦ లేకదిబన్నముఁగన్నభిన్నమా
వీలునశూద్రవిణరవ ♦ విప్రులగేషామిదొప్పఁజొప్పదున్. ౧౬౦.

సీ. బ్రహ్మచారులుశాస్త్ర ♦ పద్ధతినడచుచు ♦ కలిగియెల్లరకూర్మిఁ ♦ గనఁగవలయు
అలగృహస్థులువణి ♦ జానుసరావస్థఁ ♦ గూర్చుచండటీకన్ని ♦ కదురవలయు
ఆసనప్రస్థులు ♦ భూవరులట్టుల ♦ వరిశిక్షగుణరక్ష ♦ జరపవలయు
యతులన్నభూసుర ♦ గతినెల్లెడలధర్మ ♦ పద్ధతులుపదేశ ♦ పఱపవలయు
ఆశ్రమంబులనిట్లుండ ♦ రనుసరించి | వర్ణనియతినచరియించ ♦ వలయుసుమ్మి
పాలుమాలుచునేఁడేనిఁ ♦ బరువడనుచుఁ | బరులకొప్పుమిఁజేదుపాని ♦ బ్రదుకువృథయ.

కం. ఒరులగతినాకునేఁటికి | సరినాకేరొప్పరనుచు ♦ సాహసికానా
దరమొందేఁడుదేవునికడఁ | గొఅమాలినసుతునిఁదండ్రి ♦ కూరిమిఁగనునే. ౧౬౨.

కం. ఆదరువుగొఁదనపనినడఁ | జేఁదోడాబిడ్డజనక ♦ చిత్తప్రియుఁడౌ
మాదిరిఁబరేశుకృపఁగనుఁ | గాదనియేమెచ్చుఁగన్నఁ ♦ గడలెక్కఁబడుఁన్.	౧౬౩.

కం. సాయమొస్వీయమొహేయమొ | న్యాయముసహజార్థమిద్ద ♦ నరులకరయఁగాఁ
బాయకయొక్కటిభాగము | లైయుండఁగనన్యమున్నె ♦ యనభూవరుఁడున్.

చం. ఘనుఁడగునొడ్డువేఁగఁడన ♦ కర్మముఁదీర్చుచుబల్మిపేర్మిఁదాఁ
బనివడియొందుకార్యములు ♦ పట్టునఁజేయఁగడంగునేనినా
తనికిమహోన్నతంబయిన ♦ ధన్యతరాఁజనునేయనంగనా
మునిపతులిట్లుపల్కిరిప్ర ♦ మోదదసాదృశయుక్తభాషలన్.	౧౬౫.

తే. తన్నహంకారమూనియు ♦ దర్పమీనఁ | దలఁచెడినకానిలేఁడట్టి ♦ బలిమివాఁడు
తనకుఁగలపుష్టియెల్లస్వ ♦ ధర్మమందుఁ | బూర్తిగానూన్చునాతండె ♦ పూర్ణఘనుఁడు.

తే. అన్యకర్మంబొనర్పఁగా ♦ నాసపడ్డఁ | జేఁదరుగువానిగతినది ♦ చేతఁగాదు-
స్వీయకర్మంబురుచివాసి ♦ చెడునుమున్నె | యుభయనష్టతఁబెడఁబాయు ♦ నూర్థ్వగతియు

వ. ఇదియెయిందగుసాఫ్యఫలంబు నిజకర్మానుష్ఠానంబు సర్వసమ్మతంబు జగద్విదితంబు నగు నైన నింకవినుమని యిట్లనియె.	౧౬౮.

చం. అధికులుహీనకర్మముల ♦ యాచరణంబునకాశ్రయింపర
స్వధమునసైనఁదాల్మిఁగని ♦ వేదనపెట్టెడిసిగ్గుమాన్పన
స్పృహమునవేఱుసేగిగనఁ ♦ బట్టెదుపుట్టెదుధర్మలోపమో
యధిపతిప్రౌఢులప్పుడప్పు ♦ డన్నలపిన్నలపాటొనర్పరే ?	౧౬౯.

తే. కానిహీనులుగౌరవ ♦ కాంక్షఘనుల | కర్మలొనరింపఁజనదద్ది ♦ ధర్మహాని
చన్నఁదత్ఫలమువిలోమ ♦ జాతిరీతిఁ | జెడునుచిన్నలుపెద్దల ♦ నడకగుదురె? ౧౭౦.

ఉ. కావునఁ గాంతలా పురుష ♦ కర్మము రాజులు విప్రధర్మమ
ల్లావణిజుల్ మహీశవిధి ♦ నంఘ్రిజులార్యవిధాయకంబును
న్నావిధి గేస్తులాయతుల ♦ వర్తనమున్ బ్రవర్తింపఁ బూనరా
దావల సద్గతుల్ప్రకృత ♦ మంతయుఁ బాయును మాయు నాయువున్. ౧౭౧.

ఆ. ఏవివర్ణుఁడైన ♦ నెదకెక్కువారిది । స్వీయనియతిఁ గన్న ♦ శ్రేష్ఠతయుని
తనదు కర్మనియతిఁ ♦ దాననుష్ఠించుచో । వారియట్టి వన్నె ♦ వాఁడు కాఁడె. ౧౭౨.

తే. తల్లిదండ్రులఁ బెద్దలఁ ♦ దలఁపరుడుగ । వర్ణమాశ్రమము నఁబీడ ♦ వడిఁ దలఁతురె
తాము సరియించు నార్మగ ♦ ల్తలఁగఁ దగదె । నైజధర్మంబు పాయనా ♦ నేజనులకు.

కం. తనజననీజనకులవలె । ఘనభక్తిని గౌరవించి ♦ కలిగిన సుతుల
ట్లనువుగ గౌరవమునఁ గని । తనకర్మలొనర్చువాఁడె ♦ ధన్యుండన్నా. ౧౭౪.

కం. ఏఁడేఁటికి మహినొదవెనో । వాఁడడియొనరింపనదియు ♦ వాడుం బనరుం
గూడినఁ బెరపనిఁ బాడై । తోడంబును జేరులేక ♦ తోలఁగు ధరిత్రిన్. ౧౭౫.

తే. నిత్యవర్ణాశ్రమాచార ♦ నియతనిష్ఠ । నెల్లరుండఘటింపమి ♦ మ్లేచ్ఛరించు
టిందులకె కాదె మీరు మే♦మంపఁ బునికి । యనుచుఁ బల్కుచుఁ బలలెత్తి ♦ యటుకనంగ.

ఉ. కాంచిరి మౌనికుంజరులు ♦ కాంచనరత్నసమప్రభావిశే
షాంచిత దేహదీప్తిగల ♦ యాధరణీశ్వరపుత్రికామణిం
జంచలముల్మనంబులుగ ♦ సాహసుఁడా సుమబాణుఁడేడనో
పొంచి శరమ్ము లేసెనటఁ ♦ బోయె నొగర్మము లేఁటఁ బట్టుచున్. ౧౭౭.

## ఆమునులు శ్రీమతినభివర్ణించుట.

వ. అట్లు నిక్కంపుచక్కటులు పెక్కులుపన్యసించుచు నొక్కయెడ నెదుటిచక్కటి కైకనుఁడుఁ-జక్కనియొక్క చక్కరబోడి యాచక్కింజన్న ఫక్కింగన్నవారై యొక్కింత దెక్కుపడ నెక్కడనక్కనో. యాచక్కరతిండి యెక్కిరింతటక్కరి గ్రక్కున నెక్కిడి చురుక్కననేసె నక్కటక్కట తమయెక్కువలెల్ల నెటఁద్రొక్కిరో యెట్లొ చిక్కులకుఁ దక్కిరో దృక్కుల వాక్కుల నక్కయంపు నెల్ల చక్కుల నెక్కొనుచొక్కుపాటు తమనిక్కంపుఁ జొక్కమ్ము స్రుక్కఁజేయ నక్కముని యుక్కురులంజిక్కుకొని మిక్కిలిపలుకులకెక్కమాలి యక్కన్నియ చక్కందనమ్మునకుమక్కువపడి తక్కినవారియెక్క సక్కియములు లెక్కగొనక యుక్కడము లెక్కొన నొక్కుమ్మడి నిట్లనిరి. ౧౭౮.

కం. అదెకననయ్యెనువింతగఁ । బదియార్వన్నియలమేల్మి ♦ ప్రతిమయొమించో
పదనైనమదనుప్రపదర మొ । ముదితయొ యౌనన్ననద్దె ♦ మోహినియొక్కో. ౧౭౯.

చం. హరిసతిరూపముంగనిన ♦ యప్పటినుండియుఁసృష్టి నేర్పునం
గొఱతయటంద్రుతన్ననుచుఁ ♦ గూడినపట్టుదలంజిరప్రయ
త్నరచితసర్వసౌష్ఠవని ♦ ధానముగావిధిచేసియుండనా
హరుఁడదికాంచిమోహపడె ♦ నాహరిదీనికిమోహ మొందడే! ౧౮౦.

చం. సురపతికుండులెక్కఁదగు ♦ చూడ్కులునాఫణినాథునట్టులా
తరబడివాక్కులుంగలిగి ♦ దానికిఁబైనజునాయువొప్ప నే
సరసిజపత్రలోచనకుఁ ♦ జాలగమేలగులీలనొప్పనీ
సురుచిరలక్షణంబులను ♦ జూచినుతింపఁగ సావకాశమా. ౧౮౧.

కం. బంగరుపాడిరతనంబుల | సంగతినత్తరువుసుధయు ♦ సమ్మేళనగాఁ
గంగుదిరిచియీయంగన | సింగారించినవిధాత ♦ చెయువరిదికదా. ౧౮౨.

కం. సితముముఖవర్ణంబును | వాతెరరక్తిమముఘనళి ♦ వర్ణంబత్తు
ల్చాతుమునైల్యంబలకల | నాతక్కుదిబొట్టువన్నె ♦ లైదగుశుకమో. ౧౮౩.

కం. ముఖరాసిసారమునుస | మ్ముఖమునముసుకొనకవెనుక ♦ ముడుగుచునటఁద
త్సుఖశఁగనికటకముంబడ| ముఖరంబైజనకజలధి ♦ మురియించుశశిన్. ౧౮౪.

చం. మనమొకనాఁటికిప్పటికి ♦ మానినిఁగానఁగనయ్యెమున్నయే
యనువుననోగ్రహించితగు ♦ నంతటిజాగ్రదవస్థఁబూనియీ
చనుసరిఁగానపిడమికె ♦ శారదలక్ష్మియుమల్లిజేశుల,
ఘనముగహస్తికొందురల ♦ కారణమిప్పటికర్థమయ్యెడిన్. ౧౮౫.

ఆ. తరుగుపెరుగఁదలలుఁ ♦ దగునైల్యమొప్పెడి | రాత్రిచరుఁడుపోల్ప ♦ రాదుసోమ
నబ్జమాస్యమనఁగ ♦ ననుకూలమవునవు । నలరుగంధమళిస ♦ మాలకములు ౧౮౬.

ఉ. అంగనకంగజాతవిజ ♦ యాంకములైప్రభవిల్లిజాలువా
బంగరుబొంగరాలగతి ♦ భాసిలుచున్నకుచద్వయంబుమే
ల్రంగుమెఱుంగుఁగన్నవుడ ♦ రాకటులేగినమానసంబు తా
బొంగయిదూరెనానడుమఁ ♦ వోరపురాయిడినేమియౌనొకో ౧౮౭.

తే. నాసికాకర్ణయుగముల ♦ నర్థములయి । యాగెసాగకనయనంబు ♦ లండఁబగిన
గండములకెక్కి వెలిగెడి ♦ దండికళల । కజ్జలముదృష్టిదోషాప ♦ గమముగాఁగ.

సీ. కన్నులసరిగాక ♦ గడుసరిమీలెల్ల ♦ నిక్కి పడుచుఁబోయి ♦ నీఁటమూఁగె
కంధరతుల్యము ♦ ల్గాలేకచిందంబు ♦ లడలుచుబైటుండ ♦ కబ్ధిడాఁగె
ముంగురులకుసాటి ♦ ముంగలరాకళు ♦ ల్సాల్గుచువనగుల్మ ♦ ములకుసాఁగె
నఖములకైనరాక ♦ నక్షత్రపాళితా ♦ మిట్టుచుమినుకుచు ♦ మింటికేగె
పలుకుమెలఁకువఁబొరుచుఁ ♦ జిలుకలెల్ల । తిరిగికనమాలితరులెక్కి ♦ నరిగివాగె
పటిమగలధీరులెటునైన ♦ బయలువెడల । నిలువఁగందురెయచోఁటఁ ♦ జులుకవారు.

సీ. కాలసర్పంబులు ♦ నీలరత్నంబులుఁ ♦ జమరులుందమములు ♦ సమముగామి
కలువలుహరిణము ♦ ల్కంజముల్మత్స్యమ్ము ♦ లంగజుతూపులు ♦ వసువురామి
ముంకెనపువుగెంపు ♦ మావిచివురులత్తు ♦ కలుబింబఫలములుఁ ♦ దలలుగామి
చక్రకందుకగుచ్ఛ ♦ సామజకుంభము ♦ ల్బంగరుగిండ్లును ♦ బాటిరామి
నెదురునదురుబెదురు ♦ గదురవికుదిరిక । కురులులోచనముల ♦ ధరకుచములు
చేరితేరితీరి ♦ మీరుచున్నవి । యసమపదవిఁగన్న ♦ పసయిదెకద. ౧౯౦.

ఆ. అతనుఁడైనమదనుఁ ♦ డతఁడగోచరుఁడయి । దీనినావహించి ♦ యేనిఁగాని
వేఁగలోఁగనేయు ♦ విండ్లుబాణములన । భామలుఁజూడ్కులౌకఁట ♦ నమరఁ
దెలియ. ౧౯౧.

ఆ. కొప్పుకప్పుగొప్పు ♦ రొమ్ముపదములుఁగని । పాటిమీటిచేరి ♦ పైకరిగియు
నడిగెఘనతయనుచు ♦ నడలుచుమొయిళులు । కడుపుపగులఁగ్రిందఁ ♦ గా
ర్చుఁగాదె. ౧౯౨.

కం. నిండుశశాంకుఁడుముఖముగ । నుండినమాలిన్యమొదవు ♦ నొప్పదటంచు
న్ఖండించిశశినినుదురుగ । దండితనంబునఘటించె ♦ ధాతనెలఁతకున్. ౧౯౩.

తే. భామినీమణిలోచన ♦ పద్మములను । మధువునానంగఁగమకించు ♦ మధుపములను
పదపదంబునఁదోలుట ♦ కదనుపడమిఁ । గాంచనముఁజేసెనాసగాఁ ♦ గావలికిని.

కం. నవనవలక్షణయుతయా । నవలయటంచెలుకకైన ♦ నమ్మకమునకే
యవ్వులమతివ్వులందవ్వులుచుఁ । జెవ్వులునవాంకితములొప్పు ♦ శిఖముద్రలుగాన్.

కం. నటఫలముచుబుకమానా | నటఁబటుదంతములుదాడి ♦ మాంచితబీజో
త్కటములుమౌక్తికకుంద | స్ఫుటములునిశ్శ్రేణిఁబోల్పఁ ♦ బాలుపగునళులున్.

ఆ. మదుఁగొప్పొన్నపూవొ ♦ సుడియొమానినినాభి | నల్లజెల్లొత్రాచొ ♦ నాతియారు
సైకతములొగిన్నె ♦ లొకలికిపిరుదులు | తొడలనంట్లొయేన్గు ♦ తొండములొకొ.

కం. తామరతూండ్లఁటుభుజములు | తామరపుష్పములుహస్త ♦ తలసమములుగాఁ
దామరసములామెట్టివి | యామానినియంఘ్రితలము ♦ లంటిమనియెడిన్. ౧౯౮.

ఆ. బాలనగవుజ్యోత్స్నఁ ♦ బాలనవ్రజంబుల | నల్లచంద్రకళల ♦ మల్లెపూల
నలుఁగుమెఱుఁగుమీఱి ♦ పరగడిఘనళిమ | దీనియశముధాటి ♦ దానిసాటి. ౧౯౯.

కం. మదగజములగేరెడినొ | కుదిరికయంచలకుఁగూర్పఁ ♦ గోరెడినొయా
పదములయొదుగుడుగమనిక | కుదిరెడినేనాగకవుల ♦ కున్వర్ణింపన్. ౨౦౦.

కం. మించుంబంగరుఁగుందన | మించొమించుగనొసింధు ♦ రేద్ధంబొచు
న్నించుంజంబూపంకము | మించులనిఁకనేమిచెప్ప ♦ మించులమించున్. ౨౦౧.

ఆ. ఇన్నియింతలుండి ♦ యెన్నఁగాఁగనరాక | యున్నదతివనడుము ♦ మిన్నుపోలి
అరయఁదలిసెహేతు ♦ వాసింగమిదితన్ను | గేరునంచుఁబాఱి ♦ దూఱెనడవి.

తే. పిడికిఁటికిలోఁగినడుమున్నఁ ♦ బడతియెట్లొ | మోయఁగల్గెనుగచకుచ ♦ ములభరంబు
నడనలేమికిఁగతమిద్ది ♦ నాణెమదియు | గాఁగనేచేసెయోచించి ♦ కమలభవుఁడు.

చం. అమృతపుబావిమోవియగు ♦ నద్దిరనాసతిలప్రసూనమా
రమణతగండభాగములు ♦ రంజిలుదర్పణయుగ్మమట్లుశ్రీ
సమములుకర్ణముల్భళిర ♦ చక్కనికేతకముల్నఖంబులై
యమరునయారెయారుభ్రమ ♦ రాళిసలాకపిపీలికాళినాన్. ౨౦౪.

చం. సకియకుచంబులెన్నఁదగు ♦ సామ్యములైలికుచాబ్జకుట్మల
ప్రకరములందుఁబొందికవి ♦ రాజిలుతాళఫలంబులారయే
తికమకలొందికంచుకము ♦ దిట్టముగాబిగియించి పట్టిన
న్నికృతికినొచ్చియెచ్చఁగన ♦ నిక్కుచుముక్కులనొక్కగ్రక్కనన్. ౨౦౫.

ఉ. జౌర్ణపయోజగంధికిని ♦ హారములున్నవరత్ననూత్నశో
భారమణీయభూషిమయ ♦ భాండములంగమునిండనొప్పెడి

స్త్రీలిన దేహకాంతులను ♦ మీఱఁగఁజేతమటంచు దానికిం
గూరిమినొందియన్నిఁటికిఁ ♦ గూర్చెడి నైక్యసరూపభావముల్. ౨౦౬.

ఉ. మేను మెఱుంగు వెట్టుటకు ♦ మిక్కిలి గాజతఁ గూర్పఁబడ్డయా
చానసుభూషణంబులవి ♦ చాలక యోతనురోచులల్లనం
గానఁగ వెల్లవాటియొకో ♦ కానఁగ రాశిఁక నేమి చెప్పస
మ్మానము నొందఁగల్గుదురె ♦ మాన్యులచెంతల నూనమానవుల్. ౨౦౭.

ఉ. ఈవనితాశిరోమణికి ♦ నేర్పడు మేని సుగంధ మెంచి ప్రాఁ
దావులు తావులన్నిఁడివి ♦ తావితలైనడిఁ బాఱఁజొచ్చెడిం
గావుమటంచు లోకబలుఁ ♦ గట్టు మఁజుట్టుచు నంటిపట్టుచుం
బోవరె భీతులౌ జనులు ♦ పొందొనగూడిన ప్రాపుపట్లకున్. ౨౦౮.

ఆ. ఇట్టికాంతచెట్టఁ ♦ బట్టఁ బుట్టినవాఁడు | గట్టివాఁడు గాక ♦ నట్టివాఁడె
పట్టుదలనుదపము ♦ దట్టముగాఁ జేసి | రట్టునడ్డదిట్టె ♦ ముట్టఁగలఁడు. ౨౦౯.

చం. అధిపుఁడు కన్యకున్ బుధుఁడ ♦ యౌఁగదయీయది కన్యసార్థకా
బుధుఁడె విధాయకుండగును ♦ బోయలరాజులు గేజులింక నే
యధికులునైనఁ బోలరిది ♦ యాకటకాంచితమాత్రకామి వే
విధములదీని నేలఁగల ♦ విక్రముఁడెన్నికఁగన్న మేఁటియౌ. ౨౧౦.

కం. ఆరంభాసంభోగమె | కోరిన దేవత్వమంచుఁ ♦ గూడెడి నంటే
యీరంభోరువు పొందే | తీరునఁగన నౌను దేవ ♦ దేవుఁడు గామిన్. ౨౧౧.

చం. ఇదిలక్షియించు నేనిదగు ♦ నెంతయొ గణ్యత మేఁటికాఁగన
మ్మదనుఁడు తొంటి బంటువుచు ♦ మక్కువనెక్కొనఁజిక్కియుండెడిం
గదపురుషార్థసంపదల ♦ గణ్యములైతగి ధన్యఁజేయునె
ప్పుదవియుఁగోరఁబట్టదిఁక ♦ భద్రదమద్దియె మాటలేఁటికిన్. ౨౧౨.

సీ. శుద్ధసత్వస్ఫూర్తిఁ ♦ జూడనొప్పుగుచుండు ♦ గరితయే యోగినీ ♦ శ్వరియె కాక
పరమప్రపత్తితో ♦ భాసిల్లుచుండంగఁ ♦ గన్యయే భక్తాగ్ర ♦ గణ్యగాక
నిశ్శ్యనైష్ఠికతాప్త ♦ నిపుణతగనుపట్టు ♦ నతివయే బహుళోస ♦ ద్వ్రతయ కాక
గుణదోషవేత్తృల ♦ క్షణవతియైయుండ ♦ నారియే గ్రంథవి ♦ చార గాక
వన్నె చిన్నెలకన్ననీ ♦ యన్నిగుణము | లున్న వెన్నంగనన్నుల ♦ మిన్నయిద్ది
కన్నె మాత్రముకాదు చే ♦ కొన్నవాఁడు | బన్నము లెఱుంగకొండెడుఁ ♦ దిన్ననిగతి.

కం. కనదవయవములు గొనములు । ఘనముగఁ దనరెడినినవనితఁ ♦ గనినది మొదలీ
పనిమునిఁ గిరియెతమిఁ బడితిమి । మనమునులకుఁ దగినదగును ♦ మనమడుగుదమే. ౨౧౪.

ఆ. అనుచు యోచనకును ♦ ఘనమిటుఁ మరలంగ । నింతకీయదేవతే ♦ యెఱుఁగ మైతి
మనుచుఁ బిచ్చివన్న ♦ నార్భాటములుమాని । యథపునున్క నెఱిఁగి ♦ యడిగిరిట్లు.

ఉ. ఈవనితాశిరోమణిన ♦ హీనసులక్షణలక్షితాంగశో
భావిభవాఢ్యచారుముఖి ♦ భానజసాయకతుల్యసాధుసం
భావితసద్గుణప్రకర ♦ భాసురతేజనుగన్నయట్టియా
దేవసమానుఁ డేతఁడది ♦ తెల్పుము విందుముకందుమాతనిన్. ౨౧౬.

చం. అనవుడువారివిభ్రమము ♦ నంతయుఁ గాంచుచునున్నవాఁ డెకా
వునఁ దెలిసెందదాశయము ♦ వ్యక్రక్రమభానముఁ జూపనైనన
మ్మునిపతులల్లహానియగు ♦ ముందెటులోయనితోఁ త్రుఁ పాటునొం
దెనుహృదినెట్టకేలకును ♦ దేర్చుచుభూపతివారికిట్లనున్. ౨౧౭.

ఉ. దేనమహర్షులీరలల ♦ తేజమదెంతనుతింపమానిసం
భావనమొందుపాటిదియె ♦ పామరమర్త్యవధూటికాదయో
పావనులారదానిఁగను ♦ భాగ్యముకూడనరంబెతంద్రిరూఁ
దావకపాదసన్నిధిని ♦ దాఁదగువీఁడెయటంచుఁ జూపికోన్. ౨౧౮.

కం. ఆలింగనమొనరించుచుఁ । జాలనుతించుచునుమిగుల ♦ సఖ్యము నెఱపం
గాలేనివున్నవెన్నిన్ను । పాలుఁ బ్రసన్నునిఁ గఁ జేయఁ ♦ బాటులువడియున్. ౨౧౯.

పర్వతనారదులు శ్రీమతిం దమకిమ్మని రాజునడుగుట.

కం. ఇరువురుమునులొక్కమ్మడి । నరవరుచేఁ జేతఁ బూని ♦ నాకీనాకీ
సురుచిరరుచిఁ గన్యామణిఁ । దరుణీరత్నంబుననుచుఁ ♦ దమితోనడుగన్. ౨౨౦.

ఉ. దద్దరిలెడ్ధరాధిపుఁడు ♦ తన్మునిపుంగవులేమెఱుంగకా
పెద్దమనోవ్యథం దవిలి ♦ ప్రేముడిఁ బ్రేష్ఠముఁ గోరుచుండఁగా
వద్దనఁ బాడిగాదనిన ♦ వంద్యునివంద్యునిఁ జేయుశాపమా
ప్రొద్దునఁ బెట్టిపోయెదరు ♦ ప్రోపరులౌ టెటులోయటంచెదక్. ౨౨౧.

మ. అనుమానింపకయిత్తమన్న నొకక ♦ న్యారత్నమట్లిద్దరె
త్తినమోహంబునమే నెఱుంగకడుగం ♦ దేయంబు గాకుండఁ దా

ననుమానించినవారిఁబుచ్చుటకునే ♦ దార్ఢ్యంబుమునుదంచు నెం
చినఁదోఁచెన్నదుపాయమందులకునై ♦ చేమోడ్చి రాజిట్లనున్. ౧౧౨.

ఆ. అయ్యదీనికింత ♦ యనుసరణంబేల | నాదుచేతనున్నఁ ♦ గాదెపనియు
నూతనార్థమేది ♦ మాతనయలకప్డు | పతులుగారమాని ♦ పతులెతెలియ. ౧౧౩.

శా. మాతోఁబుట్టువుల న్మహామహితల ♦ న్మాసంద్రిడియై యొప్పమాం
ధాతేసౌభరియన్మునీశ్వరునకుం ♦ దానిచ్చెనా వైఖరి
న్నీతాత్పర్యములు న్ఘటింపఁబడనా ♦ మేలాదయాపూర్ణులై
నాతబ్బిబ్బులుమాన్పఁబల్కుఁడివరే ♦ నావారలద్దేమనన్. ౧౧౪.

ఉ. ఒక్కఁడుపూరుషుండుమహి ♦ నొన్నతుఁడైబహుకన్యకాళిఁబెం
పెక్కినమోహమందినరి ♦ యుంచినచక్కటులెన్నియేఁదగు
న్నెక్కొనప్రీతినొక్కసతి ♦ వేత్రలఁబల్వురఁగట్టికోలదే
చక్కనిగావరాదుగద ♦ సాదృశమంబలుకంగనెంచినన్. ౧౧౫.

తే. కాననాపట్టినోర్తుక ♦ ఘనులుమీర | లిరువురదుగుటసరికాదు ♦ తరలుఁడిపుడు
మరలిమీరలు రాస్వయం ♦ వరముఁగూర్తు | వనితమీలోనఁదనకోరు ♦ వానికగును.

చ. అనవుడుబాగుబాగనుచు ♦ వచ్చటలేచినకేంద్రచంద్రుతోఁ
జనియెదమంచుఁబల్కుటకు ♦ సాగనిచిత్తపరిభ్రమంబుత
మ్మనయముఁగూచనారహిత ♦ హావభయానహాభానమందుఁబె
ట్టినవపుడేబయల్వెడలి ♦ డెందములన్నమభాసమొప్పుటన్. ౧౧౬.

కం. ఏకార్థార్థులుగాఁగన | నేకమహాయుగపరిచిత ♦ హితమదియెల్ల
న్వీఁకవిడనాడివిడిరట | డీకొనిపార్థక్యమంద ♦ డిల్లపడమికిన్. ౧౧౭.

ఆ. తగినయనువుచిత్త ♦ దార్ఢ్యముకోలదిని | మోసమొరునిజేయ ♦ రోసికొనిరి
వేఱువారలయ్యుఁ ♦ దీరొక్కటియకానఁ | దంత్రిమొందెయయ్యె ♦ మంత్రబలిమి.

వ. ఇట్లు పర్వతనారదులప్పుడ యచ్చోటన యొండొరులం బెడఁబాసి యధేచ్ఛావిహారంబుల నిజావశ్యకార్థనిర్వహణ తత్పరులైయరుగుటయు నంబరీషుఁడప్పటికిఁ జొప్పడినయప్పులుకు పాటినిముప్పతప్పి తెప్పరిలిన చొప్పునఁగాఁగ నెప్పటియట్లుండెనంత

## శ్రీమతికిమునులాపెం గోరినట్లొకచెలి చెప్పుట.

నటనడచిన వృత్తాంతమెఱింగిన యొకమత్తకాశిని హృత్తలంబునఁ దత్తరపాటు గదుర నదరిపడి కుదిరికచెడి సడమలరూపయా శ్రీమతీమదవతి కెఱింగించునదియై యంతిపురం

బునకేగి చేమంతివిరి బంతినొప్పు గులాబి పూనంతవింతగ నయ్యింతులనడుమ నెంత యుం బ్రభనిశ్చింతగనున్న యక్కాంతను నితాంతసంతోషాక్రాంతస్వాంతను గనియిట్లనియె. ౨౩౦.

శా. అమ్మాయెవ్వరొ మాహానులంటవినుమా ♦ యార్భాటముల్విన్నఁగా
యమ్మల్గన్నను వారిజాడఁదెలియ ♦ న్హాస్యక్షనర్యోపము
లున్మాపాటెటకయ్యగారిగనఁగాఁ ♦ జోద్యంబుగావచ్చినా
యమ్ముల్వాల్కుచునుండియుండితుదకో ♦ యమ్మానినిమ్మందురే. ౨౩౧.

శా. అమ్యోయేమనఁగల్గుదానవినవే ♦ యాగడ్డముమ్మీసము
లుబ్బయ్యంచుఁ బెనఁగొన్నవానినడుమ ♦ న్బాచుల్బలేరేచునై
యుయ్యాలల్రహినూఁగవచ్చుఁదమకో ♦ యొయ్యారినీవేఁటికే
వెయ్యారుల్వలుకంగలారుతమరై ♦ విభ్రాంతిలోఁజొచ్చిరే. ౨౩౨.

కం. మూరెడుమునుమీసమ్ములు । బారెడుగడ్డములుఁగాళ్ళఁ ♦ బాలెడుజడలు
న్నీలఁగఁదాతలుతామై । చేరెడుకనులొప్పునిన్నుఁ ♦ జేకొన నేలే. ౨౩౩.

ఆ. మునులమనఁగవచ్చు ♦ ముక్కుమూయఁగవచ్చు । బ్రహ్మమెఱుఁగవచ్చుఁ ♦ బలుకవచ్చు
నింద్రియములబాపి ♦ కడఁగాకలోఁబడ్డఁ । జెచ్చుప్రచ్చిపిచ్చి ♦ మచ్చుఁబుచ్చు. ౨౩౪.

కం. వీరలకంటెనుశూరులు । వారటెసాపింతురంటె ♦ వారింపఁగతే
రేరంటెకానఁబతియును । గోరినమైనిత్తుననుచుఁ ♦ గుదిరిచియునిచెన్. ౨౩౫.

ఆ. మరలనత్తురంట ♦ వరియింపఁబడుటకు । నున్నయందమునకు ♦ వన్నెవెట్టి
కొనుచునయ్యవార్లు ♦ కోఁతులుగాకుంద్రె । దానికేమికాని ♦ మానినివిను. ౨౩౬.

కం. ఆమునులవాడపల్లెఁ । దామసపడువారికడల ♦ దర్పించినయా
యామెకములకూకలఁబడి । యేమెయినీవుందువమ్మ ♦ యేమోర్చెదమే. ౨౩౭.

కం. పాపపుదేవుఁడునిన్నీ । యాపదలంబెట్టనెట్టి ♦ యఘములుమున్నీ
వేపుట్టువులనుజేసితొ । కాపురముబలకునుగుదురఁ ♦ గదబ్రదుకెసఁగున్. ౨౩౮.

తే. ఏమహారాజుఁజేపట్టి ♦ యెంతవన్నె । యీవుకందువొ మమ్మెంత ♦ శీవినుంతొ
అనుచుఁబలుమఱునాసింతు ♦ మధమలమగు । మావిచారణలింకేల ♦ నీవిగతిని. ౨౩౯.

కం. అనియాచెలియనఁగావిని । ఘనచింతాక్రాంతయగుచు ♦ ఘనుఁగనులాత్ము
న్మనుగొన్నట్టుగఁదలఁచుచుఁ । దనమనముననిట్టులనియె ♦ దయపుట్టంగన్. ౨౮౦.

ఉ. ఓకమలాయతేక్షణసు ♦ రోత్తమపూజితపాదపీఠలో
కైకశరణ్యశ్రీమహిత ♦ యేలెదుభృత్యుదయారసంబద
స్తోకముగాఁగనంచుఁబలు ♦ దుఃఖములార్తవటంచువిందునీ
కేకడమ్రొక్కుచుందునను ♦ హీననునవ్యర్థనుజేయకచ్యుతా. ౨౮౧.

ఉ. ఏగతినాకునుత్తమమొ ♦ యేపసమబ్బినసల్లెడన్మహా
భాగవతాగ్రగణ్యునయి ♦ పల్లఱునీవిమలాంఘ్రిపూజనో
ద్యోగమునందఁగల్గుదునొ ♦ యోచనచేసియదేఘటింపుమీ
బాగులునోగులుందెలియ ♦ పాఁటివిచారములేనిబాలికన్. ౨౮౨.

ఉ. ఎన్నఁడొచిన్ననాఁడునిను ♦ నేకథలందునొవిన్నమాత్రనే
తిన్ననినీసురూపమునె ♦ తృప్తిగఁజూచుచుసంతసించునా
కన్నులనన్యరూపములఁ ♦ గానఁగనీకమనంబునింకనే
తెన్నులఁబోవనీకకడ ♦ తేర్పుముసన్నుతియింతుసర్వదా. ౨౮౩.

వ. అనియిట్లనేకప్రకారంబుల మానసంబున శ్రీనాథునిధ్యానించుచుఁగానున్నది మానక
గుననియనూనచిత్తదార్ఢ్యంబున నిదానించియామానిని చింతమానుపనూని దానితో
నిట్లనియె. ౨౮౪.

కం. మానైనస్తులుమునివరుఁ । గామించిసుఖంబుఁబడయుఁ ♦ గలిగిరికాదే
యామెయినాకగునేమో । నీమనమునఁజింతయేల ♦ నిలుపుమిచనుమీ. ౨౮౫.

వ. అనిదానింబుచ్చియు యథాపూర్వంబుగా నియతవ్రతయుహరిభక్తి పరవశయునై
యుండెనక్కడ. ౨౮౬.

## నారదపర్వతులొండొరులుహరిచేవానరముఖములుగల్గించుకొనుట.

చం. అటుచనినారదుండుతన ♦ యంతనెయొక్కడనిర్జనాటవి
న్విటపిసమీపభూస్థలిని ♦ వెఱ్ఱిగతిందగి యూహచేసి పి
మ్మటఁగడునుత్సహించితన ♦ మర్మములెవ్వరెఱుంగకుండనొ
క్కఁటహరియుండువేళఁగని ♦ గ్రక్కునఁబోదమటంచునెంచుచోన్. ౨౮౭.

శా. ఆవైకుంఠపురోత్తమంబున మహా ♦ వ్యాళేశపర్యంకమం
దావిశ్వేశుఁడు వేదగామి సుహితుం ♦ డంభోధిరాట్పుత్రికా
చేపి సేవితపాదజీవనజుఁడై ♦ దివ్యప్రభాదీధితి
స్వేవెల్గ్లు వెలుంగు వేళఁ గని తా ♦ వేంచేసియచ్చోఁటికిన్. ౨౪౮.

శా. ఓరాజన్యవపులాచ్ఛకీర్తిమహితా ♦ యోదేవదేవేశ్వరా
ధీరానేకనిశాచరేంద్రహరణా ♦ దీనార్థికల్పద్రుమా
నీరేజాప్తసుధామయూఖనయనా ♦ నిధ్యానసంపత్ప్రదా
ధారాళాదరసారపూరితమహా ♦ ధారాధరాభప్రభూ. ౨౪౯.

పద్మనాథ. శ్రీమానినీహృత్సరోజాతమార్తాండ ♦ శీతాంశుబింబాననాంచత్సుమూర్తీ
భీమాసురాధీశమస్తాబ్జమత్తేభ ♦ భృత్యాళిదోషాపహాస్వచ్ఛకీర్తీ
సోమేశమిత్రాసరోజాతనేత్రావి ♦ శుభ్రోత్తరీయావిధాత్రాదిసేవ్యా
హేమాద్రిధీరాపయోరాశిగంభీర ♦ హేరాళచారిత్రసన్మౌనిభావ్యా. ౨౫౦.

ఉ. ఓనళినాయతేక్షణమ ♦ హోదధడాఁగిన సోమకాఖ్యుఁడౌ
దానవు వేసమార్తసుర ♦ తాపసలోకవిషాదకర్తనా
మీనసురూపధారివయి ♦ మృత్యువువాతఁజొరంగ ద్రుక్కి సం
ధాన మొనర్చితా నిగమ ♦ ఘట్టము ధాతకుఁ దివ్యమూర్తకున్. ౨౫౧.

కం. శిక్షింతువు దుష్కృతులను । భక్షింతువు దానవహ్ని ♦ భక్తులఁ గావ
న్రక్షింతు వడిగినంతనె । వీక్షింతువు వినుతి సేయ ♦ విను నా మొరనన్. ౨౫౨.

వ. ప్రసన్నుండైన హరి లసన్ముఖారవిందంబున నొప్పు చిఱునగవుతో నల్లన నమ్మునివల్ల
భునీక్షించి మెల్లన నిట్లనియె. ౨౫౩.

కం. మునిపుంగవ నినుఁ గనఁగా । మునుపటి రూపంబు మాఱె ♦ మోహావేశం
బునఁ బడబడియెదవేలో । ఘనకార్యము తలఁచినట్లు ♦ కానంబడెడిన్. ౨౫౪.

కం. అనఁగనె సిగ్గౌననుచును । బనిజాగగునే నినటకుఁ ♦ బరులరు బేరం
గను పనదురహస్యార్థము । వినియెద రాకొల్కి యటంచు ♦ వేగంపడుచున్. ౨౫౫.

వ. ప్రక్కలవెన్కలం బాఱఁజూచి యేరు లేకుండఁగ నారదుండు శౌరికిట్లనియె. ౨౫౬.

చం. కలిగెను గార్యమొక్కటిసు ♦ క్షుప్రపమందును విష్ణుకారికాఁ
గలిగెనొకండు దానికిని ♦ గర్దతిరాజసహాయమున్నఁగోఁ

గలవరపాటురాదనుచు ♦ గట్టిగనమ్మియుపాయమొక్కఁడేఁ
దలఁచియెనిన్నుఁగాంచితిని ♦ దాపురపోలవచింతుసర్వముల్. ౨౫౭

సీ. అంబరీషుండను ♦ నవనీశ్వరుండొడ్డు ♦ ధరణీతలంబునఁ ♦ దనరుచుండు
పర్వతుండేనును ♦ య్యుర్వీశుఁగన్గొన ♦ నరిగిసంభాషణ ♦ లురుపుచుండఁ
దత్కుమారీమణి ♦ ధవళాయతేక్షణఁ ♦ గాంచితిమచ్చటఁ ♦ గాంక్షలొదవ
నాకిమ్మటంచును ♦ నాకిమ్మటంచును ♦ మేముభయులమును ♦ ప్రేమనడుగ
నరపుఁడంతటఁదాస్వయం ♦ వరముఁగూర్తు । రండునాఁటికటంచని ♦ యుండెమమ్ము
మరలవేగమహోవలె ♦ మానినిఁగొన । సాయవిలావొనరింపంగ ♦ సాగుసద్ది. ౨౫౮

కం. ఏమదినావానింగన । వామకునెబ్బెటికమొదవ ♦ వానరముఖుఁగా
నామాపర్వతుఁచేయుము । యామానినినాకదక్కు ♦ నానందింతున్. ౨౫౯

ఆ. అనుచునారదుండు ♦ వినుతులొనర్చుచు । విడువకున్నఁగాంచి ♦ విష్ణుఁడపుడు
పర్వతాననంబు ♦ ప్లవగాస్యమౌనట్లు । లనఁగమునియుఁదనిసి ♦ మొనయఁజనియె.

చం. మునువిడిపర్వతుండరిగి ♦ మోహవిశేషమదేరఁగూడనీ
యనిపరితాపమీనఁగజ ♦ లాశయతీరమొకండుచేరియో
చనఁగనిరొక్కమేలనువు ♦ సాగిననద్దిబలేయిఁకేమటం
చునుదననేర్పుమెచ్చుచును ♦ జూడఁగవచ్చెవిహంగనాథగుల్. ౨౬౧

ఆ. నారదాగమంబుఁ ♦ గోరికచోద్యంబుఁ । చెప్పికొనుచునగుచు ♦ సిరియుహరియు
నూరకున్ననప్డు ♦ యుత్తరక్షణమున । బర్వతుండుసేరి ♦ ప్రభునిఁగాంచి. ౨౬౨

తర్వి. సాధుజనోత్సాహదమదికదనీ ♦ చక్రమొనర్చెడిపనులరయంగా
బాధకదైత్యాళిశిరములువే ♦ ప్రక్కలుసేసెడిహేతులుగిరంగా
శ్రీధరదీనావనవరదా ♦ సేవకచాతకఘనఘనదేహా
మాధవశైలేంద్రజపతివినుతా ♦ మానిజనాదరవిహగపవాహా. ౨౬౩

కం. హరియింతుహితులతాపము । కరిరింతుదయారసంబుఁ ♦ గోర్కులుదీర
న్వరియింతువారినెల్లెడఁ । జరియింతుగదయ్యనిగమ ♦ సత్పథములలోన్. ౨౬౪

వ. అనిబహుప్రకారంబులఁ బ్రస్తుతించి ప్రసన్నుఁజేసికొని నారదునట్లవృత్తాంతంబంతయు న్విశదీకరించి యక్కమలనాభుండునెక్కొను నక్కటికంబునఁ దన్నుంజక్కఁ జూచినఁగాని తనకక్కన్యాలాభంబుకలుగదని తలంచి యప్పరమపూరుషునిదర్శింప వచ్చినట్లు విన్నవించుచు నిట్లనియె. ౨౬౫

కం. శ్రీలోలామానారదు । గోలాంగూలాస్యుఁ జేయు ♦ కుదిరిన నదియా
బాలయతని రోసియు నను । లీలన్వరియించు దాన ♦ లెస్సౌ నాకున్. ౧౬౬.

చం. అనుచు ఘనంబుగా వినుతు ♦ లల్లనఁ జేయుచు దీనుఁడైనయా
తనిఁ గని నారదేచ్ఛయును ♦ దన్మునివాంఛయు నేకమౌటకు
న్మనమున మెచ్చియక్లియగు ♦ మానదు పొమ్మనఁ బర్వతుండు వేఁ
జనియెను లాభమబ్బునను ♦ సంతసమెంతయు భ్రాంతి పుచ్చఁగన్, ౧౬౭.

అలమునులు శ్రీమతిచే వరింపబడనరుగుట.

చం. ఒకదెసనుండి నారదుఁడు ♦ నొండొకచక్కటినుండి పర్వతుం
డుకడుముదంబుతో మరలు ♦ డుంబురబాహ్యవనాంతరమ్ములం
దొకఁడొకనింగనంబరము ♦ ఖోదితవైకృతిలక్షణంపుపొం
దికకెదమెచ్చునైజముఖ ♦ దృగ్ధముఁగానఁగనెంచఁడొక్కఁడున్. ౧౬౮.

కం. తనమనవి విని జనార్దనుఁ । డొనరించెన్వనచరాస్య ♦ మొరునకనుచున
మ్మినవారురహస్యముగాఁ । బనిపడుటను వేఱుచింత ♦ పాఱదుగాదే. ౧౬౯.

ఆ. పనికిఁగానొనర్చి ♦ కొనిరుపాయంబులు । తెలియకుండ నెవరి ♦ బలిమివారు
ఇంకవారి కేల ♦ నీర్ష్యమనంబుల । నెఱుఁగనట్లిహితము ♦ నెఱపికొనిరి. ౧౭౦.

కం. వచ్చితివారా నారద । వచ్చితివా పర్వతాఖ్య ♦ వడిరమ్మంచు
న్నచ్చికఁ బరస్పరాహ్వా । నోచ్చయములఁ గేలు గేల ♦ నూన్చుచుఁ జనియున్. ౧౭౧.

వ. రాజమార్గంబుఁ దఱియం జొచ్చి నడచి సభామండపప్రాంతంబునకరిగి నిజాగమనం బెఱుకపఱుపుడు నంబరీషుండభ్యర్థనాభివందనార్ఘ్యపాద్యాదిసత్కారంబులఁ దనియంజేసి వారలం గొంపోయి యర్హాసనంబుల సుఖాసీనులం జేసి వారియాననవైకృతులు పలక్షించి మంతనంబున నెంతయున్వింతగఁ దురఁగనిట్లనికొనియె. ౧౭౨.

కం. అన్నన్న యిద్దియేమిర । కన్నన్న గవోదవసైన ♦ కపిరూపము లే
మున్నన్న చక్కఁదనమున । కెన్నన్న గవెట్టినట్లు ♦ లేర్పఱచిరొకో. ౧౭౩.

కం. [illegible]న న్మహనీయులువీ । రేనికి నెట్లొప్పునట్ల ♦ హేవాకమునం
గానంబడుదురు గాదే । మానిని కేరూపములను ♦ మహితులగుదురో. ౧౭౪.

తే. అనుచు మనమునఁ దలఁచుచు ♦ నదరుడుగుచు । నంబరీషుండు తనయత్న ♦ మరయుచుండ
నంతలోన నెజాగాయె ♦ ననుచురోసి । మానవాధీశుఁ బల్కిరి ♦ మౌనివరులు. ౧౭౫.

కం. ఏమయ్యాభూమీశ్వర । మామా కేమాయెఁబలుక ♦ మానితి వేమా
భామామణి రామా నెనె । మేమొకసామాన్యులమగు ♦ మెణకరులమెనాక్. ౨౭౬.

వ. దద్దరిల్లియద్దినినాథవంశదీపకుండు తనముద్దుపట్టియగు నమ్ముద్దియన్నాలంకృతంజేయించి
తోడితేరనిర్దేశించినిచి మ్రుంగలంగల రంగస్థలంబుమెఱుంగి డంగడంగనా సంగతింగనం
గొందఱి నియమించి యందున్న యున్నతాసనంబుల నన్నారదపర్వతుల మన్నన
కధిష్ఠింప విన్నవించి విన్నాణులైవిన్ననఁగన్న యా విన్నాణులువిన్నఁబోకవిన్నను
వెరాయన్న యెన్నికనెన్నికొనన్నిఖిలోపచారంబులొనర్చుచున్నంత. ౨౭౭

సీ. సంపంగినూనెతో ♦ నింపుగాఁదలయంటి ♦ చక్కనిపన్నీట ♦ జలకమార్చి
తలదూవితిలకంబు ♦ సలలితంబుగనిడి ♦ నవరత్నమణిభూష ♦ ణములమర్చి
మేలైనపట్టుదు ♦ కూలంబుఁగట్టించి ♦ బిగికంచుకంబుఁదొ ♦ డుగఁగఁజేసి
పసపుకజ్జలములుఁ ♦ బరిమళద్రవ్యము ♦ ల్వసతిగానెమ్మేనఁ ♦ బొసఁగఁజేసి
ముందుఁగొందఱువెన్కమ ♦ ఱుందరొయయి। వందలకొలందిసుందరు♦ల్క్రందికొనుచు
శ్రీమతీదేవినారాజ ♦ శేఖరునకుఁ। దెచ్చికాన్పించిరానంద ♦ మెచ్చికనఁగ. ౨౭౮.

వ. ఇట్లువచ్చినిలిచిన కుమారీరత్నంబుంగాంచి ప్రమోదంబందుచు క్షమాకాంతుండు
సమీపంబునఁగల సమావిష్టవరసమాజమందిరంబున సమాగతులంజూపి యందొక్క
సమీహితు వరియింపుమనుచు నిట్లనియె. ౨౭౯,

కం, ఈ రంగంబునఁ గనుఁగొని । కోరందగువానిఁగోరి ♦ కొమ్మోయమ్మా
ఆరమ్యాంగునకావల । నారీమణివీవుకన్మ ♦ నాయముసుమ్మా. ౨౮౦.

## శ్రీమతి స్వయంవరమునతి రోహితయగుట.

కం. అని తన్ను నియోగించిన । జనకుని వాక్యంబుహృదయ ♦ సమ్మతమగుడుం
గన కేరిమున్నమదిలోఁ। గనుఁగొని హరిరూపమదియె ♦ కాంక్షించియునెక్. ౨౮౧.

కవిరాజ. సరసిజలోచన ♦ చంద్రసమానన శార్ఙ్గగదాధర ♦ చక్రకరా
వరదసుకౌస్తుభ ♦ వారిధిజాంచిత ♦ వక్షసుభూషణ ♦ వారధరా
వరగుణకాంచన ♦ వస్త్రధరావిధి ♦ వందితభూధర ♦ వాసహితా
నిరుపమదేవవి ♦ నిర్మలభావము ♦ నిప్రభుసన్నుత ♦ స్నేహయుతా. ౨౮౨.

వ. అనుచు మనంబుననవిశంబుందాఁదలంచు ఘనమూర్తిన్నిలిపి తదేకధ్యాన పరాయత్త
చిత్తయై పుష్పమాలికాంచిత హస్తయగుచు నా స్వయంవరమండపంబుఁ బ్రవేశించి

యానరాసనంబుల కభిముఖులై యంతయుంగని స్వాంతంబున నెంతయు సంతసించి యందఱువిన నిట్లనియె. -౨౬౩.

కం. ఈరంగంబున నొక్కఁడు | దారుఁడు మద్భుపయహారుఁడు ♦ దారాజిల్లుం
గోరెదనాతని సెలవా | యారసినాకతఁడుపతిగ ♦ నానతియీరే. -౨౬౪.

చం. అనియనుకల్కిపల్కునకు ♦ నాదరభావములుప్పతిల్లఁద
న్ననికొనినారదుండుఁదను ♦ నౌనని పర్వతుఁడందు నేనినో
మునినొకనింగఁడాయనుచు ♦ ముఖ్యుఁడుతండ్రియు 'నూ' యటంచు వేఁ
బనిపడఁసైగఁదెల్పుడును ♦ భామినియామునిభూమిపుల్వినన్. -౨౬౫.

ఆ. కోఁతియొక్కటింపుఁ ♦ గొండముచ్చొక్కటి | వీరునాకు నేల ♦ వీరినడుమఁ
దేజరిల్లునొక్క ♦ దివ్యస్వరూపంబు | కాంతునద్దియేవ ♦ రింతునంచు. -౨౬౬.

కం. మానినిచేవిరిసరమా | కానంగారానివాని ♦ గళమున నేయం
గా నేతానట్లంత | ర్ధానమునొందెన్విమండి ♦ తాపసులారా. -౨౬౭.

తే. అనుచు వల్మీకభవుఁడల్ల ♦ మునులకెఱుక | పఱుపవారలువిస్మయ ♦ పడుచునింత
వింతవృత్తాంతమెన్నఁడు ♦ వినమటంచు | నవలికథఁజెప్పుమని వేడ్క ♦ నడుగుటయును.

---

అలసగతి. సురమునిజనాదరణ ♦ శుద్ధసువిచారా
వరగుణగణాభరణ ♦ వారిధిగభీరా
మురదితిజసంహరణ ♦ మూర్తిశరధారీ
పురదితిజసంహరణ ♦ భూధరవిహారీ. -౨౬౮.

స్రగ్విణి. దక్షిణామూర్తిబా ♦ ధక్షయాభిక్షుకా | దక్షయాగాంతకా ♦ దక్షసంరక్షకా
అక్షయానూనశో ♦ భాకరాశ్రీకరా | శిక్షితానేకదో ♦ షీఖరాస్త్రాకరా.

కుమారలలిత. సరోజరిపుమౌళీ | పరాజితఖలాళీ
గిరీంద్రతనయేశా | ధరాధరనివేశా. -౨౭౦.

గద్య. ఇది శ్రీమన్మేధాదక్షిణామూర్తీశ్వరాక్షీణవరప్రసాదలబ్ధకవితాభా
గధేయ నాదెళ్లపురుషోత్తమ నామధేయబుధవిధేయప్రణీతం
బయిన యద్భుతోత్తరరామాయణంబునందుం
బ్రథమాశ్వాసము. -౨౭౧.

## శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

## ద్వితీయాశ్వాసము.

కం. శ్రీకరహీరాంకారా । ప్రాకటరణవీరమేరు ♦ పర్వతధీరా
లోకాధారాభక్తవ । శీకరవ్యాళేశహార ♦ సింధుగభీరా. ౧.

వ. అవధరింపు మమ్మహర్షిసత్తముం డమ్మునివరులకిట్లనియె. ౨.

### రాజుమూర్ఛిల్లి సభాకలకలంబున మునులుపాఱుట.

కం. శ్రీమతియామెయినచ్చోటఁ । దామాయంబగుడుసభను ♦ దండడిపుట్టె
న్స్వామిశుఁడుహాహాయని । భూమిన్మూర్ఛిల్లెమునుల ♦ పొంగుఁదొలంగెన్. 3.

కం. పొక్కుచునక్కాంతాసఖు । లక్కటికముమాలిపెక్కు ♦ లక్రమభాష
ల్మిక్కిలిగననఁగఁబడియే । చక్కనొపడియసువుదక్క ♦ సాగిరిమానుల్. ౪.

ఆ. కొంతవడికనంత ♦ కాంతుఁడుతెలిసియా । శ్చర్యమోహశోక ♦ సంయుతుఁడయి
కూర్మిపట్టిఁదలఁచి ♦ గుణవర్ణనమొనర్చి । యూరముమోదికొనుచుఁ ♦ బొరలియేడ్చె.

ఉ. ఓతనుకాంతిభూషణమ ♦ హోన్నతసద్గుణరత్నరోహణా
ప్రీతినిగార్యసంఘటనఁ ♦ బెద్దపెఱుమల్గనుపట్టసల్పునో
పూతచరిత్రనోములును ♦ బూజలుఁగెవ్వరుచేయఁజూతునే
కూతురకూతురాయనుచుఁ ♦ గూయిడఁజొచ్చెనరేంద్రుఁడచ్చటన్. ౬.

### మంత్రియంబరీషునికి శోకాపనోదవిధులెఱింగించుట.

ఉ. అంతటమంత్రివర్యుఁడుబృ ♦ హస్పతియంతటిబుద్ధిశాలిభూ
కాంతునిఁజేరియిట్టులనుఁ ♦ గాంతకునైనగపొందనేలనీ
యంతటిమేరుధీరునకు ♦ న్యాయమెప్రాకృతలక్షణంబులీ
వంతలుమోహపాశమది ♦ వాయఁగఁజేయుముదుఃఖమారెడిన్. ౭.

ఉ. ఏరికినే నొసంగిమఱి ♦ యెక్కడకేని దొలంగఁ బంపనే
కూరిచితింతకార్యమును ♦ గూడనిదేమిది యెల్లవారలుం
గూరిమిఁబుత్రికామణులఁ ♦ గూడిననాథులఁగూర్చియంపరే
వారలమైఘటిల్లెనిఁక ♦ వంతరవంతయునుంతెచెప్పవెమా. ౮

చం. అదనమదొక్కటిందుఁదగు ♦ నమ్ముని నాథుఁడె నాథుఁడైన నా
పదలు వడంగఁదా నునికి ♦ పట్టైయెఱుంగక బాపనమ్మ పైఁ
గదలుచుభర్త వెంటఁజనఁ ♦ గావలెనట్టులఁగాక తా సుఖా
స్పదమగు నుక్కిపట్టుఁగని ♦ భాసిలుచుండెడిఁజింతలేటికిన్. ౯.

మ. మనమెల్లన్స్మృతివాక్కు వింటివిఁకగదా ♦ మాయాస్వరూపంబున
న్ఘనుఁడొక్కండబలాశిరోమణికిఁదాఁ ♦ గాన్పించె నన్నట్టిలా
ఘనుఁడో నెన్నఘనాభదేహుఁడయొదం ♦ గాంక్షించునీపట్టియా
తని నెల్లప్పుడుఁ దధ్యమిద్దియిఁకనీ ♦ తబ్బిబ్బులన్మానుమీ. ౧౦.

శా. నీయత్నంబున నేనికీపొసఁగిన ♦ న్నీ వెన్నియూఁగ్లచ్చిన
న్నీయైశ్వర్యముకొల్లవెట్టిగరిమ ♦ న్నితోత్సవో ద్వాహముం
జేయంజూచినఁదాఁగుటిల్లెడినొకో ♦ శ్రీదేవిసాపత్న్యమా
శ్రేయోధిక్యతపూర్వజన్మఫలమాఁ ♦ జింతింతు వేదీనికిన్? ౧౧.

శా. ఏ నేనొక్కని మ్రోలనిల్పికొనియ ♦ క్షేశుండు విష్ణుండు గా
వానిన్నమ్ముచుఁగన్యనిత్తురుకదా ♦ వైకుంఠుఁడే నీసుతం
దానైవచ్చివరించెఁబున్నెమిదియే ♦ దానంబులున్ధర్మము
ల్వేనూఱేండ్లుపొనర్చినంగలుగునే ♦ వింతోనుజింతింపఁగాన్. ౧౨.

కం. ఏదొరకినవరుసకొక | న్యాదానముజేయఁబుణ్య ♦ మపరిమితమటే
శ్రీదయితునకేయిచ్చిన | నీదగుపుణ్యంబుపొగడ ♦ నిరుపమమనఁగన్. ౧౩.

ఆ. మంత్రిమాళినీదు ♦ మాటదుఃఖమువాసె | హరివరించెననుచు ♦ నాత్మఁదెలిసెఁ
జేతనీయనైతిఁ ♦ జేకూఱునేఫల | మనవమాత్యుఁడధిపుఁ ♦ గనిపలికెడి. ౧౪.

చం. అధిపవిచారమీవుడిగి ♦ యాదరభావముఁ గంటిచాలునీ
కధికఫలంబుమున్నెతగె ♦ నద్దిలభించెడినెట్టులందువే
నధకధనప్రదానమున ♦ హర్షమదెంతొ ఫలంబునంతనో
నఘమూఁడుదానమిచ్చినవ్యథ ♦ నందినఁదత్ఫలమందనేర్చునే? ౧౫.

ఆ. చేతనీసెపున్నె ♦ మేతక్కునదికాదె | సిద్ధపఱచునీవి ♦ శ్రేష్ఠతరము
నీరుపండ్లుచేతి ♦ కేరిత్తురుతటాక | వనములమరఁజేయ ♦ ఘనమటనరె. ౧౬.

కం. ఇఁకనీవుసుతకుహరికిని | సకలాత్తులతోడఁగూడి ♦ సన్నాహమునం
బ్రకటనపఱచుచుఁబెండిలి | రొకటేర్పడఁజేయనైతి ♦ న్యూనమదన్నన్. ౧౭.

ఆ. కూడినరుసలాడ ♦ లేఁడువియ్యంకుఁడు । పాటపాడివావి ♦ మాఁటలాడి
యేదొచేయనెన్న ♦ లేదువియ్యపురాలు । కన్నెసవతులున్న ♦ దెన్నమిన్న. ౧౯.

సీ. పరపక్షిణయిడంగ ♦ వాంఛింతువేమొయూ ♦ లక్ష్మినేలెడివాఁడు ♦ లక్ష్యమెయిది?
దాసులనీయంగ ♦ నాసింతొనరదేవ ♦ మునులెల్లనుండనే ♦ ఘనులువీరు?
ఊరులిత్తునటంచుఁ ♦ గోరదేనీరేడు ♦ లోకంబులుండనీ ♦ వేకొలఁదివి?
ఇంటఁబెట్టుకొనంగ ♦ నిచ్చగింతేఁబ్రపం ♦ చంబునిండెడివాఁడు ♦ చాలునెయిది?
కడుపునిండంగవిందులు ♦ గుడుపఁబెట్టఁ । దలఁతువేనాడబ్రహ్మాండ ♦ తతులెసంగ
మెదుకులెక్కానెయిామన ♦ బ్రదుకుఁదెరువు ? గానసీదానమేదానఁ ♦ గానవీన.

కం. కావునఁగన్యాదానం । బావిష్ణునకీనమర్ప ♦ నయ్యేనటంచు
న్భావించిమోదమందుము । శ్రీవైకుంఠంబునందు ♦ శ్రీమతియలరున్. ౨౦.

కం. వ్యామోహపీడితంబై । నీమానసముంటనీకు ♦ నేనింతగనే
మేమోవిన్నపమొనరుప । నామహింతుఁడవీవెఱుంగ ♦ నట్టిదిగలదే. ౨౧.

ఆ. జన్మవితతిఫలము ♦ సంచయమునఁబేరి । కొనఁగఁగొనఁగనొకఁట ♦ ఘనతగలుగు
నట్టిపేర్మిఁగన్న ♦ దైయుండుశ్రీమతి । యాపెతాతవగుట ♦ నను పముఁడవు. ౨౨.

వ. అనిపలుకు ప్రధానశేఖరు మృదుమధురాలాపంబులకు నాహ్లాదపయోనిధి నోలలా
డుచు మనంబునఁ దద్వచనత్వెచ్చుచు నతనింగాంచి. ౨౩.

ఆ. అద్రిప్రదానసమయ ♦ మందుద్భవించుట । నధికయనుటకరుదె ♦ యయ్యెఁగాదె
అబలబాలయజ్ఞ ♦ యైమహావిష్ణువుఁ । జేరమీఱెదాని ♦ తీరవేఱు. ౨౪.

వ అనిపలికి లేచియంత నంతఃపురంబునకరిగి దురంతచింతాక్రాంతయై వంతనొందుచున్న
కాంతంగని చెంతకుంజని యంతరంగంబునఁగల వింతవృత్తాంతంబంతయు సంతసఁపడన్వివే
దీకరించి యాయింతిచింతమానిపి యుండిరంత. ౨౫.

## పర్వతనారదులు వైకుంఠమునకేగుట.

చం. అటఁజనినారదుండుతన ♦ యాస్యమువానరమంటయేమదం
చటులనెపర్వతుండనుచు ♦ హాళినెఱింగియథార్థమాటనా
విటకరివిష్ణుఁడేమనల ♦ వెఱ్ఱులఁగాఁబొనరించి యిట్టిసం
ఘటనమొనర్చితానయల ♦ కన్నియదొంగిలెమోసకారియై. ౨౬.

చం. అనికృతనిశ్చయత్వమున ♦ నప్పటికైననుస్వీయకృత్యము
ల్గనఁబడనీకభ్రాంతిఁగొను ♦ కట్టడినుంటఁడదేకచింతతోఁ

జనిరిరమాధినాయకుని ♦ సన్నిధికొక్కటఁట జంటగూడియా
తనిఁగనికాలులాడిబెడి ♦ దంబగు శాప మొసంగనెంచుచున్. ౨౭.

వ. ఇట్లామునిసింహద్వితయంబు ససంభ్రమసన్నాహంబులఁ జేరనరుగుడు. ౨౮.

సీ. కోట్లకొలందిగాఁ ♦ గూడినదేవత ♦ లజయజయధ్వనులతో ♦ జరగుచుండ
వేనవేలుగనున్న ♦ మౌనిశేఖరులెల్ల ♦ మానసంబునధ్యాన ♦ మూనియుండ
వసురుద్రదిక్పాల ♦ కసమూజములవెల్ల ♦ స్వాగమవిజ్ఞప్తి ♦ జరుపుచుండ
జయవిజయాదులౌ ♦ సకలసేవకతతి ♦ నిజకార్యనిర్వాహ ♦ నియతినుండ
శ్రీధరానీళలనువారి ♦ చెంతనల్ల । శ్రీమతీదేవిబలుకూర్మిఁ ♦ జెలఁగుచుండ
వ్యాళనాయకపర్యంక ♦ మందునొప్పు । దేవదేవుఁడుగనుపట్టెఁ♦దేజమెసఁగ. ౨౯.

కం. నారదపర్వతులచటికిఁ । జేరంగనెయవ్వికార ♦ చిత్రముఖముల
న్వారందఱుఁగనినగినను । జీరికిఁగొనరైరియన్య ♦ చింతన్నడుటన్. 30.

కం. అందొటినతిక్రమించుచు । మందరధరుమ్రోలనిలిచి ♦ మదిఁగలవ్యథచేఁ
గ్రిందునుమీఁదు నెఱుంగని । చందంబునవాకొనంగ ♦ సాగిరిమౌనుల్. 3౧.

## అలమునులు విష్ణునిదూలనాడుట.

కం. ఏమోయీనారాయణ । మామోములనిట్లొనర్చి ♦ మతికముతో నీ
పీమానినిఁగైకొంటివి । నీమాయలవెప్పుడిట్లె ♦ నెగడుచునుండున్. 3౨.

ఆ. మూర్తినగుదునన్నుఁ ♦ గీర్తింతురందఱుఁ । గూర్తురనెడిగర్వ ♦ పూర్తియేమొ
ఆర్తిఁగొన్నఁగనవు ♦ హర్తవైపేర్తువు । కర్తవయిననేమి ♦ భర్తవయిన. 33.

సీ. సిరినీకునిల్లాలు ♦ పరగెడునందేమొ ♦ యురమెక్కిత్రొక్కనీ ♦ యురుమడంగ
పరమేశ్వరుఁడునీకుఁ ♦ బరమాప్తుఁడందేమొ ♦ కూల్చనీకొమరునిఁ ♦ గుఱుతడంగ
దైత్యులనందఱ ♦ దండింతునందేమొ ♦ యెత్తింత్రుజన్మమ్ము ♦ లెత్తడంగ
భక్తులందఱునిన్ను ♦ భజియింతురందేమొ ♦ కొన్నాళ్లకెంతురు ♦ గుణరహితుఁగ
పద్మములభాతినేత్రము ♦ ప్రబలునందొ । యేనుగంతదినల్లని ♦ మేనెఱుఁగవె
ఎఱుఁగకుండినవారుని♦స్నేమనరని।యపకృతినిగన్నమాబోంట్ల♦మనవినతుమె? 3౪.

సీ. నీయాలిచందము ♦ నీకేమియందమో ♦ కలవారియిలుదూరు ♦ కదలిరాదు
పెదకొమరునిఁజూచి ♦ ముదమేమిపొందుదో ♦ తలఁపరుపిలువరే ♦ కొలదివారు
చినకుమారునిఁజూడఁ♦గనుమహోత్సవమేమొ♦కడకాడువాఁడయా♦సడులువడును
బిడ్డదొడ్డతనంబు ♦ గడ్డనుకొందువో ♦ మగనివిడిచివేఱు ♦ మగనిఁజేరు

నీదుసంసారభిద్రము ♦ ల్నిర్ణయింప । నిట్టులైయుండుమాబోంట్ల ♦ గుట్టు బయటం
బెట్టినపుడైననొకమాట ♦ పట్టివిడమె । మమ్ముఁగనిపెట్టుకుంటనా ♦ యమ్మనీకు? ౩౫

సీ. ఎక్కువార్వముఁగొన♦రొక్కంబులేకొక్క♦పక్కనెక్కుచునుండి♦నిక్కిపడుదు
పండఁబానుపులేక ♦ బండపామొక్కటి ♦ యండగానటనుండి ♦ మెండిచలితు
నిలువనీడయెలేమి ♦ నెప్పేదిచిక్కిన ♦ గొప్పకొద్దులనక ♦ కుదురుదందు
కలవారెలేమి నే ♦ కొలఁదులుతలఁచిన ♦ ముందుందుదొరకెన ♦ స్మరిపముననను
నీదుభాగ్యమదిట్టిది ♦ నీకెవరొకొ । పెట్టికట్టెరినగలును ♦ బుట్టములును
చెదరకుండంగఁగాపాడు ♦ నదియెవింత । దీనికేకాదెగిర్వంబ ♦ నూనమరయ? ౩౬.

సీ. బాగోగులెంచుచు ♦ నీగతింగుదురుపఁ ♦ దండ్రియాతల్లియా ♦ రెండులేదు
బుద్ధిచక్కఁగఁజేసి ♦ రద్దినిబడమాన్పఁ ♦ బెద్దలాగురువులా ♦ యెద్దిలేదు
తగదనిచెప్పుచుఁ ♦ దగవుబోధింపంగ ♦ నన్నలాతమ్ములా ♦ యెన్నలేరు
చక్కటుల్సెప్పుచుఁ ♦ జక్కఁగాఁదీర్పంగ ♦ నక్కలాచెల్లెండ్రె ♦ దిక్కులేదు
నీకనీవౌదురాజవు ♦ నీవమంత్రి । నగుచుఁదోచిన మైఁజేసి ♦ యవ్వగచుట
నెవ్వరేమైననన్నన ♦ ద్దెంతొలేదొ । దూరమెంచినమాపని ♦ దూరఁదగునె? ౩౭.

సీ. కొడుకెన్నఁగాస్వీయ ♦ కులజులనేనీకుఁ ♦ బరమశత్రులఁజేసి ♦ పరగఁజేయు
అల్లుఁడన్ననొనీకు ♦ నరులైనవారికి ♦ నండయైతానిల్చు ♦ చుండుఁదెలియ
మామనీదువిరోధ ♦ సామాజికులలోన ♦ మాటుచునుండెడి ♦ మర్మమెఱుఁగ
మరదిగోహంతలా ♦ తురకలుఁగొలువంగఁ ♦ దానిశాచరుఁడయై ♦ కానఁబడును
ఇన్నియిట్టులనున్న నే ♦ నిన్నుఁబట్టఁ । దరముగాకుండుననువుగాఁ ♦ దగిననన్ని
యింకనెంతలుసేసెదొ ♦ మంకుపనులు । సాధులముమమ్ముఁజెరుపుదే ♦ మాధవుండ?

## ద్రోహిపరమపాపుడని మునులునిరూపించుట.

ఆ. నమ్మకముగవచ్చి ♦ నమ్మినెమ్మనమునఁ । గలుగుమాటఁజెప్పఁ ♦ దలఁచుహితునిఁ
జేరఁదీసివాని ♦ మాఱుమొగముఁబూన్చి । మాటఫలముఁగొనుట ♦ పాఁటియగునె?

కం. మిత్రద్రోహముకాదే । పాత్రంబదియౌనెదానఁ ♦ బరువెడఁబోదే
గాత్రంబెటియఁగరాదే । నేత్రములనపాత్రుఁగన్న ♦ నీకదిలేదే? ౪౦.

ఉ. ద్రోహమెదోషభాజకము ♦ తోడెముగొప్పలిఁకెన్న స్వామిని
ద్రోహముచేతయజ్ఞతయ ♦ దూకొనునల్పముదానమిత్రుని
ద్రోహముచేతదుష్టతయ ♦ దోశతమదోఘునమాచుభృత్యుని
ద్రోహముచేతనిర్దయత ♦ దొడ్డమతింపునగడ్డుదాననా. ౪౧.

కం. సాధులుసత్యాఢ్యులునయ । బోధకులునుజేరమోస ♦ పుచ్చెదువాఁడా
బాధకనారకవహ్నికి । నాధేయుండగుననంగ ♦ నబ్బురమౌనే? ౪౨.

ఉ. ద్రోహపుఁబాతకంబఖిల ♦ దుఃఖదమౌఁదనకొప్పునెల్లను
త్సాహములార్చుచుండెడిని ♦ ధన్యతమాన్పెడివంశవృద్ధికి
న్ద్రోహకమద్దగుందలియఁ ♦ దప్పనిముప్పుఘటిల్లఁజేయువే
యూహయమేఘముల్సలిపి ♦ నప్పటికైననుమాసిపోవునే? ౪౩.

కం. ఇంతటిద్రోహముమాయెడఁ । జింతింపకచేసితేము ♦ చేసినయొగ్గా
వంతైనలేదనీకును । గాంతకునైబుధులవలసి ♦ గారింతేనాన్. ౪౪.

విష్ణుండువారికి తనసుధర్మంబువారియధర్మంబుం దెలుపుట.

కం. హరిపకపకనగియనియెడి । పరమానులుమీరలేడ ♦ వ్యామోహంబు
ల్గారకొనుటేడనుమీఱిన । పరితాపంబొండకాక ♦ పరమేఱుఁగుదురే? ౪౫.

కం. కారణములేనికార్యం । బీరేడుజగంబులందు ♦ నేర్పడఁగలదే
యూరకయేనొనరింతునె । మీరందొకకొంతలెటేఁగి ♦ మీఱుటలేలో! ౪౬.

ఉ. నారదనీవెకాదనిను ♦ నమ్మినపర్వతువానరాస్యుఁగాఁ
గోరికఁజేసిపుచ్చితివి ♦ గూఢముదేఁటికినింకఁబర్వతా
నారదునీదుమిత్రమును ♦ నాఁడెన్లవాననుఁగానొనర్చితీ
నారికినైనబంధులును ♦ నమ్మినమిత్రులుద్రోహులైతిరే! ౪౭.

కం. ఏనన్లుకాదువినుఁడా । నానాయమొనర్తునన్ను ♦ నమ్మినవార
ల్మానసముననెదితలఁచిన । నేనదిఘటియింతువారి ♦ నిచ్చలుబ్రోవన్. ౪౮.

ఆ. మీరలడుగునీహ ♦ మీకుఁగూడినయట్లె । తరుణివాంఛితంబు ♦ దానికమరె
హితులకీప్సితంబు ♦ టీగిమద్ధర్మంబు । దీనిభ్రాంతులీరు ♦ తెలియరిపుడు. ౪౯.

కం. ద్రోహంబేఁటిదిమీమీ । యూహలకేసద్దపడుట ♦ యేఁటిదివెఱ్ఱి
ల్మోహావేశతఁగలిగిన । యూహలతెరవుననపలుక ♦ నొప్పునెచనుఁడా. ౫౦.

వ. అనియాఫుల్లాంభోరుహలోచనుండు వెల్లడింపనెల్లరకుఁ దల్లక్షణంబెల్లం దెల్లంబగుడు నంతటిఘనులంత కాలంబునకు నొక్కకాంతంగని నితాంతకామోద్రేకచింతాక్రాంతు లగుటకును బరస్పరానుబంధ బంధులట్లన్యోన్యద్రోహకారకులగుటకు నసాధ్యఫలా ప్రాప్తినైన న్యూనంబున మేనెఱుంగమిస్వీయపరకీయమానాభిమానజ్ఞాన రాహి

త్యంబు పిక్కటిల్లఁ దమటక్కరితనంబులు మాలగ్రుక్కియక్కమలాధిపునెదుటి చక్కని నెక్కొనిపెక్కులక్కరణి చక్కటులు వాక్రుచ్చుటకును దగుముచ్చటల మూగుచుందచ్చనలాడుచుఁ గుచ్చితంబులెన్నుచు నచ్చటగల మునిఖియచ్చరులెల్లందమ పిచ్చులెచ్చరించుమచ్చునఁ గ్రచ్చనఁగ్రచ్చనంతకు మున్నంబరీషాస్థానంబునఁ దమయెడ నడచిన శ్రీమతీసఖులవలని పరిహాసతిరస్కారంబులె మేలనిపించుడునటఁగదలి పటు రయంబునమరలియెటకేనింబోవనట నిటలాక్షప్రియుండగు నమ్మాయానటుండుజటి దేనపటలింగాంచి యిటులనియె. ౫౧.

శ్రీమన్నారాయణుని కాముకనిరసనోపన్యాసము.

కం. నారదపర్వతులనఁగాఁ । దీరినదేవర్షులగుటఁ ♦ దెలియుదుముకదా
వారలఁగామము మోహము । భూరిమహాభూతములనఁ ♦ బూనఁగనితిరే. ౫౨.

తే. కామికాఁగనెదుష్పథ ♦ గామియగును । గామితము నెంచుఁదనకది ♦ గామిఁగనఁడు
కామిగులపట్టుదలలనా ♦ గామిఁజెఱుచుఁ । గామితముఁదప్పినర్తించుఁ♦గామినిఁగని.

ఉ. పెద్దలమంచుఁదద్వ్యసన ♦ పీడితులైనఁడదాయితుల్లదా
పెద్దసుహృన్మణుల్తమకుఁ ♦ బెద్దతికంబదివాండ్రఁగాంచునే
రొద్దనుదాముపొందుదురు ♦ హోరలనెల్లెడబుద్ధిపీడకా
సుద్దులనేచెలంగునది ♦ చూచినమేఁటులురారుమూడఁగన్. ౫౪.

ఆ. కామిమద్యపాయి ♦ కంటెనుహీనుండు । వీఁడుకొంతనడికి ♦ పీడమదము
జగమెఱుంగనేర్చుఁ ♦ దగదదివానికి । పరువముడుగుదాఁక ♦ వగలఁబుచ్చు. ౫౫.

ఆ. మోహియంధుపగిది ♦ ముందెఱుఁగకయుండు । కానడెగ్గులగ్గుఁ ♦ గామియట్ల
కామిప్రాయముడుగఁ ♦ గడబట్టుమోహియా । దేహముండుదనుకఁ ♦ దెప్పరిలఁడు.

ఉ. కాముకుఁడైనవాఁడెపుడుఁ ♦ గామినులొప్పెడిజాడలందగుం
దీమసమెద్దొతోఁపఁగనె ♦ తృప్తుఁడుతానయిమాటపాటులం
బ్రేముడిఁబెంపుసేయసతి ♦ ప్రేక్షణముంగననెంతలేనిమే
ల్గాములొనర్చునేరయినఁ ♦ గందురొవిందురొనాకనిచ్చలున్. ౫౭.

తే. యోగినిష్ఠనుబరవస్తు ♦ వొక్కటికను । లాగుననుగామికాంతనే ♦ బాగుగఁగను
మతిభ్రమించెడినేమొయం ♦ చతఁడునొచ్చు । మఱియెలేకున్కినొప్పిలే ♦ దితనికెచ్చు.

ఉ. జవ్వనితానుగాకపెర ♦ సంగతులందనిధ్యాసబల్మిచే
నివ్వటిలంగఁగాముకుఁడు ♦ నిందలుపొందులు నెగ్గులగ్గలే
మెవ్వరొనచ్చినందెలియఁ ♦ డెంతటికార్యముఁదానపూనెడి
న్దివ్వెయులేకచీకటులఁ ♦ ద్రిమ్మరుఁగ్రుమ్మరుసందుగొందులన్. ౫౯

ఆ. పిన్నపెద్దలనెడి ♦ సన్నరెయెఱుంగఁడు | యుక్తమునునయుక్త ♦ మొకటఁటంబలుకు
అపుడొనర్చుపనులు ♦ నంతకువెక్కువి | యన్నితెలియుఁగలను ♦ గన్నమాడ్కి.

ఆ. అన్యలాభదాయ ♦ కార్థంబులైనను | జూడఁబోఁడుతలఁపఁ ♦ గూడఁబోఁడు
ఎవ్వరైననద్ది ♦ యెచ్చరింపఁగవారి | నీసడింపుఁబలుకు ♦ లెన్నొపలుకు. ౬౧

మ. మహనీయుల్తనుఁగానవచ్చిరనఁగా ♦ మాటాడఁగారోయుచే
యహమందైనసుషుప్త్యవస్థఁదగునం ♦ చాడంగఁగార్యాంతర
స్పృహనెందేజనెనంచనంగఁదగున ♦ క్లేర్పాటుచేయించియా
కుహనాపద్ధతిడాగికాంచుసుఖము ♦ న్గొగ్గింతలేకుండఁగన్. ౬౨

కం. వావిఁదలంపఁడుకన్నియ | దేవతసమయైనఁగనఁడు ♦ డెంపరితనదా
లావాచేవయుఁగాఁగల | భావిఫలంబునుగణింపఁ ♦ బ్రాల్మాలిచెడున్. ౬౩

ఉ. శీమచిటుక్కనంబటిమ ♦ చింవరవందరలాడుగుండియ
ల్తామొగిజల్లనుంబెదరు ♦ లావగుదేహమువెల్లవారెడి
న్మోమునదైన్యమేర్పడెడి ♦ మూర్ఖముఁబ్రాలెడినిట్టిజారతం
దామొనగాఁడగుందెలిసి ♦ తద్ధితులాపదఁబెట్టఁబొల్పడున్. ౬౪

శా. ఏయొక్కింతయుఁదానుగూర్పకయును ♦ న్నెనాఁడొపెద్దల్మహా
పాయంబుల్వడిసేకరించినదియా ♦ భ్రష్టార్థజిజ్ఞాసనే
పాయంజేసిఋణంబుఁబేర్చియితరో ♦ పాయంబులందీర్పకా
స్తేయంబుఘటియించుఁగాముకుఁడుతా ♦ దృప్తుండుధీహీనుఁడై. ౬౫

తే. ఇంటనలరెడునిల్లాలిఁ ♦ గంటఁగనఁడు | పెద్దలితవునమతిచెప్ప ♦ రద్దివెట్టఁ
గన్నవారున్నవారనే ♦ యెన్నఁజనఁడు | కడమబంధులులెక్కయా ♦ జడమతికిని?

కం. బద్ధకమనిచోరఁడేపని | నిద్ధనియామకములెల్ల ♦ నేఁటంగలుపు
న్వృద్ధిచెడునటులఁబోవును | శ్రద్ధయొకింతయునులేక ♦ శ్రాద్ధముఁదీర్చున్. ౬౬

కం. ఈయంతయునిటులొప్పట | నాయంబెటులన్నమనము ♦ నమ్మకముగనే
చాయందగునాయెడవిడి | పోయెడినేయాత్మసిద్ధిఁ ♦ బొందిననచటన్? ౬౭

కం. ఇదియల్పానందదమును । దుదిహానిం బొసంగఁ జేయు ♦ తుచ్ఛంబనుచు
న్మదినంటనీకసపమల । పదవికినీపొట్లువడిన ♦ బ్రహ్మణ్యుఁడగుౘ. ౧౯.

ఉ. బాలుఁడు విద్యమాలిమతిఁ ♦ బారినయాటలనాడికొన్నయుం
గాలముకష్టజీవియయి ♦ గాసిలునట్టులెదేహిమోహియై
యీలఘుసౌఖ్యవాంఛఁదగ ♦ నెంతయుముందరికాలమంతయుం
జాలభయానహంబులగు ♦ జన్మపరంపరదుఃఖముల్వడుౘ. ౨౦.

తే. కానఁగోఱగానికామాది ♦ కములఁబడక । ధర్మమార్గప్రవర్తన ♦ నిర్మలుఁడయి
శుద్ధసువిచారమార్గసం ♦ సిద్ధిఁజేయ । నపుడుముందునుసుఖమెప్ప ♦ నపరిమితము.

వ. అని శ్రీమన్నారాయణుండు ప్రసాదించిన యుపన్యాసగర్భితమగు కాముక నిరస
నంబు తమకుఁగడు నాదరణీయంబగుటం జేసి యపారాహ్లాదామృతసారభరితమానసులై
మునులును దేవదేవతాఘనులు నమ్ముకుందుడెందంబులఁ బొందుపఱచి తద్భక్తిపేర్మి
నేర్పడురక్తిని బహువిధస్తుతు లొనరించుచుండి రచ్చట. ౨౧.

## పర్వతనారదులంబరీషునకు శాపమీనరుగుట.

కం. నారదపర్వతులరిగియు । దారుణమహాడటవినొక్క ♦ తటినీతటముం
జేరివిచారము పెంపున । నూరక యొక్కింతసేప ♦ టుండినయంతౘ. ౨౩.

కం. నారదుఁడిట్లను బర్వత । తీరెడిమనవ్యథలవెట్లు ♦ తెలుపుము నాఁగా
నారీమణి చిక్కమినీ । యూహాథముదిగునెయనుచు ♦ నాతండనఁగాౘ. ౨౪.

ఉ. అట్టులఁగాదుభూరమణుఁ ♦ డప్పుడుతామనలంగుమారిఁజే
పట్టఁగరండటంచనుటఁ ♦ బట్టికదామనమాడకేగుట
ల్కట్టడినాతఁడుండకల ♦ కాంతమఱొక్కనికిచ్చెశాపముం
బెట్టినఁదీరుఁగొంతవ్యథ ♦ ప్రీతియెనీకనఁబర్వతుండనుౘ. ౨౫.

ఆ. బాగుబాగుమంచి ♦ పద్ధతియిదెయగు । బుద్ధిశాలివగుటఁ ♦ బొడమెనీకుఁ
బదిమువేఁగఁజన్న ♦ నదనునఁబడునది । ముదమెసంగుదాన ♦ వ్యథతొలంగు. ౨౬.

కం. అనికృతనిశ్చయులగుచును । వనజనపదములనుగడచి ♦ వడిగనయోధ్యం
గనుఁగొనుచుఁజేరవచ్చిరి । మునులప్పుడుప్రళయరుద్ర ♦ మూర్తులభంగిౘ. ౨౭.

తే. వారికపుడొప్పుభీకరా ♦ కారములను । గన్నవారలు కోపపు ♦ సన్నయదని
యంబరీషావనీశున ♦ కపుడెచెప్ప । విష్ణుచక్రస్మరణచేసె ♦ వికలముడుప. ౨౮.

శా. ఓహోచక్రమసాధుపోషణమనీ ♦ కుత్సాహదంబౌఁగదా
వ్యూహంబుల్గొనియెందఱున్న రిపుల ♦ న్హాంతీవుకందార్చుట
న్సాహస్రంబవునీసహాయమున నా ♦ సంకర్షణుండొప్పెడు
న్బాహాప్రౌఢిమకాతఁడిచ్చెనిను నా ♦ భాగ్యంబునన్రక్షకై. ౭౯.

పంచ. నిదానభావదానమిచ్చి ♦ నీవుప్రేమసాకనే | కదాసదాముదంబునందఁ ♦ గాంచినట్టి
వాఁడనే, మదంపదాశయంబునొంది ♦ యెంతుఁజింతమానుప | న్సుదర్శనాఖ్యచక్ర
మూర్తి ♦ చూడుమన్నుసత్కృపన్. ౮౦.

కం. ఉంతుఁగదనిన్నుగద్దియ | నెంతుఁగదారక్షకతకు ♦ నీవేయనుచు
న్నింతుఁగదహృదిని ధీరతఁ | గాంతుఁగదాహరివినీవ ♦ కాసద్భక్తిన్. ౮౧.

కం. ఆమూనులుమహనీయులు | సామాన్యులుగారు మిగుల ♦ సాహసులగుచుం
దామేమొకోపమూనుచు | నీమెయిఁజనుదెంతురంటె ♦ హితమతిఁగనుమన్. ౮౨.

వ. అనియిష్టదేవతాప్రార్థనంబున మనంబుఁ బుష్టిపఱచుకొని బెదరుడిగి యెదురు చూచు
చుండంగనారదపర్వతులారాజభవనాంగణమునకుంజేరఁగనిరి. ౮౩.

తే. అర్ఘ్యపాద్యంబులాతఁడీ ♦ నందఁగనక | యుగ్రశిఖిలొప్పుశిఖులట్టు ♦ లాగ్రహమున
నూర్పులెగయంగరేగుచు ♦ నోర్పుమాలి | చూడునిన్నెమొనర్తుమో ♦ ఖంతయనుచు.

చం. పటపటపండ్లుకొట్టుచున ♦ భంబదరంగలఱంకెలెచ్చునా
ర్భటములుకొన్నిచేసియుల ♦ పార్థివుఁడారటమందిడీనుఁడై
కటకటయిద్దిరేమిననుఁ ♦ గావరహీనుఁడఁబాదనేనకుం
గుటిలతఁగాంతురేయనుచుఁ ♦ గోపమిఁకెచ్చఁగరాజుఁగాంచుచున్. ౮౫.

తే. కుటిలుఁడవునీవుమమ్మువా ♦ కిటికిఁబిలిచి | కూతునింకొక్కనికిఁగట్ట ♦ జూతెమఱియు
మమ్ముఁగుట్టిలులమందె నీ ♦ దిమ్మదిగుప | నిపుడశపియింతుమనిదాని ♦ కేర్పడంగ.

## సుదర్శన చక్రంబలమునుల వెంబడించుట.

ఉ. ఎక్కడఁగాంచెనోవినెనో ♦ యెవ్వరిచేసిరితానలేచిన
ల్దిక్కులు మాఱుమ్రోయఁగను ♦ దిమ్మనుభీకర రావమొప్పఁగా
మిక్కిలికాంతిభాస్కరుని ♦ మించుచుఁగన్నులుమిర్లుఁగొల్పుచా
చక్కిసుదర్శనాహ్వయము ♦ చక్రమవక్రపరాక్రమంబునన్. ౮౭.

తే. మీఁదఁబడరాగ శాపమే ♦ మీఁదఁ జనెనొ | కోపమేమయ్యెనో దాని ♦ కోపలేని
పందలౌచును నారద ♦ పర్వతులటు | విడిచిపాఱి రెజడియవె ♦ న్బడియెనదియు.

కం. వనములకేఁగఁగ నటకును | వెనువెంటన పడి యదేగె ♦ వీఁక సరసిలో
వనములదూఱఁగ నదియును | మునిగియె వెలుగొందఁ జూచి ♦ మునులు వెడలియున్.

ఆ. పర్వతంబులెక్కఁ ♦ బ్రాకె నద్దియు వెంట | గుహలను దూఱ నల్ల ♦ గొందిఁ జేర
భూరుహంబులెక్క ♦ మీఱె నద్దియుఁ గూడఁ | బొదలడాఁగ నటను ♦ బొదువఁ జొచ్చె.

కం. జనపదములు వనవాటులు | ఘననగములు గహ్వరములు ♦ గట్టులు పుట్ట
ల్మునిపల్లెలు పట్టణములు | మునులెటఁ జేరినను వారి ♦ ముసరుచునె సఁగెన్. ౯౧.

ఉ. భూగతసర్వదేశముల ♦ భూరుహభూధరభీకరాటవు
ల్డాఁగఁ గవిలుమాలినను ♦ డస్సి మహాబ్ధులదూఱ నాడకు
న్వేగమ వెగ్గలంబయిన ♦ వేంద్రముళీనుచు వెన్నుడింపనా
భోగినివాసలోకమును ♦ బొందిరి మునులు వోయెఁ జక్రమున్. ౯౨.

సీ. లోతున నొప్పున ♦ ప్పాతాళలోకాంత ♦ రాళంబుఁ దిరిగియు ♦ రహాటకనిరి
ఒగి భూమికే తెంచి ♦ యూర్ధ్వలోకములకుఁ ♦ బ్రాకఁగా నదియును ♦ వీఁక వెడలె
స్వర్గలోకంబున ♦ దుర్గమస్థలములం ♦ దెటఁ జేర వెన్నంటి ♦ యటనె నిలిచె
సత్యలోకాదుల ♦ నిత్యంబు వీడక ♦ యేడవారేగవె ♦ న్నాడియాగె
దేవనాథుండు కన్గొని ♦ కీవిఁ దప్పె | బ్రహ్మ యదికాంచి తానష్ట ♦ బన్మెరవడె
శంభుఁ డెపమెచ్చె దానిసం ♦ రంభమునకు | మునులు వనటను గొనదాని ♦ మొనలు గనలు

కం. మునె వెట్టి మద్యమానం | గను వృశ్చికదష్టమైన ♦ కరణిఁ గనఁగనా
మునులకుఁ గామార్తులకును | ఘనకోపులకిట్టి చక్ర ♦ ఘర్షణ మొదవెన్. ౯౪.

తే. తెన్నుఁ గానక జగములు ♦ తిరిగి తిరిగి | వెన్నుఁ దవిలిన చక్రంబు ♦ వీడకున్న
మున్ను కలయి సజంతయు ♦ మూలఁ ద్రోసి | వెన్నునాపన్నులై చేరి ♦ యెన్నఁ దొడగి.

## మునులు హరిని శరణుజొచ్చి చక్రంబు బారి దొలగుట.

శా. అయ్యో రక్షక యోగిలోకవరదా ♦ యంభోజరుట్సన్నుతా
వెయ్యారుల్విను తింపలేమడలుట ♦ న్వేమమ్ముఁ గాపాడవే
యియ్యార్భాటము ముందు మాన్పఁగదవే ♦ యేమైననోరా డెడిం
గుయ్యో యుందమటన్నఁ జక్రము నడుం ♦ గోపించి మాపై హరీ. ౯౬.

తోటక. అదిగాయదిగో ♦ యలచక్రమయా । పదమాకొదనం ♦ బడవెంటనయా
ఫుడమాపొదనం ♦ బయిలోడదయా । గదనీపదమా ♦ గతిప్రోవుమయా. ౯౭.

కం. మానుపుముముందురాయిడిఁ । గానుపుముదయాబ్ధినీదు ♦ కరుణాదృష్టిం
బూనుపుముదానినీచే । నానుపుమీమాకుశ్రాంతి ♦ యలసటబలిసెన్. ౯౮.

కం. అనుదీనాలాపంబులు । వినిహరిచక్రంబుఁబట్టె ♦ విశ్రాంతిఁగన
మ్మనులటరోఁజుచుఁగూలిరి । వినయంబునవారిఁజూచి ♦ వెన్నుఁడుపలికెన్. ౯౯.

కం. ఎన్నఁడుమీతెరువునఁజన । నెన్నదె యీచక్రమిట్లు ♦ తేర్పడె నేలో
మన్ననగలమిన్నలుమీ । మున్నిదియెంతటిదిపట్టి ♦ ముట్టడివెట్టెన్. ౧౦౦.

తే. అట్లుహరియనమునులుదా ♦ మంబరీష । జనపునకుశాపమీనెంచి ♦ మినుకఁబోవ
నద్దివెన్నంటుముచ్చట ♦ యంతతెలిపి । యింకమమ్మునురక్షింప ♦ వేయటనఁగ. ౧౦౧.

కం. భూపునియెడఁగోపంబును । శాపంబీఁదలఁపమాని ♦ సంశ్రుతభక్తుం
డాపతియనినమ్మినమీ । యాపదనోనీసుపర్శ ♦ నావృతియుడుగున్. ౧౦౨.

కం. అనిహరియనమునివరులిం । కనుగోపముశాపములును ♦ గానంబడునే
మునుపేయన్నియునుడిగెను । ఘనుఁడనిమేమంబరీషుఁ ♦ గంటిమనవుడున్. ౧౦౩.

మ. అలచక్రంబపుడంబుజాక్షుఁడుపడ ♦ హ్లాదస్వభావంబురం
జిలుకీవిన్గనుపట్టుచున్వడలెఁదా ♦ శీర్ణప్రతాపంబు న
న్జలజాతారిసమానతేజమునసం ♦ చారప్రశాంతిన్సమా
తలనాధార్చనలందు చుండఁగనయో ♦ ధ్యారాజధానిఁజొరన్. ౧౦౪.

కం. అదియట్టులుపోమోదము । గదురఁగనమ్మునులులేచి ♦ కదలిరిగుండె
ల్కుదిరికఁగనడపయుడుగఁగఁ । జెదరినచిత్తంబుమరలఁ ♦ జేరికొనంగన్. ౧౦౫.

ఆ. అట్టులచటువాసి ♦ యామానులిద్దఱు । సరగఁదోఁటిసరసి ♦ సరసకరిగి
స్నానమాచరించి ♦ జలకమానినమానె । డప్పివిశ్రమింప ♦ నొప్పులుడిగె. ౧౦౬.

చం. ఇదియొకయూపథాభమయి ♦ యెచ్చుడుపంగనుబూర్వమట్టుతో
దవటుముఖాకృతుల్గనిన ♦ హాస్యము చేయుదురంచు నేడకుం
గదలకనానసెక్కొనుటఁ ♦ గాదదికాదిదియంచు నేమియో
మొదలిఁటికామకత్వమున ♦ ముక్కొనువాక్కులెపల్కుచుంద్రటన్. ౧౦౭.

ఆ. కాలకర్మగతులు ♦ కల్పించుమార్పుల । నెంతవారికైన ♦ వింతపుట్టుఁ
బ్రకృతిలక్షణంబు ♦ పరిపాటిఁదెలియంగ । నుత్తవారుబ్రహ్మ ♦ వేత్తలేరు. ౧౦౮.

## వసంతకాలాభివర్ణనము.

కం. శిశిరముచనుటవసంతము । విశదంబుగ నేరుపడుట ♦ విస్పష్టముగా
దశదిశలం దద్విధాయక । వశగతవిషయములు సెలఁగె ♦ వర్ణింపంగన్. ౧౦౯.

సీ. ఏర్పాటులొందవిన ♦ యెచ్చునమునుముందు ♦ సదలంకృతోచ్చను ♦ జరగఁగఁగని
తీవ్రంపుధాటిని ♦ దీంద్రమెచ్చింపంగ ♦ నడలుచుజడియుచు ♦ నడలుచదర
ఘనతకుఁబుష్టిగాఁ ♦ గనిదయారసవృష్టి ♦ ద్రమాగింపమెత్తన ♦ మాఱులీన
నడివిసరుడు పెట్టి ♦ జడియమినడకించి ♦ తుదకుశోభలుమాన్పి ♦ త్రోసిబుచ్చి
నరుసనధికారిహృన్నాథ ♦ వత్సరములు । తగిలిప్రజలను సతులను ♦ జగతినెల్ల
షడ్గుణంబులబుతుధర్మ ♦ షట్కములను । జేతలెల్లనుగాలంబు ♦ రీతికాదె. ౧౧౦.

ఉ. రాజటవృద్ధుఁడౌడుఁబెర ♦ రాజొకఁడేర్పడునన్న సన్న నా
భూజనులా సువర్ణముల ♦ భూగతమాగతిఁజేసిరి త్తలా
నోజనువత్సరంబుతుది ♦ నొండొకహాయనమాదిగాకము
న్భూజనులా సుపర్ణముల ♦ భూగతమాగతిఁజేసిరి త్తలా. ౧౧౧.

ఉ. జీవనమిచ్చె నర్షమిది ♦ జీవితనాథుని మాడ్కి నంచు సం
భావనఁజేసియద్దితముఁ ♦ బాసెడిజాడఁగనంగవన్నెగ
న్నీవిని నిల్వరాదనుచు ♦ డెందములందుఁదలంచి వృక్షము
ల్వావిరిఁడీయుభాండముల ♦ వైఖరిరాలెడి నాకులెల్లెడన్. ౧౧౨.

తే. నూతనాబ్దేశ్వరుఁడు రాఁగఁ ♦ బ్రీతిమెయిని । నడిగిధరియించు రతనాల ♦ తోడవులనఁగఁ
జివురువుట్టెను జెట్లూరం ♦ జిల్లుచపుడు । వైభవంబునఁ దలలెత్తి ♦ దరలసాగె. ౧౧౩.

కం. వింతవసంతమనంతర । మెంతయుమంతుఁగనవచ్చు ♦ నేఁటను మొగినౌ
పొంతఁదగిసంతసంబును । సంతననింతంతనాక ♦ జంతువులకిడన్. ౧౧౪.

తే. బడుగుతనమున సర్వస్వ ♦ ముడిగిపోయి । మొద్దునడియున్న భూజని ♦ ముద్దుగులుకఁ
జేసఁ బైకొనరంజిలఁ ♦ జేసినిలుపుఁ । గాలమహిమంబు వర్ణింపఁ ♦ గాఁదరంబె. ౧౧౫.

కం. అసలదినసంతమాయెను । బసరంగుసరింపవిడిచెఁ ♦ బడఁజల్లినయ
ట్లసదాయసలారుఁగదా । మిసమిసనసస్పృశములయ్యె ♦ మేదినివనముల్. ౧౧౬.

ఆ. ఏడుపుచ్చియేమి ♦ కూడలేకున్నట్టి । పట్టులెల్ల మెఱుఁగు ♦ గట్టులట్టు
లింతలోనెచేసె ♦ వింతవసంతుఁడు । ము[illegible]పడెడివారి ♦ పొందికయిదె. ౧౧౭.

ఉ. నూతనవర్షరాజునకు ♦ నూలుకొనందగుముఖ్యసాధనం
బీతని ప్రీతిఁగందుమిఁక ♦ నీప్రభువొప్పెడికాలమంతయు
న్భూతలజంతుసంతతికి ♦ భూరిసుఖానహాసంపదల్తగుం
గాతమటంచునుత్సవముఁ ♦ గాంక్షనొనర్తురులోకులెల్లెడన్. ౧౧౭.

కం. మాధవపురస్కృతమని । ర్బాధకముగుననుచుఁడనదు ♦ పరిపాటికినై
నీధరణికిఁబ్రత్యబ్దము । సాధనమదికాఁగడిగ్గు ♦ జగదిష్టముగన్. ౧౧౮.

ఆ. మాధవుండటంచు ♦ మాధవుఁడనుచును । సకలవృక్షజంతు ♦ సంతతులును
వరలుఁగొరలుమెరయు ♦ మురియుమజెల్లదే । మాధవాప్తిఁగన్న ♦ మహిమనెన్న.

ఆ. పెద్దలీల్గుచున్కి ♦ పిన్నలేర్పడుచున్కి । సుద్దిజగతినిద్దె ♦ తద్దయునని
యుద్దిఁజూపునట్టి ♦ యొద్దికఁబ్రాతాకు । రాలుఁబల్లవాళి ♦ క్రాలుఁగనఁగ. ౧౨౧.

సీ. మున్నెన్నికకుఁగాని ♦ వన్నియుడులుపుచుఁ ♦ దిన్ననివెల్లెడ ♦ వన్నియనిడ
నంతస్థులన్నింటి ♦ వింతగామెఱపించి ♦ పైపట్టులంతటఁ ♦ బరగఁజేయఁ
బల్లవాధరలస ♦ త్ప్రసవగంధముగూడఁ ♦ గొమ్మలనెల్లెడఁ ♦ గుదురుపఱుపఁ
బైకేగఁగల్గుసా ♦ ఫల్యంబునిక్కమ ♦ న్పక్కినిగనుపట్టు ♦ ఫలములునుప
నలవసంతాగమోత్సవ ♦ ములరుపంగ । గహనపురవరరాజాధి ♦ కారులెల్ల
మెఱుఁగులిడునొంటికంబపు ♦ మేఁడలనఁగ । వెలయుచుండెడిఁదరుపఙ్క్తి ♦ కలసొబగున.

కం. కలవారుకలిగినంతగ । వెలయంగాఁజేసికొంద్రు ♦ విన్నాణమునం
గలదిదికదపొదరిండ్లును । నలరింపంబడియెవాని ♦ కైనకొలందిన్. ౧౨౩.

సీ. మాధవుండన్నట్టి ♦ మాటనిక్కమ్మైన ♦ మమ్మేలఁగనకుండు ♦ మహితుఁడతఁడు
సౌధాంతరావనీ ♦ సాధనుతేషుఁడై ♦ గుడిసెలవ్రేతలఁ ♦ గూడనేలు
పల్లవపాణులై ♦ సల్లలితాంగులై ♦ కొమ్మలాసౌధాంత ♦ రమ్ములెక్క
కుసుమగంధులమేము ♦ పసమాలియుందుమే ♦ కనమిద్దిలేమెక్కఁ ♦ గలమటంచు
అలతాంగులుపొదరిండ్ల ♦ కట్టెఁపాక । మాధవుండనెంతటి ♦ మాయలాఁడొ
యంపటికినన్నిరూపులఁ ♦ బొందికపడి । యలరుఫలములనందఁగా ♦ మెలపుచుండు.

కం. వనలక్ష్మియుమాధవుఁడును । నను రాగంబుప్పతిల్ల ♦ ననువుగఁదగుచో
నొనరినసుమపరిమళములు । ఘనముగ రాఁబట్టునాడఁ ♦ గలనానినొగిన్. ౧౨౪.

సీ. వనరమామాధవు ♦ లనువుగాఁబవళింప ♦ జోలపాటలుపాడు ♦ చోద్యమొక్కొ
పామగానవినోదు ♦ లామహాత్ములటంచు ♦ గానంబుచేసెడి ♦ గరిమమొక్కొ

సరసులున్నారిడ ♦ సద్దుమానుఁడటంచు ♦ లీలగాఁదలిపెడి ♦ యీలలాక్కొ-
ప్రసవరమ్యాస్తన్య ♦ పానేచ్ఛనవులాట ♦ జాలిపుట్టఁగనేడ్చు ♦ సరణిమొక్కొ-
నాఁగమూఁగుచుఁజెలరేఁగి ♦ యూగుటుఁడిగి | పాడుచుండెడినాడుచు ♦ భ్రమరపంక్తి
ప్రాపకులబల్మికల్మికిఁ ♦ బ్రాపునందు | వారలిట్లింటనాయమె ♦ వ్వారికైన. ౧౨౬.

తే. వెఁద్రుకలబోలకుండెడి ♦ వెంగలులకుఁ | గలిమికలిగినఁబట్టఁబ ♦ గ్గములుకలవె
చూడుఁడీదొంగతుమ్మెద ♦ ల్సుమముమఱిగి | ఫలవతులఁగాంచియొగతాళి ♦ పాటఁబాడు.

సీ. కోతులుపైబడ్డఁ ♦ గొమ్మలొప్పునదీడఁ ♦ జూడరమ్మనిచెప్పు ♦ సుద్దులకునో
తపసులురంభల ♦ దాకొననీచాయఁ ♦ గానఁగారమ్మను ♦ కథరులకునో
పున్నాగములఁజుట్టి ♦ పొనరులతాంగుల ♦ వీడమిఁగనుఁడన్న ♦ వింతలకునో
సరసులనడుమనే ♦ జలకమాడెడినారి ♦ వీక్షింపుఁడనితెల్పు ♦ వేడ్కలకునో
ఎత్తునకునెక్కిబిగ్గగాం ♦ తెత్తియొత్తి | కోయటంచునుబికములు ♦ కూతవెట్టి
గేలిసేయుదుభూచర ♦ ఖేచరాళి | మించువేడ్కలఁగనిసంత ♦ సించుదగదె?

కం. పనిగలయపుడేపలుకుచుఁ | బనిలేమినిమానికోలు ♦ పటిచుమొసంగు
న్ఘనపికరసమాధుర్యం | బునకిదెకారణముసుండి ♦ బుద్ధిందెలియన్. ౧౨౯.

సీ. ఫలహారములువెట్టి ♦ పనివడిపోషించు ♦ తరుపంక్తులనుతించు ♦ తరబడికినో
వరసుఖదంబులౌ ♦ వానిముద్గొలపించి ♦ నారినిస్తుతియించు ♦ నడనడికినో
పారవంతములవ్వి ♦ గారహింజేసెడి ♦ భూమిబల్మింబొగడఁ ♦ బూనుటకునో
భాగ్యభోగ్యంబగు ♦ పడమిచ్చినసంత ♦ కాలంబువినతించు ♦ మేలిమికినో
పలువిధంబులఁబలుకులు ♦ పలుకుచుండుఁ | జిలుకలవియెన్నవేడవా ♦ క్కులుగఁజెలఁగు
మెలఁకువంగనితెలియంగఁ ♦ గలుగువెడల | ఫలముఁగన్నారుకీర్తింపఁ ♦ బాడిగాదె.

కం. తిన్ననివెన్నిఁటిఁగన్నను | మన్ననఁజనిగంట్లువెట్టి ♦ మానవుచిలుక
ల్కన్నులనన్యులకొప్పెడి | నన్నియఁగన్నంతరగులు ♦ వారలునిట్లే. ౧౩౧.

సీ. పిండలైయొత్తిడిఁ ♦ గ్రిందరాలఁగఁగొని ♦ ముందువిఁగులఁగఁద్రు ♦ కొండఅవ్వి
కాయలౌచాయలఁ ♦ బాయనితమినూరు ♦ గాయలువైతురు ♦ పాయమునను
పండులైయుండంగ ♦ నిండారుకోర్కుల ♦ దండిగభుజియించు ♦ చుండెదరట
అవిపాయునవితల్ప ♦ పావతీర్ణంబున ♦ నొనరిచిభక్ష్యంబు ♦ నవిచితింద్రు
ఉద్భవించుటయాదిగా ♦ నున్నయపుడుఁ | బోయియునుగూడనుపయుక్త ♦ మాయసద్మశో
మాతఫలములటంచను ♦ ఖ్యాతిమిగులఁ | దగెడినుపయోగిమృతజీవు ♦ లగునటులనె.

సీ. బాలురుబాలిక ♦ ల్పడతులుఁబ్రౌఢులు ♦ బంతులమర్చుచు ♦ బట్టుకొంద్రు
సర్వాంగసౌష్టవ ♦ సద్భూషణవిశేష ♦ ములుఁగలవెలఁదులుఁ ♦ దలధరింత్రు
బంధులహితులను ♦ బ్రాహ్మణశ్రేష్ఠులఁ ♦ గంధహారములేసి ♦ గౌరవింత్రు
దేవతాలయముల ♦ దీపసములుమీఱ ♦ బహ్వలంకృతులను ♦ బరికరింత్రు
తెల్లఁదనమునవిమీఱు ♦ నెల్లతీరు | నలసువాసనయెటలేదు ♦ గలుగఁబోదు
వన్నెయెన్నంగఁగలవన్న ♦ వాసిమిన్న | కొల్లగానెల్లెడలఁగ్రాలు ♦ మల్లెపూలు.

కం. ఇట్టులలరువిరివిసంపదఁ | బట్టితరచతురంగబలము ♦ ప్రబలమరుఁడుదీ
రుటలేకట్టిలిట్టిలిట్టులట్టు | నటనముఁజేయించువిరహ ♦ నట్టులనయారే! ౧౩౪.

## పర్వతనారదుల కామోద్రేకోన్మాదములు.

తే. పాపమాప్రాంతమునమన ♦ తాపసులగు | నారదుఁడుఁబర్వతుండును ♦ న్నరుగాదె
తీరికగనివ్వియవ్వియుఁ ♦ జేరిచూడఁ | గోఁతులకువెఱ్ఱియెత్తిన ♦ రీతియయ్యె.

తే. ఎండిపోయినమొండులే ♦ మండితములు | కాఁగలట్టిదికాలంబు ♦ గాదెయెదల
మొదలుమున్నుండియడ్డపు ♦ కదలమెదల | నదియెపూరించెఁగామంపు ♦ మదమునించె.

సీ. ఏఁంకఁగనుఁగొన్న ♦ నేర్పడ్డతమిదీరఁ ♦ బెంటులుంబోతులుఁ ♦ బెనఁగుచుండు
నేచక్కఁగాంచిన ♦ నెనఁగినమోహాన ♦ రత్యుపరతియుక్త ♦ రమణముండు
నేజాడవీక్షింప ♦ నెచ్చుప్రావీణ్యతే ♦ బంధవిశేషము ♦ ల్బరగుచుండు
నేత్రట్టుచూచిన ♦ నెనయుసుహృత్తోష ♦ సరసకృత్యంబులు ♦ జరగుచుండు
సకలజంతుపులిట్టుల ♦ సంతసపడఁ | దాముమాత్రమవ్యగ్రులై ♦ కాముబారిఁ
బడ్డఁదెలియనిహృద్వ్యథ ♦ పట్టితివియ | నెరిగనలేనిమోహాంధ ♦ కారమొదవ. ౧౩౬.

కం. ఓరీశిష్యాయనునొకఁ | డోరాశిష్యాయటంచు ♦ ననునింకొకఁడు
న్నారాజారాయనఁగా | మారాజారాయటనుచు ♦ మాఱుపలికెడిన్. ౧౩౭.

కం. మనమిపుడేడంగలమన | జనపదముననునొయారి ♦ జరగెడిఁగానా
మునుదగువెనుదగునదెయన | ననుఁగొనుననుఁగొనునటంచు ♦ నలిబిలిపడుచున్. ౧౩౮.

సీ. అటుపాటియొకలత ♦ యలరంగఁగన్గొని ♦ చిక్కరాయనిపట్టి ♦ సీయనివిడు
ఇటుపాటిపల్లవ ♦ మ్మేర్పడఁగనిపాణి ♦ గ్రహణంబొనర్పఁగాఁ ♦ గడఁగిరోయు
ఇంకటుపడిపాటి ♦ యిదియధరంబని ♦ బింబఫలమునొక్కి ♦ పిసరునమియు
ఇంకట్టెపడిపాటి ♦ యిదెలికుచస్తని ♦ యనికౌఁగిలించిముం ♦ డ్లంటనొచ్చు
తెన్నుతెలియకయేజాడ ♦ దేనిఁగన్న | సాదృశంబుగనద్దియే ♦ సతిగనెంచి
ముంచుతమకించిగమకించి ♦ మందగించు | పడుచుతాతలుపడరాని ♦ పాట్లుపడుచు.

చం. సరసులఁబద్మపత్రములు ♦ సక్కఁగఁగన్పడఁగాంచియవ్వియా
సరసిజగంధిమోములని ♦ చయ్యనఁబారుచుముద్దువెట్టుకో
బిరబిరనేఁగనీటఁబడి ♦ బెగ్గలమంపమునింగిలేచియా
వరుసమఱెన్నిసార్లొయదె ♦ వారిఁజేసిరెజ్ఞప్తిలేమిచేన్. ౧౪౧.

ఉ. ఎప్పటికప్పుడిద్దఱును ♦ స్వేచ్ఛలనేగుచునుండియుండియొ
క్కప్పటికేదనేనొకఁట ♦ సార్థసమీహితులైనవైరము
ల్మెప్పిరిగొంచుఁబుట్టఁగను ♦ మూపులపిక్కలబాదికొంచునే
చొప్పననోవెసంగిలిసి ♦ చూడుమదేయనిచెప్పికొంద్రటన్. ౧౪౨.

తే. నన్నురమ్మనుచున్నదా ♦ యన్నయన్న । నిన్నుఁగాదురనన్నని ♦ తన్నుఁబఱఁడు
పడిగఁదన్నుచుఁదన్నులు ♦ పడుచుఁబోయి । మావిచివురాడుటఁదెలిసి ♦ మానిరొంద్రు.

కం. ఒకపట్టుననగ మొదలిడఁ । బకపకపకపకయటంచుఁ ♦ బట్టువదలరిం
కొకపట్టుననేడుఁగని । యిఁకనదియేచాలసేపు ♦ హెచ్చింత్రుసదా. ౧౪౪.

కం. కాపీనమేదిరోరీ । బాపఁడయనబాపఁడనుచుఁ ♦ బల్కుఁదెనన్ను
న్నీపలుకాపడతివిన । న్నాపయినీసొందుననుచు ♦ నసఁగనిగ్రుద్దున్. ౧౪౫.

కం. కటిసూత్రంబెటుపోయెర । జటినాజటియుందెనన్ను ♦ సకియవినంగాఁ
గుటిలపడికూడరోయును । వటుకాయనిచెంపపెట్టు ♦ వడిగానేయున్ ౧౪౬.

కం. ఏయొహనోపిలుచుటవిని । యోయనుచునుబరువులెత్తి ♦ యొకకేకియటం
గూయుటయదియనితెలయఁగఁ । బాయకనగిరంతసేపు ♦ భ్రమపాటునకున్. ౧౪౭.

ఆ. గోలయేరయిద్ది ♦ కూయుఝుమ్మనినాఁగ । బాలవచ్చునన్న ♦ యీలరయని
తామునిలువరాదు ♦ దాగుదమనుకొని । పోయిమరలిరామిఁ ♦ బొక్కుచుంద్రు.

చం. పికరవముల్వినంబడఁగ ♦ భీతిలిపాటియెటింగిమానెబా
ధకమిఁకనాకుఁబెండ్లియగు ♦ దానికెమంగళతూర్యఘోషము
ల్సకలజనుల్వినంగననఁ ♦ జయ్యననాకననీకునందువే
సికబరకాయటంచెగిరి ♦ శీఘ్రజముల్వడిఁబట్టికూలనౌ. ౧౪౯..

చం. శుకములపల్కులట్టివిని ♦ చూడఁగనప్పటిశ్రీమతీసఖు
ల్సకియనురోయవత్తువొకొ ♦ సవ్వడిఁగన్ననదేయిటుంటిమేఁ
దికమకపెట్టఁజూతురల ♦ ధీరలువారలమున్నెయుంగుపో
లికననఁగొంతమత్తుడిగె ♦ లేమలవెక్కటిరద్దియాదిశాన్. ౧౫౦

చం. ఇదినిశిచంద్రుఁడుండఁడిపు ♦ డేఁటికిభాస్కరుఁడొప్పుఁదాపమి
ప్పుడమునను న్నొకాఁడదిగో ♦ పడ్డిరామన వెంటఁజక్రమా
మొదలిఁటిమాడ్కి నంచనుఁడు ♦ మున్నలచక్రపుఘోటిపాటుఁజ్ఞ
ప్తిఁదవ్వులఁజిల్కు మత్తుడిగెఁ ♦ దేరఁగఁజిత్తములప్పు డెట్టనన్. ౧౫౧.

వ. అట్లు కామోద్రేకసంజనిత మదోన్మత్తులై యొడలెఱుంగక యున్నెడఁ బోటులు వడం గిడకాశుకారావంబుల నెపంబునఁ దొల్లి యంబరీషాస్థానంబున శ్రీమతీతిరోభావావిర్భావితావేశసమాయుక్త మహారోషంబు నందస్పృష్టీజనంబులు తమ్మాడినదుర్భాషలుంగావించిన యార్భాటంబులును జ్ఞప్తిం దవులుడు నప్పుడొప్పిన యాగొప్పభయోద్రేకంబు మఱలఁగప్పకొనునప్పటికెల్ల నప్పట్టునఁ జొప్పడి ముప్పిరిగొని ముప్పత్రిప్పలం బెట్టుచున్న చెప్పరాని యాచొప్పునుండి యొక్కింత తెప్పరిల్లుడు నప్పట్టుడిగ్గి కొంతమట్టు నెట్టుకొని పోవుటయునట్టి యెడనట్టుల విరహాగ్ని వేదనాతురులగు గుట్టుమాలినచెట్టల మట్టుఁగని పెట్టి పుట్టిముంపనుట్టిపడునట్టి జ్యోత్స్నాప్రభాద్ధతి మట్టడిగొనంగిట్టడి నడియంతకు మున్నయిట్టిట్టనరాని గట్టివాయి చట్టములఘట్టములు దట్టములై బెట్టుడిపి గట్టిమానిపి దిట్టఁదనంబు మట్టుపఱిచి యొకచెట్టచెట్టను బెట్టి యుంచుటంబట్టి ముట్టెలెత్తి యట్టికనుడు సుధాంశుబింబంబు దృగ్గోచరంబగుటయు నయ్యది తమ్ముంభోరుకోలిపిన యయ్యంభోరుహాక్షు నాయుధంబకాఁ దలంచి యత్తీంద్రంబు దానియెత్తిన వేంద్రంబయని నిశ్చయించి యద్దికొద్దికాలంబుమున్న పెద్దగద్దికంబూనిరద్దీనుచు గద్దింపుచు నిద్దంపుపెద్దపద్దున హద్దుమిగిలి కొద్దివికాని సద్దుల తమయొద్దికఁ బాపి బుద్ధిచెరపిన సుద్దులెల్లం దద్దయుం దద్దరపాటుద్ధరింపుచు స్ఫురింపఁడు నమ్మదోన్మాదోద్ధృతు లేయెడఁ బోయెనో ప్రపంచంబు కాన్పింపనైన మత్తుడిగిన మత్స్యపాయులచందంబున కగుపాండికం బొందునడి తమయుండంబులు గనుపు డెందంబులఁ గొందలంబు సందడిపడ. ౧౫౨.

కం. మేనెల్లనొప్పులునుగా | పీనంబులులేకదూళి ♦ పెరిగియుగంటు
ల్కానఁగవచ్చెడిచొప్పులు | నానారదపర్వతులకు ♦ ననుతినించెన్. ౧౫౩.

తే. సరగసటలేచిచనికృత ♦ స్నాతులగుచు | నౌరయీరీతిమనలనో ♦ య్యారముడిపి
చెలుచునట్టిద్రిశ్రీమతీ ♦ చింతనంబె | దానిహేతువుకిష్ణువు ♦ కానవాట. ౧౫౪.

తే. ఏమొనర్తుముమనమని♦యొరియుహృదులఁ | దలఁపనొక్కింతవడికొండు♦తలఁపుగదుర
నారదుండనుబర్వతు ♦ నకుపినంగ | దర్పముప్పొంగఁజేయంగఁ ♦ దలపడంగ ౧౫౫.

ఉ. పోదమువిష్ణుసన్నిధికిఁ ♦ బోయియొకానొకఘోరశాపమా
శ్రీదయితుండు శ్రీమతియుఁ ♦ జెందఁగనిత్తముపుత్త్రమంతనీ
ఖేదదకామచింతనముఁ ♦ గేవలనిష్ఠఁదపంబుఁజేసియా
మోదముఖాకృతుల్మరల ♦ మేలగువైఖరిఁజెందఁగంపమే. ౧౫౬.

చం. అనవుడుఁబర్వతుండనెడి ♦ నచ్చపుమేల్మితలంపుడీనికిం
బనినడజాగొనర్పకుము ♦ పట్టుదలంబవమాడకేగునా
పనిమనుదీర్చియంతటను ♦ పాయకచొప్పనఁజూతమన్న వేఁ
జనిరిమునీశ్వరుల్దనుజ ♦ సంహరుఁజేరఁగభీషణంబుగన్. ౧౫౭.

తే. పోగనేరంపరున్నన ♦ ప్వాలుపుఁగనక | శ్రీమతీదేవికడఁదగఁ ♦ జెలఁగుటకునె
మండిపడునట్లుతమమేను ♦ లుండఁగఁజని | దండిమగఁటిమిహరినార ♦ దుండిటనియె.

## నారదపర్వతులు శ్రీమతీవిష్ణుల శపించుట.

కం. ఔరాదామోదరమ | మ్మోరీతినివ్యథలఁబుచ్చి ♦ యెచ్చినతమితో
నారీమణిసహవర్తివి | గారాజిల్లుదువునీదు ♦ గర్వముపేర్మిన్. ౧౫౯.

సీ. మమ్మిట్టివ్యథఁబెట్టి ♦ సమ్మతినున్నదో ♦ పమ్ముమిమ్మందెడి ♦ సుమ్ముసమ్ము
మాయంబరీషుని ♦ యన్వయంబందీవు ♦ రాజవైపుట్టెదు ♦ తేజమెసఁగ
శ్రీమతితానప్డు ♦ భూమీకుమారియై ♦ నిన్నుఁజేపట్టియు ♦ వన్నెఁగనఁడు
నపుడుమీరువియోగ ♦ మందమాయిప్పటి ♦ దుఃఖంబుఁదెలియనో ♦ దోసగుపాసఁగు
మాయనీయట్లటసురుఁడే ♦ మానినిఁగొన | నందుభయులెడఁబడవ్యథ ♦ యందుఁగాత
మనుచునారదుఁడపుడీర్ష్య ♦ ననఁగనొగిన | పలికెనుతథాస్తటంచును ♦ బర్వతుండు.

కం. ఆమానులశాపమునకు | సామజవరదుండదరక ♦ సర్వజ్ఞుండై
ప్డైమెయినేయదిపలయునో | యామెయినద్దానటంచు ♦ ననికొనుచలరెన్. ౧౬౧.

తే. తాముపచ్చినపనియాడఁ ♦ దక్షణంబ | తీర్చికొనిరేలనటునిల్వఁ ♦ దీవ్రముగనె
లేచిమదిఁగలయట్టియా ♦ లేమయిూహ | పాయఁదత్ప్రతికూలము ♦ ల్వలికికొనుచు.

## అలమునుల పశ్చాత్తాపము.

సీ. ఏలఁబోయితిమిరా ♦ జేంద్రునిచెంతకుఁ ♦ బోతిమివోధర్మ ♦ పుంజములటఁ
బలుకుచుఁగులుకుల ♦ పలుగాకియుక్కాంతఁ ♦ గాంచితిమేఁటికిఁ ♦ గంటిమిసరి
దానిచక్కపుఁదిత్తిఁ ♦ బూనివర్ణించుచు ♦ మించికామించిన ♦ ముంచెమోహ
మేఁటికిద్దంతయు ♦ నేఁటఁబడ్డట్లయ్యె ♦ సాటివారలుసూఁటి ♦ పోటులంద్రు

మేను లెఱుఁగక యంతేటఁ ♦ బూనరాని | కృత్యముల నెల్లఁబడియుప ♦ కీర్తిపాలఁ
బడితిమీమాఁటజగముల ♦ నుడుగ దెపుడుఁ | గాలమిట్టిద్వైమనలఁదాఁ ♦ గాలమూపు

సీ. ఇదిసరిగదమన ♦ మింతయాప్తులమయి ♦ పొల్పుడితిమిపర ♦ స్పరముఁజెఱుప
నిష్కారణంబవ ♦ నీనాథుశపియింపఁ ♦ గనిచక్రమడలింప ♦ గాసిలితిమి
అడవిలోఁబడి వెత్తి ♦ జడులమైపడరాని ♦ పాటులువడితిమి ♦ పాఁటిశక్ర-
చిలుకునజగదీశు ♦ శ్రీనాథుమహనీయు ♦ విక్రముశపియించి ♦ వెతఁబడితిమి
ఇంతకును గారణంబయ్యె ♦ నింతిచింతె | మనలయంతటిఘనులమీ ♦ పనులు సేయఁ
గన్నుగందురె సామాన్య ♦ కాముకులిలఁ | గానఁబగఢాంద్రకునువద్దు ♦ చానతగులు.

కం. మనమేయపయశమందిన | జనులీమనచరిత మెఱిఁగి ♦ సతులభ్రమలెదం
గనకయుఁగొఱగాములకును | జనకయువర్తింత్రుగాత ♦ సర్వంసహపై. ౧౬౫.

తే. ఇంకమనకున్న దురవస్థ ♦ యీవికృతియ | పాయునీయదితగినయు ♦ పాయ మెఱుఁగ
వలయునేమాతులుండను ♦ వావినీవు | నాకుస్వస్రీయుఁడవునట్లె ♦ కాకవినుము.

వ. అనుచు మునునారదుండు మొదలిడనది హృదయరంజకంబగుడుఁబర్వతుండుం దదను
కూలసందర్భంబుల పలుకుటయుఁ బరస్పరాహ్లాదోత్సవ కారణంబుగనుండె నెట్లన.

## మిత్రానుకూల్యాభివర్ణనము.

కం. మిత్రులమైయొండొరుల మ | పాత్రులమై హృదులనొండుఁ ♦ బల్కుటెఁకొండా
శాత్రవధర్మము నెఱపుట | మాత్రమునన యిట్టులయ్యె ♦ మనగతి తెలియక్. ౧౬౮.

ఉ. 'మిత్రుఁడు నైజమానసస ♦ మీహితసర్వశుభార్థభూమియు
స్చైత్రుఁడు స్వాపదోద్ధరణ ♦ శత్రుభయావహకార్యనాశకృ
జ్జైత్రుఁడు సార్వకాలికవి ♦ చారవిషాదమహోత్తమోంబురు
ణ్మిత్రుఁడుఁబాత్రుఁడు న్విమల ♦ మేధఁబవిత్రుఁడు సచ్చరిత్రుఁడౌ. ౧౬౯.

మ. 'తనకార్యంబుఁబరిత్యజించిహితస ♦ త్కార్యంబుఁగావించెడిం
దనయాహ్లాదముకంటెనెచ్చని సుహృ ♦ ద్ధర్షంబుఁదానొందెడిం
దనశోకంబెడఁబాపియాప్తుఁడెటబా ♦ ధంబడ్డఁదానొచ్చెడిం
దనకంటెన్దమినాప్తునెచ్చుగఁగనుం ♦ దామిత్రుఁడిద్ధాత్రిలోన్. ౧౭౦.

మ. తనకేదేనొక మేల్పదార్థమమరం ♦ దానందొకింతేనియుం
గొనిముందాప్తుఁడెటున్న నేగియిడఁగాఁ ♦ గు[illegible]ంబదు[illegible]న్నైగాఁ

దనకష్టాస్పదమేర్పడంగిహితునిం ♦ దాఁదెచ్చి కాన్పింపమిం
గనఁడాలభ్యముపొందికేరుగనినం ♦ గైకోఁడుమిత్రుండిలన్. ౧౭౧.

మ. తమయుంటన్శుభకార్యమైనమునునా ♦ తండుండఁగావించెడిం
దమకిక్కట్టొకవేళ రాఁదొలుతనే ♦ తాఁవానికిందల్పెడి
న్నశ్రమనాకప్పుడతండుపిల్వమునుదా ♦ సాహాయ్యమంజేసెడిం
బ్రెముదంబందెడిఁబ్రాలుమాలఁడుపనిం ♦ బాటింపమిత్రంబనా. ౧౭౨.

తే. మిత్రమనువస్తువీభూమి ♦ మేలిమిగను | గూర్చినట్టివిధాతృని ♦ కుశలతకును
మెచ్చుకొనవచ్చుసన్మార్గ ♦ మిచ్చునద్ది | యెచ్చుదశవచ్చుపనులకు ♦ నెచ్చరించి. ౧౭౩.

కం. కనఁబడనినిత్యవస్తువు | ఘనులకుమూర్తులనెపానఁ ♦ గనవచ్చునటే
కనబడనిసత్యవస్తువు | ఘనులకుమిత్రులనెపానఁ ♦ గనవచ్చునిటే. ౧౭౪.

ఉ. మిత్రుఁడుసాముకాలమున ♦ మీక్షణకార్యముతానచేసియే
మాత్రకొపోవనైనఁదగి ♦ నంతటిచల్లనియండఁగూర్చితా
నాత్రమజీవనప్రదుల ♦ నారసివారలనెచ్చరించియే
మాత్రమురోగియైనఁదన ♦ మన్ననఁదీర్చుచునుండుమిత్రుమైన్. ౧౭౫.

ఉ. బందుగులెందరైనఁదగఁ ♦ బంక్తులుదీర్చురుభోజనంబుల
న్విందులుసక్కఁగానిడమి ♦ నిల్లడికీద్దురుగుప్తసాయముం
బొందఁగడంగిరాఁబిలుసఁ ♦ బోవరుప్రోవరుతామునేవొయి
బ్బందులనందుచున్నటులఁ ♦ బల్కుదురట్టులెమిత్రులెన్నఁగన్ ? ౧౭౬.

ఉ. చుట్టలుపెండ్లిపందిరులఁ ♦ జోఁకెడలేమిగఁజుట్టుకొందురే
పట్టుననైననార్తిగనఁ ♦ బల్వురిదేమనియందురంచుఁదా
మిట్టెయొకప్పుడుట్టిపడి ♦ యేగదరేడకొవంతుతీరెనం
చట్టిడెమిత్రరత్నమిల ♦ నాపదఁబ్రాపయితాపమాపడే ? ౧౭౭.

ఉ. జ్ఞాతులఁజెప్పనేచనదు ♦ జ్ఞానులునజ్ఞులుఁగారువారలే
ప్రీతినిగొల్పనొల్లమిని ♦ బేదగనుండిననీపడింతురే
రీతినొయర్థవంతులుగ ♦ రెక్కొనదప్పుడురీల్గఁబుట్టవా
రాతటిఁదిట్టుచుంద్రశుచి ♦ యంటఁగమిత్రునెవారువోలనా ? ౧౭౮.

కం. చిన్నప్పుడుతలిదండ్రులు | నున్నప్పుడుసతియుఁబుట్టి ♦ యొప్పెడిబిడ్డ
ల్లున్నప్పుడప్పుడనెదరు | మన్ననఁగను నేమనందు ♦ మహిమిత్రుఁడనా. ౧౭౯.

తే. తల్లిమైఁబోషణము చేయుఁ ♦ దలఁగిలిగినఁ | దండ్రిమాడ్కి నిబోధించుఁ ♦ దగవులెల్ల
బిడ్డలట్టులఁబను లెల్లఁ ♦ బ్రీతిఁజేయు | మిత్రరత్నముసరి రారు ♦ ధాత్రి నేరు. ౧౭౦.

కం. అంతటిమిత్రులమైమన | మింతలుసేసికొనఁగనఁగ ♦ నేమనవచ్చు
న్వింతగు నెవ్వరువిన్నను | జింతింపఁగ నేమిఫలము ♦ చేసేతలకై. ౧౭౧.

## ఆమునులు సమయముచేసి తపమున ముఖవికృతులు పాయుట.

తే. ఇంకమన మెక్కుమర్కము ♦ లహృదయములను | దాఁపకుండఁగఁజెప్పికోఁ ♦ దలపడనగు
సమయమిదిదీని మీఱదో ♦ షములుగందు | మని ప్రమాణీకరించిరి ♦ మునులిరువురు.

సీ. ఆత్మశుద్ధిమనల ♦ కయ్యె నిప్పుడుదీన ♦ మదిఁగలుషము మాని ♦ మనఁగనుట నె
ప్రేరకులగువార ♦ లీరీతినైనంతఁ ♦ గర్తయుత్సాహంబు ♦ కలవరపడు
బిగిచెడియాచేత ♦ పెనకువమాలిన ♦ వైవర్ణ్యమదెపోవు ♦ వచ్చినగతి
సంశయాత్ముఁడుచెడు ♦ సత్యనిష్ఠునకెందుఁ ♦ గారాములొదవుట ♦ గలుగఁబోదు
గాననిష్కల్మషాత్ములఁ ♦ గడువిహీంతులఁ | దానకృపఁ గాంచితొల్లిఁటి ♦ యాననములు
మనకుదయసేయచూనఁడు ♦ మాధవుఁడని | యుపశమించిరిమానులు ♦ తపము సేయ.

వ. అల్లది కృతయుగంబు గావునఁ దత్తపంబొక్క సహస్రవర్షపరిమితంబు గానొప్పునప్ప
టికి నప్పద్మలోచనుం డెప్పటియట్ల యొప్పిదంబులగు తమ దేవర్షీశ్వరాస్యంబులు
చొప్పడఁ బ్రసాదింపుడుఁ జరితార్థులగుట నప్పుడు వారటఁ విడిచిలేచి; సృష్టిస్థితి
ప్రళయకర్తలగు త్రిమూర్తులసేవించుచు, వర్ణాశ్రమాచారపాలనకర్తలగు చక్రవర్తుల
దీవించుచు, జగదుపకారక క్రియాకర్తలగు స్మృతికర్తలసంభాషించుచు, యథేచ్ఛా
విహారంబులఁ జతుర్దశభువనసంచారంబుగావించుచు, నుండనయ్యె. ౧౭౪.

## కన్యాదానమహిమ వర్ణన.

కం. ఆయంబరీషభూపతి | శ్రీయుతునకునర్పణముగఁ ♦ జేసినతపమిం
కాయెన్న రానిజన్నము | లేయెన్నికవబలహారికి ♦ నిచ్చినదెచ్చున్. ౧౭౫.

తే. తపముజపమును జేసినఁ ♦ దానొకండ | పుణ్యపదవిని జొరఁగాంచుఁ ♦ బూతుఁడనుచుఁ
గన్యకాదాన మొనరించు ♦ ఘనుఁడతండు | మును వెనుకఁ జెరిపదుగురఁ ♦ దనను జొనుపు.

వ. కన్నియ తాత్కాలికమనోహారిణియకాక సార్వకాలికోపయోగకరప్రజావృద్ధికార
ణభూతయగుటం బూరుషులకెల్లరకును సోత్సాహగ్రాహ్యయ యగు కన్యావైశిష్ట్య
విచారణంబున, సద్భ్రాతృకతఁ బరిగ్రహానుకూలగను సౌకులీన్యంబునఁ బూనసత్త్వవ

ర్తినిగను సౌరూప్యంబున మానసోత్సాహకారిణిగను సౌగుణ్యంబున నైహికాముష్మికాఖిల సత్సంపత్సమృద్ధిసంధాయినిగను గనుట తల్లక్షణవేత్తలకెల్లరకుం దెల్లంబ. శ్రీమతీసతీరత్నంబు నెడ నిన్నిగౌణంబులు వన్నియకెక్కి. మిన్నగానున్నవగుట నవర్ణనీయయయ్యె సాధారణ కన్యాదానఫలవిమర్శనంబున దాతనిజవంశపూర్వదశకంబునుం బరదశకంబునుం దానుంగూడ నిర్వదొకరు పురుషులకుఁదరింపను బుణ్యలోకంబునఁజరింపను ఫలమార్జించునాఁ బ్రసిద్ధంబయితగును. అమ్మహాపురుషునకొసంగిన యిమ్మహిత కన్యాప్రదానంబు మహనీయంబై యహీనానారత పరసుఖావహం బలవంశజులకెల్లరకు నెల్లెడలంగాఁజెల్లునన్న నొల్లబొటుసంభవిల్లునె! అల్లదియేకారణంబుగ నటఁ బ్రభవిల్లిన రాజన్యులెల్లను దల్లక్ష్మీకాంతసాయుజ్యంబు నందగలవారలయిరందు. ౧౮౭.

ఉ. అప్పటికంబరీషనృపుఁ ♦ డల్లన రాజ్య సుఖంబులందిపెం
పొప్పిన యౌవనాశ్వునల ♦ యుత్తమసద్గుణ రత్నరోహణుఁ
నెప్పుగనంగఁ డిచ్చితగ ♦ మేదినిఁగూర్చి విధాయకంబులం
జెప్పిమురాసురారికడఁ ♦ జెందెను ముందుగనంత సైక్యముల్ ౧౮౮.

## శ్రీమతి శ్రీరమయందైక్యమగుట.

కం. శ్రీమతియన శ్రీ సతియన | నామములభారతులనంగ ♦ జరగెడునాయా
శ్రీమహితరూపములఁగన | నామెజలిఁటి ప్రకృతికాంచు ♦ నాకృతులెకదా ౧౮౯.

తే. అవతరించిన పనియయ్యె ♦ నరయఁగాన | శ్రీమతీతేజమొక్కటఁ ♦ జిత్రముగను
శ్రీసతీ తేజమునఁజేరెఁ ♦ జెల్వుమీఱ | గారడిగనుండెఁదెలియని ♦ వారికిద్ది ౧౯౦.

సీ. అరయఁబ్రపంచను ♦ ద్దంతయునయ్యెడి ♦ నొక్కటఁదుదిఁజేరు ♦ నొక్కఁటనది
కార్యసందర్భంబు ♦ గలిగినయపుడెల్లఁ ♦ బుట్టెడినందొండు ♦ పొలియునాడఁ
గార్యాంతమైనను ♦ గాదెధర్మంబిది ♦ కార్యసంఘటనకుఁ ♦ గారణమది
దానికారణమును ♦ తలఁచినఁదోపమి ♦ నదియెల్లలీలయం ♦ చంద్రబుధులు
మాయయీయదెఱుంగును ♦ పాయమెట్లు | తెలియునదియేడమన మేడఁ ♦ దివురుకేడ
నెట్టుతానుబిపీలిక ♦ యెఱుఁగఁగలదు | గ్రామసృష్ట్యాదులంతయే ♦ కాదెవనకుఁ ౧౯౧.

కం. అనివాహపలూరుతనయుఁడు | మునివరులకుఁజెప్పవారు ♦ మోదముఁగనుచుం
దనియని మదినవ్వలికథ | వినఁగోరుచు నిట్టులనిరి ♦ వేడుకమీఱన్ ౧౯౨.

ఉ. ఓమునిచంద్రవింటివిమ ♦ హోత్తమధర్మములట్టివింతలు
న్ధీమసమొప్పునీపలుకు ♦ దీటునుబోటికినెక్కఁజేయుఁ శ్రీ
రామునునారదుండెపుడు ♦ రాయిడిగా శపియించెఁజెప్పవే
యామునిగానవేత్తయయి ♦ యాస్తతఁగన్నవిధంబు కూడఁగన్ ౧౯౩.

వ. అని సవినయంబుగా నడుగుటయు ౧౯౪.

---

మందాక్రాంత. శ్రీరామేశాంబుజజవినుతా ♦ చిన్మయాలోకనేతా
మారప్రాణాంతకగిరిసుతా ♦ మంజువాణీసమేతా
ధీరానేకాసురహరహరా ♦ దీప్తనాగేంద్రహారా
సూరేంద్వగ్నీక్షణశుభకరా ♦ సూక్తిపీఠీవిహారా ౧౯౫.

భుజంగ. పురక్రవ్యభుగ్ఘార ♦ భూభృద్విహారా
శరచ్చంద్రికాకార ♦ సత్కీర్తిపూరా
సురానీకమందార ♦ శుద్ధప్రచారా
సరిన్నాథగంభీర ♦ స్వర్ణాద్రిధీరా ౧౯౬.

పణవ. హీరాకారయ ♦ హితసంహారా | హేరంబాంకసు ♦ హితమందారా
సారాధారవి ♦ నయదాశూరా | కారుణ్యామృత ♦ కలితోదారా ౧౯౭.

ఇది శ్రీమన్మేధా దక్షిణామూర్తీశ్వరాక్షీణ వరప్రసాద లబ్ధకవితా భాగధేయ
నాదెళ్లపురుషోత్తమ నామధేయ బుధవిధేయ ప్రణీతంబైన
శ్రీమదద్భుతోత్తర రామాయణంబున
ద్వితీయాశ్వాసము.

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

## తృతీయాశ్వాసము.

కం. శ్రీమహితగానలోలా । సామజదనుజేంద్రకాల ♦ సత్త్వసుశీలా
సోమేశ్వరదిక్పాలా । ధీమజ్జనకల్పసాల ♦ త్రిభువనపాలా. ౧.

వ. అవధరింపుము మహనీయతేజోవిభవగరిష్ఠుండగు నావాల్మీకమహర్షి శ్రేష్ఠుండు కోరం
బడిన కథావిధానంబు సాకల్యంబుగఁ జెప్పఁబూని యామునులకిట్లనియె. ౨.

### చతుర్యుగ వర్ణనము.

తే. ధర్మమారయనాల్గుపా ♦ దములనడవ । సత్త్వమొక్కండపరిపూర్తి ♦ జరగుచుండ
విపులతమమయివెలసిన ♦ విప్రయుగము । కృతముగీర్వాణమానిమ ♦ హితముకడచె.

తే. ధర్మమంతటఁబాదోన ♦ దశనుబొంద । సత్త్వరాజసములుఁగూడు ♦ సరణియొప్పఁ
గలిగిదీర్ఘంబుగాఁదగు ♦ క్షాత్రయుగము । త్రేతయవనీశతాపసో ♦ పేతయిదియ. ౪.

తే. ధర్మమర్థమతగునాయ ♦ ధర్మమట్టు । రాజసంబునుదమముఁనా ♦ దేజమెసఁగ
వచ్చుహ్రస్వంబయగుచును ♦ వైశ్యయుగము । ద్వాపరమునరతద్వర ♦ ప్రాపకమయి.

తే. ధర్మమొకపాదమేకాన ♦ ధర్మమెచ్చఁ । దమముకేవలమైసర్వ ♦ సమతమీఱఁ
జూడఁగడుహ్రస్వమేయగు ♦ శూద్రయుగము । కలిమదోద్ధతమర్త్యసం ♦ కలితమవల.

తే. తలఁగెఁగృతమునఁబూర్వాహ్ణ ♦ త్రాంతమెల్లఁ । ద్రేతయేతెంచియొకకొంత ♦ తీరఁబిదప
నొక్కటఁబొసంగినైనట్టి ♦ చక్కటియిది । దీనిఁదలిపెదవినుఁడుసం ♦ దేహముడుగు.

### కళింగదేశాంచిత కుశస్థలీగ్రామాభివర్ణనము.

చం. కలదుఃకళింగదేశమునఁ ♦ గానొకరాష్ట్రముసౌఖ్యమోదసం
కలితములౌమహానదులు ♦ కాననముల్సరసుల్పొలంబులు
న్ఫలదములైనవృక్షములుఁ ♦ బాడికిఁబొటునకైనజంతవు
ల్కలకలలాడుమర్త్యతతి ♦ క్రాలెడిపల్లెలుపట్టణంబులున్. ౮.

శా. విస్తీర్ణంబయియొప్పుదేశమదియౌ ♦ విధ్వస్తకాలంబుల
న్విస్తారంబుగఁగాల్యలక్షణములు ♦ ద్వేగాపనోదంబులై

నిస్తంద్రంబులుకాఁడిపంటలిడఁగ ♦ న్నిష్కాముతోమానవు
ల్కస్త్రప్రాభవమొప్పఁదప్పతియుస్వే ♦ చ్ఛాకృత్తినర్తింపనో. ౯.

చం. కలమకుశస్థలంబననొ ♦ కానొకపల్లెకళింగదేశమం
దెలమినిదప్పిదేశమున ♦ నేర్పడుజంతుతతుల్వహింపఁగా
వలనగునట్టియొప్పిదము ♦ నావిరిగాఁగలదాడఁజూడవం
దలకోలఁదుల్లదాతరులు ♦ దార్ఢ్యముతోగృహముల్వసింపఁగన్. ౧౦.

చం. అటఁగలతాళభూజములు ♦ హాళిఁగనుంగొనమున్నుశంకరుం
డటులనులింగమూర్తియయి ♦ యేపునముజ్జగముత్తరించెనో
యటులనెపోవమంచెదుగ ♦ నాపనెఖేచరపంక్తివానిబ
ల్విటముగఁద్రొక్కికావలికిఁ ♦ దీరికరేలవసించువానిపై. ౧౧.

ఉ. చూడఁగనారికేళములు ♦ చొచ్చుకొనుంగదమేఘమండలిం
దోడుగఁదాళవృక్షముల ♦ దొడ్డతనంబునహింతమంఘనా
కూడికదెట్టిలున్ననొన ♦ గూడుజలంబుఫలంబులందటం
గూడునెమబ్బులంజొరమిఁ ♦ గోలడమానిదియేరుకాదనన్. ౧౨.

ఉ. పూరకుతైసిగిల్విలియఁ ♦ బోసియొనర్తురునిత్యనిత్తపం
బారయరెండకానలన ♦ హోయివెమేనులుడిప్పలేర్పడె
నీవ్వరుదిగంబరుల్నిలిచి ♦ వెఱ్ఱులమైఁగనుపింత్రునాఁగఖ
ర్జూరములీతలుంగలవు ♦ చూపఱులెంతయుఁజోద్యమందఁగన్. ౧౩.

చం. తగునటఁదింత్రిణీతరువి ♦ తానముమేఘసమూహమట్టగుం
ఫుగమటిపెంపుగానెదిగి ♦ భూరిభయాస్పదమంతరంబుగా
నొగిదిగతాల్చుచిన్కులన ♦ నొక్కటరాలెడి యాకులొప్పఁబొం
దుఁగనఁగసారవంతముల ♦ తుల్యతనొఘనముల్వచింపఁగాన్. ౧౪.

సీ. అచటిన్యగ్రోధంబు ♦ లమరినయూడల ♦ నొక్కొక్కటియపెక్కు ♦ లెక్కకుఁదగు
అశ్వత్థవృక్షము ♦ ల్హసనీయసమిధల ♦ నిచ్చుఁగానఁబొగడ్త ♦ నెచ్చుగఁదగు
నింబతోనారోగ్య ♦ దంబులుకూదము ♦ ల్పెద్దపూవెన్నెల ♦ యొద్దికఁదగు
చూతకపిత్థాదు ♦ లౌత్స్నతరబడి ♦ ఫలవృక్షములుచాల ♦ బలిమిగఁదగు
ఎపుడుకాంచినసస్యంబు ♦ లెవ్వియైన । జాలనుపయుక్తములునుడా ♦ త్కాలికములు
చెలఁగుచుండెడిపంటభూ ♦ ములునుదనరు । వన్నెకెక్కినయానేల ♦ వాసిచాలగ౧౫.

ఆ. అచటనొప్పుచుండు ♦ నాజలాశయములు । వాగులిఁకనుగాలు ♦ వలుఁదటాక
ములునులోనిసికత ♦ మునుక్షీరసదృశంబు । నమలజలమునిండ ♦ నమరియుండ ౧౬.

కం. వానితటంబులనలరుచుఁ । గోనలఁదళుకొప్పుచుండఁ ♦ గుశయసదృశమా
దానంజేసియు కాదే । దానిఁగుశస్థలియటంద్రు ♦ ధాత్రీజనముల్. ౧౭.

కం. అలగ్రామసదనములువ । న్నెలఁజిన్నెలఁదీరియుండు ♦ నిత్యోత్సాహం
బులుగనువసతినొసంగుచుఁ । జలతృణసస్యాప్తినిఁబశు ♦ సమితియమితమా. ౧౮.

చం. అమరెనయిక్షుయావరణ ♦ లక్కడఁజూచినఁజూఁపు మేర గాఁ
గమమురుగోపలాపువల ♦ కైయట నేర్పడలో ప్రదేశమం
దమితమనోహరంబులుగ ♦ నయ్యయిత్రీ వెలకాలవాలము
ల్క్రమముగఁబండిరుల్కదురఁ ♦ గాయలుశాకములీనుమూలముల్. ౧౯.

ఉ. బోదెలుకట్టినీరిడఁగఁ ♦ బూచెడికాచెడిమోకలన్నియు
న్స్వాదుఫలప్రదంబులును ♦ స్వస్తికరప్రసవప్రదంబులౌ
మాదిరిఁజూడమోహపడి ♦ మక్కువనక్కడనిల్చువారికి
న్స్వాదమునీరుఁదోఁపదల ♦ చక్కఁదనంబునఁదన్వితీరుటన్. ౨౦.

తే. ఇల్లుగప్పినయిండ్లురం ♦ జిల్లునొకటఁ । దాళపర్ణాన్వితములయి ♦ తనరుఁగొన్ని
ముంగిటంగలతిన్నెల ♦ ముగ్గులలరఁ । బసులకొట్టంబుతెదుటను ♦ బ్రబలియుండు ౨౧.

ఉ. తిన్నని శృంగముల్గలిగి ♦ తీరినరంగుమెఱుంగులీనఁగా
నున్నని మేనులొప్పఁగమ ♦ హోపకృతింగను నేలుసాముతా
మన్ననఁదమ్ముఁబ్రోవఁగను ♦ మార్గానకేరినిగర్వసంపద్ధం
గన్నవిగోగణంబులటఁ ♦ గ్రాలుఁబెరల్తగ గ్రామ్యజంతువుల్. ౨౨.

కం. అదియగ్రహారమగుటను । సదయులు షట్ఛాస్త్రవిదులు ♦ త్స్మార్తగీర్వాణు
ల్మదమునఁబెక్కండ్రుందురు । కోదువకులంబులజనంబు ♦ కొఱతగనుండున్. ౨౩.

చం. అటఁగల్గవిప్రులెల్లెడల ♦ హాళిఁబఠింపఁగవిన్కిగల్గన
చ్చటఁగలకీరశారికలై ♦ సామముబుక్కుయజుస్సుసూత్రము
ల్దిటమగు శాస్త్రచర్చలకు ♦ దీటగులక్షణ తర్కవాక్యముల్
స్ఫుటతరధోరణింబలుకు ♦ సూరులువారలపేర్మియేమనన్. ౨౪.

చం. ఇఁకఁగలసర్వవర్ణముల ♦ యెల్లరువారికి భృత్యులౌటసా
త్వికులయిధర్మకాల్వినఁగఁ ♦ దెల్వియెసంగుటనైజధర్మము

ల్సకరముగానొనర్చుచును ♦ శోభిలుచుండ్రుసమస్తసంపద
ల్సకలసుఖావహంబులయి ♦ సంతసపుచ్చఁగవింతయొచ్చఁగన్. ౨౭.

ఉ. ఊరనుజూడవేడుకగు ♦ నోరిమిధారుణికీడువచ్చుసా
ధ్వీరమణీమణుల్మహిత ♦ దేహవిలాసములంబరంబుల
న్దూటిచిమోములెత్తకయ ♦ దుస్త్యజభర్తృవిధేయతేసదా
చారముగావహింత్రువినఁ ♦ జాలకువాక్కులవెట్లొయెన్నఁగన్. ౨౮.

## కౌశికుడనుహరిభక్తుని వృత్తాంతము.

తే. ఇట్టిపొందికలమరిన ♦ యట్టియూరఁ | గలఁడొకానొకవిప్రుండు ♦ కౌశికుఁడన
సత్వసంపన్నుఁడాతండు ♦ సత్యవాది | పరమభక్తుఁడుసుహితుండు ♦ బ్రహ్మవేది.

సీ. చిన్ననాఁటంగోలె ♦ శ్రీనాథపదపద్మ ♦ చింతనఁబలుమారు ♦ చేయుచుండు
ఆడఁగాఁగూడిన ♦ యర్భకులనుజేర్చి ♦ పాడించుఁదాఁబాడుఁ ♦ బలుపదములు
గూడొండమర్చియా ♦ గూఁటదివ్వెఁదనర్చి ♦ భజనచేయుచునూర ♦ బయలువెడలు
భయములజ్జయులేక ♦ భక్తిచేనలవడ ♦ నెంతెంతలయినను ♦ వింతఁబాడు
ఋగ్యజుస్సులునేరిచె ♦ ఋజువిధమున | సామవేదంబుఁదనపాట ♦ సరణినేర్చి
బహువిధంబులనెల్లెడఁ ♦ బాడునదియు | వింతలయలనుజెలువొందు ♦ వృత్తములును.

ఆ. చిన్ననాఁడెతన్నుఁ ♦ గన్నవారలుతీఱ | నెన్నదిక్కుమాలి ♦ యున్ననతని
కన్నినన్నియలును ♦ దిన్నఁదనంబున | మిన్నలగుచుఁబ్రబలె ♦ వెన్నునిదయ. ౨౯.

కం. భిక్షాశ్రమముననటఁదగి | భిక్షించుచుదొరకినంత ♦ భిక్షయెచటనో
భక్షించుచునట్టట్టులఁ | గుక్షింభరణంబుఁజేసి ♦ కొనుచుండునటన్. 3౦.

కం. ఆయెడనిలులేదతనికి | మాయింటికిరమ్మురమ్ము ♦ మాయింటికిటం
చాయూరివారలందఱుఁ | జేయఁగనాహ్వానమతఁడు ♦ సేరుచునుండున్. 3౧.

తే. పాడఁబాడంగగానంబు ♦ పటిమఁజెందు | నన్నలోకోక్తికీతండు ♦ వన్నెవెట్టె
నేర్పునారలలేరెట్లొ ♦ నేర్పరియయి | తీర్పుతాఁజేయుఁబేర్వడ్డ ♦ తీర్పరులను. 3౨.

కం. గానంబుకవిత్వంబును | దానంబునుశూరతయును ♦ దత్తత్కర్మో
చ్ఛానఫలంబునఁబ్రాప్తము | లౌనైసర్గికములగుచు ♦ నలవడఁదగునే. 33.

ఆ. మిగులగష్టసాధ్య ♦ మగునెల్లరకువేద్య | మింతొయంతొదాని ♦ కంతులేమి
కవులువైద్యులింక ♦ గాయకుల్వేదాంతు | లెందఱుండ్రులెక్క ♦ లెందుఁగంద్రు ?

క. ఆతఁడు గాయకుఁడనఁగా । ఖ్యాతినిబడ్డాఁడెకాని ♦ కలతెలుఁగుఁగన
న్గో తెలిఁగినభక్తుండయి । యాతరబడిపొందికఁబగ ♦ నాసక్తుఁడగున్. ౩౫.

సీ. కానవాతఁడుమస్త ♦ కంబునాడింపఁడు ♦ ఘాలంబుమడుతలు ♦ పడఁగనీఁడు
వదనమందింతయు ♦ వైవర్ణ్యమొదవింపఁ ♦ డెపమచేఁజెవిమూత ♦ కిడఁగఁబోఁడు
ఇట్టట్టుకుదులుచు ♦ నిక్కిలేచిపడండు ♦ గేలుసాచుచు నేదో ♦ తోలఁబోఁడు
వన్నెవారలఁగన్న ♦ మిన్నగాఁగులుకఁడు ♦ మెచ్చుకోఁబడఁగోరి ♦ పెచ్చువోఁడు
వలయుగమనికల్లనా ♦ గళమెక నెడిఁ । జేతులాతాళనాదంబె ♦ ప్రీతిపడెడి
ఆననంబల్లయానంద ♦ మాదుకొనెడిఁ । జిత్తమాహరిపాదంబు ♦ చెంతఁదగెడి. ౩౬.

అలభక్తుని పద్మాక్షుండను విప్రుఁడాదరించి నిలుపుట.

క. ఆతనిపాటయుభక్తియు । ఖ్యాతిఁగన మెచ్చికొనుచుఁ ♦ బద్మాక్షుండన్
క్ష్మాతలదేవుండొక్కఁడు । చేతస్సంప్రీతినింటఁ ♦ జేరిచికొనియెన్. ౩౭.

తే. తగినమర్యాదనాతనిఁ ♦ దనుపుచుండి । భజనమందిరమొక్కండు ♦ పరగఁజేయ
నచ్చటుండగియొంతేని ♦ ముచ్చటపడి । గానమొనరించుఁబద్మాక్షు ♦ వీనులలర. ౩౮.

చ. కనియదియంతబ్రాహ్మణుఁడొ ♦ కండుమదంబునఁగన్నెమిన్నని
చ్చినను గృహస్థుఁడైతనదు ♦ చింతెమటింతగసంతరింపనా
వనజదళాక్షిమాలతిల ♦ నంబునవీడనివిన్కికల్మిఁదాఁ
బనుపడిభక్తునై గృహము ♦ బాగొనరించియలంకరించుచున్. ౩౯.

ఉ. చాలఁజమత్కృతుల్వనినె ♦ సరగఘుటించుచువిగ్రహంబుల
స్లీలనలంకరించికడు ♦ లెస్సపెలుయల్లనుపట్టఁజేయనా
లోలతభక్తుఁడుబ్బుగొన ♦ లోకులుమెచ్చుచుఁబల్కుచుందురీ
మాలతిఁగౌశికాఖ్యునకు ♦ మానినియైనదెవోద్యమంచటన్. ౪౦.

తే. బ్రాహ్మణాద్యర్భకులుభక్తి ♦ పటిమఁదెలియ । గానకాంక్షమశుశ్రూషఁ ♦ బూనిచేయ
వచ్చిరితరస్థలంబుల ♦ వారుడాయ । నెల్లరకుఁబెట్టుఁబద్మాక్షు ♦ డల్లదాయః ౪౧.

మాలతీపతియగు కౌశికుడు శిష్యులతో హరిభజించుట.

సీ. కౌశికుండెల్లెడ ♦ ఘనగానమొనరించు ♦ భక్తినెల్లరుఁజొక్క ♦ పరవశులుగ
మాలతిపీఠంబు ♦ సాలంకృతముఁజేసి ♦ యాలించుఁబతివాడ ♦ లోలతఁగను
శిష్యులతో నరణివ ♦ శిష్టగౌతమముఖు ♦ లురిబాడుచుందురు ♦ గురుఁడుమురియ
ఆమశస్థశ్వాసు ♦ లానందమగ్నులై ♦ యన్నపానంబుల ♦ యాస్థఁగనరు

అదియె వైకుంఠముగ నుబ ♦ ద్మాక్షుఁడలరి | కనుచు వినుచుఁ బ్రహర్షాబ్ధి ♦ మునుకలిడుచు
నెల్లసమకూర్చి రేపగ ♦ ల్లిందఱకును | షడ్రసోపేతభోజన ♦ సౌఖ్యమొసఁగు. ౪౨.

మ. ఒకమాఱచ్చట వైష్ణవవ్రతదినం ♦ బొడ్డేదొ రాఁగాఁచిరయో
న్నికగా నెల్లరుఁ గానవత్తురనిత ♦ న్నిష్టందదాగారసా
ధకశిష్యావళిగానముల్సలుపఁగాఁ ♦ దాబాడుచున్వించుఁగా
శికభక్తుండతిమోదసంభరితుఁడై ♦ శిష్యాళిఁబల్కించుచున్. ౪౩.

మానిని. శ్రీరమణీయమనోహరవిగ్రహ ♦ శ్రీరమణీహృదయాంతరగా
సారసమిత్రసుధాకరలోచన ♦ సారసనాభఖగేశ్వరగా
భూరిమదోద్యమదానవసంహర ♦ భూరిమహీధరధీరహరీ
కారణమూర్తిచరాచరసృజ్జన ♦ కారణవైరిమదేభహరీ. ౪౪.

భాస్కర. కామజనకబుధకల్పకరారా ♦ కామితమొసఁగుచుగతిఁగనుఁగోరా
సామజబహుళవిషాదనివారా ♦ సాధుభయదదితితనయవిదారా
పామరహితజనపాపవిదూరా ♦ పావనశుభకరజలధిగభీరా
నామముఁబల్కెదనన్గనవేరా ♦ నమ్మినదయగనునగసమధీరా. ౪౫,

తురోగ్వజ. సదమలపరిపూర్ణ ♦ సత్కృపాధామ ♦ సదృశమునీకేది ♦ జగదభిరామ
పదభవగంగాంబు ♦ పరిప్లుతభూమ ♦ పదగులుదిక్పతు ♦ ల్ప్రవిమలనామ
మదనకోటివిలాస ♦ మణిమాలలామ ♦ మధుకైటభాదిదు ♦ ర్మత్తవిరామ
సుదకునీవేగతి ♦ సూరిసుత్రామ ♦ సుధసురాళికిడితి ♦ సూపరంధామ. ౪౬.

లయగ్రాహి. నిక్కముగనీ వెతగు ♦ దిక్కనుచునమ్మితిమి ♦
తక్కవగఁజూడకుము ♦ దక్కితిమటంచు |
న్నక్కఢమతిక్కడను ♦ జక్కనిపురాణములఁ ♦
బెక్కుకథలన్వినఁగఁ ♦ జొక్కరహిమించు |
న్మక్కువభవత్పదము ♦ చిక్కహృదిమన్యమున ♦
నెక్కొలుపుచుండుమట ♦ ద్రుక్కులునసించు |
న్వాక్కులనునీస్మరణే ♦ తక్కకొనరించుమము ♦
నక్కటికమారఁగను ♦ చిక్కులునశించున్. ౪౭.

మంగళమహాశ్రీ. మంగళముగైకొనుము ♦ మందరనగోద్ధరణ ♦ మాహృదయసారసనివాసా
రంగదసమాచ్ఛమణి ♦ రమ్యకనకాంగదవి ♦ రాజితభుజాంచితసువాసా

సంగరపటిష్ఠశివ ♦ సన్నుతజయాంకనిజ ♦ చక్రహతదైత్యబహుదాసా
మంగళముమాకొసఁగి ♦ మమ్ముదయనేలగదె ♦ మాన్యశశికాంతిసమహాసా. ౪౭.

కం. అనియిట్లు భజనసేయఁగ । వినసైనకళింగరాజు ♦ విస్మితుఁడగుచా
వనితానెన్నఁడుఁగనమిని । మనముననభిలాషపొడమ ♦ మాటగననియెన్. ౪౮.

## కళింగరాజా కౌశికుం దనయాస్థానగాయకుఁగమ్మనుట.

వ. అట్లు నిత్యనియామక భజనంబు సలుపుచుండ నానాఁటికానీఁటికి విచ్చేసిన కళింగ దేశాధీశ్వరుండు గ్రామస్థగ్రామణులప్రోత్సాహంబున నాభజనమందిరాలంకారంబుగ ననుపమభక్తజనగానసై పుణ్యంబువినను దద్దేవాగారాంగణంబున విడిసియు నద్దేవ సంకీర్తనశ్రవణంబున నానందంబువడసియు నల్లజగన్నాధునట్ల జననాధుండగు తానును పూజ్యంబులగు నృత్యవైచిత్ర్యంబులఁ గీర్తింపఁబడన పేక్షించి తదర్థంబువారినెల్లరం దన యాస్థానగాయకులుగ నెలకొనుండనియుఁ దనపోష్యంబున నెగడుండనియుఁ దన్నుఁ బాయుండనియు నెయ్యెచ్చరింపఁగ నిట్లనియె. ౫౦.

ఉ. మీరలు గాయకోత్తములు ♦ మేఁటులు పాటికి నెక్కు భక్తిని
యూరనుబర్ణశాలఁదగ ♦ నొద్దికదేరికిఁగానుపించు వే
సారపరంతయోదొరకు ♦ సాదముమాత్రమె కాదెయిచ్చుట
న్భూరిమయాలయంబులును ♦ భూపలొసంగుదునన్నుఁజేరరే. ౫౧.

శా. మాయాస్థానమునందు గాయకులరై ♦ మాకీర్తనంబుంపుచుం
బాయుక్రానిమహాసుఖంబుఁగనఁగాఁ ♦ బాటింత్రు గాదే సదా
మీయానేర్పులువన్నెకెక్కు గరిమ ♦ న్నిమ్మంద యింత్రప్పుడీ
హేయంపుఁగతిపాయువేగనిపుడే ♦ యేతేరనాతోననన్. ౫౨.

## భక్తుఁడు సంపదలు వినరించి గర్వింపఁగూడదని తగవుతెలుపుట.

ఆ. నగుచుఁగౌశికుండు ♦ నరనాధుతోననుఁ । రాజవీవు మేము ♦ భూజనులము
మేముకోరికోరఁగ ♦ నీమాటలాపైవి । సామిలేమికామి ♦ రామశేమము. ౫౩.

కం. నందలకోట్లకొలందిగ । నుందురుధరజనులు లెక్క ♦ కొక్కఁడనసే
నందనుకోనసుత్తముఁడను । సంపనములు వానికిడఁగ ♦ వచ్చుఁబెరనరుల్. ౫౪.

తే. ఎద్దియేనొక్కసంపదఁ ♦ బెద్దఁజనముఁ । గన్నమాత్రానమితిమీఱు ♦ పన్నెకగునె
అలినేలినజగమేలఁ ♦ జాలునెకట । కోరఁగారాదుకొఱగాని ♦ కోర్కెలెపుడు. ౫౫.

క॥ కొదువంగనకే దేసం । పదఁ గాంచినవారిఁ గూడఁ ♦ బాటింపక సం
పదతన దేహనమనుకొన । మదుఁ డెందురువాని నేరు ♦ మన్నింపరిలన్. ౫౬.

సీ. పూర్వకృతంబగు ♦ పుణ్యంబులెక్కను ♦ దగినసంపదకల్గు ♦ ధరజనులకు
సుందరులగుచును ♦ జూడసొంపుగనుందు ♦ రారోగ్యవంతులై ♦ యలరుచుంద్రు
బలమెసంగశరీర ♦ పాటవంబునుగంద్రు ♦ విరివిగాఁదగుపశు ♦ వృద్ధిఁగంద్రు
సంతతమలరారు ♦ సంతతిఁగందురు ♦ బహుధాన్యసంపత్తిఁ ♦ బ్రబలియుంద్రు
సుందరాంగులుదరికొన్న ♦ సుఖముగంద్రు । అన్నియొనగూర్చుబలఁగము ♦ నమరియుంద్రు
తనరఁగాఁ జేసికొనఁగల్గు ♦ ధనముగంద్రు । పరగఁజేసెడిధారుణీ ♦ శ్వరతఁగంద్రు. ౫౭.

సీ. అలపూర్వపుణ్యమే ♦ యతిశయించినదానఁ ♦ జనువరులగుదురు ♦ గదధరణిని
భాషలెన్నియొ నేర్చి ♦ పల్కుచుండెదరవి ♦ పదములఁదప్పది ♦ ద్దదరువలుక
కాదన్న దోసన ♦ వాదంబు నేతురు ♦ కానున్న దియుఁ దెల్పఁ ♦ గల్గుచుంద్రు
శారీరతత్త్వము ♦ ల్సక్కనేయఁగగంద్రు ♦ కులవృత్తివిద్యలం ♦ గుదురుగంద్రు
గాననిపుణతఁగందురు ♦ కవులగుదురు । బహ్వలంకారశబ్దార్థ ♦ పటిమఁగంద్రు
అలరసంబులఁగంద్రుర ♦ హాస్యములను । ఫలితమెఱుఁగుచుజ్ఞానులౌ ♦ పథముఁగంద్రు.

క॥ మొదటిపిసామాన్యంబులు । విదపవియెన్ని కనటంచుఁ ♦ బేర్కొనఁబడఁగా
నొదవెడితరబడిఁదెలిసెడిఁ । గదరాణించుటను దెలియుఁ ♦ గాదె మహీశా. ౫౯.

క॥ ఘనకాంక్షఁగొండతిందుల । ధనవంతులభూమిపతుల ♦ దగ్గరఁదగమీ
ఘనికావనీశులుబ్బుచు । మనమేబలుమగలమనుట ♦ మర్యాదే నే ? ౬౦.

క॥ ఏసంపదఁదాఁగోరిన । నాసంపదకల్గువాని ♦ యాచించుఁగదా
ఏసంపదఁదాఁగోరమి । నాసంపదలిచ్చువాని ♦ యాచించుసదా. ౬౧.

తే. తనకుఁగలిగినసంపద ♦ ధర్మనియతి । ననుభవించుచుఁదారక ♦ మందకనఁగఁ
గోరువారలకద్దితా ♦ నూరకిచ్చి । మాఱుఁగోరమిఁబైజన్మ ♦ మహితుఁడగును ౬౨.

ఉ. అట్టిలఁగాకసంపదల ♦ నమ్మినయట్టిలోకళ్లకిచ్చితా
మట్టులెవారివందుకొన ♦ హాయిజగంబునఁగాంచునింతఁబోఁ
గొట్టుకొనంగిదాహరము ♦ కోరెనరాదికనెన్ని భంగులం
బట్టదికేమిసంపదయు ♦ భావిభవంబునఁబున్నె మొప్పమిన్. ౬౩.

## భక్తుఁడు తనవిద్వత్తును రాజునకమ్ముకొననగుట.

ఉ. పోయినఁబోవనీయనుచు ♦ భోగములబ్బుఁగదాయటంచునీ
చాయకుఁజేరియమ్ముకొనె ♦ సంపదకొద్దిదికాదుతొల్లినా
కేయెడఁజిక్కనైనదియె ♦ యింతదితుచ్ఛపుడబ్బుకాసకై
పాయఁగఁజేసియూర్ధ్వగతిఁ ♦ బాడుకఁజేసికొనంగఁజూతునే. ౬౪.

కం. నీకిచ్చినధనమిత్తువు । గాకుండిననూరులిత్తు ♦ కాదేయువియే
మాకొదవెననుచుఁగుడునఁగ । నీకుంభినినుందుమెన్ని ♦ యేడులుచెపుమా. ౬౫.

కం. హరికీసంపదనొసఁగుచు । స్థిరమతినాతనిభజింపఁ ♦ జేతఃప్రీతిం
జిరసుఖములఘటియించెడిఁ । దరమేవానికినిబోల్ప ♦ ధరభోగంబుల్. ౬౬.

ఆ. జ్ఞానులైనవారు ♦ కానవేయిద్ధర । నేరనేమికోర ♦ కూరకితగు
నీతిబోధఁజేయు ♦ నియతిగనవ్వారి । తానొసంగుసన్ని ♦ ధానమెపుడు. ౬౭.

ఉ. ఇట్టులనమ్మియుండఁగను ♦ నేఁటికినీకడఁబెట్టికొలునా
కట్టడివిందెశ్రీహరిది ♦ గాకిఁక నేతనినామమైన నేఁ
బట్టనునోటఁబల్కఁగను ♦ బాడిననన్యులువిన్కఁ కేఁజెవిం
బెట్టనుడబ్బుముట్టనిఁకఁ ♦ బెట్టులుపోతలవేలభూవరా. ౬౮.

కం. నాశిష్యులనేరేనిధ । నాశంగన్నారలున్న ♦ నరయఁమటంచుం
దాశాలఁగలయఁగనఁగజ । నేశునిఁబొడగాంచినార ♦ లిట్లనిరపుడే. ౬౯.

కం. హరినామమెపాడుదుమల । హరినామమెవిందుమింక ♦ నరయముమేమే
నరనామంబులననవిన । గురువుగతిఁజరింతుమనుచు ♦ గుఱితెల్పిరటన్. ౭౦.

ఆ. అపుడుభూమిపతికి ♦ నాశ్చర్యమటులుండ । లజ్జముట్టడించె ♦ లానదియయి
ఆమహానుభావు ♦ లటుతృణీకరణము । చేయవారికెగ్గు ♦ చేయనెంచె. ౭౧.

## వందిమాగధులు రాజకీర్తనబాడ భక్తులు చెవుల మేకులు కొట్టుకొనుట.

ఆ. పోయెనచటువాసి ♦ పొరుగుగ్రామమునకు । వందిమాగధులను ♦ వరభటులను
పిలిచిబోధపఱచి ♦ ప్రేరణమొనరింప । వడిఁగుశస్థలంబు ♦ వారుచేరి. ౭౨.

కం. అలభజనాగారంబున । బలిసికళింగాధినాథు ♦ ప్రస్తుతిపదము
ల్బలరేగిపాడఁ[illegible]డఁగిరి । కలవారలువింతపడఁగఁ ♦ గట్టేడిచెడఁగన్. ౭౩.

చం. అటులనువారురేగిమను ♦ జాధిపకీర్తనలొక్కఁబెట్టినం
గుటిలతఁబాడఁగానయినఁ ♦ గుంభినినాయకునానయుద్ధటం
చెటులనొవేద్యమాడుమది ♦ నేవసహింపమిఁగౌశికుండుముం
బటుతరకాష్టశంకువుల ♦ బాగుగఁబూడిచెఁగర్ణరంధ్రముల్. ౨౪.

కం. వింతగనాతనిశిష్యులు | పంతంబునసతియువినని ♦ పట్టాదలకున్నై
సంతసపడుచిరిమేకుల | నంతందమకర్ణబిలము ♦ లందరుదార్చన్. ౨౫.

తే. వినఁగనబ్బురమగునిది ♦ వినియుర్రాజు | మత్సరంబుననాత్మీయ ♦ మదముకొలఁది
వారిగారించియెట్లైన ♦ వారిచేతఁ | దనదునామంబుఁబాడింప ♦ దరికొలుపుడు. ౨౬.

భటులు రాజనామముబాడింప బీడింప భక్తుడు

నాల్కఁగోసికొనుట.

చం. భటులుసరోషులైకదిసి ♦ భక్తునిఁదత్సతిశిష్యసంఘముం
గుటిలతవారికృత్యములు ♦ గూర్పఁగనడ్డుచుభీతిఁబుచ్చుచుం
బటిమమువాయఁజేయుచును ♦ బాడుఁడిమాపతినంచునిచ్చలుం
దిటమగుబాములంబఱుప ♦ దీనుఁడతండుమహాక్రమగ్నుఁడై. ౨౭.

మ. అకటాక్రీశహరిమాకిదేమిగతియే ♦ మన్యాయమీదుష్టులీ
వికటంబుల్ఘటియింపనేలవిభుఁడా ♦ విభ్రాంతిపాటొందుటేఁ
టికిమమ్మిక్కడఁగాతురేరుసదయా ♦ డెందమ్ములన్నీదిన
మ్మికగానుంటిమినిల్వనీరభటులీ ♦ మేఁటుల్పతిప్రేరణన్. ౨౮.

కం. తలఁపవుగదమాగతిహరి | పిలుపవుగపదిక్కుమాకు ♦ మిసిమింతులమే
నిలుపవుగదయీయెద్దమి | కొలుపవుగదవీరివేర ♦ కొలమిట్లాడన్. ౨౯.

కం. నిత్యుండవుపరిపాలిత | భృత్యుండవుదళితభువన ♦ భీకరదుష్కృ
ద్దైత్యుండవుదయఁగనుకృత | కృత్యుండవునీవగుదువు ♦ కేశవదేవా. ౩౦.

తే. నిన్నుఁబలికెడినానోట ♦ నెన్నసగునె | తెన్నుమాలిననరులను ♦ దేబెనగుచు
మదిఁదలఁతుఁగదభటులన ♦ న్వదలన్నృపతి | భ్రాంతియుడుగంగఁజెల్లనా ♦ పంతమిలను.

కం. నాజిహ్వాగ్రముఖండము | గాఁజేసెదనాసయుడిగి ♦ కదలియువీరా
రాజునకుఁదెల్పనాతఁడు | మాజిజ్ఞాసంబునింక ♦ మానకయున్నే. ౩౧.

తే. మోటువారలకెప్పుడు ♦ మోటుపనియ | సూటిగోరాఁగానిపెరపరి ♦ పాటిగాదు
వాటముగనంచుఛురికచే ♦ దూటికొనియె | వీఁటివారెల్లభటులుపై ♦ దూటుకొనఁగ.

## మాలతీకౌశిక పద్మాక్షాదులు రాజ్యము వెడల గొట్టబడుట.

మ. భటులంతంజనిరాజుతోడఁ దెలుపం ♦ బాపంబునా కాతఁడా
రటముల్వారలవెన్నఁబోకతనదౌ ♦ రాజత్వగర్వంబుచే
నటవాతెందనరాష్ట్రమున్విడిచిపో ♦ నంపించిపద్మాక్షుని
ల్కుటిలత్వంబునఁజూరఁబుచ్చియతనిం ♦ గూర్పించెనక్కౌశికుఁ. ౧౪.

వ. ఇట్లు కాళింగుండీర్ష్యఁగొని రాజ్యమదాంధకారంబునఁ గన్నుగానక తెన్నుమాలిన యాపన్నుగడలవారల నాపన్నులఁజేసి విడుచుటయు మాలతీకౌశికాదులు పద్మాక్షుం గూడి శిష్యసహితులై యెటకేనియుంబోనొల్లమిగమ్యస్థానంబును నిరూపింపనేరక కర్తవ్యంబెఱుంగంజాలక హృదులఁజెదరకొదవియున్నమధు సూదనపదభక్తిచే నన్నపానభ్రాంతినెన్నఁబోక యాచిదానందునిపదంబులె ముదంబుగ సదాపాడికొనుచు నుత్తరాభిముఖులై యేడహోరాత్రంబులేక దీక్షన్నడపనడవనట్టియెడ. ౧౫.

## ఆభక్తజనులనెల్ల బ్రహ్మదేవుడు సన్మానించుట.

సీ. నిత్యశోభాంచిత ♦ సత్యలోకంబున ♦ మహితసభాస్థాన ♦ మండపమున
దేవర్షులోకచక్రి ♦ దేదీప్యముగనుండ ♦ బ్రహ్మర్షులోకచెంతఁ ♦ బరగుచుండ
రాజర్షులోకచాయ ♦ రహినొందుచుండంగ ♦ సాధులింకొకప్రక్క ♦ సంతసపడ
గరుడగంధర్వకి ♦ న్నరులుఁగింపురుషులు ♦ సిద్ధచారణులును ♦ జెలఁగుచుండ
బుండరీకాసనమునగూ ♦ ర్చుండితనదు | చెలువపలుకులవెలఁదుక ♦ చేయుగాన
మునకునానందమందెడి ♦ ఘనుఁడునలువ | కాననయ్యెనుభక్తుల ♦ ధ్యానదృష్టి.

కం. తనచెంగటఁగలనిర్జర | ఘనులనుబొడగాంచియల్ల ♦ కౌశికముఖ్య
ల్వనజోదరసద్భక్తులు | గొనిరండిచటికనఁబోయి ♦ కొనితేరంగాఁ. ౧౭.

చం. అలపరమేష్ఠివారలమ ♦ హాదరభావముతోడఁజేరఁగాఁ
బిలిచిసుఖాసనంబులిడి ♦ ప్రేముడిపేరిమిఁగారవింపఁగాఁ
దొలఁగెనుబాధకంబులిఁక ♦ దుఃఖముఁగానమటన్నధైర్యపుం
బలమునవబ్జసూతిఁగను ♦ భాగ్యముపెంపునసొమ్మసిల్లుచుఁ. ౧౮.

చం. తెలిసియొకానొకప్పటికి ♦ దేవమునీంద్రులదేవతావళిం
గలియఁగఁగాంచివారికడఁ ♦ గల్గిననిల్కడనిక్కసంబొకో
కలయఁగనోయటంచరసి ♦ కట్టకడన్నిజమన్ననమ్మికం
గలిగిమహోత్తమస్థితికి ♦ గ్రక్కునఁజేర్పఁగనెంచిరాహరిఁ. ౧౯.

## బ్రహ్మానుపున కౌశికునకు శ్రీవిష్ణుసందర్శనప్రాప్తి.

కం. వారలలోఁ గౌశికుహరిఁ । జేరుపనియమించియంత ♦ శేషించినత
న్నారీపక్ష్మాక్షాదులఁ । దీరికనటనిలుపుఁడనుచుఁ ♦ దెలిపెనజుఁడిఁకన్. ౯౦.

సీ. సర్వలోకోత్తమ ♦ శైత్యోష్ణ్యకరంబయి ♦ తగుమహామహిమచేఁ ♦ దనరుచున్న
స్వీయధీధితిదీప్తి ♦ చెలువుననప్పద్మ ♦ బాంధవప్రతిభంబుఁ ♦ బాపుచున్న
బహువిధదేవతా ♦ ప్రముఖులుసస్మను ♦ ల్బలిసియుండఁగఁ ♦ బరగుచున్న
పద్మాలయాసతీ ♦ పరిచారికాబలా ♦ మణిమనోజ్ఞతలచే ♦ మసఁగుచున్న
దివ్యవైకుంఠపురమునఁ ♦ దేజరిల్లు । రత్ననిర్మితమండప ♦ రాజమందు
వైభవంబుననలరారు ♦ వాసుదేవు । మ్రోలఁగౌశికునిలుపంగ ♦ మ్రొక్కిలేచి.

కం. పడఁగాములెన్నియోపడఁ । గడుఁగోటులుజన్మలెత్తి ♦ గాసిలుచెట్లో
యెడనీయడుగులఁబొడఁగన । విడనేఁటికిఁగష్టమెల్ల ♦ విడనిటనింకన్. ౯౨.

సీ. కన్నులునాహృది ♦ గహ్వరంబునమాధ్య ♦ తమమునసీరూపుఁ ♦ దడవికొనుచు
మిన్కుమిన్కనుజ్యోతి ♦ మెయినొప్పునాతెల్వి ♦ చాలిచాలనివెలు ♦ గైలభింపఁ
గనఁదికమకపడుఁ ♦ గాదయెట్టెదుటను ♦ నిర్మలమైయొప్పు ♦ నీస్వరూప
మునుబొడఁగనఁదగు ♦ ఘనతేజమిద్దంద ♦ నవితాల్చునీదేహ ♦ మట్టివెలిగ
అంతదీనఁదగిది ♦ వాంఛంబులట్లున్న । కామముఖములెల్లఁ ♦ గడలఁబట్టె
శమదమాదులరయ ♦ స్వచ్ఛంబులయ్యెనా । కమలభావమొదవె ♦ నమరతఁగన ౯౩.

కం. సుందరుఁడవుబహుభోగివు । రందరుఁడవునిఖిలదేవ ♦ రక్షోద్ధృతస
న్మందరుఁడవుక్షీరోదధి । మందిరుఁడవుసర్వలోక ♦ మహితుఁడవభవా. ౯౪.

దోదక. సాదరపాలిత ♦ సర్వసురౌఘా । పాదరజఃపరి ♦ పాకహృతాఘా
మోదదరాక్షస ♦ ముఖ్యవినాశా । శ్రీదయితాముని ♦ సేవితయీశా. ౯౫.

## శ్రీహరి కౌశికాదులను వైకుంఠముననిలిపికొనుట.

చం. అనివినుతించుకౌశికున ♦ టాదరభావముతోడఁగాంచియా
సనమిడఁజేసినిల్పిహరి ♦ సారససంభవుఁబిల్వఁబుచ్చియా
తనిసతిమాలతిన్మతియుఁ ♦ దక్కినభక్తులఁబంపుడుంచున
య్యనువుకుశస్థలాంచితుల ♦ కందటికింపగునంచుఁబల్కెడున్. ౯౬.

కం. అప్పుడభక్తార్థాంగియు । నప్పద్మాక్షుండుశిష్యు ♦ లందఱురాఁగా
నొప్పెనుగౌశికుముఖమునఁ । జెప్పఁగరానట్టిశోభ ♦ శ్రీహరికనఁగన్. ౯౭.

వ. అప్పుడు వారందఱు ముందు పరస్పరాలోకనకౌతుకంబు నెక్కొనం దమయుత్కృష్ట
తమపదనివాససంప్రాప్తికుప్పొంగుచు నుత్తరానుకూల్యగతనిత్యనిష్కళంకసంతోష
సూచకంబగునని నమ్మి యుత్సాహంబుగనున్న నల త్రివిక్రమదేవుండు నిరుపాధికులగు
వారలనందఱిం గాంచి యిట్లనియె. ౯౮.

ఆ. చాలసుఖము మీకు ♦ సరిపడి యొనగూడ। స్వేచ్ఛనుండుఁడయ్య ♦ చెలఁగుచీడ
నేచుగలుగుదనుక ♦ నిత్యంబు మీభక్తిఁ। దనియుచుండుమిమ్ముఁ ♦ దనుపుచుందు. ౯౯.

కం. ఓమాలతి నన్నెప్పుడుఁ। ప్రేమ నలంకరణఁజేయఁ ♦ బ్రియపడితిగదే
నీమానసేశ్వరునితో। క్షేమంబుగనుండుమిచట ♦ సిరులొనగూర్తున్. ౧౦౦.

కం. పద్మాక్షా నామైనీ। సద్మంబున నాదుభక్త ♦ సమితిఁగుడిపితే
ఛద్మము లేకీడను నా। సద్మంబునఁ గోశపతిగ ♦ జరగుమి యింకన్. ౧౦౧.

ఆ. ఛాత్రులార మీరు ♦ పాత్రులరింతకు। నాత్రముడిగి గురవు ♦ ననుసరించి
యింక మీరు పోలె ♦ నెసఁగుసద్భక్తులఁ। గలిపి మోదములను ♦ బలిసితగుడు. ౧౦౨.

కం. కౌశికనాథభక్తులకీ। వీశుఁడ వైవిరి నెల్ల ♦ నేలుచు సతిని
న్నాశింపసుఖముఁగను మీ। నీశుకవాఙ్మధురగాన ♦ నియతిని భక్తా. ౧౦౩.

వ. అని యాదరంబు వహించి యందఱికన్ని నియమించి యింకం దమిమించిన మంతనంబున
నెంచి యావిరించిఁ బోడగాంచి హరియిట్లనియె. ౧౦౪.

## కౌశిక ప్రీతికై లక్ష్మీయాజమాన్యమున గానసభ జరుగుట.

కం. విధివీరలుభక్తులున। న్నధికమనఃప్రీతిఁగందు ♦ రక్షేఁజేయ
న్మధురాక్షర పేశలమనఁ। గథితంబగు గానసభను ♦ గల్పింతునిటన్. ౧౦౫.

ఆ. అల్లసభను బ్రీతి ♦ నభిలషించెడిలక్ష్మి। గానఁదన్నిమిత్త ♦ మానదియనఁ
జేయనందఱటకుఁ ♦ జేరంగఁజేయుము। చనుడు ధాత ప్రీతి ♦ నట్లొనరుప. ౧౦౬.

సీ. హైమవతింగూడి ♦ యభవుఁడే తెంచెను ♦ గీరమణియుఁదాను ♦ జేరధాత
శచిఁగూడి శక్రుండు ♦ సతులతో నెల్లరు ♦ దిక్పతుల్ సేరిరి ♦ తృప్తిపడఁగ
దేవతలందఱు ♦ దేవయోనులుఁగూడ ♦ రాజిల్లిరచ్చట ♦ రభసముగను
సనకనారదముఖ్యు ♦ లనుపమదేవర్షి ♦ సంఘము బ్రహ్మర్షి ♦ సమితిచేరె
ఏమునచోటికప్పు ♦ డేగితిమట్టిలె। మీరుఁగొందఱటకుఁ ♦ జేరినారె
గానమునకు మాత్ర ♦ మానందపడితిరి। కానిజరిగినట్టి ♦ కథవినుండు. ౧౦౭.

ఆ. అప్పుగిదినిమనము ♦ ముప్పిరిగొనిమూఁగ | గొప్పసభయద్దయ్యెఁ ♦ జెప్పఁబడఁగ
నప్పుడటకులక్ష్మి ♦ యప్పుడతులఁగూడి | యొప్పవచ్చినట్టి ♦ చొప్పెఱుఁగరె. ౧౦౮.

మునులు సురలుందరుమబడి తుంబురుడు గౌరవింపబడుట.

కం. కోటులకొలఁదిగనొప్పిన | చేటులుకొలువంగనటకు ♦ శ్రీసతిరానా
బోఁటులుమనలంబురుషుల | బైటికిజరుగంగఁదఱుము ♦ ఫక్కినెఱుఁగరే. ౧౦౯.

ఆ. వేత్రపాణులగుచు ♦ నాత్రంబ రావార | లందు మేఁటిమూర్తి ♦ యందిపరిఘ
నాడనున్న వారి ♦ నందటినెడముగ | జరుప రాజ్ఞి తాము ♦ జరగిరాడ. ౧౧౦.

కం. ఆయాడంబరమునుబడ | నైయున్న నటంగలార ♦ లాగానంబా
ప్యాయతవినిచొక్కిరికద | యాయెడనవుడున్న తుంబు ♦ రాహ్వయువారల్. ౧౧౧.

కం. రమయనుమతిరాఁబిలువఁగ | సమయోచితగానములను ♦ సంచారవిధిం
గ్రమమెఱిఁగిపాడవింటిమి | రమణీయంబయ్యెనాఁటి ♦ రహియెల్లరకున్. ౧౧౨.

ఉ. అప్పుడు మోదమందిజల ♦ జాక్షుఁడుతుంబురుగాయకోత్తముం
గప్పెసుభూషణంబులను ♦ గాంచనవస్త్రసుపుష్పమాలల
న్నెప్పుటలాతఁడందుటయు ♦ మేఁటులుమారగులొటఁజూడఁగాఁ
జెప్పెడిదేమినారదుని ♦ చిత్తముతత్తరపాటునొత్తిడెన్. ౧౧౩.

కం. పడియుండఁగహారవిధులును | గడమవిబుధవరులునింకఁ ♦ గలవారలమా
యెడవిడిచివచ్చినదుదాఁ | దడసియుశ్రీదేవియందు ♦ దంభము వెదకెన్. - ౧౧౪.

ఈయంతకు నారదుఁడుకోపించి లక్ష్మినిశపించుట.

సీ. ఈరమతనదాసు ♦ లిందొఱఁబురికొల్పి ♦ ప్రబలులమ్మైల్ల ♦ బయటఁదోలి
తుంటరి పోనల్లి ♦ తుంబురుమన్నించి ♦ పతిచేతనిప్పించె ♦ బహుమతులను
గరిమకులఘిమంబు ♦ ఘనుఁగననొకఁజేత ♦ వివరింపరాక్షస ♦ విధులుగాన
తానురాక్షసయోని ♦ ధరఁబుట్టిఁగావుతఁ ♦ బుట్టిబహిర్భూమిఁ ♦ బూడ్పఁబడుత
మనుచునారదమౌనీంద్రుఁ ♦ డాగ్రహమున | శ్రీమహాదేవిశపియించె ♦ నేమిచెప్ప
నఖిలదిశలప్రహహాయ ♦ టంచు మ్రోగె | లక్ష్మిచింతిల్లిశ్రీవిష్ణు ♦ రక్షఁగోరె. ౧౧౫.

ఉ. అంతటవిష్ణుఁడారమయు ♦ నమ్మునిపుంగవుఁజేరిమ్రొక్కియొం
తెంతగనోనుతించిమది ♦ నేచుకళంకముఁవాపియయ్యమీ

యంతటివారలెంతలన ♦ నంతయుఁగాఁదగునింతెవింతెమా
చింతనుదీర్చుమార్గమొకటి ♦ చెప్పుముదానశమించుఁగొంతయే. ౧౧౬.

కం. మునినాథులశోణితమున | దనుజస్త్రీగర్భమందు ♦ ధరఁబుట్టంగా
ననుమింతెచాలుననన | మ్మునిశేఖరుఁడనుమతించి ♦ మురహరికనియెన్. ౧౧౭.

తే. లేమప్రియమందునదెచాలు ♦ లెమ్మటనియె | పోలరేరాత్రఁడేయెచ్చు ♦ పొమ్మటనియె
తుంబురునికట్టిసభలోనఁ ♦ దొడిగితే వెః | వెక్కసముబొందరేయటఁ ♦ దక్కినారు?

కం. అనినారదుఁడనగావిని | మనమునఁదనకొప్పునట్టి ♦ మర్మముఁదెలుపం
గనువైనతేయగమనుం | డనియెనిఁకెప్పుడునులోకు ♦ లందఱుఁగన్. ౧౧౯.

## గానము తనకుఁబ్రియతరమని శ్రీహరి తెలుపుట.

సీ. వేదవేదాంతము ♦ లీవ్విధులునాకగు ♦ నందునేఁదిరుగుదు ♦ నందురుగడ
మీబోటిమానసులు ♦ మేటులుమీహృదు ♦ లందునేనుందునం ♦ చందురుగడ
రవిత్రిమూర్త్యాత్మక ♦ రమణీయతేజమా ♦ నందుఁబ్రకాశింతు ♦ నందురుగడ
పుణ్యస్థలంబులఁ ♦ బుణ్యతీర్థంబుల ♦ నందందునంగాంతు ♦ మందురుగడ
ఇంతయుహుళక్కియెట్టులో ♦ యెన్నోకలుగు | నేడనేరైనఁగూడినం ♦ బాడుచున్న
ఓడకేనాఁడదమితోడ ♦ వినుచునుందు | గూర్తువారికిదానికేఁ ♦ గూర్మిఁగందు. ౧౨౦.

కం. తపములమహాధ్వరంబుల | జపములబహుదానములను ♦ సంతృప్తుఁడనై
కృపఁగనుటయెంతగానం | బపరిమితప్రీతినాకు ♦ నందునమెత్తున్. ౧౨౧.

కం. కానసెకాదేకౌశికు | నేనిట్టులచుహితుఁజేసి ♦ తెలుఁగవవాని
న్మౌనియెయమరుఁడెనరుఁడగు | గానంబుననాదప్రీతి ♦ గిరిమనఁదల్లో. ౧౨౨.

తే. నరులుసామాన్యలేయిట్టు ♦ లరయఁబడఁగ | గాయకాగ్రణితుంబురుఁ ♦ డేయధనులఁ
బోలకుండెడినఁదువా ♦ శీలనీకు | నలయునందేనిగానంబు ♦ నలవడఁగను. ౧౨౩.

కం. అనిహరియనఁగనారద | మునియనవోయయ్యయింత ♦ ముచ్చటనీబో
ర్జనుఁడాఁచిపమ్ముఁదకమకఁ | జోనుపుదయనవింకఁజూపు ♦ చొచ్చెదఁబనినాన్.

వ. ఎట్టులైనం దనదిట్టఁడనంబు రట్టుచేసికొని యట్టిపరవందనట్టి తుంబురుగట్టితనంబు వట్టుపరుపఁ బట్టుదలంజలపట్టిన యామునిజెట్టి మదిగుట్టుగనిపట్టి యాగట్టుతట్టిపట్టిన దిట్టయిట్టులనియె. ౧౨౫.

తే. మానససరోఽరోత్తర ♦ మహితశృంగ | మందులూకాధిపతిగాన ♦ బంధుఁడనఁగ
గాయకోత్తముఁడుండునా ♦ చాయకీవు | పొమ్మునీఁకటఁదగినలా ♦ భమ్ముకలుగు.

## నారదుండొకఘూకమునొద్ద సంగీతము నేర్చుకొనబోవుట.

కం. అనిహరియనవెనువెంటనె | చనియెన్నారదుఁడుసరసి ♦ సరసశిఖరమం
దునుగంధర్వాప్సరసల | కును నేరుపుచున్నగాన ♦ కోవిదుఁగనియెన్. ౧౨౭.

ఆ. అయ్యులూకనాథుఁ ♦ డాతిథ్యగౌరవ | మపుడునారదునకు ♦ నాచరించి
ప్రస్తుతించియతని ♦ భగవత్సమానుఁగ | నాగమార్థమడుగ ♦ నతఁడిటనియె. ౧౨౮.

సీ. విహగేశవినుమయ్య ♦ విష్ణుఁడీనడుమను ♦ గల్పించెసతికాంక్ష ♦ గాయకసభ
హరవిధాత్రాదులు ♦ నమరులెల్లను నేము ♦ మునులమంచఱమాడ ♦ ముసరుకొనఁగ
రమదాసులంచఱు ♦ మముదూఱముగఁదోలి ♦ తామధిష్ఠించిరి ♦ దగ్గరగను
అంతఁదుంబురుమేఁటి ♦ యనిచేరఁగాఁగొని ♦ పాడించియొసఁగిరి ♦ బహుమతులను
ఏనుగోపించిరమశపి ♦ యించినాఁడఁ | జేరిహారేమొకోరంగఁ ♦ జేసినాఁడ
నంతహరితెల్పగానంబు ♦ నధికతవిన | దానినేనేరఁదలఁచితి ♦ మానసమున. ౧౨౯.

కం. హరియేనినుఁదలిపియునీ | దరిఁజేరుమటంచుఁబనిచె ♦ దానన్నీకేఁ
బరగితిశిష్యుండనునం | గిఱపుముగానంబునాఁగ ♦ ఖగమిట్లనియెన్. ౧౩౦.

## ఆఘూకముయొక్క పూర్వజన్మవృత్తాంతము.

కం. నీకేఁగననైనఁదగని | కాకవినైయుండిలోక ♦ గౌరవ్యుఁడవౌ
నీకుంగురుఁడనుగాఁగల | నాకోటికినైనకార ♦ ణముమునువినుమా. ౧౩౧.

సీ. భువనేశ్వరుండను ♦ భూనాయకుండొండు ♦ మహితుఁడైయొప్పెభూ ♦ మండలమున
బహుయాగములుసేసి ♦ ప్రతిభంబుగాంచెభూ ♦ సురులనుగోదాన ♦ సరణిఁదనిపె
నిత్యాన్నదానము ♦ ల్నిరుపమంబుగఁజేసె ♦ సప్తసంతానము ♦ ల్సరవిఁదీర్చె
పరమసౌఖ్యంబందఁ ♦ బ్రజలనుబాలించె ♦ భూపురందరుఁడన ♦ భోగమందె
తనదురాజ్యంబునంగల ♦ ధరణిసురుల | వేదశాస్త్రంబులన్నాని ♦ విపులముగను
వినదుపేరిమిఁగణించి ♦ దానిఁబాడఁ | గానొనర్చుచుఁదానుబ్బు ♦ దానికలరి. ౧౩౨.

తే. గిరిమఁదనయదివర్ణించి ♦ కవులుకీర్త | నములుసేయంగనెల్లరుఁ ♦ దమినిబాడు
చుండనియమించెనెల్లెడ ♦ నొప్పఁగఁబతి | గానమెచ్చెనుదేవతా ♦ ధ్యానముడిగి.

మ. హరిమిత్రుండననొక్కవిప్రసుతుఁడా ♦ యావర్తనల్సేయకా
హరిలోకేశ్వరుఁబాడికోఁదలఁచితా ♦ నాయూరడంబాసిస
త్వరుఁడైయొక్కనదీతటంబునలయ ♦ స్నానమ్ములున్వర్ణము
ల్సరిగాఁజూచుఁదదేకనిష్ఠహరిఁదా ♦ సంప్రీతితోఁబాడుచున్. ౧౩౪.

కం. కీర్తనములధ్యానించుచుఁ | గీర్తనములనర్చనములు ♦ గీలించుచునా
కీర్తనలెనివేడించుచుఁ | గీర్తించుం దేవదేవుఁ ♦ గేశవుననఘున్. ౧౩౫

కం. పొరలుచునుత్సాహంబున | హరిహరియనియెగురుచుండు ♦ నపుడొకటఁటదిగం
బరుఁడైననెఱుఁగనేరక | పరమానందమునవిట్లు ♦ పాడ్చుచునుండెన్. ౧౩౬

చం. అతఁడటనట్టులుంటవిని ♦ యాభువనేశమహీశుఁడీసునం
బ్రతిమనుజూండునిట్లయినఁ ♦ బ్రస్తుతిస్వీయములు ప్రమాణటం
చితరులభీతిపుచ్చుటకు ♦ నేర్పడనాతనియిల్లుదోఁపస
మ్మతిఁదగువారిఁబంపెనిజ ♦ మందిరమాతఁడునేరరాపనెన్. ౧౩౭

కం. ఆపతియేమేఁజేసిన | నాపదలేమిడినెఱుఁగఁ ♦ డాహారిమిత్రుం
డేపునరేవగలనకర | మాపతిపదగానమోద ♦ మానసుఁడగుటన్. ౧౩౮

ఆ. అంతమరణకాల ♦ మాసన్నమగుడును | రాజుభూమివిడిచి ♦ రహిందోలంగ
జేయుపుణ్యమెల్లఁ ♦ జెల్లచెదరుగాఁగ | నయ్యెఘూకమనఘ ♦ యదియెనేను. ౧౩౯

కం. అంతక్షుధార్తుఁడనగుచేఁ | జింతాక్రాంతుండనగుడుఁ ♦ జెంతఁదగినయా
యంతకుఁడుగానుపించెను | మంతివ్యుండతఁడకాన ♦ మనవిగనంటిన్. ౧౪౦

ఉ. ధారుణిధర్మరాజబహు ♦ ధార్మికుఁడన్నప్రసిద్ధిఁగంటినే
ధారుణిదేవవర్యులకు ♦ దానములెన్నియొజేసిజీవనా
ధారముజంతుసంతతికిఁ ♦ దద్దయుఁగల్పనఁజేసియుంటి,నా
కారటమేలనిట్లువిహ ♦ గాకృతిరాఁగతమెద్దియోయనన్. ౧౪౧

## సాధుసంతాపకర్త మహాపాపియనియముడు చెప్పుట.

ఉ. చేయఁగరానిదొక్కపని ♦ చేసితిమోసముఁగంటిదానన
న్యాయముగామహోద్ధతికి ♦ నైహరిమిత్రధనాపహర్తవై
తాయెడఁబున్నెమున్నడియు ♦ హైన్యమునొందవిపత్తునచ్చెనీ
కీయెడనింతఖీడదిది ♦ యేచెడినింకనుముందువిందువే. ౧౪౨

కం. తొఱఁగినసీయామేన్కడ | మఱిగియెపలలంబుఁదినుచు ♦ మన్వంతరమి
ట్లురుగుడుశ్వానంబయ్యెదు | నరజన్మముపిదపఁగలుగు ♦ నమ్ముములాకా. ౧౪౩

కం. భక్తులుజ్ఞానులుసాధుల | శక్తులుగానెంచిచిత్త ♦ సంతాపములా
సక్తినొనర్చెదునఘముఁడు | రిక్తుండైదేనఁగూడ ♦ రెక్కొనకచెడున్. ౧౪౪

సీ. వినుమునీయంతటి ♦ విపులపుణ్యాత్ముండె ♦ హరిమిత్రభక్తుండ ♦ టాత్మఁగనని
చెడుగాతనికిఁజేయఁ ♦ జేసినపుణ్యంబు ♦ వాసియిట్లింతటి ♦ గాసికలిగె.
తామేమిపుణ్యంబు ♦ ధరఁజేయకప్రమత్తు ♦ లైసాధులకునెగ్గుఁ ♦ జేసివారు
సంతాపపడఁజూచి ♦ సంతసించెడివారి ♦ దుర్గతియెంతగు ♦ దూరదృష్టి
నెంచుమన్వంతరంబుల ♦ వెన్నిహీన | జంతుజన్మంబులెత్తుచుఁ ♦ జచ్చుచెట్టి
దోసఁగులనుబొందవలయునో ♦ దోసమెంత | ఘనమొభయదమొగర్వులు ♦ గనరుగాదె!

మ. పరిహాసంబులనీసడింపులనొగి ♦ న్భక్తాళిచిత్తంబులం
బరితాపంబులువొందఁజేయునఘము ♦ ల్బ్రహ్మోత్తరుల్గాఁగమే
ల్తరవుంబున్నెములెన్నిచేసిననుద ♦ త్తాపాగ్నిదగ్ధంబులా
వరుసన్వంశవినాశనంబగునుసూ ♦ వాహొందుపాల్లుండఁగన్. ౧౪౬.

ఆ. అరుచుఁదెలియఁబలికి ♦ యంతటసమవర్తి | తానగోచరుండు ♦ గానవలను
త్రుస్తతిశయమగుడు ♦ క్షోభించుచేఁగంటెఁ | దొంటిమేనిఁకేది ♦ కంటఁబడదె!

మ. అటనేనెంతవిషాదమందమతియెం ♦ తల్లాడమల్లాడనా
కఁటఁగ్రుక్కంగనుటొడ్డెపెచ్చుఫలమై ♦ కాన్పించెఁగాణాచియే
కటనాదేహమెయెల్లఁతిందునిదియోఁ ♦ గాకృత్యమంచేమిచే
యుటకుందోఁపమిఁగొంతకాలమఱిగె ♦ న్యోగానుసంధానతన్. ౧౪౭.

మ. పరమామోదకరానుకూలసమయ ♦ ప్రాప్తంబునాకప్డుగా
హరిమిత్రుండటువోవిమానగతుఁడై ♦ యారాట్ఛరీరంబుతా
నెఱుఁగుంగావునడిగ్గినన్నడుగఁగా ♦ నేనెల్లపూర్వోత్తరం
బెఱుఁగంజేసియమోక్షులప్పుడనుచే ♦ నేడ్వంగృపాయత్తుఁడై. ౧౪౮.

ఆ. అపలకుందుమింక ♦ హరిమిత్రుఁడనునేన | నీవుచెప్పునంత ♦ నిక్కమైనఁ
గష్టముడిగినీకు ♦ గతిగలుగఁగఁజూతు | హరికృపంగనంగ ♦ దొరకుమేల్మి. ౧౫౦.

సీ. సంతాపమింతనా ♦ మంతనంబునలేదు ♦ నీవొనర్చినయొగ్గె ♦ నేఁదలఁపమి
నీదోసంగుఁగనంగ ♦ నేదయమదిఁగఁటి ♦ నిష్కల్మషత్వంబు ♦ నీకొదవెడి
పాయుదీశవమును ♦ భావికర్మ్యరజన్మ ♦ కలుగదీభవమందె ♦ ఫలముఁగందు
గానమేనేర్పుదు ♦ ఘనభక్తిహరినెంచు ♦ దేవయోనులకౌదు ♦ వీవుగురుఁడ
వనుచుఁగరుణించివరమిచ్చి ♦ యనువుఁదెలిపి | గాయకునిఁజేయహరినామ ♦ గానమహిమ
జెప్పినంతకునిట్లయి ♦ యొప్పుదుఁగద | గాననమ్మమునారద ♦ మౌనిచంద్ర. ౧౫౧.

కం. హరిగానలోలుఁడగుటను । హరిపదగాయకులఁజేయు ♦ నాత్మోపముల
న్దరవారునోవనెగ్గగుఁ । గరుణింపన్గుకలుగుఁ ♦ గదువడిసుమ్మీ. ౧౫౨.

కం. ఈనాపూర్వచరిత్రం । బేనరుఁడెఱిఁగినను భక్తు ♦ నెల్లెడభక్తిం
గానంగలిగియుదానన । నూనంబగుపరమపదము ♦ నొందెడుఁగాతన్. ౧౫౩.

వ. అని యిట్లుగాన విద్యాప్రాగ్భారంబును దానననుసంధానంబై యొప్పు భగవద్భక్తి ప్రావీణ్యంబును దీనననయ్యెడి మహోత్కృష్టావస్థోద్గమన ప్రాగల్భ్యంబును దత్తిరస్కారణంబునఁ బ్రాప్తించుమహాదాపత్పరంపరాభివృద్ధియును విశదీకరించు ననువున నన్నియుండిన్ననగానున్న యెన్నికంగన్న తనయుపాఖ్యానంబున్న తెల్పియాగా నబంధుండా మానిసింధునకిట్లనియె. ౧౫౪.

## గానవిద్యాభ్యాసకులకు వలసినలక్షణములు.

కం. క్షమసదృశముగానోప్పదు । క్షమనీవుతపస్వివగుటఁ ♦ జాలవలయునూ
శమముకొలఁదిశ్రమపడిననె । క్రమముగరాఁజెల్లుసుమ్మి ♦ గానమునెమ్మిన్. ౧౫౫.

సీ. సరసవినోదినీ ♦ సంసర్గవేళను ♦ గానవిద్యాభ్యాస ♦ కాలమందు
భోజనంబుతఱిని ♦ బాలుపుగానోపార్థ ♦ సంగ్రహంబొనరించు ♦ సమయమందు
ధనధాన్యములటీయఁ ♦ దాఁగొనుచుండంగ ♦ నాయవ్యయంబులు ♦ సేయునపుడు
వైపరీత్యప్రరాక ♦ వాయమానసికముఁ ♦ దాఁబయల్పచ్చెడి ♦ తఱుణమందు
లజ్జయేర్పడియుండిన ♦ జజ్జుకొనును । లజ్జవీడినసుఖమబ్బు ♦ లాభమొదవు
గాననారదమౌనీంద్ర ♦ గానమునకు । నాదిమంబిడకట్టిడి ♦ గాఁదలియను. ౧౫౬.

సీ. కుంఠితంబుగఁగాని ♦ గూఢంబుగాఁగాని ♦ పరవర్ణములఁగాని ♦ పాడఁదగదు
హస్తవిక్షేపణ ♦ వ్యాదితాస్యంబును ♦ నిర్యాతజిహ్వయు ♦ నీటుఁజెలుచు
ఊర్ధ్వబాహుతయట్టె ♦ యూర్ధ్వదిష్ట్విష్టత ♦ తగవొరుఁగనమిము ♦ సకమువంపు
నగుచేష్టచుమ్బితిఁ ♦ దగుచుండరాద్ట్లు ♦ పాడువారలఁగూడి ♦ పాడరాదు
ఆకఁటంబడఁజప్పిఁగో ♦ న్నష్టమతియు । భ్రమనుబడియేనినంధకా ♦ రమున నెపుడు
తగదుపాడంగనొకచేతఁ ♦ దాళమట్టె । గానమునకిట్టినీతము ♦ ల్గలవెఱుఁగు. ౧౫౭.

చం. అని తెలియంగఁబల్కుచుస ♦ హస్రసురార్చ్యములాడనేమహా
సనుగొని నేరనేరపెను ♦ దక్షయుఁబ్రీతినులూకనాథుఁడ
మ్మునిపతిగీతనర్ణములు ♦ ముద్దుగఁబాడుచునంతనావిపం
చినిబహుసాధనంబుఁగనేఁ ♦ జెప్పెడిదేమిఁకమేఁటినాఁబడెఁ. ౧౫౮.

ఆ. భట్టులదట వేచి ♦ పట్టుదలంగొని | పదియుమూడువేల ♦ పయుననువది
సురుచిరంబులైన ♦ సుస్వరభేదము | ల్నారదుండుగాంచె ♦ పారగుండు. ౧౫౯.

ఆ. ఎంత నేర్చియేమి ♦ అంతులుందిరిక | లింతెతుంబురుఖిజ ♦ యింతుననియె
అంతరహితునామ ♦ చింతనందమింగోరఁ | డింతయేనిచదువు ♦ సంతకొక్కొ. ౧౬౦.

## వినయము లేని విద్య విఫలమనునీతి.

సీ. మేఁటులైరెయితెంత ♦ ధాటిగాఁజదివిన ♦ విద్వాంసులైనను ♦ వినరమెఱుఁగ
లేకున్న నలమూఢు ♦ లే మెఱుఁగననగు ♦ వర్తనంబులనుండ్రు ♦ వనటఁగంద్రు
అల్లమూఢులకెవ్వ ♦ రైనఁజెప్పఁగవచ్చుఁ ♦ జదివినశుంఠలఁ ♦ గదియలేరు
చదువఁగాఁగల్గెడిఁ ♦ జక్కనిజ్ఞానంబు ♦ దానసౌఖ్యడిన్నిని ♦ దానవుపుడ
అట్టిశాంతినిఖూజ్యుఁడౌ ♦ నట్టిఘనత | నంది వెలుగొందుఁ ఘర్మయందు ♦ నపుడుముందు
కంటెఁదాఁజనఁబేరొప్పు ♦ కాలమందు | నతఁడె మృతజీవుఁడిల మూర్ఖ ♦ గతినిఖునుఁడు.

సీ. చదివినసార్థక్య ♦ మొదవనివారికిఁ ♦ జిహ్వ సుజ్ఞానంబుఁ ♦ జెందకునికి
అదిలేనిచదువబ్బ ♦ నదరుడెచ్చయ్యెడి ♦ వదరుటమీఱెడి ♦ మదమెదిగెడి
పెద్దలందఱికంటెఁ ♦ బెద్దలుతామన్న ♦ బుద్ధియొక్కటిరేఁగి ♦ బొద్దుగనును
తోఁచినట్లెల్లడ ♦ నాచెంతనీచెంప ♦ నాచాటులైకొంత ♦ వాచరచుడు
నేరువినకున్న నంతయుఁ ♦ దారువినుచుఁ | దారసిల్లియుఘుమదూత ♦ లోరిమూర్ఖ
నీకుశాస్త్రాభియోగత ♦ లోకముచెడు | దారయంచీడ్తురిద్దియే ♦ వారికిగతి. ౧౬౨.

కం. ఎక్కువచదివినకొలఁదిని | మిక్కిలియడఁకువనుగన్న ♦ మేఁటియనఁగనౌ
నొక్కడదుడుకుగనున్నను | బ్రక్కంబడెదారితప్పి ♦ ఫలమునకననౌ. ౧౬౩.

కం. నిజముఖసౌందర్యముఁగనఁ | గజ్జెలంగడిముకుర మొప్పు ♦ కరణిందగువా
సుజనులతెల్వినిదేఁటగ | నఁజదివినదౌనరనదపుడు ♦ నాయపుఁజనువౌ. ౧౬౪.

ఆ. చదువువానికర్మి ♦ సత్ప్రవర్తనపేర్మి | యద్దిలేకయున్న ♦ రద్దిమిన్న
అదియుఁగలుగధాటి ♦ యొదవుడునగు మేఁటి | పరగునిహమునందుఁ ♦ బరమునందు.

సీ. వేఱుకీటకమట్టు ♦ చేరుఁదాఁదొలుదొల్తఁ ♦ జగువంగమొదలిడ్డ ♦ మదమెకందు
దానిఁబాపినఁగాని ♦ తానురంజిల్లదు ♦ ఫలదాయిగాఁదరు ♦ వలచదువును
మెండిచెట్టటులఁల ♦ దండిగాఁగుదిరిన ♦ నిష్ఫలంబనుటది ♦ నిజమటుండ
కోటరంబదిచేయు ♦ సాటినడంకువ ♦ లేమిలోనేర్పడ్డ ♦ నేమిపనికి
గాకమ్రాకట్టెచెడిపోంది ♦ కకునుఁగిన | వన్నెఁగూర్పంగలారలే ♦ తన్నుఁగనమి
నీచులంజేరియామూర్పు ♦ నేర్పునఁబడ | గానఁగ్రారాకపేర్మాయు ♦ నౌనదెగతి. ౧౬౬

ఆ. చదువవచ్చుఁదాను, ♦ జదివినంతకుఁబెచ్చు | వదరవచ్చుఁదనకు ♦ మదము హెచ్చు
కుదురవచ్చునొక్క ♦ కుదిరిక నేర్పుచ్చు | పదవి గ్రుచ్చువారి ♦ యదనుమచ్చు? ౧౬౮.

తే. తెలియనట్టులఁజదువంగ ♦ వలయుఁగాని | తెలిసినట్టున్న నింకేమి ♦ తెలియఁబోదు
తెలియఁగోరంగఁదెలిసెడిఁ ♦ బొలియుదనుక | కొలఁదియప్పటికింకను ♦ గలదనునది. ౧౬౯.

తే. పూర్వపుణ్యంబుతోడ్పడి ♦ పూనికొన్న | ముందెయనువందునొకవేళ ♦ నందకున్నఁ
జక్క నేసెడివెమ వెంటఁ ♦ జక్కఁగఁదగి | నారదునికట్టుకూడిన ♦ తీరువినుఁడు౧౬౯

## నారదుడు గాయకుఁడై గర్వించిన నైనపరాభవము.

సీ. వరుసగంధర్వకి ♦ న్నరులువిద్యాధరు ♦ లచ్చరల్దన్నెప్డు ♦ మెచ్చుకొనఁగ
బాగుబాగనితన్నుఁ ♦ బరిపాటిపలుకుల ♦ గురుఁడుఘూకేశుఁడె ♦ చ్చరికఁదెలుప
ఆడనేతుంబురు ♦ నోడించివైచిన ♦ ట్లతిశయపడఁగల్గు ♦ కుతుకమెప్పు
మేనెఱుంగకరాఁగ ♦ తానపల్లవులన్న ♦ నభ్యాసపటిమచే ♦ నవిసరెపుడ
కంఠకలనాదమువిపంచిఁ ♦ గలసునాడ | మంచులీనముగావించి ♦ మందరాను
మందరంబులనెన్నెని ♦ పొందికలను | బాడవినిగానబంధుండు ♦ పలికెనిట్లు. ౧౭౦.

ఉ. నేరితిచాలకాలమిట ♦ నిస్తపసించిమహోస్త్రగానముం
దేరితిపెద్దపేరుగొన ♦ దేవమునీంద్రుఁడవైననీకునీ
తీరుపునబ్బుటున్నఁగను ♦ తింగనుస్వర్ణముతావిఁజెందిన
ట్లౌరపిహింకనీవరుగ ♦ నౌమహిమోన్నతినొందనౌసదా. ౧౭౧

కం. గురుఁడిట్లననారదుఁడనుఁ | బరమామోదంబుతోడ ♦ భాసిల్లంగాఁ
గఱపితివిద్యనునీకే | గురుదక్షిణయేమియిత్తుఁ ♦ గుమనుపుమనియెన్. ౧౭౨.

చం. అనవినిగానబంధుఁడనె ♦ నయ్యమహాత్ముఁడపీవుగాననా
కనువగుదక్షిణేయుడఁగ ♦ నావినుమంబుజసూతికీపవ
ల్చనిప్రళయంబటౌదనుక ♦ సమ్మతినేహరిసంస్మరింమన
ట్లనుముపరమ్మునాకదిము ♦ దానపూవక్షిణమాంఁదరించెదన్. ౧౭౩.

ఉ. నావుడునారదుండనియె ♦ నక్కలినీవటుకోరుటెంతనీ
చేవకుఁజిత్తశుద్ధికిని ♦ జెందినభక్తికినట్టుకూడఁగా
లావెయజాహ్నమచ్యుతుని ♦ లావరిగాభజియింతువప్పుడా
దేవునియందదైక్యమును ♦ దృఢముగాలభియించుఁబోయెదన్. ౧౭౪.

వ. అని గురుదక్షిణగాఁ దన్మనోభీష్టవరప్రదానంబొనరించి నారదుండు స్పర్థచేఁగాని విద్యఁ దగ్గఁడు తుంబురునతిక్రమింపనూనిన మత్సరంబునఁగదా యేనింతమేటిపాటకుండ నైతినని కొనుచు సాటిలేనిన్నీటునం బాటికెక్కు ధాటి నాకు వాటంబుగా వాటిల్లెనని యుబ్బుచు మార్గంబుగడచుచు స్వర్గపురంబుఁజేరి యరుగునెడం దుంబురుమందిరాంగణంబునఁ గరంబులుతునిగియుఁ జరణంబులువిరిగియు జంఘలులేకయు జానువులు గనరాకయు వక్షంబులుమాసియుఁ గుక్షులంబాసియు స్కంధంబులడఁగియు మూర్థంబులుడిగియుఁ గన్నులుపూడియుఁ గర్ణంబులూడియు నాసంబులువోఁబగియు నాలుకలుచిరిగియు నిట్లనేకభయంకర వికారాకారంబుల బహుశతసంఖ్యాకంబుల భిన్న స్త్రీపురుషకళేబరంబుల హాహానాదవిషాదసంయుతంబులంబొడగాంచి యచ్చెరువంది వివరంబెఱుంగంగోరి వానితో నమ్మునిసరుండిట్లనియె. ౧౭౫.

ఉ. ఎవ్వరుమీరలీగతికి ♦ నెట్టులువచ్చితిరేడునేసెమీ
కివ్వికృతాకృతుల్దెలియ ♦ నేర్పడఁజెప్పుడిజాలిపుట్టునే
చివ్వలనైననిట్లయినఁ ♦ జేరితిరీడకునెట్టులేఁటికి
న్నివ్వటిలంగ నేరిచొట ♦ నేర్తురుచేయుననంగనవ్వియుఁ . ౧౭౬.

కం. రాగములము రాగిణులము । నీగానంబుననుభిన్న ♦ నిజసంధులమై
యీగతికివచ్చినారము । బాగుగఁదుంబురుఁడువాడ ♦ బాగొదుమిటన్. ౧౭౭.

కం. నారదనీగానముచేఁ । గ్రూరావస్థలనుబొంద ♦ గుఱిఁదుంబురుఁడా
నేరుపునఁదీరుపంగా । నీరీతినిజెడిబ్రదికెద ♦ మేమనునంతన్. ౧౭౮.

వ. పెద్దకాలంబెల్లరనెడఁబాసి విద్యావ్యాసంగంబుఁజేసి యందుఁగృతార్థతఁబడసినట్లు మదికి రూఢికలుగఁజేసికొనియున్న యాతపసి వెన్నుండు తన్ను వెన్నంటియె యున్నాఁడనియు నన్నెలవునఁ గాన్పించుచిన్నెలెల్లనాయన్న పన్నుగడలెయనియుఁ దోఁపనెట్లోపు నోపఁదుగావున నోపికకు లోపంబుతారసిల్లుటయు. ౧౭౯.

ఆ. అడఁగెగర్వమంత ♦ యయ్యగారికిఁజింత । పొడమె నేమితోఁప ♦ కడలుచల్ల
నల్లనయ్యఁజేరి ♦ యెల్లకృత్యముఁజెప్పె । వేయియేఁడ్లదితుద ♦ కీయదియును. ౧౮౦.

ఆ. ఘనుఁడునారదుండు ♦ గంధర్వుఁడగుమున్న । మునులయోగమునకుఁ ♦ జనియుటంగల
స్త్రీలమోహదృష్టిఁ ♦ దేరిచూడఁగమును । ల్యాసమీఁగిదాస ♦ జన్మమెత్తె. ౧౮౧.

తే. పూర్వపుణ్యఫుఁబటిమనే ♦ పూనితపము । చేసికడతేరిదేవర్షి ♦ రైయిసాలయని
కీవినొప్పారుననితత్త్వ ♦ భావమెఱుఁగు । గాననేవిష్ణుఁడాతని ♦ గర్వముడుప. ౧౮౨.

ఆ. తలఁచెనట్టివాని ♦ దర్పోద్ధతినిబూని । జరగనీఁగనున్నె ♦ జగతిపన్నె
కాననొక్కకంటఁ ♦ గనిపట్టియేయుంట । జియ్యతనముపాయఁ ♦ జేసెమాయ. ౧౮౩.

కం. అదటుఁచుపాడుమునివిని । మదముడుగవిభుండుహస్తి ♦ మశకాంతరమౌఁ
గదతుంబురునకునీకనేఁ । బదఁపడిమునిఁబిక్కవోఁగఁ ♦ బలికెనతండే. ౧౮౪.

సీ. మత్సరంబునకేమి ♦ మహితగానంబబ్బెఁ ♦ బ్రాప్తానుసారిగా ♦ ఫలితమగును
తుంబురుతెరువేలఁ ♦ దోచినమైనీవు ♦ గంధర్వగానము ♦ లడఁగివినుచు
విద్యపెంపొందఁగా ♦ వెలయుచునిట్లుండు ♦ మిప్పటికినిబది ♦ యెనిమిదవది
ద్వాపరంబందునే ♦ ద్వారకఁగృష్ణావ ♦ తారంబుఁదాల్తునా ♦ తరుణమందు
నీవురమ్మ్రఘ్నునాకొప్పు ♦ నెలఁతచేతఁ । జక్కనేయింతునీగాన ♦ సరణినంత
తుంబురుఁగూడిపాడఁగాఁ ♦ దోడగుదువు । పెంపులకుఁబోయిమర్యాదఁ ♦ ద్రెంపఁగనకు.

## నారదుండు శ్రీకృష్ణభక్తుండయినవిధము.

చం. అనిహరినాఁగనుబ్బుడిగె ♦ వ్యాకులమానఁగనట్టిపట్టిమే
లనువగుఁగానభక్తితగె ♦ నంతటఁగానపుపొందికల్లఁదం
దనలనుమానిశ్రీహరిప ♦ దంబులెయెల్లెడఁబాడుచుండఁగై
కొనియటుసత్యలోకమున ♦ కుంజసెనొక్కఁటధాతఁగానఁగన్. ౧౮౬.

ఆ. తాతకల్లఁదలిపి ♦ తాఁగానమొనరింపఁ । భీతుఁడగుచునతఁడు ♦ ప్రియముఁజూపి
విష్ణుమాయఁదెలిపి ♦ వెల్లడిచేయక । చూపెదారియతని ♦ కాపగిదినె. ౧౮౭.

కం. హాహాహూహూలనఁగా । మాహాత్మ్యముగానమందు ♦ మసఁగినవారి
న్సాహాయ్యంబొనగూర్చి । సాహిత్యముపెంపుగాఁగ ♦ జరగుమటనియెన్. ౧౮౮.

ఉ. అట్టిలమేఁటిపాటకుఁడు ♦ నైయురమేశ్వరుమాయపెంపున
స్గట్టిఉఁగింగలేకబలు ♦ కూరిమివిష్ణునికీర్తనంబులే
షట్టునఁబాడుచుండిబహు ♦ భక్తివిశేషతనొప్పితుంబురు
న్మట్టిడివైతమన్నయల ♦ మూర్ఛనఁబోసెఁగ్రమక్రమంబుగన్. ౧౮౯.

కం. కృష్ణావతారమందు । న్విష్ణుడుతనుదీర్చునవఁగ ♦ వేద్యంబగుదుం
గృష్ణాకృష్ణాయనుచునె । కృష్ణునకెచ్చరికచేయఁ ♦ గీర్తనఁబాడున్. ౧౯౦.

కం. పాడుచునానందంబున । నాడంగాఁదోడగుఁజూప ♦ అచ్చెరువందఁ
గూడందెవ్వరిపల్లకి । వీడఁడుమదిలోనభక్తి ♦ వీడండట్లే. ౧౯౧.

ఆ. నారదుండుమిన్న ♦ నారాయణునిభక్త | వారమందటన్న ♦ వాసిఁగాంచె
రాగరుచినిభక్తి ♦ రామణీయకమగు | రీతికనుదురదింక ♦ నేతపముల. ౧౯౨.

కం. నారదగానాభ్యాసం | బేరెటిఁగినదుడుకనుగూర్చు ♦ నేపుడుగంగా
దీరుదురుభక్తులగుటకు | ధారుణిగానంబొకింత ♦ తమకలవడఁగాౝ. ౧౯౩.

కం. అనివాల్మీకమహాముని | వినుపింపఁగమానులకిది ♦ విశదంబగుడు
న్ననసీతాజననముహరి | యునుబుట్టఁగనైనదంత ♦ యుఁదెలుపవేనాౝ. ౧౯౪.

---

తన్వి. భూధరజాంభోరుహదినకరశం ♦ భూధరణీధరధరశరదేవా
భూధరచాపాహరదళితమనో ♦ భూధరణీరథసదమలభావా
వేధితపాపాకృతనిగమహయా ♦ విశ్రుతభీకరపురహరవీరా
బోధితమానీంద్రపటలసదయా ♦ పుష్కరకేశకనకనగధీరా. ౧౯౫

మదనదర్పణము. సారసభవసారసాక్షవా ♦ సవాదిపూజితా
చారుబహుమణిప్రభాఢ్యశే ♦ సహార రాజితా
వారిజరిపుపుష్పమాళిదే ♦ సమానివందితా
నారదముఖవేద్యనందగా ♦ నతానవందితా ౧౯౬.

ప్రహరణకలిత. కరధృతకలశా ♦ గళధృతగరళా
తరళితసుయశా ♦ తనుగితబగిళా
సురవరనరదా ♦ సురుచిరకరుణా
విరళితపదధా ♦ విధిముఖహరణా. ౧౯౭.

ఇది శ్రీమన్మేధాదక్షిణామూర్తీశ్వరాక్షీణవరప్రసాదలబ్ధకవితాభాగధేయ
నాదెళ్లపురుషోత్తమ నామధేయబుధవిధేయప్రణీతంబైన
అద్భుతోత్తర రామాయణంబున
తృతీయాశ్వాసము.

## శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః.

## చతుర్థాశ్వాసము.

కం. హృతమదనదళితశమనా | సతతాసురవీరకదన ♦ జయశశివదనా
సుతరదనాంచితమండన | హితకైలాసాద్రిసదన ♦ హితసౌఖ్యదనా. ౧.

వ. అవధరింపుము వాల్మీకిమహర్షి మునిప్రవరప్రకరంబు నాలోకించి సీతారామావతారవిధానప్రకరణంబు సాకల్యంబుగను బూర్వరామాయణకథా ప్రశంసనంబు సంగ్రహంబుగను జెప్పంబూనియిట్లనియె. ౨.

### సీతారామావతారనిరూపణము.

మ. ఒకకార్యంబుఘటింపనైనవిసరం ♦ బూహింపనేమేమిగా
ప్రకటింపంబడనొకతంబులచట ♦ న్భాసిల్లుసామాన్యమం
దికలోకాధిపులంతవారలిలపై ♦ నెత్తంగనౌజన్మకె
న్నికకెన్నేనియొకారణంబులరయ ♦ న్నిగ్గైనవిట్లొప్పవే! 3.

ఉ. నారదమౌనిశ్రీమతికి ♦ నాఁడిడుశాపమునింకనిప్పుడీ
శ్రీరమకిచ్చినట్టిదియుఁ ♦ జేరియుటుండఁగనొక్కమానిపెం
పారినభక్తిలక్ష్మిసుత ♦ నాటకొనర్చినదీక్షకూడశ్రీ
ధారుణిజాతరాక్షసిజ ♦ తన్మునిపుత్రియునయ్యెసీతనాఁగ. ౪.

సీ. సనకసనందను ♦ ల్సంచారవశమున ♦ వైకుంఠపురిఁజేర ♦ వచ్చిరొకఁట
కాలవశంబున ♦ ఘనజయవిజయులు ♦ వారినడ్డశపించి ♦ నారలైరి
ఘోరరాక్షసులయి ♦ కుంభినిజన్మించి ♦ హరిచేతముమ్మారు ♦ హతులుగాఁగ
వారట్లుపుట్టిపెం ♦ పారుతపముఁజేయఁ ♦ దగువీలునధింపఁ ♦ దానుహరియు
నవతరింపంగవలసిన ♦ యదియుఁగూడఁ | దొంటినారదుశాపంబు ♦ జంటచేపి
పూర్వపుణ్యాప్తదశరథ ♦ భూమివిభుని | పుత్రకామేష్టిరాముఁడ ♦ న్పుత్రుఁడయ్యె.

కం. సనకసనందనులట్లనఁ | గనెగాంగేయాక్షికోసక ♦ కశిపులనంగా
మునుజయవిజయులుపుట్టిన | ఘనకటినృహరియునయిహరి ♦ కడతేర్చుటగాఁగ. ౬.

సీ. నారాయణోదర ♦ నాళీకసంభవ ♦ ధాతృదేవునియొక ♦ తనయుఁడైన
ఘనపులస్త్యబ్రహ్మ ♦ కనురాగపుత్రుండు ♦ దగువిశ్రవస్సను ♦ ధన్యుఁడొండు

ఆతనితరుణులు ♦ యందొకర్తు కైకసి ♦ యామెకుఁ బ్రభవించి ♦ రాత్మజులయి
రావణకుంభక ♦ ర్ణావతారములిట్లు ♦ జయవిజయులమరు ♦ జన్మలరయ
కులముఖున నైనఁగొఱగాని ♦ గొనకులనుర | గరళమల్లపయోరాశిఁ ♦ గలిగినట్లు
లయ్యెమార్పునకుసుతుఁడగు ♦ నసమునకుఖుఁడు | వినమెప్రహ్లాదుపుట్టువు ♦ వింతగాదె!

తే. కాననెప్పుడుగుణమెన్న ♦ నౌనుగాని | కులముననేవానిఘనతకుఁ ♦ గొఱతకెన్న
నాతురింపంగరాదందు ♦ హానిపొందు | వైపరీత్యంబునకుజాలి ♦ వలనులేతగు. ౯.

కం. అట్టులఁబుట్టినరావణుఁ | డెట్టిమహావైభవముల ♦ నెసఁగెనొయాచో
ప్పిట్టిదనిమున్నె తెలిపితి | నట్టిదిమఱిచెప్పనేల ♦ నధికమువినుఁడా. ౧౦

ఎండవానలకెదురెత్తగు రావణుతపము.

ఆ. అతఁడుచేసెఁదపము ♦ నధికనిష్ఠనుబూని | శీఘ్రముగనువరముఁ ♦ జెందఁగోరి
మోటుతనమునాక ♦ పాటులువడియెను | జూచిమునులుమిగులఁ ♦ జోద్యమంద.

సీ. ఒక్కనాఁటికెయల్ల ♦ బక్కచర్మపుమేని ♦ జంతువుల్మొకలు ♦ సమసిపోవ
మఱునాఁడెఁకంగొన్ని ♦ చిఱుతతిర్యక్కులుఁ ♦ గుమిలినయాకులుఁ ♦ గూలిపడఁగ
అంతటనొగినిజ ♦ లాశయంబులవెల్ల ♦ నింకఁదద్గతజీవు ♦ లీల్గియడఁగ
అపుడప్రమాగ్ధ్యు ♦ లలగృహస్థార్భకు ♦ లుఁగూడనేఘుతో ♦ లంగిచాఁగ
తీక్ష్ణతరదీప్తిపృష్ఠులు ♦ తేజరిల్లె | నూదినట్లయిలోలోన ♦ నూపిరగొన
వేడిగాడుపుచెలరేగి ♦ మాడుపంగ | భువనమంతయుసంతాప ♦ పూరితముగ. ౧౧.

కం. ఇలనిట్టులఁదపతపఁపడ | నలనలుదిశలందునాతఁ ♦ డగ్నిజ్వాల
ల్కాలుపుకొనినడుమనెలకొని | బలునియతిందపమొనర్చెఁ ♦ బటిమఁగనితిరే. ౧౨.

సీ. క్రాగియుండిననేల ♦ మ్రాగఁగనమవగు ♦ వలనునకునేమును ♦ దొలుకరించి
పనములూర్జనకభు ♦ వనమెల్లవనమయ ♦ మననొనరించియుం ♦ తనువిద్ధువక
భోగంబులంబాసి ♦ రోగులైనరులేద్వ ♦ నేగతిఁదాఁబూనె ♦ నాగుటేఁబడి
యుఱుముచుమెఱయుచు ♦ వెఱపుగముసరుచు ♦ వలిగొనిదూషణ ♦ ములనుజేయు
బడుచునైననుపీడని ♦ గడుసువాన | షైనఁబడుట్ఘుండఁబ్రక్కపో ♦ టూనఁగొండ
లెక్కపడివడివచ్చున ♦ మ్మక్కయనఁగ | వెల్లువలువాఱునెల్లరుఁ ♦ దల్లడపడ. ౧౩.

కం. అలవర్షకాలమందు | న్నెలయేఱులక్రిందనిల్చి ♦ చేసెఁదపంబా
యలఘుఁడురావణుఁడెంతటి | బల్లియుఁడో తెలియుఁడుతని ♦ పటిమముఖోర్దల్. ౧౪.

సీ. బక్కవారలనెల్లఁ ♦ బట్టిపీడించెడి ♦ నెక్కుడిదిదియన ♦ నేమొపలిడి
దుష్పటులందును ♦ దూఱుచున్న దెయులి ♦ త్రుప్పుదుగుడ్డలఁ ♦ గప్పికొన్చు
మూలగొందులలోన ♦ వీలొనరుమకొని ♦ యటమూఱిపడకుచు ♦ నందఱుండ
కొందఱగ్గులపఱిఁ ♦ గూర్చుండఁగానన్య ♦ జంతువుల్మ్రదుగుచు ♦ జడిగొనంగ
జరగజడిస్థిరయెకాఁబోలు ♦ జాగురాక | వేఁగఁబోకలఁదగుఁబ్రొద్దు ♦ నాఁగదినము
లిట్టిప్రహస్వంబులైరాత్రు ♦ లట్టిపెఱుఁగ | నెంతనిద్రింపలేవనీ ♦ నంతదిచలి. ౧౫.

కం. ఆశీతకాలమందుజ | లాశయములగొంతుబంటి ♦ యంబులఁదగివా
ణీశుంగూర్చితపంబుమ | హాశ్వంబడిచేసెనాతఁ ♦ డాశ్చర్యముగాన్. ౧౬.

చం. పనివడియాతఁడిట్టులఁద ♦ పంబొనరింపఁగదానితీవ్రమే
ర్చినభువనంబులెల్లఁగడుఁ ♦ జింతిలసాగెఁదదద్భుతంబుఁదాఁ
గనుఁగొనివారిజోద్భవుఁడు ♦ గానఁగనయ్యెనువానిముంగలం
దనవగునుక్తియుక్తులకు ♦ ధాతరహింగనఁదానుతించెడిన్. ౧౭.

## రావణుఁడుబ్రహ్మను నుతించుట.

ఉ. ఓకమలాసనామునిజ ♦ నోత్తమసద్హృదయాబ్జభాస్కరా
శ్రీకరభారతీరమణ ♦ చిత్తసరోరుహమత్తబంభరా
లోకములన్సృజించితగు ♦ లోలతఁబెంచియులొట్టవోవఁగాఁ
జేకొనిచేసియాపనులె ♦ చేయుదువెల్లెడఁజిత్రమెన్నఁగన్. ౧౮.

ఉ. అన్నిసృజించినందులకు ♦ నన్నిఁటినిక్కపుఁబ్రేమఁజూతువీ
వన్నియునిన్నెతఁడ్రిగమ ♦ హామహిమల్గలవేల్పుమేఁటిగా
నెన్నికొనుంగధాతగవి ♦ దేయగునోపరమేష్ఠికొంపఱి
న్వన్నెగనింకఁగొందఱిని ♦ వంచనఁగానవుపూజ్యతేయిదే. ౧౯.

ధృవకోకిల. కనుకనేనినునమ్మినాఁడను ♦ గావఁగాదయఁజూడఁగా
వినితినీమహనీయకీర్తిని ♦ పీడఁగాకొనియాడఁగా
ననుగృతార్థునిజేయకుండిన ♦ నాయమాసముపాయమా ?
ఘనులుదీనులఁబ్రోవకుండఁగ ♦ గ్రాహ్యమాగణనీయమా ? ౨౦.

శ్లో. వందేవిశ్వసృజంజగత్స్థితిలయప్రఖ్యాతహేతుంముదా
మానీశార్చితపాదపద్మయుగళం వేదాంతవేద్యంవిధిం

హేమాద్రిప్రతిమానసుందరతనుం వాణీమనోహారిణం
సత్యాధిష్ఠితసర్వలోకపితరం లోకేశ్వరంశాశ్వతం. ౨౧.

శ్లో. లోకేశశాశ్వతీదయాపరపుణ్యమూర్తే | మౌనీంద్రచంద్రవిబుధార్చితపాదపద్మ
కామాపహారిసమసత్త్వనిధేనమస్తే | వాణీమనఃకుముదపూర్ణశశిన్ ప్రభోహం. ౨౨.

కం. పుట్టింతువుభువనమ్ముల | గిట్టింతువు పెంచియవ్వి ♦ కృపఁ గైకొన్న
న్నెట్టింతువుసత్త్వదమును | బట్టింతువుభద్రదశను ♦ భక్తులకునజా. ౨౩.

కం. అనివినుతించెడిరావణు | వనజోద్భవుఁడపుడుకాంచి ♦ వాత్సల్యమునం
గనిమెచ్చియోయిభక్తా | మనమునఁదలచునదిచెప్పు ♦ మాయనియడుగన్. ౨౪.

తే. నాకునమరత్వమిమ్మని ♦ వీఁకతోడ | రావణుండనుపల్కిన ♦ కావిధాత
నాకలేదద్దియేన్నట్లు ♦ నీకునిత్తు | కోరుమింకొండుకాఁదమి ♦ తీఱనుండు ౨౫.

తనకుమార్తెను వలచిననే తాజచ్చునట్లు రావణుడు వరముఁగొనుట.

కం. అనఁదనమనముననున్నది | యనకాచినఫలితమొప్పు ♦ దనియెంచుటచే
వినయమునమరల్ప్రమొక్కియు | వినుతించియుననియెనిట్లు ♦ విధివెఱఁగందన్. ౨౬.

చం. ఘనమగుకామకత్వమెదఁ ♦ గ్రందుకొనుంగద నాకునేనెటే
వనితనుగూడఁబట్టినను ♦ వందురుపాటయిదానచాకనా
తనయనుభ్రాంతిఁగూడఁగనఁ ♦ దప్పకముప్పుపుడొప్పునట్టులే
మనమునసాపయింగరుణ ♦ మక్కువఁజెంచివరంబొసంగవే. ౨౭.

ఆ. అట్టులైననన్ను ♦ నమరులుగిమరులు | చెనకలేరికేమి ♦ మనుకలేరు
నిజకుమారిగనయ ♦ నేఁగోరునంతకు | నాకమరతెకల్గుఁ ♦ గాకికేమి. ౨౮.

ఆ. పుట్టినప్పుడీవు ♦ పెట్టినదుండమే | ల్చల్మిఁగంటినీదు ♦ భక్తుఁడనయి
యైనఁగోరికొందు ♦ నమరాధిపులెవండ్రు | నన్నుఖీఱరనుచు ♦ నెన్నికనను. ౨౯.

కం. అనిరావణుఁడడుగంగా | వినియావిధివిస్మయంబు ♦ వెఱపుఁబెనఁగొనం
గనునీకోరినయాతీ | రుననానని పల్కితాఁది ♦ రోహితుఁడయ్యెన్. ౩౦.

రావణుండుముల్లోకములజయించినవిధము.

మ. కృతకృత్యుండయిరావణాసురుఁడువే ♦ గేహంబుమున్జేరిసం
తతలింగార్చనవేదపాఠకతలం ♦ దామేటినానొప్పుచు
న్ప్రాతదిక్పాలకసర్వసంపదుఁడుగా ♦ ఘోరాఖ్యధైర్యంబున
న్దితిజానీకముఁగొంచుఁగాంచెజయము ♦ న్దేదీప్యమానంబుగన్. ౩౧.

సీ. దేవేంద్రుఁ డీవెల్ల ♦ నావిరి గానూది ♦ యగ్నిదేవునినిగ్గు ♦ నుగ్గడంచి
దండధరుని మెండు ♦ గండగత్తెర నేసి ♦ నిరుతికిఁ బరిణతి ♦ విరతిఁ జూపి
వరుణునివరణమా ♦ వరణంబులను బాపి ♦ వాయువు నాయువు ♦ డాయఁ జేసి
ధనదునిమునుదగు ♦ పెనుదడఁ గనదించి ♦ యీశానునిని వేశ ♦ నాశనునిచి
గ్రహములన్నింటినొకమూల ♦ గృహముఁ జేర్చి । ద్వాదశాదిత్యులకుఁ బెద్ద ♦ యాదరలిడి
పేరిటులఁ గొన్న యంపతి ♦ పేర్మిమాపి । రావణుం డెచ్చె భువనవి ♦ ద్రావణుఁడయి. ౩౨.

చం. భువిఁ గలరాజులెల్లరను ♦ భుక్తికిమాకునొసంగుమయ్యయీ
యవనికి వేల్పు మేఁటులన ♦ టాచినపీరుఁడవీవు వత్తెమా
జపములు చాల వేయనుచు ♦ సైనిక రాక్షసులేగి యేపునం
దవిలి జయంబుఁ గొన్నఁ దన ♦ ధాటి దశాస్యుఁడు నించె ధారుణిన్. ౩౩.

కం. పాతాళ నేతలెల్లరు । నాతాకుడు తెలిసి మున్నె ♦ యాతురపడుచుం
బ్రీతిని గప్పము లొసఁగిరి । ఏతహతహ లందకుండి ♦ రిఁక వివరింపన్. ౩౪.

కం. ముల్లోకంబులు గెలిచిన । యుల్లాసము దక్కనీని ♦ యొకకొఱఁతకునై
యల్ల దె దండక వనమున । గొల్లలు గా మున్ద్రుమౌని ♦ కుంజరులను చున్. ౩౫.

వ. రావణుం డేకతంబ నిర్భయంబుగా వెడలి దుర్భరతపో మహిమా విఖ్యాత సౌఖ్య సందర్భంబులనున్న యా నిర్భేద్యులఁ దెలియుంగాన నాస్వర్గానుతోషుం డార్భాటంబులు సేయక సామంబున నిట్లనియె. ౩౬.

రావణుఁడు మునులను మేనిరక్తము గిఁటికొన నొప్పించుట.

చం. ఘనులర టంచు నమ్మితగు ♦ గౌరవమీయఁ దలంచి మీకు నే
మనవి యొనర్పఁ బూనితిని ♦ మన్ననఁ గైకొన నెంతు రేని నా
ఘనతఁ గళంక మెప్పుమికిఁ ♦ గామిము నేను జయించినట్టి లా
ననికొనఁ జిహ్వ మెద్దొయొక ♦ టారసి చేయసహింత్రె చెప్పుఁడీ. ౩౭.

ఆ. ఆత్మహస్తనఖము ♦ లాని చిమీ మేను । లందు రక్తమింతొ ♦ యంతొ కొనఁగ
దృప్తినాకుఁ గల్గుఁ ♦ దెల్ప రేయది మీకు । నిష్టమే నొనర్తు ♦ నేమి చేయ. ౩౮.

శా. కాకున్నం బలు బాము లెన్నొ పడఁగాఁ ♦ గల్పించుచున్ మిమ్ము నే
లోకంబందు వసింప నేగినను మీ ♦ లోచూపులం బాపుచ
న్యోన్యకు యోగ్యయనియంగ లార్పవినకే ♦ హుంకారముల్ సల్పుచు
న్వీఁకన్ నష్టములందఁ జేయుదుఁ గన ♦ న్విష్ణుండు గిష్ణుం డనన్. ౩౯.

తే. పలుకువినఁగనెలోనఁబెం ♦ పలుకుగదర | నీసునాసీరజయుఁడుఁడా ♦ నీసుఁగన్న
వంతలోనగూర్చునప్ఫుర ♦ వంతయైన | గతిగలుగఁబోదుఃపిన్నసం ♦ గతిఁగనంగ. ౪౦.

సీ. తాసమానులలోనఁ ♦ దక్కువదళగిన ♦ నలసమానుఁడపోని ♦ సలుపనైన
నద్దివంచనయయి ♦ యుద్దిమానుపఁగరే ♦ పగలనకల్లాడ ♦ పగలఁబుచ్చు
ఘనుఁడొకానొకవేళఁ ♦ గనలివంచింపంగ ♦ నొంటిగానోనైన ♦ గంటుపడును
అదియుఁబల్వురుగూడఁ ♦ దుఁదినదుఃఖంబహు ♦ భిస్సహాయననగు ♦ బిమ్మిటిడదు
హీనుఁడెపుడునురేగుఁడా ♦ నెగ్గుచేయు | వంచనముఃసాధుఁడందును ♦ వర్తనమిది
ఇందులనుగూడనందొఱ ♦ ముందుమెకద | వంతనాకొప్పుఁదగుమన ♦ వంతనుకొని. ౪౧.

చం. జయమునమేటినొదునని ♦ సత్తునపేర్మిఁదలంచిధీరత
న్భయనముసేసిలోకముల ♦ భాసిలువీరులనుగ్గడంచియే
భయమునులేనిశూరుఁడగు ♦ బ్రహ్మకులీనుఁడునద్వితీయుఁడే
నయముననొక్కపంగనియె ♦ నర్మిలినొప్పినసర్మమెప్పునే. ౪౨.

కం. ఎద్దెటులనున్నమనమీ | సుద్దినెలోఁబడినమనలఁ ♦ జూచునెపుడుఁడా
ముద్దుగనిటుగాకున్నను | రద్దికిఁదెచ్చెడినిబ్రదుకు ♦ రాయిడిఁబుచ్చున్. ౪౩.

ఆ. కానవొప్పికోలె ♦ కడుననుననుచును | నిశ్చయించిమునులు ♦ నియతినీది
నెరపికొనుటెమాకు ♦ నిర్ధారణపశాస్య | పనిఁబడంగఁజూడు ♦ మనినవాఁడు. ౪౪.

కం. తనదక్షిణకరనఖముల | మునులశరీరంబులందు ♦ మెఁగినొకటొకఁటం
జొనిపియసృగ్బిందువులను | గొనివామకరంబులందుఁ ♦ గూర్చికొనియటన్. ౪౫.

## గృత్సమదుడు లక్ష్మినావహించిన కలశమున వాడానెత్తురు పోసిపైకొనుట.

చం. కనుఁగొనియొక్కకుంభమును ♦ గ్రక్కుననందలరక్తమెల్లఁబో
యనయినఁగాంచిగృత్సమదుఁ ♦ డన్మునియల్లఘుటాధినాథుఁడా
ర్చినవినిచీరికింగొనక ♦ శీఘ్రమతక్కినవారిలోహితం
బునుగొనువానికార్యమునె ♦ పూనెనిఁకేమియువాఁడెఱుంగిమిన్. ౪౬.

సీ. అలగృత్సమదుఁడొక్క ♦ బలియుఁడౌకొమరుని ♦ మునుగాంచియంతకే ♦ మోదపడక
చిరతపోమహిమచేఁ ♦ జెందినపటిమను ♦ దామనస్ఫూర్తిగాఁ ♦ దలఁచికొనియు
దగుకడంకనొనర్పఁ ♦ దనయగాశ్రీదేవి ♦ తనకేర్పడెడినంచు ♦ ననుదినంబు
సాభిమంత్రంబుగా ♦ జలబిందువులపైదు ♦ క్షీరబిందువులైదుఁ ♦ జేర్చునదియె

ఫలముగన్నకాలమాసన్న ♦ పడునటంచు । దలఁచికొనితన్నిరీక్షణ ♦ తత్పరుఁడయి
యుండనట్టిఘటంబున ♦ నుంభితమ్ముగ । నెత్తురేసియుఁగొనిపోఁగ ♦ నెత్తదేవగ. ౪౭.

కం. కావునగృత్స్నమదుండపు । డావురుమనైనైనవాఁడ ♦ ట్లాలించెడినే
వావిరిఁదనకార్యంబును । దావేఁజేసికొనిపోయెఁ ♦ దత్కలశముతోన్. ౪౮.

## దుడుకువాండ్రు యాగడపుపనులు.

ఆ. దుడుకువాండ్రకెపుడు ♦ దూరపుయోచన । దూరకుగనుగాని ♦ దూఱనగునె
యెన్నియెట్లపోయి ♦ యేమెగ్గుపుట్టినఁ । బాముతలఁచినంత ♦ కామివిడరు. ౪౯.

కం. యుక్తాయుక్తములెఱుఁగరు । వ్యక్తియెఁకింతయెఘటిల్లి ♦ వాకొనఁజేయం
దవ్యక్తములెయందుచుండ్రా । సక్తియెటోయటులెవేళ ♦ చక్కఁజూడమిన్. ౫౦.

కం. అదియెద్దిగిలఁగఁదన్నుదు । రిదిబోరగిలంగఁద్రొక్కు ♦ చేగుదురింకే
రెదురైననోదుగికటునిటు । నెదురుగనేనడతురన్న ♦ నేమెఱుఁగమిచేన్. ౫౧.

చం. శమమెదలేమినేరయినఁ ♦ జాలరెఱుంగఁబరాపవల్మహా
శ్రమపడివారలేడ్చినను ♦ జాలియుఁజెందరెఱుంగిలేమినే
తమకపుడెన్నరేనిదరి ♦ దాకొనినెమ్మదిపుచ్చితెల్పఁగా
నమరినశాంతియట్టిడుమ ♦ హార్తినినొచ్చుకొనంగఁజూడనౌ. ౫౨.

ఉ. తిన్ననిబుద్ధిమంతులకె ♦ తీరిదియోరిమిలేమినయ్యెడి
న్మన్నెదయావిహీనుఁడగు ♦, మూర్ఖుఁడురావణుఁడట్టివానికి
యెన్నఁగరానిగొప్పజయ ♦ మేర్పడియుండనిఁకేఁటియోర్పువో
మిన్నునుమన్నుగానకయ ♦ మీఱియుఁకేమెఱుఁగండుచెల్లదే. ౫౩.

తే. కానఁగొనరానికలశంబు ♦ గైకొనియును । జేతులంగాఁరక్తమ ♦ టాతురముగఁ
బోయుచేతక్కఁదత్స్వామి♦పొగలవినక । కొఱతపనితీర్చిచేరని♦ల్కొనియదియును.

వ. ఇట్లుదశకంధరుండు మునిసింధురుల జయించి వారిక్షీరలోహితమిళిత చిత్రవర్ణయుత
సారపూరితంబగు నక్కుంభంబుఁగొని నిజపురంబునకరిగి నగరుచొచ్చి సౌధాంతరంబున
కెక్కిమనోహారిణి యగుమందోదరిఁజేరఁబిలిచి మిషగానిట్లనియె. ౫౫.

## అదివిషకలశమని రావణుడు సతికిచెప్పి దాపనిచ్చుట.

మ. వనితాయిద్దిగరంబుదీనికొఱకే ♦ వాంఛించియేదీర్ఘకా
లనివాసంబటఁజేసికైకొనితిఁజూ ♦ లంగార్యమిద్దానిచే
నొనగూడంగలదీడలక్ష్యమునవీ ♦ వుంచంగఁగాపాడఁగా
ననువౌనేపెరవారికీఁదగదటం ♦ చన్నన్భయభ్రాంతయై. ౫౬

కం. అట్టిది సురక్షితంబుగఁ | బెట్టఁగదా శ్రేయమగును ♦ బెరలకునీఁగా
గుట్టుచెడు నింకపాయము | పుట్టంగాఁ జెల్లునేలెఁ ♦ బూనెద నేనే. ౫౭.

తే. అనుచు మందోదరియుఁ గొని ♦ యద్దియొక్క | గూఢమగు చోటఁ డాచియు ♦ గుఱుతుపెట్టి
కొనియటుండంగ నాదశా ♦ ననుఁడొకప్డు | దాడివెడలెను గీర్వాణ ♦ ధామమునకు. ౫౮.

కం మున్నదిజయించి యాతఁడు | క్రన్నన మరలంజనంగఁ ♦ గారణమెవరుం
గన్నారుగారు వేల్పుల | యన్నులఁ జెరగొననెసుండి ♦ యాశయమెదనొ. ౫౯.

## రావణుడు స్వర్గమునుండి దేవతాస్త్రీల చెరగొనిపోవుట.

చం. పడినతఁడట్లువో సురలు ♦ వారిరి పూరుషులెల్లఁ గన్ననే
యడలుచు మొన్న నీనడుమ ♦ నాతని బారినిబడ్డ నాఁటి యా
బడలిక తీరకుండఁగనె ♦ పట్టఁగడంగెడి బమ్మరక్కసుం
డెడయును లేని పోరులకు ♦ నెక్కడఁ జొత్తుమటంచు నేడకో. ౬౦.

ఆ. శూరుఁడాతఁడౌటఁ ♦ బోరవచ్చెనటంచు | నమ్మికొంద్రు కాని ♦ యమ్మగువలఁ
బట్టవచ్చినట్టి ♦ పలుగాకియనికొన్న | నిలిచిచత్తురటక ♦ బలలఁగొంద్రు. ౬౧.

తే. కానితమప్రాణధనముల ♦ నానెలవుల | నట్టులసహాయగతిఁ బెట్టి ♦ యరుగుదురెటు
తాము వోయిన విన్ననే ♦ తామరలెడి | శూరధర్మంబదే యని ♦ వారితలఁపు. ౬౨.

కం. వానిదురూహ యెఱుంగక | పోనమరులు దండునెల్ల ♦ పురినిల్పి యుఁద
న్మానినులఁ బట్టుకొని చనెఁ | దానలసహ్యాద్రిఁ జేరి ♦ తరుణులఁ గవిసెన్. ౬౩.

వ. తానెత్తివచ్చిన యాధాటిపోకెల్ల పాటిమాలిన నీటుల నాబోటికోటుల కూటమితో
వాటంబడఁ జేయఁదలంచినన్. ౬౪.

సీ. తమిదీర వేర్వేరఁ ♦ దరుణీమణులనెల్ల ♦ గజిబిజిగొనఁ బొగి ♦ కౌఁగిటనిడు
దశవిధచుంబన ♦ దశకంబులను జుంబ ♦ శతకంబులయుపరి ♦ మితము గొనుచు
చౌశీతిబంధము ♦ ల్చాతుర్యముకొలంది ♦ వివిధకాంతలతోడఁ ♦ విరివిగఁగను
బహ్వాగరావృత ♦ పానపుష్టి నిమీలు ♦ చెడమింతయును లేక ♦ యేపెనంగు
తనదు దంతనఖక్షత ♦ ఘట్టములను | పూవుబోండ్లశరీరము ♦ ల్పులిపులియయి
సొమ్మసిల్లినఁ గనబోఁడు ♦ దిమ్మరీఁడు | ఇల్లు రాజ్యము నిల్లాలి ♦ నెల్లమఱచి. ౬౫.

చం మునిఁగియదేసదా పనిగ ♦ మోహియతండటనున్న విన్నయా
తనిసతియల్లగర్హ్యమునకే ♦ దప్పక ముప్పుఘటిల్లు వానికం
చనికొని చింతిలందొడఁగె ♦ నట్లెటకోచని దేవతావళు
ల్వనఁటను బొందుచుండిరట ♦ వాని మహోద్ధతిఁ జానలట్లు లే. ౬౬.

కం. ఎడఁబాసిసురలటడలఁగ | నెడమయిపతిజాగుగొనుట ♦ కింతియుడలఁగా
నెడమీయమిసతులడలఁగ | నెడనింకొకతలంపుగదుర ♦ నేవాఁడడలున్. ౬౭.

## ఆకలశవిషము మందోదరి ద్రాగగా లక్ష్మిగర్భమున బడుట.

ఉ. ఇట్టులఁబెక్కుహాయనము ♦ లిల్స్కరియించమిసచ్చురాకయే
పట్టునఁగానరామిఁదన ♦ భర్తృని రాశనుజీవితేచ్ఛపైఁ
బుట్టినరోతఁదద్రమణి ♦ పూర్వవిషాప్తిఘటస్పృహంబడ
గ్గట్టనదద్దిగైకొనను ♦ గొబ్బునఁగ్రోలనునయ్యెనట్లుగాన్. ౬౮.

వ. చిరకాలంబు మగనిబాసిన విరాగంబును మరలఁదద్దర్శనంబు లభించుట కల్లయను రూఢియుంబెనగొన భర్తనెడబాసియుండుఁబ్రదుకుకురోసి యెవ్వరునెఱుంగకుండఁజత్తమని తననమ్మిన యాకలశ విషమెల్లంద్రాగగా. ౬౯.

శా. ఆపూనీంద్రుఁడుచేసియుండినమహా ♦ హర్షప్రయత్నంబునం
దామాదేవియచేరుపడ్డదగుటం ♦ దైత్యాంగనాగర్భమాఁ
గామున్నందినశాపముంగలిసిరాఁ ♦ గానింకమానీంద్రర
క్తామేయంబునదయ్యెనంచుఁజొరఁగా ♦ నందొప్పఁగాఁజొప్పడేన్. ౭౦.

మ. వెలుఁగొందన్దిశలెల్లగర్భమునసా ♦ వేశించుశ్రీదేవితో
నలమందోదరిబైటరాఁగనెడివా ♦ రాశ్చర్యమున్పొందఁగా
ఫలమద్దేకనసైనచిహ్నలాదవం ♦ బ్రాప్తించుటల్గాంచియా
యలివేణీమణివెల్లవాఱెమునుపే ♦ యావెల్లవాఱంగినన్. ౭౧.

ఆ. లోనఁజేరియున్న ♦ లోకనాయకిమాయ | మునిఁగియితరవిషముఁ ♦ గొనఁగఁబోక
గర్భమందువెల్గు ♦ ఘనపదార్థపుభార | మాపలేమిదేని ♦ కోపకుండె. ౭౨.

ఆ. దైవచిద్విలాస ♦ ధర్మంబదట్టిట్టు | కలిసివచ్చుఁజూడుఁ ♦ డలగిమనిక
తెలిసినంతయైన ♦ మెలపికోనేరము | కలుగఁగారణములు ♦ గనఁదలఁతుము. ౭౩.

ఆ. చూడఁడింకదీని ♦ చోద్యంబదేమానో | లేరభూమిదైత్య ♦ నారులింక
మరుగుపెట్టియుల్ల ♦ మందోదరికిఁబుట్టఁ | గూఁతురసురపతికిఁ ♦ గోతఁగూల్ప. ౭౪

కం. ఇఁకభూమిజాతనూటకుఁ | బ్రకరణమెట్లన్నఁదెలియఁ ♦ బలికెదవినుఁడా
యకలంకరావణాంగన | యొకటని కొనవేఱొకండ ♦ టొప్పఁగభీతిన్. ౭౫.

శా. అయ్యోయేమి దురాసదంబిదికదా ♦ యన్యాయిదైనాథుఁడా
సయ్యాటల్గొనెనంచుఁజూఁదలఁచి నే ♦ సంప్రీతినీలంపటం

బెయ్యాప్యాయతఁ దాగియుంటినిదినా ♦ కెట్లైన ప్రారబ్ధమో
వెయ్యారుల్లనువారువల్కెనను ♦ స్వేద్యంబుగర్భంబు గాఁగ. ౨౬.

ఆ. తానొకండుతలఁప ♦ దైవమొండుతలంచు । నంద్రులోకులిట్లు ♦ యూటఁగాదె
వేగపడుచునోరుని ♦ వెఱపింపఁగాఁబోయి । వెఱచివచ్చునట్టి ♦ విధమిదయ్యె. ౨౭.

కం. తానెన్నిదుష్ప్రవర్తన । లూనియొనర్చినను బురుషుఁ ♦ డొప్పెడిఘనుఁడై
మానినికళంకినైనను । హీనులచేఁగూడనింద్య ♦ యేంటుగుఁగాదే. ౨౮.

ఉ. ఏనికనేమెఱుంగవిభుఁ ♦ డిచ్చినకుంభగతంబుఁ గ్రోలితిం
గాననెగర్భమాయెననఁ ♦ గావిని నవ్వరెఁ యెల్లవారలుం
దానికనింటిజాడఁగనఁ ♦ దప్పితినన్నునుదన్ను నట్టిలే
పూనికనెంచియేగతికిఁ ♦ బూన్పఁగడంగునోయెందుఁ జొత్తునే. ౨౯.

ఆ. కలశసారమతఁడు ♦ తెలిసినదైనను । దన్నువన్నెవెట్ట ♦ నన్నుఁజెనకు
అదిగరళమటంచు ♦ మదినమ్మియేయున్న । నాదుగతులుసెప్ప ♦ రాదుపిదప. ౩౦.

కం. కావునని క్కముచెప్పిన । నేవారునునమ్మఁబోవ ♦ రెట్లయిననునే
నీవిడుదలఁగనకుండినఁ । జేఁచెడునుర్వ్యశంబు ♦ చెందెడినన్నుఁగ. ౩౧.

## మందోదరి కనిపూడ్చిన సీతనైై జనకునికి దొరకుట.

కం. అనినిశ్చయించియపుడొక । ఘనదివ్యవిమానమెక్కఁ ♦ గఁగురుక్షేత్రం
బునకేగఁగల్గెనటసుతఁ । గనిధారుణిఁబూడ్చిమరలెఁ ♦ గ్రమమెటఁగితిరే. ౩౨.

కం. అందపుఁజందముఁగనమది । కందినఁ బ్రేమమునబ్రదుక ♦ ననువౌననుచు
న్మందసమునవిడియుంచెను । మందోదరియేరెఱుఁగని ♦ మఱుఁగుననరిగెగ. ౩౩.

ఆ. అంతఁగొంతకాల ♦ మరుగుడునచ్చట్ఖు । జనకభూవిభుండు ♦ జన్నమునకు
బాగుగానొనర్ప ♦ నాగంటదున్నింప । బెట్టెదొరకెఁదెఱవ ♦ నట్టెమెఱసె. ౩౪.

సీ. పాపమైయపుడుట్టి ♦ పడ్డకైటనటనగాఁ ♦ గ్యావుక్యావురటంచుఁ ♦ గలిగనేడ్వ
ఎల్లలోఁగొనిచూపు ♦ ఫుల్లాంబుజేక్షణ ♦ మెల్లగాఁగనులప్ప ♦ డల్లఁదెఱచె
అఖిలలోకంబుల ♦ నరసిపోషించుతా ♦ నాహారకాంక్షణ ♦ మపుడుచూపె
భానుబింబోపమ ♦ ప్రతిభనువెలుగొంద ♦ జనకుండుముద్దాడ ♦ సరగఁగొనియె
అపుడుసూనవృష్టి ♦ యాప్రాంతములఁదగ । జనకుఁడెంచెనాపె ♦ ఘనతకొంత
తగుదునంచునాకుఁ ♦ దనయగానిదికూడె । ఠెనిచిఘనతఁగాంతు ♦ ననుచుఁగొనియె.

కం. జనకుఁడు గుణగణనంబున | వెనుకటి యాయంబరీషు ♦ వెనుబుచ్చఁగఁ జాఁడే
గనుక నెయ్యంతటివానికిఁ | దనయయనంబరగె జగతిఁ ♦ దా సీతాఖ్యన్. ౮౬.

కం. సీతయనంగా నాఁగటి | చేతంబడుచాలు కాదె ♦ శ్రీయందుండా
నాతీరున బ్రభవిల్లుట | సీతా నామంబు గలిగి ♦ చెలఁగు ధరిత్రిన్. ౮౭.

చం. అటమును శ్రీమతీత్వమున ♦ నందినశాపముదానికంటె బ
ల్దిటముగ శ్రీసతీత్వమున ♦ దెప్పర మెప్పుడుగ నందినట్టిదా
రటముడుగంగఁ బుట్టినయి ♦ రంజిలుచింకఁ ద్రివిక్రమార్చన
ల్పటిమను జేయుచుండె దన ♦ భర్తయతండగుఁ గాతమంచెదన్. ౮౮.

వ. ఈయవ్వనిన్నిజనకుండు కనుట కాకుండఁగ విశ్వంభరాని క్షిప్తయు మందోదరీగర్భ ప్రవిష్టయుంగాకయునుండి మహర్షింద్రాస్పృక్సూరితె కలశాంతర్గతమాత్రయై రావణు నింటంబత్తలోఁచరివశంబున నున్నయట్టిసమయంబున. ౮౯.

## దేవతలఁగూడి బ్రహ్మ శ్రీహరిని బ్రార్థించుట.

సీ. అటురావణుండును ♦ హ్యాద్రికై తమకాంత ♦ లనుగొని పోవఁగాఁ ♦ జనినసురలు
అడకాడకుఁ బాటి ♦ యందఱుంగూడిరి ♦ సత్యలోకాధీశు ♦ సమ్ముఖమున
అంతనాతనితోడ ♦ నంగలార్చిరితమ ♦ క్షోభంబుఁ దెల్పుచా ♦ క్రూరగతికి
అతఁడంతయు నెఱుంగు ♦ మతిమంతుఁడే కాన ♦ నొక్కింతయోచించి ♦ చక్కనరిగి
సురుచిరంబగు వైకుంఠ ♦ పురమునందు | శేషతల్పంబునందువి ♦ శేషదీప్తి
రంజిలుచునున్న లోకేశ ♦ రమ్యుఁ గాంచి | భక్తి జోహారులొనరించి ♦ బ్రహ్మయనియె.

మహాస్రగ్ధర. ఘనదేహా సర్వభర్తా ♦ ఘతిమిరతరణీ ♦ కల్పితానేకలోకా
వినతాపుత్రాధిరూఢా ♦ విదళితసురరా ♦ డ్వైరవైరీడనీకా
వనజాతాప్తేందునేత్రా ♦ వరగుణవరదా ♦ వార్ధిగంభీరశూరా
జనకాసర్వాధినాథా ♦ సతతశివహితా ♦ స్వర్ణశైలాభధీరా. ౯౦.

కం. కలిగింతువు లోకంబులఁ | జెలఁగింతువ కల్లమిగులఁ ♦ జేతః ప్రీతిం
దొలఁగింతువంత మునకును | మెలఁగింతువు వాని నీవు ♦ మెలఁగుచునందున్. ౯౧.

ఉ. రావణబాధలోకములు ♦ రాయిడినొందుచునున్నవక్కటా
యావిధమేడ మున్నెఱుఁగ ♦ నంతటికాముకుఁ గానలేమెట
ద్దేవరకేమి తెల్పి వెస ♦ దివ్యదృగీక్షణఁ గాంచుమిప్డె వే
కావవెకావవేయనుచుఁ ♦ గన్నదివిన్నది యొక్క పెట్టునన్. ౯౨.

తే. అయ్యకును దెల్ప నాప్రభుం ♦ డంతకుమును । సతియరిగెఁ గానఁ దాను ♦ జతపడవలె
నారదోక్తంబు జరిగెడి ♦ తీరుఁ జూడ । ననుచు నున్నాఁడ కావున ♦ నద్ది తెలిపి. ౯౪.

కం. ప్రియమున నిట్లని పలికెను । భయ సుడుగుఁడు మీరలెల్ల ♦ బలియు నిశాటు
న్నయమునఁ దునిమెద నిప్పుడ । పయనంబై రాముఁడనఁగఁ ♦ బ్రభవింతు భువిన్. ౯౫.

వ. అని యా పరమేష్ఠి పురస్కారులగు నిఖిల గీర్వాణులను సత్యలోకంబునన సెలవు కొన
వెలవిచ్చి యప్పుడిప్పుడమింగల చొప్పరసిన. ౯౬.

## శ్రీరామావతారఘట్టము.

సీ. అట్టి లహరి మాచు ♦ పట్టునఁ బట్టిన ♦ దశరథుండను మహా ♦ ధరణీధవుఁడు
పుత్రులఁ గనఁ గోరి ♦ పుత్రకామేష్టియు ♦ క్రతువొందు చేయంగ ♦ జతపడియెను
ఆతని ఘన్యత ♦ కంబరీషాన్వయు ♦ మందుద్భవించుట ♦ యనువిఁకొకటి
కాఁగ నానారద ♦ ఘనశాపము డుపంగఁ ♦ దగినయట్లుగనున్నఁ ♦ దగవు నెఱప
పూనికఁ దగ ప్రాజాపత్య ♦ పురుషుఁడొసఁగి । నట్టి పాయసమందొక్క ♦ యల్పకణము
దాను జేరుదు రాజల్ల ♦ తరుణులకది । పంచియీఁగాను గౌసల్య ♦ పాలదాయె. ౯౭.

కం. ఆ గర్భము మహితంబై । బాగుగ వెలుగొందెనందు ♦ భాస్కర దీప్తి
న్నాగేంద్రశయనుఁ డొప్పుడు । యోగులు పతికెఱుకపఱచి ♦ రుత్సాహమునన్. ౯౮.

కం. కౌసల్యకనియె రాము । న్నాభసురముఖవిజితసోము ♦ పావననాము
న్వాసరపకులలలాము । న్దాసఖగా రాముఁ రాము ♦ దనుజవిరామున్. ౯౯.

ఆ. కుసుమవృష్టి సురలు ♦ కురిసిరప్పుడు భూమి । నమలమానసులకు ♦ హర్షమబ్బె
నసురవరుల గుండె ♦ లవి సెడి విధమున । బలిసె దేవదుందు ♦ భులనినదము. ౧౦౦.

తే. కైకకనియెను భరతుని ♦ ఘనగుణఖని । లక్ష్మణాఖ్యు నిభయభక్తి ♦ లక్ష్మణు మతి
యనుఁగుఁ దమ్ముని శత్రుఘ్ను ♦ హతకృతఘ్నుఁ । దానుగనియె సుమిత్రయి ♦ తరబడిగల.

సీ. అన్నదమ్ములు వార ♦ లైపరస్పరమును ♦ ప్రేమానుబంధము ♦ ల్పెనయఁగనఁగ
నొకచోటనాడుచు ♦ నొక్కెడఁ బాడుచు ♦ నొక్కచక్కనెమక్క ♦ వెక్కవగను
గూడుచు విద్యలు ♦ గూరిమి నేర్చుచు ♦ విలువిద్య క్రమముగా ♦ నలవడఁగను
చిన్నకంటెం బెద్ద ♦ మిన్నయంచన్నట్టె ♦ వన్నియవారల ♦ నెన్నికగన
లేక లేకుండి చిరకాల ♦ మీకొమరులఁ । గడఁగి కన్నట్టి దశరథ ♦ పుడమిపతికి
ముదిమి ముదమగు సమపాయ ♦ మొదవెననఁగ । వదలకాతండ్రి బిడ్డల ♦ వలన మెలఁగు.

## దశరథుడు బిడ్డలతో కాలక్షేపముచేయుట.

కం. వారాడినఁదానాడుచు | వారేయేరీతిఁబలుక ♦ వాకొనుచక్లే
వారలుగూరిమిఁగనవా | తీరుగనుండెడివిమాపఁ ♦ ద్రిప్పుందిరుగున్. ౧౦౩

ఆ. చిన్ననాఁటిపనుల ♦ వన్నియువారల | గూడిచేయుచుండుఁ ♦ గూర్మికొలఁది
వింటివిద్యనేర్చు ♦ చుంటఁగనుంగొని | యలనిపుణతవేగ ♦ నలఁరచెడి. ౧౦౪

ఉ. ఒక్కొకపట్టులందుఁబని ♦ నూహలఁదన్నునుమించినట్టుపెం
పెక్కనబల్మినేఁటుఁనన ♦ హీనపరాక్రమపుష్టిఁగన్నచో
నక్కునఁజేర్చిముద్దుగొని ♦ యంతనెనొచ్చెడిరాజదృష్టిచే
నెక్కడనుక్కుతక్కునొయిఁ ♦ కేమిదొసంగగునోయటంచెదన్. ౧౦౫

సీ. రాజకార్యంబులు ♦ తాఁజూచుచుండంగ ♦ నడుగుచుపాయము ♦ ల్నుడువుచుండఁ
అనువుమాత్రమెకాక ♦ యదిగోప్యధర్మమై ♦ నైహికాముష్మిక ♦ హర్షదమగు
పనినండఁజేసికోఁ ♦ దనుమించుననినమ్మఁ ♦ దన్మతంబునఁబను ♦ ల్దానొనర్చు
గానివెల్లడిసేయఁ ♦ గనడంబఅమ్మక్క ♦ యండ్రెబిడ్డకుహాని ♦ యౌనొయన్చు
పాలకుండట్టుపసిబిడ్డ ♦ మూలదాచి | కోలెనాయంబటంచునా ♦ లీలగాము
నతఁడుకనుగొంచునతిమోద ♦ మందియుండ | గాధిజుఁడువచ్చెనటకుఁద ♦ ద్బాధకముగ

కం. వచ్చినవిశ్వామిత్రుం | డిచ్చినయర్ఘ్యాదులంది ♦ యిలఱేనిందా
ముచ్చటలముంచియిట్లను | మచ్చికనెచ్చఱికపుచ్చు ♦ మాటగనాటన్. ౧౦౭.

కం ఉపకారకవస్తువుతన | కెపుడబ్బిననొరులకద్ది ♦ యీఁగఁగొనఁగఁదా
నుపకారియనఁగఁబరగెడి | నపవాదంబొరులకీయ ♦ నందునఁగాంచున్. ౧౦౮.

కం తనవ్యామోహముకొలఁదిని | దనయొద్దనెనిలిపికొన్నఁ ♦ దదుపార్జనచేఁ
బనిఁగనువారలుచెడనగుఁ | బనిముట్టటనేచెడుఁదన ♦ పరువుంజెడెడున్. ౧౦౯.

కం. జనసామాన్యపదార్థమె | ఘనుఁడొక్కఁడుముందుఁగాంచుఁ ♦ గడమజనులఁకుం
బనికలిగినప్పుడందఁగ | నొనగూడెడిఁగాదెయన్న ♦ నూకొనుపతికిన్. ౧౧౦.

వ. విశ్వామిత్రుండు నిజాగమనార్థఫలసంధానానుకూల భావగర్భితంబులై పరమధర్మం బులగు ననేక నయవాక్యంబులు సోదాహరణంబుగా వాకొన్న నూకొనుచు మంద హాసంబుఁగనుచు మనోరంజకంబులనుచు మెచ్చుకొనుచుఁ దదంతరార్థం బెఱుంగ కున్న దశస్యందనునితో విస్పష్టంబుగా నెఱుకపఱచువాఁడై యాకౌశికుండిట్లనియె.

ఉ. రాముఁడుసర్వలోకమును ♦ రక్షణచేయురమాధినాథుఁడౌ
యామునిలోకనిర్జరస ♦ మర్థకునీఘనుఁదెచ్చికొంటిమీ
భూమికిమార్గమధ్యమునఁ ♦ బుట్టువుఁగాంచితిపీవుచాలుమా
కాములువాపికోలిఁకను ♦ గానలయున్విడుమింతనీతనిన్. ౧౧౨.

చం. అనవుడురాజుబెగ్గిలియ ♦ యాయతఁడెక్కడఁజిన్నవాఁడ నేఁ
బనిపడనత్తునంగొనుశు ♦ భంబగుమీకును నాకునన్ననో
జనపతినిన్నుమున్నెఱుఁగఁ ♦ జాలమొకోయవినిన్నుమమ్ముమిం
చినపనులౌటనీతనిన ♦ చీరఁగవచ్చితిఁబంపుమీయిఁకన్. ౧౧౩.

కం. మానసనాయకవిష్ణుఁడు । కూనయునేనింకనీవు ♦ గొప్పనితలఁతే
నీనందనుఁడనికొనెదే । మానాయకుఁడాతఁడెరయ ♦ మాపనికైయే. ౧౧౪.

కం. నీపూర్వపుణ్యవశమున । నీపుత్రుండనఁగఁబరగె ♦ నీకిదెఘనతో
మాపతిమాటనులకుఁగా । కాపఁగనీకౌనెదాన ♦ నాపదమాకౌ. ౧౧౫.

## రామలక్ష్మణులు విశ్వామిత్రువెంట జనుట.

ఆ. వలదనంగవలదు ♦ వడినంపుమనుచును । లక్ష్మణాన్వితునిగ ♦ రాముఁగొంచు
కౌశికుండువోవ ♦ ఘనులువారలుమార్గ । మధ్యమునను గబ్బి ♦ మతకరిఁగని. ౧౧౬.

కం. నాతియనిసంశయింపఁగ । నాతురమునవేయుమనుచు ♦ నమ్మునియనఁగా
నాతాటకవడిఁగూల్చెను । వైతేయాబ్జభరామ ♦ ధరణీపజుఁడటన్. ౧౧౭.

కం. విశ్వామిత్రుండీఁగా । విశ్వాసపుగరిమఁగొనియె ♦ వివిధాస్త్రములా.
విశ్వజ్ఞుఁడైనఁదాస । ప్తాశ్వకులీనుండటంగుముఁ ♦ దగుమనుజుఁడుగాన్. ౧౧౮.

తే. అన్నదమ్ములసూరెందు ♦ లన్నునిలిపి । కొనియభీతిగనామౌని ♦ ఘననియతిని
యోగనిష్ఠనుగూర్చుండ ♦ నాగతిఁగని । దైత్యవీరులుఁచెలరేగఁ ♦ దక్షణంబ. ౧౧౯.

కం. మునియాగమురక్షింపఁగ । ఘనమారీచునిసుబాహు ♦ గాడఁగనేయ
న్వెనుకఁటిపేఁడపుడీల్గెను । జనిచనివాఁడల్లలంక ♦ చాయంబడియెన్. ౧౨౦.

ఆ. తండ్రియంతలోనె ♦ తనయులఁగనఁబంపు । దూతలేగుదెంచి ♦ ప్రీతిమౌని
చూపిచెప్పినట్టి ♦ యాపలుకులువారి । మీఱియున్కిఁదెల్పఁ ♦ గూరిమిఁగనె. ౧౨౧

కం. మునియప్పుడువినఁగానల । జనకమహీశుండుసీత ♦ సత్ప్రతిఁగోనఁగా
వనువగునొక్కస్వయంవర । మునుమిథిలఘటించెనన్న ♦ ముచ్చటతెలిసెన్. ౧౨౨.

కం. ఉపకారులయినవారికి । నుపకారముచేయనయిన ♦ యూహావెడలెనా
తపసియురాట్పుత్రులఁగొని । యపరిమితాహ్లాదమొందవ ♦ నగుడుమిథిలకున్. ౧౨౩.

చం. ఘనమగుభర్తృశాపమునఁ ♦ గల్లయికూలియునేకవర్షము
ల్చనఁజనశాపమోచనపు ♦ జాడకునైనగపొందుగౌతమాం
గనదగురాతిరూపమునఁ ♦ గాలిదెరాముఁడదాయెరామయో
తనిమహిమంబునన్నగనఁ ♦ దాబయటంబడుడాగివేర్చునే. ౧౨౪.

కం. అంతటమిథిలానగరికి । సంతసమునఁజేరిరాజ ♦ సన్నిధికిని బో
నంతయుమునిచేవిని రా । జెంతయుసంప్రీతినొంది ♦ యెచ్చుగఁగనియెన్. ౧౨౫.

తే. జరిపెఁదల్లిశిలాశాపమో♦క్షంబటంచు । వినిశతానందుఁడుపొంగి ♦ వివశుఁడయ్యె
గురునిజననికిగతులిచ్చు ♦ గురుఁడటన్న । రాజొనర్చెడిగౌరవ♦మోజఁగనుఁడీ. ౧౨౬.

సీ. వడిజానకీస్వయం ♦ వరముఁగాంచెడివేడ్క ♦ బహురాజపుత్రులు ♦ పరగిరచట
బలియుఁడుపదివేలు ♦ భటులెత్తితెచ్చిన ♦ హరువిల్లుటంబెట్టి ♦ యద్దిచూపి
ఇదియెత్తిమోపెట్టి ♦ విదితవీరుండగు ♦ నతనికిచ్చెదసీత ♦ ననియెరాజు
కొండఱూరకచూడఁ ♦ గొందఱుచదిచూడఁ ♦ గొందఱెత్తఁగఁబోయి ♦ కొందలపడ

## శ్రీరాముడు హరువిల్లువిరిచి సీతనువరించుట.

రాముఁడలగాధిసుతునిప్రే ♦ రణనులేచి । తొలిప్రదక్షిణానందన ♦ ములనొనర్చి
ధనువుడాకేలనవలీలఁ ♦ దాధరించి । యెక్కుడఁగలాఁగబలిమిని ♦ ముక్కలయ్యె.

ఉ. అందఱువింతనొందిరల ♦ యద్భుతకర్మముఁగాంచిరాజుతా
ముందెస్వయంవరంబనితి ♦ ముద్దుగసీతనికీయనైతియే
చందపువీలుతోశయిన ♦ సాగెదుఁగాతమటంచుఁగోరుసా
నందమునొందెనాపనిసె ♦ నందనకాతఁడెనాథుఁడౌటచేన్. ౧౨౭.

సీ. శ్రీరామచంద్రుండు ♦ సీతఁజేపట్టెడు ♦ నప్పుడాతనితమ్ము ♦ లలముగురికిఁ
దనకూర్మిపట్టినిం ♦ కనుజునిబిడ్డల ♦ వరుసనిచ్చెదఁబ్రీతిఁ ♦ దరుణులుగను
దశరథాధీశుండు ♦ తరజీకులీనుండు ♦ వియ్యమాతనితోడ ♦ వేడ్కఁగందు
ననినిశ్చయించియ ♦ య్యనువునజనకుండు ♦ శుభలేఖసంపుటఁ ♦ జాచిదానఁ
గూర్మిసుతుఁడగురాముని ♦ పేర్మిఁదెలిసి । యమితసంతోషమునమిటి♦యాయజాఁడతి
పెండ్లిపరికరములతోడఁ ♦ బ్రీతివెడలి । మిథిలఁజేరిసుతులఁగని♦మిసిమికలరె. ౧౨౮.

కం. బహుతూర్యఘోషములతో । బహువిప్రాశీర్నినాద ♦ పటిమముతోడ
న్బహుమతులనేకములతో । బహువిభవోద్వాహములట ♦ భాసిల్లంగాన్. ౧౩౦.

ఆ. సురలువిరులవాన ♦ కురిసిరప్పట్టున । దేవదుందుభులును ♦ తీవ్రమోగె
ఆడిపాడిరాడ ♦ నచ్చరల్గంధర్వు । లీడసీతరాముఁ ♦ గూడుజాడ. ౧౩౧.

ఉ. బందుగులెందఱోధరణి ♦ పాలురుఁగూడఁగనెల్లవారికా
నందమమందమైచెలఁగ ♦ నవ్యపదార్థములెన్నియేనితా
విందులఁగూర్చుచున్మతియు ♦ వీనులకింపగుగానమింకనా
పొందికలెన్నియోజనక ♦ భూవిభుఁడప్పుడుకూర్పమెచ్చుచున్. ౧౩౨.

రాముడు భార్గవు భంగపరచి యయోధ్య జేరుట.

ఆ. కొన్నినాఁడులుండి ♦ కొమరులఁగోడండ్రఁ । గొంచుదశరథేశుఁ ♦ డంచితముగ
దానయోధ్యపురికిఁ ♦ బోనల్లపథమున । దోడ్డపరశురాముఁ ♦ డడ్డగించె. ౧౩౩.

సీ. గజగజలాడుచు ♦ ఘనుఁడాదశరథుండు ♦ సంస్తుతింపఁగసుంత ♦ సరకుగొనక
పరగుమద్గురువర ♦ హరశరాసనఖండ ♦ నోద్దండబాహుని ♦ యుద్ధతిఁగన
వచ్చితినని రాము ♦ నొచ్చునట్లాడుచుఁ ♦ దనవిల్లుమోపెట్టు ♦ మనియెసంగ
నందుండితనలోని ♦ యంశమాతనిఁజేర ♦ శక్తిహీనుండయి ♦ శరణుజొచ్చె
కాలమిట్లీడ్చికొన్నించుఁ ♦ గానిపనుల । దశతొలంగఁగదుర్దశ ♦ వశపడంగ
నెంతవారలకైననీ ♦ వింతయుంతె । యట్లురాముండుభార్గవు ♦ నడరడంచె. ౧౩౪.

ఉ. చేరిరయోధ్యపట్టణము ♦ చిత్రితమైయదిమున్నెయొప్పఁగా
వారలవైభవంబునకు ♦ వాసిగనుండెనుపౌరభామిను
ల్హారతులిచ్చిపాడుచున ♦ టూచుచుఁజూచుచుమెచ్చుచుండునా
తీరునలోనిహర్మ్యమునఁ ♦ దేజరిలంగనిహాయినుండఁగన్. ౧౩౫.

ఉ. సీతనుఁగూడిరాముఁడెదఁ ♦ జెందినహర్షపుఁబేర్మితోడఁదా
నాతలిదండ్రులెంతయును ♦ హోముదమందుచుఁగాంచుచుండఁగాఁ
బ్రీతినిదన్నుభక్తిఁగను ♦ పిన్నలఁదమ్ములఁజూచుచుండియా
భూతలమెల్లనేలఁగల ♦ పొందికలంగనుపట్టిచుండియున్. ౧౩౬.

చం. తముఁగనిసర్వసౌఖ్యమును ♦ ధాత్రినెపొందెడిమేఁటితండ్రిచి
త్తమురహిఁబెంపుసేయఁగల ♦ తత్పరిపాలనకార్యపుంజము

ల్క్రమమగుధర్మమార్గమునఁ ♦ గాఁగలరీతు లుపన్యసించుచో
సమయముగానెఱింగిబుధ ♦ సమ్మతినీయువరాజ్యమెన్నఁగన్ ౧౩౭.

తే. అంతలోఁ జిత్రమా రాముఁ ♦ డంతఘనుఁడె | కాఁగలట్టిదోసంగుల ♦ కారణముగ
మంథరను గైకదాసిని ♦ మంకుఁడన్న | నద్దితానేగిదోరసాని ♦ బుద్ధిచెఱుప. ౧౩౮.

సీ. పురముశృంగారించి ♦ పూర్ణప్రయత్నము ♦ త్తమిఁగూర్చినాథుండు ♦ తనకుఁజెప్పఁ
గాఁగైకపూర్వము ♦ తాఁగోరువరముల ♦ నప్పుడీఁగారాము ♦ నటవికనుప
భరతునాయువరాజ్య ♦ పట్టభద్రునిఁజేయఁ ♦ గోరుడు రాజాడఁ ♦ గూలెపినసె
రాముఁడుంజనకవా ♦ గ్రక్షణకటవికి ♦ రామలక్ష్మణులతోఁ ♦ దాముసుజనె
పుత్రశోకంబున నెరాజు ♦ పుడమివిడిచె | భరతశత్రుఘ్నులిలుసేరి ♦ పరితపించ
నయ్యెరాముఁడుచిత్రకూ ♦ టాద్రిఁజేర | నటకుభరతాదులెల్లరు ♦ నార్తినరుగ. ౧౩౯.

కం. దారిగుహుఁడడ్డగింపఁగ | నారసితస్నీతిలజ్జ ♦ నంత తెలిపిపో
మిాటినలక్ష్మణుశాంతిం | గూరుచునన్నన్భరతుఁడు ♦ గూడియెఱఁగినన్. ౧౪౦.

ఆ. గ్రుచ్చియెత్తిప్రేమఁ ♦ గూర్చిరాఁగతమెన్నఁ | దండ్రిమృతినిదెల్పి ♦ తన్నుఁబిలువ
పైతృకంబునాఁడ ♦ నేతీర్చియనుజుతో | రానటంచుఁదెల్ప ♦ రహినిటనియె. ౧౪౧.

మాతాపితృగురుభక్తివరమని చిత్రకూటమున శ్రీరామునుపన్యాసము.

కం. ఘనదేవతలెటనోకల | రనికొనుజనులకును గాన ♦ నయ్యెడివార
ల్జననీజనకులుగురువులె | యనయము వారలఁగనంగ ♦ నాబహుభక్తిన్. ౧౪౨.

కం. సృష్టిస్థితిలయకర్తలు | నిష్టార్థదులింక నెన్న ♦ హేయార్థఘ్నుల్.
స్పష్టముగఁదస్సమానులు | దృష్టింబడరితరులందు ♦ దివిభువులందున్. ౧౪౩.

కం. ఆత్రరబడివారేమన | నాతీరునఁజేయకున్న ♦ నఘముఁడెకాఁడే
భీతిన్నె జనసీజన | కాతీతుఁడుఁగాకవార ♦ లన్నదొనర్తున్. ౧౪౪.

సీ. జననిసద్భక్తితోఁ ♦ గనకుండఁవాఁడును ♦ జనకునిబంధన ♦ ల్జరుపకుండి
యాతనికంటెఁదా ♦ నేతునెచ్చనికొను ♦ మూఢుఁడుద్రోహులు ♦ మోఘులరయ
గురులుబోధింపంగఁ ♦ బెరలర్థములెఱింగి ♦ యవిచేయునఘములు ♦ నల్లికారె
మాతృపిత్రాచార్య ♦ మతములనడవంగ ♦ నుత్తరసృద్ధికి ♦ యుక్తపథము
అటులఁగాకున్న నంతక ♦ భటులుమిాతె | యింతకంటెనుపకారు ♦ లేరిరోరి
తద్విరోధముఁగన్నకృ ♦ తఘ్నుఁడకని | సమ్మెటలపోటులేయరే ♦ దిమ్మకొనఁగ?

కం. ప్రాపంచకధర్మంబుల | నోపిసదాయనుభవించు ♦ నుత్తముఁడైత
న్నేపునఁబెట్టఁగఁజెప్పెడి | ప్రాపకులలవారిపల్కు ♦ పాటింపవలెన్. ౧౪౬.

ఆ. అపుడుకష్టమైన ♦ నపరిమితోత్సాహ | దాయియగునుముందు ♦ దానవొందు
నిహాసుఖమ్ముకొంత ♦ యిఁకఁబరముమఱింత | తల్లిదండ్రిగురుల ♦ ధర్మమునన. ౧౪౭.

తే. కానమరలనటంచును ♦ దానుదాల్చు | పాదుకలనిచ్చి రాజ్యము ♦ వ్లాదుకొనఁగ
భరతుఁదాఁగోరఁపుచ్చియా ♦ తరుణమందె | తల్లులంబంపెనట్టులే♦యెల్లవారి. ౧౪౮.

చం. జననిని దండ్రినిన్గురునిఁ ♦ జక్కఁగఁగొల్చుచువారు పల్కుచో
ప్పునఁదగఁబున్నెముండఁగను ♦ బొందెదులాభములెన్నియేనినా
యనువటుజన్నముత్తపము ♦ యాత్రలుసల్పినరాదురాదిఁకే
ఘనతవహింపనైననుఁ ♦ గాదెమహాత్ముఁడురాముఁడెల్లెడన్. ౧౪౯.

## సీతారామలక్ష్మణుల యరణ్యవాసము.

ఉ. అచ్చటువాసియేగిరిఁక ♦ నన్నయుఁదమ్ముఁడునన్నుఁగూడియా
ముచ్చటలాడికొంచునట ♦ ముచ్చటగాఁదగునవ్వియివ్విబ
ల్మచ్చికఁజూచుచేగునెడ ♦ మానినికోరినవెల్లఁదెచ్చియం
దిచ్చుచునిచ్చలుందిరుగు ♦ చిచ్చటనచ్చటఁజొచ్చివచ్చుచున్. ౧౫౦.

కం. జనకజమునుగొనిడించియు | ననుజుందనునెత్తికొనఁగ ♦ నాదుర్గాఘు
న్ఘనతరబాహువులనఁబో | రునఁద్రుంచివధించెనలని ♦ రోఘువిరాధున్. ౧౫౧.

తే. మునులయాశ్రమములుగాంచు♦చునుజనిచని | యలఘటాయువుఁదమజన♦కాప్తుఁదెలిసి
యొక్కచోఁబర్ణశాలఁదా♦మొనరిచికొని | యుంచుసౌమిత్రిజంబుని♦ద్రుంచుటగుడు.

చం. అలదితిజన్మమాతయుద ♦ శాస్యునిచెల్లెలుచప్పనాతిరా
జులఁగనిమోహముందెలుప ♦ శూరుఁడులక్ష్మణుఁడాకటారితో
నలసతికర్ణనాసికల ♦ నంటఁగఁగోసివిడంగనార్చుచుం
దొలిచనియాఢనొప్పుఖర ♦ దూషణముఖ్యులఁదోడబుట్టులన్. ౧౫౩.

కం. పదునాల్గువేలరధికుల | యధిపులఁబురికొల్పవారి ♦ నందరినపుడే
కదనమునన్నురుముచేసెం | గద్మశ్రీరాముండుజగము ♦ కడువెఱగుపడన్. ౧౫౪

ఆ. పెద్దయన్నమిగుల ♦ గద్దటికాఁడౌట | లంకకేగితగిన ♦ లాగుననన
మాయలాఁడతండు ♦ మారీచుమృగముగాఁ | బనుపదానివెంటఁ ♦ బడెవిభుండు. ౧౫౫

ఆ. తుపకురోసియేయ ♦ నదిగోదహోసీత | లక్ష్మణాయటన్న ♦ లక్ష్మణునకు
పుచ్చిసీతయుండ ♦ బిచ్చపువేసాన | రావణుండువెలపి ♦ రమణిఁగొనియె. ౧౫౬.

కం. త్రోవజటాయువటడ్డము | గావచ్చియనేకవిధులఁ ♦ గలవరపఱప
న్రావణుఁడుమోసపఱుపను | లావరివాఁడగుచుఖగము ♦ లావుడిపిచనెన్. ౧౫౭.

ఆ. అంతఁబర్ణశాల ♦ కన్నదమ్ములువచ్చి | యింతిఁగానలేక ♦ చింతమునిఁగి
మూర్ఛవోయెఁబతియు ♦ మునుకొనియనుజుండు | నగచెఁదెలిసిరాముఁ ♦ డుగడుఁబొగలె. ౧౫౮.

కం. నారదపర్వతులొండిన | తీరునవిరహాగ్నిఁగ్రాగి ♦ తెలియమినొప్పన్
జైరిచెననుజుఁడుపంపా | తీరమునకుఁగొంతసేద ♦ దేరఁగనుటకున్. ౧౫౯.

సీ. అంతమరింతగా ♦ నార్భాటపడకుండ ♦ విరహమునడిత్రెంపు ♦ లూరయవలసె
ఆజటాయువుఁగన ♦ నంతయువివరించి ♦ కడకీల్గనగ్నిసం ♦ స్కారణజరిగె
అటుకబంధునిబారి ♦ నన్నదమ్ములుపడి ♦ పట్టుననానిఁగూ ♦ ల్పంగనాయె
శబరియాశ్రమముత ♦ త్సతిచవిగనియిచ్చు ♦ ఫలములుగనుతిను ♦ పనులివాయె
ఇన్నియేఁటికిఁజేపట్టి ♦ యున్నవాఁడు | కూర్మితమ్ముఁడుపలుమఱు ♦ గుదురుపఱుప
లోకసామాన్యవిరహమే ♦ తాకుడుగనె | గాకయుండినవారల ♦ పోకలెయగు. ౧౬౦.

కం. ఎట్టెట్టులొకట్టడిగని | నిట్టూరుపుమాత్రమొదవ ♦ నెలఁతఁదలఁచుచుం
బుట్టెడివిషయములెఱుఁగుచుఁ | బట్టినపనిచేయఁగల్గు ♦ పాటిగనుండన్. ౧౬౧.

ఉ. అంజనిగర్భశుక్తినగు ♦ నచ్చపుముత్తెమనంగస్వచ్ఛత
న్రంజిలుభానుమండలము ♦ రాసముచేసెడినన్నదీధితిం
గంజరుహాండభాండములఁ ♦ గందుకకేళులుసల్పునన్నబ
ల్మింజనుదెంచెనచ్చటికి ♦ లీలఁబ్రభంజనపుత్రుఁడయ్యెడన్. ౧౬౨.

## శ్రీరాము విశ్వరూపము హనుమంతుడనుతించుట.

ఆ. కనఁగఁగల్గెహనుమ ♦ ఘనుఁడగురాముని | యందువిశ్వరూప ♦ మద్భుతముగ
పుట్టినప్డెతెలిసి ♦ పట్టుదలంగొని | భక్తినున్నయట్టి ♦ పటిమఁబట్టి. ౧౬౩.

కం. ఈతఁడెరాముండౌనాఁ | జేతోగోచరమిటయ్యెఁ ♦ జేయుదునుతులం
చీతీరునఁబల్కెడిఁదన | చేతులుజోడించిశిరసుఁ ♦ జేర్చిమహాస్థన్. ౧౬౪.

ఉ. ఏతఁడువిశ్వకర్తయుఁద ♦ దేకవిధాయకభర్తహర్తయౌ
నేతఁడుబ్రహ్మవిష్ణులన ♦ నీశ్వరుఁడౌననొప్పనొక్కఁడై

యేతఁడుసర్వమందుఁదగి ♦ యెన్నసమస్తములోనఁడాచునో
యాతనిసర్వవేతనిను ♦ నద్భుతరూపుఁగనంగఁగంటి నే. ౧౬౫.

ఈ. ఓమహీమావిశేషనిను ♦ నొక్కనిరెండనసాటిలేనిబ
ల్స్వామినినిర్వికారునఘు ♦ సంహరుసర్వచరాచరంబుల
న్నీమహనీయరూపమున ♦ నిల్పిభరించువిధంబుఁగందునా
నామహితప్రపంచగత ♦ నవ్యపదార్థములీడనొప్పెడిన్. ౧౬౬.

ఉ. ఔనవుదుపురుషోత్తముఁడ ♦ పక్షురరక్షకదివ్యరూపసం
ధానముఁగంటిమంటిరహిఁ ♦ దావకభక్తుఁడనైభరంపగ
న్నేనిటుపుట్టినట్టు విని ♦ నిత్యమునిన్నదనమ్మికొల్తుఁగా
నానియతంబుపెంపుగన ♦ నమ్మికనెమ్మదిఁ గ్రమ్ముసమ్మిఁకన్. ౧౬౭.

పంచ. పరాత్పరామహాత్మనిన్నుఁ ♦ బ్రస్తుతించుపాటినే
దురాపతాపముల్హరించు ♦ దువ్వనైనపాటిచే
తిరంబుగామదిన్నినేఁడు ♦ తృప్తితోడనెంచిన
న్పితానవానిమేఁటిచేతు ♦ ప్రీతిగాఁదలంచినన్. ౧౬౮.

మత్తకో. ఓసనాతనశాశ్వతాజగ ♦ ముద్ధరింతుకదాసదా
భాసమానమచింత్యమవ్యయ ♦ భాతరూపమిదొఁగదా
నీసమానమిఁకుండ నేర్చునె ♦ నిండియుందువిటంతలో
వాసికెక్కుదుచిన్మయుండన ♦ వారువీరనునంతలో. ౧౬౯.

కం. కలుగుదుతలఁచినచొప్పున । మెలఁగుదుమహాదుఃఖముప్రలందు ♦ మిఱ్ఱిమొకగతిం
జెలఁగుదువెప్పుడునెచ్చటఁ । దొలఁగుదురేనిన్నుఁదెలియఁ ♦ దుష్టింబుష్టిన్ ౧౭౦.

కం. అనిసాగిలఁబడిధ్యానము । కొనసాగించుచుముదంబుఁ ♦ గొనిలేవంగాఁ
గనిరామచంద్రుసానుజుఁ । దనుఁదెలిపియువారిఁదెలియు♦తక్కిపివరులతోన్. ౧౭౧.

ఆ. రాముఁడనిరోఁదనదు ♦ రమణిరావణాహృత । యయ్యెనంచునతఁడు♦నంతఁబ్రభుఁడు
నవ్వికొనిరిదాని ♦ నాశమెఱింగిన । మాయసీతకాని ♦ మానినదని. ౧౭౨.

ఆ. మాయమానవుండు ♦ చేయనేయదిపూని । చేయుమన్నదెల్లఁ ♦ జేయుదురహి
మేఁటిబంటునితని ♦ కోటకేమునుబుట్టి । యుంటిఁగానబల్మిఁ♦గంటిదాన. ౧౭౩.

## శ్రీరాముడు సుగ్రీవాప్తత వాలిం ద్రుంచుట.

కం. హనుమంతుఁ డిట్టులనుకొని । తనమూఁపులవారిఁ గొంచుఁ ♦ దరణిజుతోడ
స్సనమైత్రి నెరపి రాముని । కనురక్తుండయ్యెఁ దెలియు ♦ ననుబంధమునన్. ౧౭౪.

ఉ. ఏరినిలెక్క సేయఁడత ♦ డెన్నికఁ గన్న మహానుభావుఁడౌఁ
దీరుపుఁ గాంచె విద్యలను ♦ ధీరత శూరత బ్రహ్మవేత్తృతం
గూరిమి నాంజనేయుఁ డెదఁ ♦ గూర్చిన దేవుఁడు కొంచెమానెయం
చారయఁ బోరు రామమహి ♦ మాతిశయంబును నమ్మి యెల్లరున్. ౧౭౫.

తే. తాళసప్తకమును గూల్చి ♦ లీలఁ జూపి । వాలి నట్టులె యొకకోలఁ ♦ గూల నేసి
పరగ సుగ్రీవునకు రాజ్య ♦ పదము నిచ్చి । వాయుజుని రాముఁ డబలను ♦ రోయఁ బనిచె.

ఆ. వాలిఁ బాసి తార ♦ వడిశపియించుట । మరల సీత భూమిఁ ♦ జొరఁగ విరహ
మద్భుతముగ రాముఁ ♦ డందెడిఁ గంటిరే । యనుభవింత్రు ఘనులు ♦ నఘఫలము. ౧౭౭.

కం. మును జేసిన కర్మంబుల । నొనగూడిన మంచి చెడుగు ♦ లొందక విడువే
ఘనులైన నల్పులైనను । గనుగాన కొనర్తురెట్టి ♦ కర్మములైనన్. ౧౭౮.

ఆ. అనుభవించ నప్డు ♦ డా బ్రహ్మదేవునిఁ । దిట్టుచుంద్రు నరులు ♦ గుట్టెఱుఁగరొ
తొల్లి చేసినంత ♦ ముల్లె లోముడిగిన । దట్టె పాలఁబడియె ♦ ననుకొనఁదగు. ౧౭౯.

## హనుమంతుడు సీతం గాంచి రామునకు దెల్పుట.

చం. పనిచిన వాయుపుత్రుఁడల ♦ పంక్తిముఖాశ్రయమైన లంకకై
వననిధి దాటి యేగుడును ♦ వాలికకోలలనడ్డ వచ్చునా
ఘనబలు లంకిణిం బొలిపి ♦ కాంచి మహీజ నటక్షయాదులం
దునిమియు లంకఁ గాల్చి విభు ♦ తోడ సమస్తము వచ్చి చెప్పినన్. ౧౮౦.

చం. తరుచరకోట్లఁ గూర్చుకొని ♦ తద్రవిపుత్రుఁడుతోడు రాఁగనం
బరధరమధ్యగహ్వరము ♦ ప్రమ్మిన ధూళి మహానినాదము
ల్తఱుచుగ నేమి గానవినఁ ♦ దాళవు కన్నెవు లెంతవారికా
యురువడి నేగి రాజలధి ♦ యుద్ధతిమించుమఱొక్క వార్ధినాన్. ౧౮౧.

ఆ. రాము నెత్తికొనియె ♦ రహిమరుత్సూనుండు । అట్టె లక్ష్మణార్యు ♦ నంగదుండు
ఉబ్బి జలధిఁ జేరఁ ♦ గొబ్బున బలమెల్ల । విడిసె నాడ దిగిరి ♦ విభులు గూడ. ౧౮౨.

ఉ. తమ్మునిఁ జూచి రాఘవుఁడు ♦ తావక శక్తిఁ గపీంద్రు లబ్ధిఁ డా
విమ్ముగఁ దాటఁ జేయుమన ♦ నెంతయు సంతసమంది యాతఁడా

త్రేమ్మనభక్తితో జలధిఁ ♦ బ్రార్థనఁజేయఁదొడంగ నెంతకు
న్నెమ్మదిమాటలన్విననిఁ ♦ నిశ్చయ మేర్పడఁబుట్టెనుగ్రతన్. ౧౫౩.

లక్ష్మణుండబ్ధినింకింప రాముఁడువారించి సేతువుకట్టించుట.

సీ. కోపించిసౌమిత్రి ♦ యాపట్టునఁబయోధిఁ ♦ దాఁదుముకంగానె ♦ తచ్ఛరీర
తాపంబజలమెల్లఁ ♦ ద్వరహరియింపంగ ♦ గుల్లలునాచులు ♦ వెల్లడివడె
అందుండుజంతువు ♦ లమితరత్నంబులు ♦ దాఁగినదానవా ♦ ఘములునట్లె
కాఁగవిస్మయమంది ♦ కడుబొబ్బలిడిరెల్ల ♦ వానరుల్లక్ష్మణు ♦ వన్నెనెన్న
దిశలుహాహాయటంచు నే ♦ దిమ్ముగొనియె | దేవలోకంబువారెల్ల ♦ దిగులువడిరి
మానులొక్కెడస్వస్తియ ♦ న్మంగళోక్తి | పలుకరాముండువినికొంత ♦ భయముదక్కి.

శా. అన్నాలక్ష్మణయెంత చేసితివి నే ♦ నన్యాయి నైపోయితే
యెన్నన్రానిమహాపరాక్రమమునీ ♦ వీయబ్ధిపైఁజూపఁగాఁ
దన్నష్టంబదిపొందెలోకమునన ♦ న్దారావియోగార్తిచే
నెన్నేఁగూడనివిట్లుచేసితినన ♦ న్హేయంబునాజన్మమా. ౧౫౪.

కం కాంతనుబాసితిదానను | యెంతలొపుట్టెడినిఁకెట్టు ♦ లెడ్డేమానో
వింతబ్రదుకాయెనాదని | చింతించెంబ్రభుఁడుజలధి ♦ చేరఁగనశ్రుల్. ౧౫౫.

కం అనుజునిపనికచ్చెరువడు | వనచరులబ్రముదమునుఁగ ♦ వడినబ్రాశి
న్తొనదొనజేరినయశ్రులఁ | గనమునుపటిజలధినిండె ♦ గదయంతటితోన్. ౧౫౬.

కం పోకార్చిశోకమాపతి | వీఁకసముద్రోక్తవిధిని ♦ వివిధాద్రులతో
నాకంధబంధనంబును | వాకొన నేచేసిరపుడు ♦ వానరవీరుల్. ౧౫౭.

చం. ఘనహనుమాను దేవుఁడని ♦ కల్గిననమ్మకమట్టులుండనీ
పనులనుగాంచివానరులు ♦ బాగుగవారియమానుషత్వముం
గనుఁగొనిభక్తిమీఱితము ♦ కాయములైనఁదొలంగియెంతయోఁ
బనినొనరింతమంచుఁదగు ♦ పట్టుదలంగొనియుండిరంతటన్. ౧౫౮.

శ్రీరాముఁడు విభీషణునాదరించుట.

వ. లంకాపురంబున రావణాసురుండు కొలువుతీర్చి చారులవలన వానర వీరులంగూర్చి కొని లక్ష్మణాన్వితుండగు శ్రీరామచంద్రుండు తమపైదాడి వెడలివచ్చుచుండువార్తం దెలిసి మంత్రులను సేనాధిపతుల నెచ్చరించి యుద్ధప్రయత్నంబుల నుండనియ మించునెడ. ౧౫౯.

కం. దోషము విడుసీతను నా | దూషించియటన్న తన్ను ♦ దుడుకై యపుడా
రోషమున లంక వెడలు వి | భీషణు రాముండు పేర్చెఁ ♦ బ్రియమున నంతన్. ౧౯౧.

ఆ. జలధి దాఁటి లంక ♦ సరగఁ బ్రవేశింప | మున్ను రావణుండ ♦ టున్న జాడఁ
గన్న రవిజుఁ డతని ♦ ఘనుఁ డాతఁ డాతని | బట్టి యొక్క పెట్టు ♦ గొట్టికొనిరి. ౧౯౨.

## రావణాది సింహళ క్రూరాసుర సంహారము.

తే. ఆమహాకాయు నతికాయు ♦ నలని కుంభుఁ | గుంభు ధూమ్రాక్షు మకరాక్షు ♦ గ్రూర దంష్ట్రు
నగ్ని వర్ణ నకంపను ♦ వ్యాళరోము | ఖడ్గ వృశ్చికరోమాది ♦ ఘనులఁ ద్రుంచి. ౧౯౩.

ఉ. పేరుగలాఁడు రావణుని ♦ పెద్దకుమారుఁ డటింద్రజిత్తు తా
నేరుచు మాయ లెన్నయిన ♦ నెవ్వగఁ బుచ్చెను మూఁడు మాఱులా
వీరులఁ బోర లక్ష్మణుని ♦ వేడిశరంబులఁ గ్రాగ గోదానవే
మీఱుటలార రాక్షసుల ♦ మేటికి నప్పుడె సామ చావుగన్. ౧౯౪

ఆ. కుంభకర్ణు మేలు ♦ కొల్పనాతఁడు వచ్చి ♦ కపులఁ మ్రింగఁ దొడఁగెఁ ♦ గాని వారు
ముక్కు రములఁ జెవుల ♦ గ్రక్కున వెడలిరి | కడకు రాము చేత ♦ మడిసె వాఁడు. ౧౯౫.

కం. ఇరుమార్లు కేసరిసుతుఁడు | ద్వరసంజీవని వలసిన ♦ వడిగొని తెచ్చెం
దరుచరులు బ్రదికి రొక్కట | వర లక్ష్మణుఁ డొకట రాము ♦ వనటలుడుగఁగన్. ౧౯౬.

శా. ముమ్మాఱంతయు ముమ్మరమ్మున మహా ♦ మోహభ్రమాభీతిదం
బమ్మాయాసమర ప్రవీణతను ద ♦ మ్మాయా సపెట్టెం గదా
యమ్మస్త్రాళి నవీరుఁ డైంద్రిరఘమం ♦ దా రాముఁ డక్షైక్కి యొ
క్కమ్మేయందుదఁగూలెఁ గాదె విభు బ్ర ♦ హ్మాదుల్ప్రశంసింపఁగన్. ౧౯౭.

కం. అలలంకా రాజ్యమునకు | బలియు విభీషణునిఁ గొట్టి ♦ పట్టంబనుచు
న్జలజాక్షుండనుపంగా | సలలితగతి నద్దొనర్చె ♦ సౌమిత్రియటన్. ౧౯౮.

## సీతను బరీక్షించికొని రాముడయోధ్యఁజేరి రాజగుట.

ఉ. అంత విభీషణుండు వన ♦ జాక్షిని జానకిఁ దెచ్చియీఁగ భూ
కాంతుఁడు రామచంద్రుఁడల ♦ కాంతఁ బరీక్షకునగ్ని కుండమం
దెంతయు వింత నాఁడగల ♦ యెల్లరు సూడఁ జొరంగఁ జేసి తా
సంతసమంది క్రైకొనియె ♦ సర్వసురల్మునులున్నుతింపఁగన్. ౧౯౯.

తే. పుష్పకంబందు రాముండు ♦ బుధనుతుండు | కోట్లకొలఁదుల సందోఁటిఁ ♦ గూడి యెక్కి
భరతుఁడా మోదభరితుఁ ♦ పరగుసరణి | నెదురుకొని కొనిపోనంగ ♦ నిల్లు సేరి.

తే. తల్లులకు మ్రొక్కి తక్కిన ♦ యెల్లరదయఁ | గాంచితమ్ములఁ బ్రేమించి ♦ కడఁకవారు
తన్నుఁ దమిదీఱ సేవింప ♦ ధన్యతఁగని | యున్న సుముహూర్తమారసి ♦ యుత్సహించి.

కం. శిష్టనరుఁడౌ వశిష్ఠుఁడు | శిష్టినిబహునదులజలముఁ ♦ జేర్పించియు సం
తుష్టిగనభిషేచించెను | బుష్టిని రాముండు రాజ ♦ పుంగవుఁడటంగాఁ. ౨౦౨.

ఆ. పారితోషికంబు ♦ లారయుచొనరించి | వారివారిమదులఁ ♦ గోరినట్టు
లుండువారలచట ♦ నుండంగఁజనువారు | వోయిరాగి సెలవు ♦ లీయనాయె. ౨౦౩.

వ. అనియిట్లు వాల్మీకమౌనిసింధురుండు వలుక సీతాజననవివరణంబున కత్యాశ్చర్యం
బునొంది యాయావిషయంబుల సమ్మేళనంబు నవ్వర్ణించుచు నీరామాయణ సంగ్రహం
బున హనుమచ్ఛక్తికి నశేష వానర వీరుల యనురక్తికినైన యనుబంధకారణద్వితయము
నమ్మహారామాయణమ్మున విడిచితినని యామెఱుఁగు తఱుగుల నిందువివరించినందుల
కామహనీయునభివర్ణించుచు నింకసహస్రముఖరావణ విజయంబెట్టిది చెప్పవేయని
మహదాసక్తితో వినుచున్న మునివరులెల్ల నడుగుటయు. ౨౦౪.

వనమంజరి. పురహరశంకర ♦ భూధరచాపవి ♦ భూతిలేపనతత్పరా
స్మరహరమాధర ♦ సాయకయుప్రతి ♦ మానదేవపరాత్పరా
గిరివరమందిర ♦ గీష్పతిసన్నుత ♦ కిల్బిషాపహరక్షకా
సురవరపోషక ♦ సోమకళాధర ♦ సుస్థిరాగరభక్షకా. ౨౦౫.

సుగంధి. పర్వతాత్మజామనోజ్ఞ ♦ భాస్కరామహేశ్వరా
నిర్వికారసత్వమూర్తి ♦ నిర్గుణాబుధేశ్వరా
సర్వలోకపోషణాని ♦ శాచరాబ్జవారణా
శర్వనిత్యబ్రహ్మగోళ ♦ జాలసృష్టికారణా. ౨౦౬.

దోదకము. దేవనదీద్యుతి ♦ దీప్తకిరీటా | యావసితాంబుజ ♦ జాండకృపీటా
భావజదాహక ♦ పాలితభక్తా | యావృతదీనజ ♦ నావనసక్తా. ౨౦౭.

ఇది శ్రీమన్మేధాదక్షిణామూర్తీశ్వరాక్షీణ వరప్రసాదలబ్ధ కవితా భాగధేయ
నాదెళ్ల పురుషోత్తమ నామధేయ బుధవిధేయ ప్రణీతంబయిన
శ్రీమదద్భుతోత్తర రామాయణమున
చతుర్థాశ్వాసము.

## శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః.

## పంచమాశ్వాసము.

---

కం. హరివిధిపూజితచరణా । గిరిరమణసదావిహరణ ♦ గిరిజాదరణా
కరిదానవసంహరణా । వరనాగాభరణవిజిత ♦ వైరిపటురణా. ౧.

తే. అవధరింపుముసంప్రీతి ♦ నాలకించు । చుండియుత్తరకథవిన ♦ నుత్సహించు
మునులఁగన్గొనివాల్మీక ♦ మునివరుండు । చెప్పఁదొడఁగెనుబైగాథ ♦ చిత్రముగను.

### శ్రీరామ పరిపాలనాభివర్ణనము.

ఉ. రాముఁడుహీనకృత్పరశు ♦ రాముఁడుధారుణీదేవలోకసు
త్రాముఁడునిత్యసత్త్వగుణ ♦ ధాముఁడుభక్తమహాఘనాశకృ
న్నాముఁడువారితారిఖల ♦ నాముఁడుశాంతిదయాదిసద్గుణ
స్తోముఁడుజానకీకుముద ♦ సోముఁడురాజయియేలెనిద్ధరన్. 3.

చ. సకలసరోజజాండములు ♦ సక్కఁగఁబాలనచేయుశ్రీధవుం
డొకధరణిన్భరించుటది ♦ యొక్కవిశేషమె నేర్పుచెప్పఁబో
లిక కెవరుండఁజాలుదురు ♦ లేములుగాములులేకభూప్రజ
ల్సకరసుఖంబులెల్లెడల ♦ సొంపుగఁబొందిరి రాముపాలనన్. ౪.

ఉ. సర్వసమత్వమాతనికి ♦ సాజగొనంబుగదామహాత్ముఁడౌ
దుర్విషయంబులేయెడలఁ ♦ దోఁపఁగనీయఁడునిర్వికారని
గర్వనిరార్తనిష్కలుష ♦ గాధులపౌగృహమేధులెల్లడం
బర్వినధర్మమున్దెలియు ♦ భక్తులుజ్ఞానులుధార్మికోత్తముల్. ౫.

ఉ. వైరముఁగోపమీషణము ♦ వంచనమోసమునీర్ష్యభావము
న్దూఱువిషాదమజ్ఞతయు ♦ దూరములయ్యెనొకోనశించెనో
తీరరయంగఁజూడనొక ♦ దిక్కునసైననుగానరావెయా
క్రూరగుణంబులెన్నుతగుఁ ♦ గ్రూరనివారక రామరక్షణన్. ౬.

సీ. కుటిలతకఠినత ♦ గూఢతమందత ♦ లేమివక్రతలింక ♦ నేమఱుఁగున
నిల్వఁదావేలేక ♦ పిల్వనిపేరఁట ♦ మేగియింతులనల్ల ♦ మేఁగిశొంచు

నాటియుఁగచకుచ ♦ నాభియానములందుఁ ♦ గౌనుననలకలఁ ♦ గానఁబడుచు
మీటియేయుండెడి ♦ నారులరాముండు ♦ కనఁడెన్నఁడనునమ్మ ♦ కముగలుగుట
కానినిజకాంతయుండెన్డొ ♦ కాంచెనతఁడు । అబలలనుఁజేరనేపాటి ♦ ప్రబలమన్న
నాదమాత్రమెచేలఁగంగ ♦ నానయొసఁగె । గాననింకేడవెదకినఁ ♦ గానఁబడవు. ౭.

చం. ఘనులెయసత్యవాదులిఁకఁ ♦ గానఁగఁజోరులుగానివేఱులే
రనయముపారెభక్తిఁదమ ♦ హైన్యమునజ్ఞతలేనివంచుసా
చనువునఁజేరఁదీసితము ♦ జాలిగనారయుచుండఁజెట్టుసా
ఘనమునరామునత్కరుణఁ ♦ దస్కరణంబునుజేయుచుంద్రటక్. ౮.

ఆ. ఉగ్గుఁబాలఁబోసి ♦ యొడివింతురోయన । భక్తియెల్లరకును ♦ బట్టునెడిఁ
బెద్దలైననదియుఁ ♦ బెలుగువారలతోడ । రామరాజ్యమహిమ ♦ మేమిచెప్ప. ౯.

సీ. ప్రక్కమక్కవనొప్ప ♦ భూమిసీతాదేవి ♦ వెనుకనులక్ష్మణుం ♦ డనువుగఁదగ
భరతశత్రుఘ్నులు ♦ పార్శ్వద్వయంబునఁ ♦ జామరమ్ములువీచు ♦ సరణిఁదనర
పాదసన్నిధిబహు ♦ భక్తిఁదత్పాదంబుఁ ♦ గొలుచుచుహనుమంతుఁ ♦ డలరుచుండ
ఆవిభీషణుఁడును ♦ సుగ్రీవుఁడంగదుఁడును ♦ జాంబవంతుఁడుదిశా ♦ సంఘులఁదగ
మంత్రులవనీసురులునుసా ♦ మంతరాజా । లిష్టబంధులుసైన్యేశు ♦ లెదుటనుండ
గాయకులవందిమాగధ ♦ కవులవినుతి । నిండువేడుకతోఁగొలు ♦ వుండుఁజెలిని. ౧౦.

## మునులు శ్రీరామునిగనవచ్చి నుతించుట.

సీ. కశ్యపుండత్రియుఁ ♦ గణ్వుండుజాబాలి ♦ గాధిపుత్రుండును ♦ గౌతముండు
గర్గుండుజమదగ్ని ♦ ఘనవశిష్ఠుండును ♦ మాండకర్ణియునిట్టి ♦ మౌనివరులు
శిష్యసంఘంబులు ♦ సెలఁగుచుఁదోనుండఁ ♦ జిత్తంబులెంతేని ♦ స్థిరతనొప్ప
కందమూలంబులు ♦ ఘనపుష్పఫలములుఁ ♦ గలకొలందులఁగొంచుఁ ♦ గానుకలుగ
తామయోధ్యకుశ్రీరామ ♦ దర్శనార్థు । లగుచురావార్తతెలియంగ ♦ నగుడురాముఁ
డప్పుడెదురేగివారల ♦ నర్ఘ్యపాద్య । విధులఁబూజించిగద్దియ ♦ లెక్కిటయును ౧౧.

కం. వారందఱుఁగూర్చుండియుఁ । దీఱనిమోహమునరాము ♦ దివ్యాకృతిఁజెం
పారినతమితీఱఁగఁగను । దారులలోఁద్రావికొన్చుఁ ♦ దద్దయుఁబ్రీతిన్. ౧౨.

శా. శ్రీరామారవివంశజారఘుపతీ ♦ సీతామనోహారకా
కారుణ్యాంబునిధీబుధాళివరదా ♦ గాంగేయచేలాంచితా

క్రూరానేకనిశాచరాహిగరుడా ♦ కూపారగంభీరనీ
ధారాళాదరభాగ్యమబ్బెఁగనని ♦ ధాత్రీజనుల్ధన్యతన్. ౧౩.

తన్వి. రామమహోత్సారవికులభనధా ♦ రాధరసన్నిభమృదుతనురూపా
శ్రీమహితాసంతతమధురపదా ♦ సేవకసాధ్యశపరిసృతభూపా
సోమసమాస్యాపిస్ఫురచనపరా ♦ కూరనిశాచరవరగణహర్తా
స్వామిసురస్తోమమునిశుభకరా ♦ సజ్జనకల్పకవరనరభర్తా. ౧౪.

కం. ధన్యుండవుహృతసేవక | దైన్యుండవుసార్వభౌమ ♦ దశరథరామా
మాన్యుండవెల్లయెడలను | హాన్యుండవుహానినెల్ల ♦ నడచితిసుమ్మా. ౧౫.

ఆ. నిన్నునీవలెన్న ♦ కున్న వెన్నుండవు | మున్నునీవుగన్న ♦ యన్నకొన్ని
విన్నవించికొన్నఁ ♦ గన్నాఁడవిన్నరు | లెన్నవన్నవన్నె ♦ లిన్న నెన్న. ౧౬.

సీ. మత్స్యమవైయునసో ♦ మకుననామకుఁజేసి ♦ వేదకిచ్చితికాద ♦ వేదచియము
కూర్మంబవైయుళ్ల ♦ కుధరముకంధిలో ♦ మునుఁగనీకమరుల ♦ కనుపోసఁగితి
ఆదివరాహమ ♦ వైషేతిఁబోరలించు ♦ కనకాక్షుఁబరిమార్చి ♦ ఘనతఁగనితి
నారసింహుండవైయు ♦ ఘోరకశిపుఁద్రుంచి ♦ ప్రహ్లాదభక్తుని ♦ రహిమెలపితి
వామనుండవయిమాపద్దు ♦ లీమువడపడి | బలినిద్రొక్కితిపాతాళ ♦ తలముఁజేర
పరశురాముఁడవైభూమి♦పతులహంతులఁ | జేసితాకార్తవీర్యునిఁ♦జెండితియుము. ౧౭.

ఉ. రాముఁడవైయుకేగ్రుడితి ♦ రావణుసానుజుసాక్షజున్మహో
ద్దామపరాక్రమాన్వితులఁ ♦ దద్బలమంత్రిచమూపులంపటీ
న్యాయులనాఖరత్రిశిర ♦ భీషణదూషణముఖ్యులెల్లర
న్నామములెన్నిచెప్పవిల ♦ నాకపవైరులఁజంపితొక్కటన్. ౧౮.

శా. అయ్యానేఁటికిఁగాదవేమమహిలో ♦ హాయిన్మైలంగన్నదా
యయ్యైకర్మలుకాలనిష్ఠజరుప♦ హవ్యంబులర్పేల్పఁగా
నెయ్యేధర్మములైననిర్భయముగా ♦ నెల్లర్తిబోధింపఁగా
నియ్యాస్థానములట్టివిష్ణుకనఁగా ♦ నేర్పాటుకల్గెంగదా. ౧౯.

ఉ. నీమహిమావిశేషమున ♦ నిత్యములోకములన్భరింతుకా
దామహనీయయొక్కరుఁడె ♦ దానుసమెచ్చినవద్దడంపఁగా
భూమినిబుట్టుచుండిటులఁ ♦ బూన్కినిసత్వమునెచ్చుచేసిన
న్నీమముగల్గిలోకులుగ ♦ నేతుతునక్షమతుంచునచ్యుతా. ౨౦.

కం. మనఁగలము సుఖముగా నిఁక । వినఁగల మెల్లెడల స్మృతుల ♦ నఖిలార్థంబు
ల్గనఁగల మొకళుల నొకరము । చనఁగల మభయమున నెటకు ♦ సాగిన నటకున్. ౨౧.

తే. ఇద్దియంతయు నీప్రాపు ♦ పెద్దతికము । బుద్ధి నిల్పిన వారమై ♦ యొద్దికఁదగ
ముద్దుగా మూకుఁ గన్గొనా ♦ బుద్ధిమాలి । రద్దిఁ గాంచినఁ గాలుని ♦ యొద్దకగతి. ౨౨.

వ. అని యిట్లు పెక్కుతెఱంగుల నక్కుశస్థలికుమక్కునవెక్కులుప నొక్కపెట్టినఁ
జక్కనివినుతులెక్కునగాఁజేయు నక్కాలంబున సీతామహాదేవి యల్లనమోమెత్తి
యెల్లరం గాంచి యుల్లాసంబు వెల్లివిరియం బొల్లి పల్లవించుసల్లక్షణంబున మెల్లనఁదనవల్ల
భుతోఁబలుకం బల్లెత్తనంతనె హల్లునలేర్పడఁ గొల్లగాఁగురియు జల్లువాన చల్లారి
నట్లు నిశ్శబ్దంబగుటయు నమ్మానినీమణి యమ్మానవాధీశుసమ్మతింగొని యమ్మునిపతుల
సుయితము బన్నెరపుచ్చు కమ్మనివచనమ్ముల నిట్లనియె. ౨౩.

## సీతామహాదేవి సహస్రముఖ రావణుకథ చెప్పుట.

సీ. కన్నెప్రాయంబునఁ ♦ గడుచేడ్కఁ జనకుని ♦ వేశ్మంబునందేను ♦ వెలయుచుండ
నొకయతీంద్రుఁడు రాఁగ ♦ నొద్దికమాయయ్య ♦ యాతిథ్యమొనరించి ♦ యారయంగ
నప్పుడుచాతుర్మాస్య ♦ మవ్వేటజరిపికో ♦ నిచ్చగింతునటన్న ♦ నెడపఁబొంగి
తగినదెల్లం గూర్చి ♦ తత్పరిచర్యకు ♦ నన్ను నేమించెను ♦ నాజనకుఁడు
అంత నేనుగొల్వ ♦ నాతఁడప్పట్టప్పుడు । చక్కనైనపెక్కు ♦ చక్కటులను
జెప్పియుండెనందుఁ ♦ జెప్పఁగానిపుడొప్పు । పెద్దముద్దుసుద్ది ♦ కద్దుపినుఁడి. ౨౪.

కం. అతఁడు నాకుం జెప్పిన । కతనెన్నె విన్న వింతుఁ ♦ బ్రీతిందెలియుండీ
లోతెఱుఁగువారి కెఱుకగు । నీతక్కనవారుచరిత ♦ మేనమ్ముండీ. ౨౫.

వ. అని శ్రీరామచంద్రుఁ రామాలలామంబు తావిన్న పలుకులన్నియు నొక్కయక్కరమైనం
దక్కనపడకుండఁ జెప్పంబూనినచొప్పున నిట్లనియె. ౨౬.

కం. అమ్మాజానకి యేమన । నిమ్మాయాజగములోన ♦ నెంతెంతలొచో
ద్యమ్ములు పెక్కులుగల్గును । సుమ్మా తెలియంగఁగాదు ♦ సులభము వినవే. ౨౭.

ఉ. హారిజనుఁట్రప్రహౌత్రులగు ♦ వారలు క్రూరులు యాతుధానుల
న్వీరులు లోకరావణులు ♦ వేమొగములుపది మోములొప్పవా
రారజనీచరేంద్రులయి ♦ గ్రైపిహికాభోగములెన్నొయందుచు
న్నారపితమ్ముఁ జెందుటకు ♦ నప్పుములోకులఁగూర్తు రొందఁగన్. ౨౮.

ఆ. అనుచు మొదలిడంగ ♦ నదికథకదయెన్ని | పదులమొకము లైన ♦ నదుకవచ్చు
నంచు వింతపడక ♦ వించున్నఁగనిపట్టి | యల్లయతియటని యె ♦ న్నెల్లఁ దెలియ. ౨౯.

## కైకసీవిశ్రవసుల సంతతి వివరము.

సీ. భూసుతా వినుమన్న ♦ పొందచ్చెరువింత ♦ కల్పనకథలివి ♦ గాదలఁపను
నిక్కంపుమాటలో ♦ నీకెఱిఁగింపంగ ♦ వలసియే తెలుపంగఁ ♦ దలఁచినాఁడ
మహితసుమాలియ ♦ న్మనుజాశనేశుని ♦ కూఁతుఁగైకసినిసం ♦ ప్రీతితోడ
విశ్రవసర్షియ ♦ న్విధిపౌత్రుఁడు వరింప ♦ నుభయధర్మంబుల ♦ యుద్ధతికిని
దగినలాగునఁబుట్టిన ♦ తనయులగుట | విప్రులైయును రాక్షస ♦ వికృతిఁగనిరి
పెచ్చుబలిమికిఁ దగినంత ♦ పేర్మిరూప | ములను వారొందఁగాఁగల్గి ♦ రలరుఁబోఁడి. ౩౦.

తే. వింతగను కనెనీకిది ♦ యింతగాను | దెలుపఁబూనితిముందీవె ♦ తెలియఁగలవు
నమ్మఁగానవొనామాట ♦ నాఁటికైన | నిపుడనమ్ముదువే నీను ♦ న్నెఱిఁగియుండు. ౩౧.

మ. అలకైకేసికి విశ్రవస్సునకుఁదా ♦ నావిర్భవించె న్మహా
బలుఁడిట్టట్టనిచెప్పఁబోల్కెకటఁగ ♦ న్వట్టంగరాదేదియుం
దలలే వేయికరంబులెన్న నిఱువే ♦ ల్తద్యుక్తదర్పంబునం
దొలిచూ లైద్విసహస్రనేత్రుఁడలరు ♦ న్దోర్వీర్యధైర్యంబులన్. ౩౨.

ఉ. అట్టిభయానకాకృతుని ♦ నాత్మజుఁ విశ్రవసుండుఁ గాంచివేఁ
డెట్టులనేమిచేయఁగన ♦ నెగ్గుజగంబులకెంతయో నొసా
పట్టియుఁటుంచునట్టులగు ♦ పట్టులనన్నునుదిట్టనౌనొకో
కట్టడియిట్టు పుట్టుటకుఁ ♦ గర్మములేమి యొనర్చినాఁడనో. ౩౩.

తే. మోహమునఁ గొంటెనిదితగు ♦ ముద్దియయని | దానియోగ్యతకోలఁదిని ♦ సూనుఁగనియె
తెచ్చికొన్నట్టిపనిఁగూడి ♦ వచ్చినట్టి | ఫలముకననయ్యెననికొంచుఁ ♦ బలికెనిట్లు. ౩౪.

## సత్సంతతికి సద్వివాహములు విధాయకములనునీతి.

తే. క్షేత్రబీజములనదగు ♦ పాత్రతలనె | సంభవింతురుసంతతి ♦ జగతియందు
గానవైవాహికములవి ♦ దానదృష్టి | దీర్ఘయోచనచేయనే ♦ దీఁటువడును. ౩౫.

కం. తనమోహావేశంబున | వనితనుఁబురుషుండు పురుషు ♦ వనితయుఁగోరం
గనువిపరీతంబదిగా | నొసగూడినఫలముజగతి ♦ నుత్పాతదమౌ. ౩౬.

తే. వన్నెకన్నను మిన్నది ♦ వాసియద్ది । యున్న చేకద యోగ్యత ♦ తిన్న నదగు
బరిమళంబున నేకాదె ♦ పరువుగనెడి । మల్లెవిరి యొండ తెల్లని ♦ వెల్లటుండ. ౩౭.

కం. పరగెడు రూపము లేమిని । గొఱఁతేయనికోలకొఱఁత ♦ గుణిగాన దమే
ఱుక్కుఱువేఱు మృగమదంబును । బరగెడి నేరూపమందుఁ ♦ బరువతులితమా. ౩౮.

తే. కానఁగంటికి నింపైన ♦ దానివానిఁ । బురుషుఁడింతియుఁ గోరంగఁ ♦ బూనకయిఁక
దల్లిదండ్రుల యోగ్యత ♦ తరబడిగన । వంశమరయంగ వలయును ♦ వాసి తెలియు. ౩౯.

సీ. అననుకూలార్థంబు ♦ లాసక్తిపడువారు ♦ శిష్టధర్మంబులు ♦ చెఱచువారు
నిష్ఠురాలాపన ♦ నిరతినిగనువారు ♦ బహ్వాశనాపేక్షఁ ♦ బడెడివారు
తెంపరితనమునఁ ♦ దెగఁబడఁగనువారు ♦ వ్యభిచారలక్షణ ♦ మబ్బువారు
మానాభిమానము ♦ ల్గాననివారును ♦ భూతదయాహీన ♦ బుద్ధివారు
ఆలుమగలందునొక్కరైన ♦ నాగుణములు । బిడ్డలందును గాన్పించుఁ ♦ బేర్మిఁగనుచు
నరయఁగైకసి రాక్షసే ♦ శాస్త్రజగద । కానరాకున్న నైజము ♦ ల్కడుపునఁగనె. ౪౦.

కం. వెఱ్ఱికి వేముఖములుతగుఁ । గుఱ్ఱని కటువే ముఖములు ♦ కుదిరినవింక
న్వెఱ్ఱికనన్లోకమ్ముల । మొఱ్ఱోయనిపించువిడఁడు ♦ మునుగతులెట్లో. ౪౧.

కం. అని చింతించి పితామహు । మనమున ధ్యానించికొనుడు ♦ మహనీయుఁడతం
డును బ్రత్యక్షంబైకనుఁ । గొనియెను మునుమనుమనిఁదన ♦ గుండెలవియఁగన్. ౪౨.

## బ్రహ్మదేవుడు సహస్రముఖుని పుష్కరంబున నిల్పుట.

ఆ. అంతవిశ్రవసుని ♦ యంగలార్పులువిని । యంతకంటె జగము ♦ లరయవలసి
కొంతచింతచేసి ♦ కుదిరినయోచన । వింతపాపఁగొంచు ♦ వేఁగనరిగి. ౪౩.

కం. భూమికిఁగడుమూరమ్మున । నామక రాలయమునడుమ ♦ నయపుష్కరమ
న్నామమున వెలయుదీవిని । నేమంబుగనిల్పిబుద్ధి ♦ సెప్పెఁదగుతతిన్. ౪౪.

తే. పుష్కరద్వీపనాథుఁడై ♦ పొందికఁగను । గానిజపతపములు లేవు ♦ జ్ఞానమల్లె
బ్రహ్మవాక్యానుసారియై ♦ పదవిగాంచు । వాఁడుకలఁడన్న దెఱుఁగరె ♦ వ్యాసుసీత.

కం. బహువిభవములు బలఁగము । బహువీర్యము భోగభాగ్య ♦ పటిమనుదనకు
న్సహనమ్ము చెడఁగనైనను । మహిదివిపాతాళములను ♦ మడిచిముడిచెడిన్. ౪౬.

వ. ఆతండట్లు నిరంకుశవీర్యధైర్యగాంభీర్యంబులను దగుసౌకుమార్యంబు ననుదగుచుభూ
తలం బేతెఱంగునఁదగునో స్వర్గంబునకు మార్గంబేయదియో పాతాళంబేతాళంబున

మాయఁబడెనో యెఱుంగిక తాతనొక్కని మాత్రమతలఁచి నప్పుడెల్లంగనుఁగొనఁ
గల్గుచుండె నంతనిక్కడ. ౪౭.

ఆ. మొదటిబల్మిచాల ♦ వదలుచుఁగైకసి | పదిమొగంబులున్న ♦ పట్టిఁగనియె
గుదురఁగాంచుజనకు ♦ కొన్నిగొనంబులు | చదువుపటిమమతియు ♦ జపతపములు.

మ. విపరీతాకృతియొక్కఁ డేచెడుఁగఁక ♦ నేవేటమి లేదన్నమై
జపములప్రాజలు వేదశాస్త్రపఠన ♦ ల్సాగింపఁగాఁదండ్రికే
యపవాదల్కొనఁడన్న నమ్మకమెపెం ♦ పయ్యెన్వయస్కుండుగాఁ
దపముల్సేసిపటిష్ఠుఁడైపరసతీ ♦ ప్రవ్యాపహర్తయ్యెసూ. ౪౯.

ఆ. ఇంకజనముతలఁగ ♦ నేకశిరస్కుని | ఘనశరీరుబల్మి ♦ గలుగువీరు
గానిదీర్ఘనిద్రుఁ ♦ గనియెనుగైకసి | వానిహానియట్టి ♦ కానిదయ్యె. ౫౦.

ఆ. కర్ణములనెకుంభ ♦ కర్ణుండనంగాను | సార్థకాఖ్యనతఁడు ♦ జరగునన్ను
తక్కనవయవముల ♦ యెక్కువతద్దేహ | దైర్ఘ్యమెఱుఁగలేవె ♦ దానిఁబట్టి? ౫౧.

కం. తుదకాయమునైజంబది | తుదముట్టఁగసత్కుమారు ♦ స్థూలోదారు
న్సదయువిభీషణనామకు | ముదురునఁగనెనమ్మతండ్రి ♦ ముదమందంగన్. ౫౨.

కం. పదిమొగములచినరావణుఁ | డదయుండయికాముకతకు ♦ నారంభింపల
బధిలముగహరుఁడునిలిపెం | గడసింహాళమందునతనిఁ ♦ గలఁడిష్టచటన్. ౫౩.

చం. బలఁగముపెంపునొందుడును ♦ బల్మివిశేషముఁగాంచియంతఁదాఁ
జలమునదేవనాయకుల ♦ జర్జరచేసిజయించివారికి
న్నిలువగనీడనింకనగు ♦ నిర్వృతియేదియుఁగల్గనీయఁడీ
యిలఁగలవారువానివిన ♦ నేభయమందెదరెట్టిశూరులున్. ౫౪.

కం సుతులంతకంటెబలియురు | హితమంత్రులుబంధులెల్ల ♦ నెచ్చినధీరు
లతపడిరికోట్లకొలఁదిగఁ | బతికంటెనుగ్రూరమతులుఁ ♦ బాపులుసీతా. ౫౫.

కం. అనిభయదములగువింతలు | చనువునయతివర్యుఁడనఁగఁ ♦ జక్కఁగవింటిం
గనుఁగొంటిఁజిన్నరావణు | ఘనులగుతద్ధితులఁబాప ♦ కర్మలనెల్లన్. ౫౬.

కం. అప్పుడతలఁచితినెదలో | నప్పరమేశాభయతివ ♦ రాలాపంబు
ల్చెప్పినయంతయుఁగన్నులఁ | గుప్పినయట్లయ్యెనెల్లఁ ♦ గొనముట్టెఁగదా. ౫౭.

ఉ. ఇప్పుడునెమ్మదిందలఁతు ♦ నీచినరావణుఁడిద్ధవేదము
ల్గొప్పగనేచియీశ్వరునిఁ ♦ గూర్మిభజించుమనుండినైజమా

చొప్పననీద్వనిద్దయుఁడు ♦ శుంఠయునయ్యెసహస్రనక్తుఁడి
క్లేపపృశోరేగముజ్జగము ♦ లే మొనరించునోయంచునిత్యముక్.  ౫౮

తే. ఆతఁడజ్ఞానిమూఢుండు ♦ నంటువింటి | నట్టివానికిఁజెనుబుద్ధి ♦ యంటియెత్తగు
నేలనోసాగకున్నది ♦ యెసఁగనేని | పట్టఁదరమానెనాముసు ♦ ల్పలికిరిట్లు. ౫౯

## మూఢమూర్ఖ తారతమ్యములు మునులు చెప్పుట.

చం. తెలియనివానికెద్దయినఁ ♦ దెల్పఁగవచ్చునదేయొనర్చడిం
దెలిసినమూర్ఖునిందెలియఁ ♦ దేర్పఁగధాతకుధాతృతాతకుం
గొలఁదికిమీఱుఁజెప్పవినఁ ♦ గూడఁడుకూడినఁజేయఁడింకఁదా
బలుమ్యతిరేకముల్పలుకుఁ ♦ బట్టినదేయొనగూర్చుచుండెడుక్.  ౬౦

కం. తెలిసినవినుఁదెలియమివినుఁ | దెలియక తెలిసినవనికొనఁ ♦ దివురువినకయే
మెలఁకువనిదురనుఁబలికెడిఁ | బలుకఁగఁదలఁపనినిదురను ♦ బలుకునెపిలువక్. ౬౧.

ఆ. మూర్ఖుకంటెఁజాల ♦ మూఢుండుమెఱుఁగమ్మ | మొదటినుండికొంత ♦ కుదిరికఁగన
దెలియకున్నదేవొ ♦ తెలియనెతెలియును | తెలియునెఱిఁగినంత♦తెల్లముగను. ౬౨.

ఆ. ముందెకొంతతెలిసి ♦ మూర్ఖుఁడుకాఁజెల్లు | వానిమొదలెఱుంగ ♦ వశముగాదు
వెనుకయత్నమెపుడు ♦ కొనసాగకుండున ♦ ట్లనువుగాదుబోధ ♦ వినకగొనుగు. ౬౩.

ఉ. కావుననావిధాతమును ♦ గైకొనిపోయియిఁకేమెఱుంగనీ
కావలఘోరదేశమున ♦ నల్లసహస్రముఖున్వసింపఁగాఁ
జేసయుభోగముల్మదముఁ ♦ జెందగనాడనెయానవెట్టితా
నావిధిపట్టినిల్పుటనె ♦ యంతటివాఁడునబాధకుండగుక్.  ౬౪.

తే. అట్టిధాతయెతానుద ♦ శాస్యుఁగనెడి|యప్పటికెవాఁడుమితిమీఱి ♦ యయ్యెఁదపసి
వానికోరినవెల్లను ♦ దానొసంగెఁ | గానితనపల్కు వినఁడని ♦ మానెననె.  ౬౫.

ఉ. దుష్టుఁడుధూర్తుఁడాఁజెలఁగి ♦ దోర్బలమెల్లజగత్త్రయంబున
నష్టముఁగూర్చుచుండుటకె ♦ నాఁటికినాఁటికిఁబేర్చిచేర్చుచుం
గష్టములంబుధుల్వడయఁ ♦ గానొనరించెదురాత్ముఁడంచునే
స్పష్టముగాజగంబులనఁ ♦ జచ్చెనుబొచ్చెమెశాశ్వతంబుగక్.  ౬౬.

ఆ. అటవినుండువ్యాఘ్రము♦ మటనుండుచందాన | భయదుఁడైయుఁగంటఁ ♦ బడఁడువాఁడు
జనునిమాంసమొకఁటఁ ♦ జవిగన్నవిడనిశా | ర్దూలమట్టిగడుసు ♦ దుడుకువీఁడు.  ౬౭.

కం. వాఁడైననొక్కమారెది । చూడంబడ నైనవిడునె ♦ చొన్పియురంబులో
వీడకపట్టైనసింగము । జాడన్వాదుండునాడఁ ♦జనరేరటకున్. ౬౮.

సీ. మునుబుష్కరద్వీప ♦ మునవిశ్వకర్మతాఁ ♦ గల్పించెనాలుగు ♦ ఘనపురములు
సురపతిశమనులు ♦ వరుణకుబేరులుఁ ♦ వరుసగానవికొని ♦ మరియుచుండ
దన్మధ్యశిఖరిపై ♦ ధాతవానిన్నిల్పఁ ♦ గనఁబడకవిడిచి ♦ చనిరివారు
కానవచ్చినవెంటఁ ♦ దానంటువాఁడని ♦ మేలయ్యెవాఁడవే ♦ యేలునిపుడు
వేరెజగముండునందుంద్రదు ♦ వీరులనుచుఁ । దెలియనంతగవాఁడుండ ♦ మెలపెధాత
మాదృశులమైనఁగనబోము ♦ మర్షముడిగి । రేగునోరేగనెటకువాఁ♦డేగునోయని. ౬౯.

తే. బలిసిరిపుడటఁగోటుల ♦ కొలఁదివింత । తనువులొప్పెడిక్రూరులు ♦ దనుజవరులు
వానియానవెయటువీడఁ♦ గానఁడేఁడు । జగమునకునద్రిశ్రేయమై ♦ నగతియయ్యె. ౭౦.

## శ్రీరాముడు సహస్రముఖునిపై దండెత్తనిర్ణయించుట.

కం. అనివారువలుకఁగావిని । ఘనుఁడారాఘవుఁడుపలికెఁ ♦ గాలంబెల్లం
జనవలయునిల్లెనాఁగా । నొనగూడునెరొప్పడేమి ♦ యుద్ధృతియగునో. ౭౧.

ఆ. పాములింటనున్కి ♦ పట్టుఁగన్నుమమూఁత । పెట్టిపాలువోసి ♦ పెనుచుచున్న
నెంతకాలమట్టు ♦ లేమరకుందురు । తప్పివచ్చెనేని ♦ ముప్పదిచ్చు. ౭౨.

కం. ఘనసాత్త్వికులకుఁగోపం । బొనగూడదుకూడనుండ ♦ దొకక్షణమైన
న్ఘనతామసులకుశాంతం । బొనగూడదుకూడనుండ ♦ దొకక్షణమైనన్. ౭౩.

ఆ. కాననమ్మరాదు ♦ కల్మషాత్ములుదైత్య । లట్టివారుమిాటి ♦ యట్టులున్నఁ
బుట్టిముంపకుంద్ర ♦ యట్టెరేగినవెన్డా । యన్నభూతనూజ ♦ యనియెనిట్లు. ౭౪.

కం. పదివదనములయదయునా । పదలనుబడియుంటఁజేసి ♦ భయమొదవెడినా
పదిపదులపదులమొగముల । మదునెవఁదలపంగఁగాన ♦ మక్కువయుఁదగన్. ౭౫.

ఆ. మున్నువిన్నవన్ని ♦ విన్నవించితినని । సీతపలుకమిగులఁ ♦ బ్రీతినొంది
రామచంద్రవిభుఁడు ♦ రహిమెచ్చెజానకీ । దేవియట్టివీరుఁ ♦ దెల్పటకునె. ౭౬.

వ. అంతసభాసదులకెల్లరకుందనయుల్లాసంబువెల్లడించి యల్లది వారికినింబల్లవించి
యల్లనవెల్లివిరియఁగనఁదనశౌర్యగాంభీర్యౌదార్యంబులుతెలియనిట్లనియె. ౭౭.

చం. పటిమముఁగాంచియంతటిప్ర ♦ భావముగల్గుటవిజ్ఞవీగియా
కుటిలులటుండవానిహిత ♦ కోటులుమేటులునుండభూమికా

రటములునిత్యముల్కలుగ ♦ రాజులుస్వర్థులుకారయోగ్యుఁగా
దిటపుఁగడంకతోనరులఁ ♦ దేర్చిననేజగముల్సుఖింపదుర్. ౭౮.

ఆ. కానవాడివెడల ♦ నూనుకేయుక్తము | మానఁదగునెయంత ♦ వానివిన్న
నకటమనయుపేక్ష ♦ హానికల్గినదాన | నఘుముమనిదెప్పుట్టు ♦ నఫలదమిఁక. ౭౯.

కం. అన్నాలక్ష్మణభరతా | పిన్నాశత్రుఘ్నహనుమ ♦ ప్రియసుగ్రీవా
విన్నారలేవిభీషణ | యన్నంతయుజాంబవంత ♦ యంగదసచివా? ౮౦.

కం. ఎల్లియకేదనపుఁబయనం | బెల్లరకును దెలియనేయుఁ ♦ డేగెడిభేరు
ల్బల్లిదుఁడువాఁడుకావునఁ | గొల్లలుగాసాధనములఁ ♦ గూర్చికొనుండీ. ౮౧.

కం. వనితాదశముఖుతోనేఁ | బెనఁగుటఁగనవైతి విద్ది ♦ ప్రియపడినీవే
పనిఁబూన్చుదానవైతివి | ననుఁగూడియెరమ్మనుటయె ♦ న్యాయముకాదే? ౮౨.

ఆ. అనఁగననియెసీత ♦ యధిపయేరాకున్కి | తూడునెట్టులింత ♦ చాడిచెప్పి
ఫలముతుదకునందఁ ♦ గలదాననేనైతి | నత్తుఁగాంతుసర్వ ♦ మత్తటినన. ౮౩.

వ. అల్లభావగర్భితవచనంబు దెలియుద్వర్థయైనను దెలియవలనుగలుగమి నల్లయర్థాంతరం
బరయుకంటె నర్థాంతరంబరయఁబూని. ౮౪.

కం. మునులారమీయనుగ్రహ | మునవానిన్నిగ్రహింప ♦ మునుకొననెంతుం
గనులారఁగనఁగనత్తురె | పనికలిగియిఁకెటులోపోవఁ ♦ బయనమగుదురే. ౮౫.

చం. అనియనురామచంద్రునకు ♦ నమ్మునివర్యులుసత్యవాక్యులి
ట్లనిరిమహాత్మమీరుతగు ♦ నప్పుడెనిర్భయతందదాహవం
బునఁగనకున్నవానినిఁకఁ ♦ బొంతకుఁబోయికనంగనేర్తుమే
జనకజయేతగుంగొఱత ♦ నవ్వడియొప్పనెపత్తుమేమునాన్. ౮౬.

తే. అందఱుత్సాహులైమహా ♦ నందమంది | యెల్లియనికేఁటికిప్పుడ ♦ యేగకనుచు
నిమిషమేడుగఁగడపుచుఁ ♦ దమకపడఁగ | నంతనానాఁడుభాస్కరుఁ ♦ డస్తమించె. ౮౭.

## సూర్యాస్తమయ వర్ణనము.

తే. దూరదేశమునందున్న ♦ దుష్టశత్రు | నుక్కడంపఁగఁగాల్చిన ♦ యుక్కుగుండు
గ్రక్కననుపైచెరాఘపుఁ ♦ డెక్కవెట్టి | యనఁగనపరాబ్ధిలోఁబడె ♦ నర్కుఁడపుడు.

కం. నాకులజులు నాశిష్యులు | నాకొమరుఁడు నింకఁ గలుగు ♦ నానావీరు
లోకద్రోహులఁ ద్రుంతురు | పోకఁ గనుఁడనుచు దివిఁ జన ♦ వేరఁ బిపఱచెన్. ౯౧

సీ. భయమెఱుంగని చిన్న ♦ ప్రాయంబు నందన్ను ♦ ఛాయమీఱిన బాల్య ♦ సమయ మిన్న
తరుణత్వమంతకం ♦ తకుఁ దాటి గానొప్పు ♦ నడుగులంటఁగ వచ్చె ♦ నడఁగియడఁగి
అట్టిదేయంతలో ♦ నలుసెక్కి మీఱంగ ♦ మెల్లగా మొదలిడి ♦ మిగిలెధృతిని
తానంతయున్నతిఁ ♦ గానంగ వద్దకా ♦ హీనస్థాయి నేలంటి ♦ యేతగడిని
పైఁగనెదురెత్తఁగాఁ బోవు ♦ బరపథమున | దనయకలుషతకోపని ♦ తామసమున
నిట్టిదిగ్గాలు పెడఁడన ♦ ముట్టిపడిరి | బ్రదుకరోతని వార్ధిలోఁ ♦ బడెనినుండు.

సీ. ఎప్పుడు నెదుట నే ♦ యొప్పుచుండిన సతి ♦ పరిచయమునఁ జుల్క ♦ పఱతురనియొ
తనదాటిన నిశంబుఁ ♦ గనకనఁ గ్రాఁగినఁ ♦ బులుకరించుట నంద్రుఁ ♦ కంతలనియొ
పటిమఁ గాంచిన పర ♦ స్ఫురమోహనశముల ♦ నాంధ్రుడను మగలెగ్గు ♦ లందురనియొ
ఒక్కటే తీఱున ♦ నెక్కువ మెఱసినఁ ♦ జొక్కఁడిఁడనఁ దీవి ♦ తక్కువనియొ
ముప్పుత్రిప్పులఁ బడ్డట్టు ♦ మునిఁగి తేలి | పోయివచ్చుచునుండెడి ♦ మాయలాఁడు
సర్వకాలము నొకరీతి ♦ జరుపు నాఁడు | నాఁడు నట్టులె యమునఁగడి ♦ జాఁడఁ బోయె.

సీ. ప్రాగంగనను జేరఁ ♦ బశ్చిమసతిఁ జేరఁ ♦ బరికింపుఁడీ వింత ♦ భానునంత
ఘనుఁడయ్యు నూరక యెట్టి ♦ గాఁగను పించెడి ♦ నిసుమంత యేదాటి ♦ యొసఁగదరయ
జగము తేలంగను ♦ సాగించితీక్ష్ణంబు ♦ స్వచ్ఛంబుగా నుండు ♦ సరణిఁ గనుఁడు
ఎంతటివారికి ♦ నంతఃకరణశుద్ధి ♦ భాగ్యతకొలఁదిని ♦ బట్టియుండు
బైటికి నిమంచిగా నున్న ♦ మాటలనుచు | బ్రజలమాద్భుతరధికార్లు ♦ పటిమమెఱుఁగ
నింటఁ గనవచ్చు వారల ♦ బంటుతనము | భూకరింపొంకతగు బ్రభ ♦ వోయియుండె. ౯౨

కం. నిశ్చింతగ మెఱయంగ నెఁ | బశ్చిమదిక్పద్మగంధి ♦ పతితనుఁ జేరం
బశ్చాత్తాపము నొందెన | భశ్చంపకగంధితమము ♦ పొడిన వగటన్. ౯౩

తే. తనదుపద్మినిజాతికి ♦ తరులఁగనఁగఁ | దనపతివ్రతధర్మంబు ♦ తలఁగు ననుచు
విభుఁడు దేశాంతరం బేఁగ ♦ వికసనంబు | భ్రమలకాస్పదమగునంచుఁ ♦ గమలమొగిడె.

కం. శూరుఁడు పైఁగాపుండినఁ | గ్రూరుల చోరులను బడక ♦ కూర్మిఁ దిరుగనో
జారిన నాతం దూరులఁ | జేరు బెతగునంచుఁ బసులు ♦ సేరె నెలవులన్. ౯౪

ఆ. వేవెలుంగు నంద ♦ వెట్టపిఁగఁటఁగని | కటికితామ సుండు ♦ క్రమ్మవచ్చు
రంపపోదమనుచు ♦ నొండొంటిఁ బిలుచుచు | నుండు పట్టఁ జేర ♦ నండజములు. ౯౫

కం. కనఁగనరాజకసమయం | బననైగాఢాంధకార ♦ మంతటనిండె
జ్జనులుత్తములందభయం | బునుఁగ్రూరులురేగిపోని ♦ పొనరింపంగన్. ౯౭

కం. రవిపోయితెలుపవచ్చిన | దివిజులెకాఁబోలుననఁగఁ ♦ దేజరిలెంబై
నవశోభలనుడులచ్చెరు | వవుపీడకరేయియెల్ల ♦ నట్టులెనిల్వన్. ౯౮

## చంద్రోదయాస్తమానవర్ణనము.

ఉ. కాలినగుండురాముఁడటు ♦ కైకొనియేయనటున్న దంతయుం
గాలిచెనద్దిదానిపొగ ♦ గాఁడగునీతమమిద్దితీర్పమిం
జాంభయానహాంబనుచుఁ ♦ జక్కనితెల్లనిగాజుకుప్పెలో
నోలినిదీపమూన్చిసుర ♦ లుంచిరనన్నశిహూర్పునందగెన్. ౯౯

సీ. మిత్రుండుతననైజ ♦ చిత్రదీప్తులుసూపె ♦ జగమేమియగడోండి ♦ దిగులుపడునొ
అంధకారముపెను ♦ బంధకమైమీఱె ♦ జంతుజాలంబెంత ♦ చింతపడునొ
క్రూరజంతువులును ♦ జోరులుజారులు ♦ మీఱుదురేడనే ♦ మేల్మిచెడునొ
తాపంబులిన్నిట్లు ♦ తాలిమిచెఱుపంగ ♦ నోఁపకజగమెట్టి ♦ యూహపడునొ
చల్లచేయకయుండిన ♦ సరసతచెడు | నమృతమయుఁడంచునేనున్కి ♦ వ్యర్థమగును
వేగఁబోనంగవలెనంచు ♦ నేగుడెంచు | గతినిజంద్రుఁడుగాన్పించె ♦ గగనమందు. ౧౦౦.

తే. పూర్వదిక్కాంతసంతోష ♦ పూర్ణయయ్యె | వల్లభుండట్లుచల్లని ♦ వాఁడుచిక్క
డాబుకొనముందుగానుగు ♦ లాబిచీర | యంతలోదలివల్వయు ♦ నమరఁగులికె. ౧౦౧.

సీ. చొక్కుజంతువులును ♦ షష్ట్యనష్టనుజెంద ♦ హాయిఁదానొనగూర్చు ♦ నలరుచుఁబయి
సాధుసంతతులనే ♦ చల్లగాసుఖపెట్టు ♦ శిష్టరక్షణమది ♦ శ్రేష్ఠమనుచు
చోరులనరికట్టి ♦ పాఱనీయఁడుకాలు ♦ విరహులజారుల ♦ వెతలఁబెట్టు
దుష్టశిక్షణమువి ♦ శిష్టధర్మంబని ♦ సర్వదాతాఁజేయు ♦ జగమునందు
చంద్రుఁడగుతానుశ్రీరామ ♦ చంద్రునందుఁ | గొనకుసామ్యమైనఁజేయక ♦ గుణముఁగననె
యనుచునెక్లైనదోషాక ♦ రాశ్యఁదోలఁగఁ | జూచుఁగానికళంకికిఁ ♦ జొప్పడడెనె.

కం. కుముదంబులువికసింపఁగఁ | దమముగుహల్దూరఁబార ♦ దారాపతులుం
దమితోజతపడుటొప్పఁగ | నమలశశాంకుండునభము ♦ నందలరారెన్. ౧౦౩.

సీ. గురుపత్నిఁగూడిన ♦ గుణహీనుఁడంచును ♦ దనునిశాచరుఁడంచుఁ ♦ దలఁపజగతి
కొమరుఁడంతబుధుండు ♦ కూర్మిఁదాఁగన్నను ♦ బరమశత్రుగఁదన్ను ♦ నెరపుననియొ
అందఱదారల ♦ నమరిచికొన్నను ♦ నందుసాముద్రుండ ♦ రంభఱనియొ

రోహిణీజనులల్ల ♦ వేదనబడితన్ను ♦ దూఱుచుండఁగవిని ♦ దుడుకుగనిరయో
రాజుతానైననొక్కింత ♦ రద్దిసడ్డ | లోపముండుటనులుకత్తి ♦ యోఁపమాలి
యేమితోఁ బ్రకవార్ధిలో ♦ దాముసుంగ | నఘుము లెడఁబాయునవిశశి ♦ యరయుచుండు.

## సూర్యోదయ వర్ణనము.

తే. మక్కువలఁజిక్కి సతిపతు ♦ లక్కుఱింకఁ | దక్కువరబడెపక్కనీ ♦ దెక్కడిదిది [మె
నిక్కియెక్కెడిఁజూడుఁడ ♦ మ్మక్కయనుచు | వెక్కసపు లెక్కననవేఁగు ♦ చుక్కపొడ

ఆ. ఇనుఁడువచ్చుచుండ ♦ నింకనునిద్రింత్రె | సమయకృత్యములను ♦ జరిపికొనక
యనుచు నెల్లపాటి ♦ యాగ్రహమునమీటి | యుండునాఁగనరుణుఁ ♦ డుదయమయ్యె.

సీ. ముగురుమూర్తులకును ♦ మూలమౌనీస్వామి ♦ ముఖ్యమీనయమను ♦ ముచ్చటకునొ
కొంకకలెండిశుఁ ♦ గొండాడికొండిఁకఁ ♦ గొఱనూనఁబొండను ♦ గుఱుతునకునొ
ముప్పొద్దులీశుని ♦ గొప్పగాధ్యానించు ♦ టొప్పు సుండీయని ♦ చెప్పుటకునొ
ఆదిమధ్యంబుల ♦ కైక్యమంత్యంబెన్నఁ ♦ డీటొక్కఁటేయెడ ♦ దీక్షమననొ
కొఱ్ఱకొకోఁయటంచును ♦ నొక్కినొక్కి | యంతటను జెప్పఁగాల్జ్ఞ ♦ సంతతులడి
బహురహస్యముగల మేటి ♦ పల్కుటంచు | నమ్మకంబుగబుధులుండు ♦ రమ్మెఱుగన.

చం. తెలతెలవాఱె లెండనుచుఁ ♦ దెల్పఁగనోయదికాదుమావలెం
దొలితొలినీశుఁ బ్రార్థనము ♦ దొడ్డరనంబునుబూనిఁజేసిమీ
కలహలుఁకార్యములుగనఁగఁ ♦ గైకొనుఁడంచెటిఁగింపనూననో
కలకలనాదమండజని ♦ కాయము చేసెడి నెల్లదిక్కులన్. ౧౦౫.

సీ. బ్రాహ్మణోత్తము లేగి ♦ పొలుసేలులలోనఁ ♦ గడువడిమున్గియు ♦ ఘర్మంబులోసఁగ
కులకాంతలెల్లరు ♦ స్థలపారిశుద్ధ్యంబు ♦ నొనరిచిచిత్రించు ♦ పనుల మెలఁగ
వందిమాగధపంక్తి ♦ వలెనువిద్యార్థులు ♦ పలువిధగ్రంథము ♦ ల్పఠనచేయ
వెలివాటిజగమెల్ల ♦ వెలసినసంతోష ♦ మునను న్నయాసన్నుఁ ♦ గనఁబఱుపఁగ
మూర్తియినుఁడుగ్రహాధిపుఁ ♦ డార్తిహరుఁడు | వచ్చిచేరునొవినఁగన ♦ నిచ్చఁగనునో
యెట్టులైననుదగినవౌ ♦ నట్టిపనుల | నుండనందఱుభాస్కరుఁ ♦ డుదయమయ్యె. ౧౦౬.

కం. మందలుగొనురక్కసులను | జిందరవందరగఁజంపు ♦ శ్రీరాముండీ
మందేహులవిడిచెన్న | న్నుందవులఁగనంచినుండు ♦ సులుసుఁగొనుఁగదా. ౧౦౭.

తే. కానఁగిరణమ్ములునుదీప్తి ♦ కానరాక | న్యాసతనుబుట్టుతోపము ♦ నూనముగుట
గనఁగముబ్బడియాకృతిఁ ♦ గొనియదంత | యెఱ్ఱవాఱెనబిక్కవో ♦ యినటులయ్యె.

ఆ. అంతఁధాత్రిదేవ ♦ తార్క్ష్యబిందువులను । రామబాణములను ♦ రహాటువాపి
సతతమొప్పనండ ♦ జతనుండఁధృతినిండ । సంతసించితెలుపు ♦ సరణిఁబరఁగ. ౧౧౨

తే. మృగమదంబుండలుగఁజేసి ♦ మెల్లఁజేయుఁ । బద్మినీకాంతలేఁపఁగా ♦ భానుఁడన్న
విధముననభృంగములుపడు ♦ విడలునపుడు । తామరసమునమధువును♦దమినిగ్రోల.

కం. కరములగిలికించెడినో । యొరులెఱుంగకయుండసైగ ♦ లొల్లొనరుచునో
బిరబిరవిరిసెడిసరసిజ । ధరణిందాఁదగుచునింగి ♦ దరణిపరగనే. ౧౧౪

చం. ఇటులనుబ్రాచిఁదోఁపఁగను ♦ హేళిరఘూద్వహకాల్యకృత్యసం
ఘటనముగాఁగనాపతిస ♦ గౌరవరూఢిమనంబుసక్కసే
యుటతమిసెమ్మదిందలఁచు ♦ టొప్పఁగనింకొకభానుమండలం
బటులఁబ్రశస్తదీధితుల ♦ హాసునఁబుష్పకమేగుదేరఁగన్. ౧౧౫

## శ్రీరామాదులు పుష్పకారూఢులై దండు వెడలుట.

ఉ. దండునుయోధవీరులును ♦ దంతులుఘోటకముఖ్యలగంబులు
ద్దండపరాక్రమోద్యమని ♦ దానమెధైర్యముదానశౌర్యము
న్దండిగనొప్పనుత్సుకత ♦ దానవటీనుడుముప్పిరుల్గొన
న్మెండుగనిబ్బడించెనటు ♦ మీఱినపుష్పకమెక్కఁగల్గుటన్. ౧౧౬

కం. రామాజ్ఞమునులుబలములు । భామామణియోధవరులుఁ ♦ బౌరులలోన
న్సామాన్యపురుషులింతులు । నేమానఁగనెల్లవార ♦ లెక్కిరిపతియున్. ౧౧౭

శా. అంభోధిధ్వనులైక్యముంగనఁగబ ♦ ల్హార్యతూర్యముల్ద్వారది
క్కుంభిద్రంబులఘీంకృతుల్ప్రతులిడ ♦ న్ఘోరారిపృద్భేద్యసం
రంభోత్సాహముతెల్పుభేరులాకఁటం ♦ బ్రఖ్యాతరామప్రభా
గాంభీర్యంబులువెల్లడింపబలము ♦ ల్ఘట్టించుపుష్టింగనెన్. ౧౧౮

తే. అంతఁబుష్పకమల్లన ♦ నరుగలేవఁ । బౌరనారులుహారతు ♦ లీరహిఁదగి
పేరులెటేఁగినవారలు♦పెరలకెల్లుక।పలుచుచుంజూపిచెప్పంగఁ ♦ బరగిరిట్లు. ౧౧౯

సీ. రాము రాక్షసహంత ♦ రమణినిగంటిరే ♦ యింద్రజిజ్జయలక్ష్మ ♦ కేంద్రుఁగనఁడి
భరతశత్రుఘ్నులు ♦ పరగెదరల్లదె ♦ మునులందొఱొకగుమి ♦ గొనిరికనుఁడు
అలలోకబలపుత్రుఁ ♦ డతఁడెలంకంగాల్చె ♦ నావానరేశుసు ♦ గ్రీవుఁగనుఁడి

వాఁడెమందోదరి ♦ నీడిచినంగదుం ♦ డాజాంబవంతుఁడౌ ♦ నపరహనుమ
అసురులనుదప్పఁబుట్టిన ♦ యావిభీష | ణాఖ్యునలునీలునాసుషే ♦ ణాదిఘనుల
నలసుమంత్రినిసైన్యాధి ♦ పులఁగనుండి | వేగజయమందిమరలదీ ♦ వింతమమ్మ.

వ. అనిమహోత్సాహంబులఁబల్కఁగాంచిరింకం దాము కామినులైనందున నటువోనోమరై రనికొనిరేకాని యొక్కరును దూరపుఁబయనంబనియొ క్రూరరాక్షసవీరసంగ్రామారంభముగదా యేరీతినగునోయనియొ శంకింపనైనఁదలంపరేలన. ౧౨౧.

కం. జనపతియండఁరయెమేఁటిది | యినుమిక్కిలియాంజనేయు ♦ నెసకంబెసఁగుం
జనువారెల్లరుసుఖముగఁ | జనుదెంత్రనుపల్కవేలు ♦ చక్కటులున్నే. ౧౨౨.

తే. కనఁగనౌనంతదవ్వున ♦ గాంచుచుండి | యాగఁబౌరులుపుష్పక ♦ మేగవేఁగఁ
దేజరిల్లెడిపుష్కర. ♦ ద్వీపముఁగని | నిలిపియంబరమునఁబతి ♦ నలికెనిట్లు. ౧౨౩.

## శ్రీరాముండుపుష్కరద్వీపమునువర్ణించుట.

సీ. కనుఁడిపుష్కరమిది ♦ కనకాద్రినిరసించుఁ ♦ దనసువర్ణచ్ఛాయ ♦ ఘనముగాఁగ
మహినొప్పుభానుని ♦ మండలంబోయను ♦ రీతినిశోభిల్లు ♦ భాతిగరిమ
క్రిక్కిరిసినమేఁటి ♦ రక్కసుల్వెక్కుండ్రు ♦ నెక్కొనస్వర్గంబుఁ ♦ దక్కుగఁగొను
వైకుంఠకైలాస ♦ వర్ణనీయౌన్నత్య ♦ మీలంకనొకపంక ♦ కెనయదగునె
అలయయోధ్యకుసింహళ ♦ మకుఁబదింత | లిద్దినూటింతలగులంక ♦ ముద్దనకను
అగునునాయమెముఖమొండె ♦ తగుననాకు | వానికాఁబడవేయాయె ♦ పీనికరయ

కం. చక్కగవట్రువుగాఁదగి | యొక్కధరాధరమునదుమ ♦ నొప్పంగాన
ల్దిక్కులఁజక్కనిపురములు | మిక్కిలిశోభిలనెసంగ ♦ మెఱయఁగనుండి. ౧౨౫.

తే. నడిమిచక్కటినొప్పెడి ♦ నగమునండఁ | గడిదిపురమెప్పరాక్షస ♦ ఘనుఁడటుండు
ఘణములోదాచుచక్రిపైఁ ♦ బరులకలవి | కానిదశనుండియగుఁబుష్ప ♦ కంబుకలిమి

ఉ. నాలుగుపట్టణంబులకు ♦ నాణెములౌమణిగోపురంబులీ
శాలయశైలపుంబురికి ♦ నౌనలుదిక్కులనొప్పుద్వారము
ల్చాలులుమూలలుంగలిగి ♦ చౌకములైదయికూడియొక్కటౌ
లీలనుభిత్తిస్వర్ణరస ♦ లేపితమైతగుదార్ఢ్యమెచ్చుగాన్. ౧౨౭.

ఉ. ఎన్నికఁగన్నసౌధముల ♦ యెచ్చటులుంతమగారసంతతు
ల్గన్ననుజిన్నదొక్కటియుఁ ♦ గానఁగరాదెయిదేమిచోద్యమో

యున్నతదేహులౌదితిజు ♦ లున్కికివారివిహరింపఁబూన్కికిం
దిన్నగనుండనీగిరిమఁ ♦ దేజరిలుంగననద్భుతంబుగాకన్. ౧౨౮.

కం. ఏవాఁడచిలుకయాపలు । కేవాకొనునన్నయట్లు ♦ లిదియారయఁడీ
చేవనఁటీవినినున్నతి । నేవెలయునుజంతువితతి ♦ యెల్లతరువులున్. ౧౨౯.

శా. ఉద్యానంబులనూనపుష్పఫలర ♦ మ్యోద్భిజ్జముల్దట్టమై
చోద్యంబైమితిమీఱియున్నతములై ♦ చూపట్టునొక్కొక్కడ
న్వేద్యంబుల్వెనుగట్టులట్టియరుగు ♦ ల్విస్తీర్ణముల్వారికి
న్హృద్యంబుల్విహారించిశ్రాంతిఁగొనఁగా ♦ నేర్పడ్డవాఁజూడుఁడీ. ౧౩౦.

శా. కాసారంబులుగంటిరేయవిమహా ♦ గాంభీర్యముల్పూర్ణము
ల్ప్రాసాదంబులపొంతఁగొన్నియువన ♦ ప్రాంతంబులంగొన్నియు
న్హాసోల్లాసవిలాసవేషములన ♦ య్యైదైత్యభామామణు
ల్వైభసింగాంచినవారుడిగ్గుటకుసో ♦ పానంబులేర్పడ్డవో. ౧౩౧.

ఉ. మున్నలలంకలోనొకటి ♦ ముద్దగునీలముఁగంటిరావణుం
డెన్నికదానిపైఁగడుగు ♦ నెక్కిపదంబులనంగవింటిని
క్కెన్నఁగరానిలెక్కఁడగు ♦ నీడఁగొలంకులజాడఁగంటిరే
యన్నులవస్త్రశుద్ధిదితి ♦ జాంఘ్రులక్షాళనకర్మలందగున్. ౧౩౨.

సీ. సికతామయంబెల్ల ♦ సీమయైభూసార ♦ పటిమచేసస్యము ♦ ల్వెరగుఁగనరె
పెనువృక్షములభాతిఁ ♦ బెటిగియామోకలు ♦ దండిగాఁబండునే ♦ ధాన్యమొక్క
తిన్ననిజఠరదీ ♦ ప్తినిగన్నవారికే ♦ కూడినవైయుండుఁ ♦ గూఁటికెన్న
మత్తేభములకంటె ♦ నెత్తుసత్తువలొప్ప ♦ క్రొత్తవాపసులుండు ♦ మొత్తములుగ
గజములల్లవెకనుఁడున ♦ గంబుల్గొలు । హయములొప్పెడిసౌధంబు ♦ లంతలచట
స్యందనంబులుగాబోలు ♦ చాలసాగి । శిఖరగతకేతనములివె ♦ చేరుమనల. ౧౩౩.

చం. పురములవీథులంగనరె ♦ పుష్కరణుల్నగముల్వనంబులుం
బురములునుండఁదావృతగి ♦ పుష్కలమైనవిశాలమొప్పెడుం
దరిఁదగుసౌధపంక్తులను ♦ దైత్యవధూటులుచీటితత్స్వఘట
స్వరములఁబల్కఁగావెదుటి ♦ వారువచింతురువారికేతగున్. ౧౩౪

కం. అదివారికొకవిశాలమె । పదములదైర్ఘ్యమునఁజూచి ♦ పాదమువెట్టం
బడిపంప్రెండడుగులెయగుఁ । గదమననరులకునునడవఁ ♦ గాజామైనన్. ౧౩౫.

సీ. అలసింహళద్వీప ♦ మందొప్పునగరులీ ♦ ఛాయసేవకగృహ ♦ సముములగునె
ఆలంకలోనుండు ♦ చాలవనంబులీ ♦ నేలనొక్కపొలంబు ♦ లీలకగునె
అందలిమణిగోపు ♦ రాట్టాలకంబులిం ♦ దందఱియిండ్లకు ♦ నమరుఁగనరె
ఆరావణాసురు ♦ నార్భాటముళవెల్ల ♦ నీడనెల్లరకుండఁ ♦ గూడుసుండి
కనుఁడుకనుఁడదెయటనటఁ ♦ గలదితిజుల। స్త్రీలఁబురుషులవారున్న। లీలలెల్ల
కొండలుద్యానవనములఁ ♦ గొండలూగ్ల। సరసులందుంద్రుకొందఱు ♦ సరణిఁగనుఁడి.

చం. పదితలలున్నవాఁడొకఁడె ♦ బంటుట రావణుఁడీడఁగందురే
పదులిఱుమూళ్లుమూళ్లయిదు ♦ పంక్తులుదీఱముఖంబులొప్పఁగా
మెదలెదరెందరొకనుఁడు ♦ మేఁడలనిండ్లనిఁక్కొందఱుందురో
యదయులువీరు రావణుని ♦ యంతటిక్రూరులుఁగాకయుందురే. ౧౩౭.

కం. అతికాయమహాకాయులు। జతపడిరొకయిద్దఱుందు ♦ సందడిగొనియిం
దతితమహాస్తమాంగుల। మితముగఁగాన్పింత్రెయింక ♦ మేఁటులటుండఁ. ౧౩౮.

సీ. సర్పవృశ్చికరోమ ♦ సంజ్ఞలేపడయుచు ♦ నెన్నికగాఁగొంద ♦ లెసఁగిరాడ
అట్టిచిహ్నలుగని ♦ పట్టిపేర్లిడుటకు ♦ ననువుగాదీడనె ♦ ట్లనఁగవినుఁడు
సర్పవృశ్చికఖడ్గ ♦ సన్నిభంబులెసర్వ ♦ రోమంబులిటఁగల ♦ తామసులకు
ప్రత్యేకమొకరికిఁ ♦ బరగవుతెగలుగా ♦ నందఱికవియొప్పు ♦ ననువుసరణి
దీర్ఘములుసర్పములయట్లు ♦ తీరియుండు। చుట్లుగొన్నవితేళ్లకొం ♦ డ్లట్లుతగును
నిక్కియున్నవికత్తుల ♦ లెక్కగును। అన్నివిధములునందఱి ♦ కున్నవెకద. ౧౩౯.

ఉ. మేనులెఱుంగకుందుర్కదె ♦ మేఁటులుకొందఱుగ్రాలుచుండఁగాఁ
జానలువారియెత్తునకు ♦ సత్తునకున్సరిపడ్డవారలై
పూనికఁగొంచుఁబోదురదె ♦ భూతములన్నవిధానఁగాననౌ
సేనరులైనవీరిఁగన ♦ నేపడిచత్తురునిల్వనేర్తురే. ౧౪౦.

కం. అల్లదెయుద్యానంబున। వెల్లగిలంబడియెనొండు ♦ వేదికపైనం
గొల్లగఁద్రాగెనుగాబో। లెల్లయొడల్దలుగవంద ♦ యేన్గులబరువౌ. ౧౪౧.

కం. పిల్లలయాటలుగన్గొనుఁ। డల్లరికొండొరులుగ్రుద్దు ♦ లాడుకొనంగా
మల్లడిగొనుజగమెల్లను। మల్లకులునుమల్లులైన ♦ మార్కొనఁదరమే. ౧౪౨.

ఆ. వారిమేనులందు ♦ మీఱిశోభిల్లెడి। తీరుతీరునగల ♦ తీరుఁగనుఁడు
పసిడిమొప్పిదంబు ♦ పరగెడురత్నము। ల్స్థాపితంబులైన ♦ యాపగిదియు. ౧౪౩

## గుణహీనత వినాశహేతువను రామోపన్యాసము.

ఉ. ఇంతటిభాగ్యభోగ్యములు ♦ నీతనుపాటవమీవిలాసము
ల్చింతలెఱుంగరానిదశఁ ♦ జెందినమన్కియుఁగల్గివీరలి
ట్లింతగఁగ్రూరులౌటనెక ♦ దేబుధశత్రులునాశపాత్రులై
రింతటిహానికైనగుణ ♦ మేకదముఖ్యముడీనిచెన్న రే. ౧౪౪.

తే. కలిమిబలుములుఁగలిగిన ♦ గడియలోన | బలిసివెలసెడిఁబోలఁగదు ♦ పాడుమదము
తలఁగమెలపినబలియుఁడై♦ధన్యతఁగను | నలరఁగులికినఁదలపడు♦హన్యతఁగను. ౧౪౫.

చం. ఘనికులువీరలైమదము ♦ తారసిలంగఁబోలంగనీకయ
య్యనువునవర్తిలంగనిన ♦ నట్టిదురాత్ములేరాక్షసుల్గదా
జనులకుహానిచేయుదురు ♦ సౌఖ్యముస్వీయమెచూచికొందురిం
కనుభెరగొప్పలేమరయఁ ♦ గామదివెట్టెరుదానహానియౌ. ౧౪౬.

కం. బలవంతులైయుదుగ్ధయు | లలతులగారింత్రువార ♦ లలమటఁజెందం
గులమెల్లనాశనంబగు | ఫలితమెకననొనుగుణము ♦ పాయుటనెకదా. ౧౪౭.

కం. తలిదండ్రులుగురువులుద | మ్ములయనిపనులందుమెలప ♦ హాస్వింపకతా
మలవరచికొండ్రుపెరపను | లొలిసినపాపదలకేత్తు ♦ రౌదవమిగుణముల్. ౧౪౮.

ఆ. మిన్నుమన్నుగాన ♦ కున్నంతగామేటి | వన్నెగన్నవారి ♦ యెన్నికఁగనఁ
దెన్నుసున్నచేయు ♦ క్రొన్నడకలవడ | జన్నెయెన్నగొనమ♦దున్ననగునె. ౧౪౯.

ఆ. పాపమన్నదొకటి ♦ ప్రాప్తించుననుమాఁట | యపుడునరకమొందవు ♦ నన్నమాట
మరలజన్మలందు ♦ మలసెడుననుమాట | యెఱుకపడవుగుణము♦కొంతతమౌట. ౧౫౦.

కం. ధార్మికుఁడౌగుణిశ్రేయమె | కర్మంబులనందనేర్చుఁ ♦ గలుగదిదియెయా
ధర్మగుణరహితునకునీ | మర్మముజగమెఱుఁగుమెఱుఁగు ♦ మాటౌమాటౌ.

తే. అట్టిగావుననీలంక ♦ పట్టునందు | దిట్టఁదనమునవిందఱు ♦ జెట్టులున్నఁ
జుట్టుకొన్ననుగట్టడిఁ ♦ బట్టితెలియ | కుట్టిపెట్టంగఁబడరట్టు ♦ యెట్టులున్నొ. ౧౫౨.

కం. ఇఁకఁగానరానివీరులు | లకలుకలేగతినిగూర్చు ♦ లావరులౌకదా
యెకిమీనివేమొగంబుల | ప్రకటితపటిమంబుమున్న ♦ ఫణితమెయాయెన్. ౧౫౩.

తే. ఇట్టివీరులపైమన ♦ మెత్తివచ్చి | యిట్టివట్టివిచేయురా ♦ నట్టియూహ
లారయకచేసిమిలిమిఱ ♦ నూరకేగఁ | గాడిగాదెంకఁగాఁపల ♦ పల్కు విసుడు. ౧౫౪.

వ. అని యాతఁడు నాభూతనయాచేతఃప్రియుండు నూతనసంభ్రమంబులొప్పింప భ్రాతలను వానరనేతలను సైనికవ్రాతంబును బ్రీతింగలయంగనుంగొని యాతురంబులుడిగి లోఁతయిన యాతెఱంగు లెఱింగి యాతనియానలె చేఁతనీతమనికొనఁ జూతురకాన నిట్లనియె.

## యుద్ధరంగయోధాదినిరూపణ రాముడు చేయుట.

సీ. నాల్గుపురంబుల ♦ నడుమవిస్తీర్ణమై ♦ నగనికటంబున ♦ నగరులమొగిఁ
దగునల్లరంగము ♦ తగుఁగదనంబున ♦ కాడడిగ్గదముపై ♦ నాఁడువీఁక
నెదుటిమధ్యపురంబు ♦ లేఁజూడఁగానగుఁ ♦ బెరమూఁడుసౌమిత్రి ♦ భరతులకగు
నరబలంబులుమని ♦ నరులఁగాచుటొచ్చాలు ♦ సేనాపతులువారి ♦ పైనఁగాపు
ఏపఁగూడినవారల ♦ నాడమడిపి | వీఁడులన్నియు వేవేగ ♦ బీడులుగను
బాడుచేయక యుండిన ♦ వాఁడును మెఁన | గాఁడెచూడంగఁబడు నెల్ల♦ప్రోడఁదనము.

సీ. హనుమంతుఁడేచాలు ♦ సైననలాదులు ♦ నాకండగానుండి ♦ నడచనగును
అంగదుండేచాలు ♦ సైననీలాదులు ♦ లక్ష్మణునకునంగ ♦ రక్షకగుఁడు
జాంబవంతుఁడేచాలు ♦ జతగవయాదులు ♦ భరతునకుంజుఁడు ♦ ప్రాపుగాఁగ
సుగ్రీవుఁడేచాలు ♦ నూసుషేణాదులు ♦ శత్రుఘ్ననకుబాహు ♦ మిత్రులగుఁడు
మనవిభీషణుఁడొప్పెడు ♦ తనబలముల | వోఁడుగాఁగొని యెల్లర ♦ జాఁడఁగూడ
నరుగుచుంగనుచెల్లయు ♦ నరయుచుండి | బల్మికొఁ అవడుచోఁ బ్రాపు ♦ పరగఁదగును.

వ. అనియిట్లు తమదిగుట కమరిన సమముగుసమరరంగము నదిసమచతురనగరములకు నడిమిక్షమంగలబలిమిపురమగుట నట్టినడుమ నట్టుపొడుము గిట్టిపటిమ రట్టిగనమి నట్టిగరిమనగు దిట్టఁదనము పెట్టుశ్రమలని యెట్టియమరసములకు నిట్టిభ్రమలు పుట్టుసుమియని సమరసమయపుగమనికలును దానవమరినపొందికనంపజు బృందములుగ నందికలోనెయుందురనుచందము ముందుగనెఱుంగందగు నంపంబున నమందబలులగు వందారుభ్రాతృవానరేంద్రులకుం దొరువందించి మునిసందోహంబులందాముండి కొందలమంద నీకుందుమనుపొందుబాఁటున నందెందులకునుగాని నరులుందుమనియానందింతురనియును బలికె. ౧౫౮.

కం. జనవిభుఁడుజనకవిభుసుత | వనితానన్నంటియుండు ♦ వాయువుగాదే
మనమిరువురమీపుష్పక | మున నేవెలయుదముచూచు ♦ ముచ్చటకనియెన్. ౧౫౯.

చం. జననిభుహాత్మపుష్కరము ♦ చాయకుఁజేరినయాక్షణంబునం
దనమొగమందులేనగవుఁ ♦ దారసిలంగనొనర్చి రాముఁడా

యనువునఁజెప్పినంతయూన ♦ టచ్చెరువందుచు విన్నయట్లుతే
వినెనిదియేమినాఁకయిన ♦ వేఁగు నేపతియెంచెనట్లుతే. ౧౬౦.

కం. కావుననంతము నీంద్రుల । తోవారలు నిల్వఁజక్కి ♦ తోడ్పాటు విధు
ల్తా వేగఁజెప్పె శ్రీరా । మావనిపతియొ త్తైశంఖ ♦ మద్భుతరవముగ్. ౧౬౧.

తే. తోడలక్ష్మణభరతశ ♦ త్రుఘ్నులొకట । దండడి స్వెట్టుతమతమ ♦ చిందములను
వేఁగఁబూరింపవానర ♦ వీరులెల్ల । నార్చిరొర్కట జయభేరు ♦ లపుడు మ్రోగె. ౧౬౨.

కం. ఆకసమునఁదగునలధ్వని । వీఁకంగొని యెల్లభువన ♦ విసరంబులలో
డీకొని చొచ్చిననవియువి । తాకుపడెందాకుహాని ♦ దాకొనునంచున్. ౧౬౩.

శా. జృంభింపన్ఘనఘోషమట్లులొకట ♦ న్సింధుల్కలత్రగ్రంథులై
స్తంభించెన్విడెఁ పృష్టులజ్జహితుఁడా ♦ జంభారిదంభోళిది
క్కుంభుల్స్తంభములౌచు సంభృతివిడె ♦ ఘూర్ణిల్లె బ్రహ్మాండము
ల్కుంభుండద్భుతమొందిమెచ్చె రవము ♦ న్సంరంభసంభూతమున్. ౧౬౪.

తే. అట్టిపెరధ్వనులెఱుఁగకు ♦ న్నట్టిదైత్యు । లిట్టియట్టిదివిన భీతి ♦ పుట్టనార్చి
మెట్టుచట్టలనుదము ♦ దిట్టకడకు । నట్టిపడిరిసహస్రాస్యుఁ ♦ డొట్టెపట్ట ౧౬౫.

కం. అందుఁగొండలుసండడి । నందిందుఁగనంగనైన ♦ యట్లుభ్రంబం
దుండవిలి వెలుగుపుష్పక । ముందానందెలియనైన ♦ మురిగనిరవుడే. ౧౬౬.

వ. అట్టికలకాలంబు నింతలంతలువంతలెఱుంగక నితాంతసంతోషాక్రాంతులై పెటిగినయా కృతాంతసములగు దితిసంతతివారు తాముననంతకులెదైయుమను భ్రాంతిమాత్రంబున నెంతయుసంభ్రమాక్రాంతులై యంతయుంచమచింతలుమువు దొరకతెఁగింతమని గంతు లుడిగి అంతులిడుచుఁజనునంత. ౧౬౭.

## సహస్రముఖరావణవిలాసాభివర్ణనము

సీ. సింహళద్వీపమి ♦ స్తీర్ణంబులోనొప్పు ♦ నంబరంబంటెము ♦ నంతయెత్తు
కలిగిపెన్బ్రహ్మాండ ♦ గహ్వరంబోయన ♦ నంతఃపురంబొప్పు ♦ నందులోన
నలువదియోజనం ♦ బులుపొడవు వెడల్పు ♦ ముప్పదియామడ ♦ లొప్పియుండు
గొప్పఘట్యంబొండు ♦ కూడినదానిపై ♦ స్వేచ్ఛగాఁబవళించి ♦ విచ్చలవిడి
తనదువేగురుసతులతో ♦ మనసుదీర । సరససల్లాపములఁబ్రీతి ♦ సరణిఁగనుచు
వారియానందవాక్కులు ♦ మీఱివినుచు । దరికదెఱుంగకుండుచా ♦ వీరుఁడింక.

సీ. కొండఱంబంక్తిగాఁ ♦ గూర్చుండ నేమించి ♦ కుడికాలువారల ♦ తొడలఁజాచు
నింకఁగొందఱినట్టె ♦ యేర్పడఁగాఁజేసి ♦ వామపాదముఁజాచు ♦ వారితొడల
మఱికొంద ఱెడమప్ర ♦ క్కరహిఁగూడఁగఁజేసి ♦ నాగ్గసి చేతుల ♦ నలిబిలిగొను
దక్కుకొందఱేఁగుడి ♦ దిక్కునఁజేరిచి ♦ మక్కువపను లెన్నొ ♦ చక్కఁగఁగొను
నిట్టులు సహస్రవక్త్రుఁడు ♦ నట్టనడిమి | పట్టునందగి శోభిల్లుఁ ♦ జట్టునున్న
దిట్టలైన సహస్రస ♦ తీమణులను | గట్టుచెరిపెడిచందాన ♦ ముట్టడిగొని. ౧౬౯.

సీ. అత్తరుపన్నీర ♦ మగరుచందనముల ♦ నెత్తుపై నెత్తుగా ♦ మెత్తికొంద్రు
తట్టైడువిరులొక్క ♦ దండకై నంజాల ♦ వెట్టొకట్టఁగ రెట్టిఁ ♦ జుట్టికొంద్రు
బండమండనముల ♦ దండిరత్నంబులు ♦ మెండుగా మండఁబై ♦ నుండఁగంద్రు
మిఱ్ఱుపట్టున నేయ ♦ బిఱ్ఱుగా నెఱ్ఱగా ♦ విఱ్ఱవీఁగెడి వల్వ ♦ వెఱ్ఱిగంద్రు
ఎట్టులుండిన నాథుండు ♦ పట్టువిడక | గుట్టుకనిపట్టినట్టులఁ ♦ బట్టుఁదసుమ్మ
వట్టులుండఁగ దట్టమా ♦ నట్టిసొగసు | రెట్టికావింత్రు సతులు మా ♦ పట్టుగతుల. ౧౭౦.

కం. అలవారిభూషణంబుల | కలకలమునఁబడిమునుంగుఁ ♦ గదపకపకనాఁ
బలుమఱు వే మొగములనగు | చలరుంగదవాని కెట్టు ♦ లాఘ్వని తెలియున్? ౧౭౧

తే. కాననిసుమంతవిన్నన ♦ నూనపటిమఁ | గన్నుఁ దీరుండు వానికా ♦ సన్న యెన్నఁ
దోఁచు నేనాఁగనట్లుండు ♦ నాచెలువము | మీఱినపుడల్ల భ్రాంతులు ♦ సేరి రాడ. ౧౭౨.

వ. అట్లమందగతింబాఱుచుఁదాఱుచు మందలుసేరి సందడిమీఱి మందరోపమంబగు తన్మందిరద్వారంబునందవిలి పెందడనొందుచు ముందు ప్రార్థనగ నిట్లనిరి. ౧౭౩.

ప్రగుణ. అసురాధీశా! అసమానేశా! వసుధాధ్యక్షా! ద్విసహస్రాక్షా! ౧౭౪.

కుమారలలిత. మహాపదలు రానే; సహింపఁగానోనే?
వహింపు హృతబాధా! సహస్రముఖనాథా! ౧౭౫.

భుజంగ. తలంపన్నగంబుల్వి ♦ దారింతుకాదే? కులాద్రుల్పొడింజేయఁ ♦ గుప్పింపనాదే!
యిలన్నిన్నుమార్కొందు ♦ రే పాటి ద్రోహుల్ నిల్ఛలీ రెండు వేలుండు ♦ బాహుల్మహాహుల్!

## పౌరులు సహస్రముఖునకు విలయపుసన్నతెలుపుట.

వ. అనియిట్లొక్కపెట్టున నెల్లరు గొల్లుమను మహోద్ధతిని బ్రస్తుతించుటయును వాండ్రెల్ల నెల్లలోనికిఁ బ్రవేశింపను దవదక్షిణపార్శ్వంబున బారుతీరి మీఱి వాడుగన్న వైపరీత్యము విన్నవింపను వెలవోసంగ వారట్లు చేవియిట్లనిరి. ౧౭౬.

శా. వింటే రావణయేమిధ్వాంతమదియో ♦ వింటన్దిశల్ప్రక్కలౌ
గంటుల్వారుదిగంతరాళమిదియే ♦ గంటున్నవారుంద్రునీ
కంటెన్మేల్లుజగంబులంగలుగరే ♦ కంటేయదేవచ్చెడి
న్నింటన్భాసిలుచే మొదానఁగలరో ♦ మిశుల్కృశాంగుల్గనన్. ౧౭౮.

కం. వారేరొమీటివత్తురు | ధీరుల్గాన్పింత్రుహ్రస్వ ♦ దేహులెయౌచు
న్వీరులుమనవారలుగద | చేరుదురెట్లీడఁజంతు ♦ చేసెదరాడన్. ౧౭౯.

తే. ఇంక నేరైనభువిలోన ♦ మంకులున్న | జాడఁగాంచిననీవుచెం♦డాడకున్న
నిట్టులెప్పుడొరామీఱు ♦ పట్టుఁగన్న | గడ్డుగానొప్పుఁగాదయే ♦ ర్పడ్డమిన్న? ౧౮౦.

వ. అనివిన్నబన్నము సన్నఁదెలుపుచు విన్నవించునెడ రోస మొకపొంత యూసడింపా
క చెంతినుట్టిపడ నల్లనఁదొల్లి మోచేతులు నంతనెల్లపాణులును జల్లగనూనుచు నయ్యె
ల్లమాలినయొడలెల్ల నెత్తుగనలేచు మనిష్లనియె. ౧౮౧.

విద్యున్మాల. ఏమీవాండ్రే ♦ రెట్లుండ్రండ్రే | భీముల్గండ్రే ♦ బెగ్గింత్రాండ్రే
బ్రాముస్గాండ్రిం♦పన్గండ్రింతున్ | స్వామీతండ్రీ ♦ నాఁగాఁబుత్తున్. ౧౮౨.

తే. వేముఖంబులనిట్టులు ♦ భీమవాక్కు | లనుచునల్లనబాహువు ♦ లాన్చిలేచి
పటిమగలమేనవిఱిచెను ♦ నెటికలపుడు | బయటవినఁబడ్డధ్వనికిని ♦ బ్రతియదనఁగ.

ఉ. అప్పుడువారలంగనుచు ♦ నద్భుతమేమదియేఁటిచప్పుడో
గుప్పెదసేనమీరెచని ♦ కూకలఁగొందటిసేట్టఁగొందఱిం
ద్రుప్పనుధూళిగానెగురఁ ♦ దోలుదురేలభయంబునందగాఁ
జెప్పెదసర్వముందెలియఁ ♦ జేరెదఁగొల్వునమీరువేగమే. ౧౮౪.

ఆ. పాండుపోయిమంత్రి ♦ పుంగవులనుసైన్య | నాథవరులనాదు ♦ నందనులను
బంధుబృందములను ♦ బంటులమేఁటుల | నర్బుదంబుఁగూర్పఁ ♦ డటకువత్తు. ౧౮౫.

## సహస్రముఖుడుకొలువుతీరు నేర్పాటు.

వ. అనివారింబుచ్చి కొలువుకూటంబున కేగంగృతారంభుండగుట యప్పుడ తనమనోహారి
ణులకెఱింగింపఁగా. ౧౮౬.

సీ. ఒక్కొక్కతలకొక్క ♦ రొక్కరుగాఁజేరి ♦ చక్కగానవితీర్ప ♦ మక్కువపడి
అందంబుగాదూవి ♦ పొందికముడులేసి ♦ యందుఁగిరీటము ♦ క్రందుకొలిపి
రెండేసిభుజముల ♦ మెండైననవమణి ♦ మండితాంగదములు ♦ నిండుకొలిపి

అన్నికంఠంబుల ♦ నన్నులమిన్నలు ♦ కొన్నెసిహారము ♦ ల్వన్నెగనిడీ
వ్రేళ్లనుంగరములుపది ♦ వేలువెట్టి | గండపెండారములురెండు ♦ కాళ్లఁబెట్టి
పందలవ్వేత్తిపట్టెగఁ ♦ గొండఱూన్పఁ | జీలలిరువురుత్రిప్పిరి ♦ చిత్రముగను. ౧౮౭

ఉ. చేతులనొప్పుమున్నెమణి ♦ చిత్రితముల్కటకాదులక్షతిం
బ్రీతినిగందమత్తరును ♦ బీటికలేడ్పడఁబూసిగీసియా
హేతులుబాణముల్గదలు ♦ నెన్నికఁగన్నమహాయుధంబుల
ల్లాతతినాతఁడందికొని ♦ యల్లనలేచఁగనైనఁజూడఁగాఁ. ౧౮౮

కం కాలాగ్నిరుద్రుఁడీతని | నాలోకించిననుబోర ♦ నోఁగాకున్నం
గాలెత్తిముందువెట్టునె | యేలెక్కతండువీని ♦ యెదుటలోడితేడా. ౧౮౯

తే. ఱెక్కలున్నఫ్లమేరువు ♦ నిక్కరణిన | తోఁచియుండునటంచన ♦ లేచినడచె
దానుదలఁచినవారలా ♦ స్థానమునకు | మున్నె రాఁగాంచిరాడకుఁ ♦ దిన్ననరుగ.

కం. జోహారులుపొసరిచియును | బాహాబలశౌర్యములను ♦ బ్రస్తుతిసేయం
గాహంకృతిహాసులుదగ | దాహోరాహోరిఁబనికిఁ ♦ దలపడెవినుఁడీ. ౧౯౧

వ. అని యావాల్మీకమహర్షీశ్వరుండు వివరింపన్వింతనొందుచు నంతరంగంబున సంతసం
బులింతంతనరానిదగుడుఁ దమకింబున మునులు ముందరికథవిన నపేక్షించుచుండిరి.

## కతిపయపద్యగర్భిత సరసిజవృత్తరధబంధ కందములు

## సముచిత్రపదాదిమ మణిగణనికరాంతిమ కందద్వయోపగము

## సరసిజవృత్తము.

ధీరమ్యాసింహాచలధీరా ♦ స్థిరమతిసురపవి ♦ ధమునులుసురలుఁ
ధారాస్థాహేమాచలధారీ ♦ దతిఁదగుతతిఁజను ♦ దరుగనినుతులుఁ
పారంగోదారాభృతభారా ♦ పరిపరివిధములఁ ♦ బ్రణతులొనరుపఁ
హారాహీంద్రాంచద్బహుహారా ♦ యరయుదుమదమున ♦ నభయతమనుపఁ ౧౯౩

1. చిత్రపద-ప్రతిపాదపూర్వనవాక్షరి;
2. మణిగణ-ప్రతిచరణానంతరాఖిలము.
3. ప్రథమకందము-పూర్వపాదద్వయము ;
4. ద్వితీయము-ఉత్తరచరణద్వయము

## అద్భుతోత్తర రామాయణాఖ్యాంచిత రథబంధకందము.

అత్యద్భుతమహితోద్ధృత । నిత్యాధ్యాత్మప్రభావ ♦ నిర్మలచరణా
సత్యోత్సాహాధీరా । రాత్యంతకగౌరిమార ♦ రమ్యాయగుణా. ౧౯౪.

పంచచా. సురేంద్రముఖ్యులార్తినొంది ♦ సూరెలన్వసించినీ
పరోపకారచిత్రకృత్య ♦ పాళిపాళినెంత్రునీ
వెలింగిదానవారిఁబ్రోతు ♦ వెప్పుడొప్పునంచునీ
చరిత్రలంగనంగఁగల్గు ♦ సాకుమమ్ముఁగోర్కెనీ. ౧౯౫.

ఇది శ్రీమన్మేధా దక్షిణామూర్తీశ్వరాక్షీణ వరప్రసాదలబ్ధ కవితాభాగధేయ

నాదెళ్ల పురుషోత్తమనామధేయ బుధవిధేయ ప్రణీతంబైన

శ్రీమదద్భుతోత్తర రామాయణంబునఁ

బంచమాశ్వాసము

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

## షష్ఠాశ్వాసము.

కం. వరవృషభరాట్తురంగా । గిరిజామనసాబ్జభృంగ ◆ గీష్పతిరంగా
మరపతికమలపతంగా । తరళాంగామాళిగంగ ◆ దానవభంగా. ౧.

తే. అవధరింపుమువినెడిమ ◆ హర్షులకును । విన్నకొలఁదినిహర్షము ◆ మిన్నగాఁగ
మీఱిజరుగుచుమునుముందుఁ ◆ జేరుచుండఁ । బల్కెవాల్మీకమౌనియీ ◆ ఫక్కినూని.

### సహస్రముఖరావణసభాభివర్ణనము.

ఉ. అప్పుడురావణుండువిభ ◆ వాఢ్యుఁడుబంగరుమిట్టగద్దెపై
నొప్పెడుమేరుశైలమున ◆ నుంచినరోహణపర్వతంబన
న్గొప్పునిఁకొప్పిదంబునకుఁ ◆ గూడినకాంచనరత్నదీప్తుల
న్మెప్పులుగొన్నరాక్షసుల ◆ మేఁటులకోటులకూటమందటన్. ౩.

తే. మంత్రులొకవేయిమగఁటిమి ◆ మంత్రపటిమ । గలభయంకరరూపులు ◆ ఘనశరీరు
లుండురందఱుసన్నిధి ◆ నందుముఖ్యు । లైనవారలఁజేర్కొందు ◆ మానఘనుల. ౪.

సీ. కోటీశపూర్ణులుఁ ◆ గోణపపాతులుఁ ◆ బిచ్ఛలచక్రులుం ◆ గచ్ఛకుండు
కాలవేగుండుఁబ్ర ◆ కాలనుండుహిరణ్య ◆ బాహుండుఁగృకుఁడుమ ◆ హాహనుండు
సరణహాలీమక ◆ శరభమానసభద్ర ◆ మండలకశలులు ◆ ఘేంఠకుండు
పిండశక్తుఁడుఁగాల ◆ దండకప్రచ్ఛండ ◆ లవికీరణోచ్ఛిశ ◆ లకరమూఘ
బింబుత్రేజప్రలేపన ◆ భీషణోగ్ర । హరిణబహురోమపారావ ◆ తాగ్నిదంష్ట్ర
పారిపాత్రమహాఘాల ◆ పాండురోమ । ముద్గరాదులుముఖ్యులు ◆ ముందుఁదగిరి. ౫.

ఉ. వీరలుతొంటినుండిప్రభ ◆ వీర్యముశౌర్యమెఱింగిరాజుతో
దూరపుయోచనల్తెలిపి ◆ దొడ్డపనుల్ఘటియింపఁబూనినం
దారెపురోగులైజరిపి ◆ ధన్యతఁగాంచెడిమేటులౌటఁజే
కూరినపెద్దకార్యమిది ◆ కూడరెముందుగనెందఱుండినన్. ౬.

ఆ. ఒక్కలక్షగలర ◆ టుక్కుపర్వతముల । ఫక్కిదేహపుష్టి ◆ బలిసినారు
దానవేంద్రరాష్ట్ర ◆ సేనాధికారులు । మూఁడుకొద్దిగొప్ప ◆ సేఁడుంతలల. ౭.

ఆ. రక్తనీలవర్ణ ◆ సిక్తమహాంగులు । ఘోరదంష్ట్రలబ్ధి ◆ ఘోషభాషు
లగ్నినేత్రులమిత ◆ హస్తులువారెల్ల । గామరూపులింకఁ ◆ గామబలులు ౮.

సీ. కుంభనాసికపద్మ ♦ కుముదనికుంభులు ♦ ఘృణిభుజకృష్ణోప ♦ కృష్ణనంద
కాంచనాక్షప్రియ ♦ కప్రమోదస్వస్తి ♦ కానందధ్రువకమ ♦ హాసినఖులు
అంతకస్కంధమ ♦ హాపారిషదజల ♦ ధరసుప్రతాపసిం ♦ హరవహాస
గోవ్రజకనకరో ♦ మావృతబహుదంష్ట్రి ♦ సమరోత్కటాంధక ♦ శమదమనులు
క్షేమబాహుసుబాహులు ♦ సిద్ధపాత్ర । న్యాళినాహవ రాహవా ♦ హహరివాహ
మకరవాహేభవాహులు ♦ మహిషవాహ । ముఖ్యులందఱునయ్యెడ ♦ ముసరుకొనిరి

ఆ. దశసహస్రసంఖ్య ♦ తనయులుప్రబలులు । తక్కినారుకోద్ది ♦ లెక్కవారు
వారిపేర్లుచెప్ప ♦ వశముగాదైనను । దెగలుసెప్పవచ్చుఁ ♦ దగినమచ్చు. ౧౦

సీ. కూర్మకుక్కుటనాగ ♦ కుంభినీగారుడ । నక్రకుర్కురవృకా ♦ ననులుమఱియు
మస్తకకంధర ♦ హస్తోరుజానునీ ♦ కటిబాహుమూలవ ♦ క్షనయనులును
గజనక్రసూకర ♦ గార్దభకాసర ♦ శార్దూలహర్యక్ష ♦ చర్మలుమఱి
ఘనకర్ణఘననాస ♦ ఘనదంష్ట్రఘననఖ ♦ బహుశిఖబహుదీర్ఘ ♦ బాహులునయి
హ్రస్వకంఠులుదీర్ఘోరు ♦ లద్రికటులు । దీర్ఘపృష్ఠులుదీర్ఘోష్ఠ ♦ దీర్ఘగళులు
శ్వేతలోహితపింగనీ ♦ లాతతాక్షు । లంఘ్రిశిఖులూర్ధ్వవక్త్రులు ♦ నైతగుదురు. ౧౧

ఉ. వారలుభూరిభూషలను ♦ వావిరిగాధరియించిమించియా
మేరువుబిడ్డలొక్కయన ♦ మేటివిలాసములందిస్వీయులౌ
వారలసైన్యనాయకుల ♦ వాసిగలారినిజక్రరక్షకు
ల్గారహినిల్పికొంచునటుఁ ♦ గ్రచ్చిరిముచ్చటమీఱమచ్చునన్. ౧౨

ఆ. అయుతసంఖ్యలట్లె ♦ యాతనిదౌహిత్రు । లున్నవారుపెంపు ♦ గన్నవారు
మేనమామలట్లె ♦ మేనివిలాసంబు । లొప్పుఁబోల్కెలట్టు ♦ లొప్పుఁగాదె. ౧౩

కం. పౌత్రులులక్షలకోలఁదులు । పైతృకసారూప్యములనె ♦ ప్రబలుదురచట
న్గాత్రములపటిమకెన్నఁగఁ । బాత్రమ్ములుపర్వతములె ♦ ప్రాఁచుఁపువారల్. ౧౪

ఉ. తక్కినపెక్కురక్కసులుఁ ♦ దక్కువవారలుగారువారుఁబెం
పెక్కఁగనిక్కినిల్చినన ♦ బెత్తునఁదాళమహీజతుల్యులై
నెక్కొనుపుష్టినేనుఁగుల ♦ నీలుగఁదొండముఁబట్టియీడ్చిమ
త్తెక్కినవానిపైకెగసి ♦ యెత్తువడంగనుద్రొక్కుచుండ్రటన్. ౧౫

తే. ఇట్టివీరలుగూడిన ♦ యట్టిమేటి । సభనుగలరొక్కయర్బుద ♦ సంఖ్యవార
లొక్కపెట్టునసొక్కక్క ♦ చక్కటియన । ప్రక్కలయ్యెడిబ్రహ్మాండ ♦ మక్కుడిఁదిని.

వ. అన్నెలవున నున్నతిఁగన్న మిన్నగద్దియనున్న యన్నిశాచరేంద్రుఁ డన్నిమొగం
బులుం దిన్నగఁగన్నాఁడై మున్ను విన్నయెన్నికయెన్నియతఁపుడో నిర్ణయింతమన్న
యన్నాయంబున మున్నుగనిట్లనియె. ౧౭.

కం. ఏండ్రోగండ్రండ్రుండ్రడట । గాండ్రింత్రేటనత్తురంట ♦ కండ్రేమీమీ
తీండ్రంబులేలఁజూడరో । మండ్రాటముగాంత్రెవాండ్రు ♦ మండ్రేయాడన్? ౧౮.

వ. అని సహస్రముఖంబుల మహానాదంబుపుట్ట నావిష్టరోషావిర్భూతభాషణంబులె
బహుభీషణంబుగాఁబలుక రక్షస్సేనాధినాథముఖ్యుండగు నొకసప్తాస్యుండుదగ్గనలేచి
యిట్లనియె. ౧౯.

## అల్లసభాసదుల గర్వాతిశయము.

కం. ఎత్తునవెన్వంద్రోచను । చిత్తతిఁగనభీతిపుట్టి ♦ యేడ్చిరికానా
వత్తురచోత్తురయిత్తతిఁ । దుత్తునియలొనర్తు నెట్టి ♦ ధూర్తులనయినన్. ౨౦.

వ. ఆతండనువెంటనె తత్సహాయాధికారాగ్రణియగు మఱియొకసప్తశీర్షుండు లేచితమ
యేలికంజూచి యిట్లనియె. ౨౧.

కం. ఇత్తావుగన్నవాండ్రకుఁ । జిత్తముచెడిబొబ్బలేయు ♦ చిత్రంబద్దో
మిత్తినిమ్రింగెడినాపే । రెత్తినచేచత్తురేగ ♦ నిత్తునెయరులన్? ౨౨.

వ. వారిగంభీరభాషణంబులువిని యానందించుప్రభుంగాంచి యనంతరసైన్యాధికారి
యగునొక షడ్వక్త్రుండంతట లేచియిట్లనియె. ౨౩.

కం. ఇద్దికనిదద్దరిల్లనె । సద్దట్టాలఁబెద్దదయ్యె ♦ శ్రద్ధగనేనే
గద్దించియద్దికన్నను । బుద్దులుడిగిమొద్దులల్ల ♦ ప్రొద్దునఁజారే! ౨౪.

వ. అనియిట్లు స్వాతిశయోత్కర్షంబుఁదెలుపుచు నాతండు పలుకుడు రాజుమెచ్చు
కొనుటయుననంతరసేనా నాయకుండగు నొకపంచాననుండిట్లనియె. ౨౫.

కం. గడ్డాయిదిదొడ్డాయగ । పడ్డనెయేయడ్డుగానఁ ♦ బడ్డవిడువకే
గొడ్డులగతిదుడ్డులహతి । సడ్డవిడకగడ్డిఁగుడిపి ♦ జడ్డఁబ్బులిపుదున్. ౨౬.

వ. ఆతండిట్లువచియింపనుబ్బి తబ్బిబ్బులఁ గనునట్లయిన యాగబ్బి దొరయెదురనెగసి
లేచికుమార సైన్యాధిపాగ్రగణ్యుండగు నొకచతుర్ముఖుండిట్లనియె. ౨౭.

కం. ఇయ్యెడనెయ్యరులొయ్యన । గయ్యంబునకడుగువెట్టు ♦ గయ్యాళురు? కా
నయ్యోకుయ్యోనాఁగా । నయ్యముఁగననియ్యనొక్కొ ♦ యయ్యాయేనే? ౨౮.

వ. ఆనియుక్తులాడిన యమ్మాటిపోటు మాటలు పాటింపంబడుటయుం దత్సహాయాధికారి
యగునొక్క త్రిమస్తకుండిట్లనియె. ౨౯.

కం. పుష్టియుటఁగలదియోటుఁగక | స్పష్టముగాఁబీరిఁగట్ట ♦ పఱపనెరాఁగా
నష్టమభీష్టహారంబుగఁ | దుష్టినిగ్లిష్టముహరింప ♦ దుష్టులఁద్రుంతుక్. ౩౦.

తే. అనుచునిందఱుఁదనుతమ ♦ యతిశయములు | బలికిరొక్కుమ్మడినినాథు ♦ ప్రౌఢిమంబు
బొగడునెచ్చరికకుగాను ♦ మిగులభక్తి | ననిరిచేతులుజోడించి ♦ యతనిగాంచి. ౩౧.

శా. ఓరక్షోధిపయోసహస్రవదనా ♦ యోమేరుతుల్యాంగనీ
ఘోరాభీలద్విసహస్రబాహుచయము ♦ గ్గోరంతధ్యానింపనే
నీమైఁబోవరయెట్టిధీరులిలలో ♦ నీరాష్ట్రము న్మెట్టఁగా
వీరలువ్వట్టినవారలందుఁగలరే ♦ వేవత్తురేయాడకుక్? ౩౨.

కం అననేసహస్రముఖంబుల | ననువుగనొకపెద్దనవ్వు ♦ నవ్వియెవండ్రో
చనుదెంచిరంగ్రడియేమో | మునిఁగెనటంచుత్తపంద ♦ మూఢులనంగా. ౩౩.

కం రాఁరేరీడకువచ్చినఁ | బోరింకేడకనుగాలు ♦ పురికేతక్క
న్నీరావణనామస్మర | ణారావమువిన్నప్రక్క ♦ లయ్యెదుగుండెల్. ౩౪.

ఆ. అననెపొంగియరచే ♦ నహాహాయటంచును | మాఱుమ్రోగెదిక్కు ♦ లారవమున
నట్టిసంతసంబు ♦ పట్టుచిక్కనదని | పల్కెమంత్రిచయము ♦ ప్రభునితోడ. ౩౫.

## దండయాత్ర వెడలమంత్రిముఖ్యులు రావణునడుగుట.

ఉ. ఎన్నియొసార్లువిన్నపము ♦ లెంతగఁజేసిననొప్పకుందు వే
మన్ననుమాఱువల్కవది ♦ యందఱకుంగనవింతయౌఁజుమీ
తిన్ననిసంతసంబునకుఁ ♦ దీరుదువిప్పుడుమా మొఱల్వినం
బున్నెముకట్టికొందువని ♦ పూనెదమింకొకమాఱుతెల్పఁగన్. ౩౬.

ఉ. వారిధులీదిపోయియటు ♦ వైపులమర్త్యనిఁకేమియుండునో
యారసియన్నిగెల్తుమది ♦ యంతయునీదగురాజ్యమైతగం
గారవిఁజేసిభోజ్యములు ♦ గల్లభుజించుచుమేటివీరులం
జేరటనున్ననెత్తుడిపి ♦ యీడ్తుమునీపదసన్నిధింబడన్. ౩౭.

ఆ. పంపుమయ్యమమ్ముఁ ♦ బరికింపఁగావలెఁ | బూరుషుండుపుట్టు ♦ నూరువిడమి
ఖ్యాతిపడఁడుక్రొత్త ♦ రీతులెఱుంగఁడు | ధైర్యసాహసముల ♦ ధాటిఁగనఁడు. ౩౮.

సీ. ఒకకూరియొండైన ♦ సుకరముగా నిల్పింప ♦ మాటిమాటికి నబ్ధి ♦ దాఁటునైన
నాంధ్రుఁడుబిడ్డలు వేగు ♦ నంతపనుల్వుట్టఁ ♦ దోడనేయంబుధిఁ ♦ బూడుతునని
యిల్లింభూభాగంబు ♦ నెచ్చించియుంతట ♦ నేమున్ననౌదుపై ♦ వేలికనని
క్రిందిపైదిక్కుల ♦ నెందెంపఁబూండిన ♦ వారిఁదెత్తుమునీదు ♦ చేరికకని
మమ్ముఁబంపవెరొకమారు ♦ సమ్మతికొని । యనుచుఁబెక్కు తెఱంగుల ♦ మనవిఁజేసి
కోసుచునందుము మమ్మేల ♦ వినవొ నాథ । బయటఁగలచంద మెఱుఁగమి ♦ భయమిటయ్యె.

కం. ఇప్పటికైననుమాపై । నొప్పదయన్విడుతు వేని ♦ యొక్కమ్మడి వే
కుప్పించియెల్లదిక్కుల । నెప్పటిమకలారలున్న ♦ నీడ్చెదమిటకున్. ౪౦.

తే. ఎట్టిసంపత్తుకల్గిన ♦ నేసుఖంబు । దానఁబడయంగవచ్చునో ♦ దానిఁగనమి
వానికొప్పినసంపద ♦ వ్యర్థమగును ♦ అడవిఁగాచెడివెన్నెల ♦ యట్టులధిప. ౪౧.

కం. సౌఖ్యపడఁదాఁబోసంగిన । ముఖ్యబలంబింతకలిగి ♦ మూఢులమైనీ
వ్యాఖ్యయెఱుంగకయుండినఁ । బ్రఖ్యాతింబడయుటెట్లు ♦ పరికింపఁగదే. ౪౨.

ఆ. పదవియంతకంత ♦ కొదవించికోవలె । వృద్ధికాఁగనద్ది ♦ విహితధర్మ
మగునుగానివట్టి ♦ యప్రయోజకులవలె । మూలములఱగనగునె ♦ యేలినయ్య? ౪౩.

కం. నిన్ననరవ్మనియున్నను । మిన్నసుఖంబులనుబాయ ♦ మిన్మిన్నకయీ
వున్నంపగునస్నారమె । పిన్నవొరక్లేశవారి ♦ పెఱీదింజనమే? ౪౪.

ఆ. చిన్నయేలినారు ♦ చిన్నలునీకని । కొన్నలోకమునకుఁ ♦ గోలఁదివారె
యెన్నరానివీరు ♦ లీపాటివీరని । యెన్నువారలైన ♦ నున్నవారె? ౪౫.

ఉ. మమ్ముటుపంపియొక్కతటి ♦ మాదిక్కెయొనను జూడ వేలకో
యిమ్మహియెల్లనేడకపి ♦ యెల్లియొసత్తుము తెత్తుమెల్లనీ
సమ్మతికొప్పనస్తువులు ♦ సక్కని వెక్కడనున్నఁగొంచునో
మమ్ములనేలినాఁడయును ♦ మానముపీడుముపీడుమమ్ములన్. ౪౬.

కం. కడుపులునిండఁగఁదిండుము । పడిప్పుదుజంతువులనవ్వి ♦ నర్తిలనెడం
బొడగన్నగడుసులనునీ । కడనుంతుమటందు మెపుడుఁ ♦ గైకొనవేలన్? ౪౭.

ఆ. ఎన్నిమాఱులిట్లు ♦ విన్నవించెదమయ్య । వీడకుందువేమి ♦ చూడకుండ
భీతిపుట్టుఁగన్న ♦ నూతనమేయది । యిప్పుడైనఁబంపు ♦ వేగిరాఁగ. ౪౮.

## సహస్రముఖుడు తనబ్రహ్మవాక్యనిష్ఠ దెలుపుట.

కం. అనవినిసహస్రకంఠుడు । మనమునవొక్కింతరోయించి ♦ మఱుమాటలుతా
ననకున్న నెల్లకాలము । తనవారలుఁగమినివేలు ♦ తలఁతురనియనెన్. ౪౯

సీ. మాతాతమహితుండు ♦ మనలశ్రేయమెకోరు ♦ నను బెంచిమితిమించి ♦ చనువొసఁగెను
ఈహపీడకయుండి ♦ యేడకేగికయున్నఁ ♦ గల్పింతుసిరులనెఁ ♦ గలుగఁజేసె
నేనొండయిటనుండ ♦ నిర్విఘ్నదంబుగా ♦ సంతతిమీరలు ♦ జతపడితిరి
తినఁగట్టనన్నియు ♦ నొనగూడెహాయిగా ♦ మనకాతఁడనుపల్కు ♦ వినమియేల
ననుచునుండెనమాతాత ♦ ననుఁగనుగితి । మిమ్ముఁగాంతునుగావున ♦ నిమ్మహివిడ
నన్ను నాతండుమలపన్న ♦ యన్నియతినె । మీనవోఁగోరనెటకువే ♦ యారులనిన.

కం. పనిగలిగినజగదండము । లను నేనొండొంటిఁదార్చి ♦ లంబుదుగఁగమ
ద్దనసేయఁజాలనేసరి । పనియేమనియూరకుండు ♦ భావ్యమకాదే. ౫౧.

కం. ఏఁడైనప్రోడతానిటు । చూడఁగరాకైనవానిఁ ♦ జోపుచుఁబోఁబోఁ
జూడికినెల్లంబఱఁగనఁ । గూడెడినరికొందఁగాని ♦ కూడదెయదియే. ౫౨.

ఆ. అక్కుహైనదాత ♦ పెట్టినమొట్టను । నప్పినప్పకాదు ♦ గొప్పవాడు
పిమ్మకొన్నిచేసి ♦ యెమ్మెయినిమ్మహి । నున్నవన్నికొన్న ♦ వన్నెమిన్న. ౫౩.

## పుత్రులు రావణునెగతాళిచేసి తలక్రిందుధర్మములుపలుకుట.

కం. అనియూతండనఁగావిని । ఘనపుత్రులువల్కిరిట్లు ♦ కలియుగనీతు
ల్దనుజులువారలుగావున । మనమునకవిశ్వస్యములగు ♦ మాటలయితగున్. ౫౪.

శా. అప్పావింతలునీదుమాటలుగడే ♦ యన్యుల్వినన్నవ్వరో
యిప్పేర్మిందగియుంతమేటివయినీ ♦ వింకల్లతాతయ్యతాఁ
జెప్పెంజేయుదుఁదాతయక్లేముదిగాఁ ♦ జిట్టాడనైరింపనం
చొప్పంగూడనివిట్టులాడఁదగునే ♦ హొంతొందుటింతొటకే? ౫౫.

ఉ. తాతలువృద్ధులాటబెడి ♦ దంబులువారికినైనకార్యము
ల్చేఁతయనంగఁగుజ్జులకుఁ ♦ జేకుఱుఁగష్టములంచుమానుపం
జూతురుపెక్కులాభములు ♦ నూడరుబిడ్డలతుష్టిపుష్టులే
ప్రీతిగఁగంద్రుదీనికినె ♦ పెచ్చులకేగకయుండవచ్చునే? ౫౬

ఆ. తాతతాతగాని ♦ తాతపేవాఁడువే | యేము తాతలముగ ♦ నేర్పడితిమొ?
మాతవెట్టినట్లు ♦ మఱుగమూలనెయున్న | రోఁతగాఁదెయిద్ది ♦ తాతనడుగు. ౫౭.

కం. మున్నీవుచిన్నప్రాయము | గన్నప్పుడు తాతయనఁగఁ ♦ గలిగెనొయేమో
యెన్నినయున్నతిఁగననివు | డన్నన్నిఁగఁబట్టితాత ♦ నాఁడింతుముసూ. ౫౮.

ఆ. బుద్ధిపటిమతోఁ బఱఁగు ♦ వృద్ధులకనుమాట | వారిదూరదృష్టి ♦ దారితోలఁగి
యుండఁగాంచినట్టి ♦ దండివారందురు | అట్టితాతపల్కు ♦ జెట్టికగునె? ౫౯.

ఉ. పెద్దయతండుప్రాయమునఁ ♦ బేరిమినద్దటులుంచు మేఁటికే
సుద్దిని నీకునుద్దియగుఁ ♦ జూడఁగమస్తకసంఖ్యవారనే
పెద్దతికంబునీకుఁదగుఁ ♦ జెంపుబలాననపారమింకనీ
నిద్దపువీరవారములు ♦ నీకగుభృత్యులు నిన్నుఁబోలునే? ౬౦.

ఆ. తానుగొప్పదశకు ♦ దాకొనియింకను | బెలనుచుబుద్ధి ♦ పెడకుఁబట్టి
తమ్ముఁబోలియుండ ♦ సమ్మతిబోధించు | పిజికిముసలనగునె ♦ సరకుగొనఁగ? ౬౧.

చం తమినునశ్రేయమారసెడిఁ ♦ దాతయటంటివిపుట్టుచోటనే
శ్రమమునుబొందకుండితిని ♦ చచ్చెడికీటకపంక్తియట్లునా
మములనుబాసినట్టపతి ♦ మానినియౌవనమట్టుబల్మికా
నమరెడిదుష్టజీవనము ♦ నందగనీకునుజేయుబోధనే? ౬౨.

చం చనువునుజూపెనంటివిమటి ♦ సాకినమోహముకద్దటంటివా
యనువుననేమ తేఁ ఫలము ♦ లందఁగనీయకయున్నమట్టునం
దినుమనిపవ్వళింపుమని ♦ తేజమువాయఁగఁజేసికొమ్మటం
చనియెనెకాకయేయశము ♦ నార్జనచేయఁగదారిచూపెనో! ౬౩.

సీ. ఈడపీడమిఁదాత ♦ యిచ్చెనుసిరులంటి ♦ వింతకంటెనుమాఘ్య ♦ మెందుఁగలదు
తాతయబ్బదిసొమ్ము ♦ దాచినదిచ్చెనే ♦ మాయచేసిననమ్మి ♦ మమతఁగొనితి
తాదున్నిపెట్టెనో ♦ ద్రవ్వితానిచ్చెనో ♦ భూమిలోఁగలదేదొ ♦ పుట్టిదొరకు
నిలయములెన్నొసొమ్ములు ♦ నిర్మించియిచ్చెనో ♦ పసులబిడ్డలఁగాచు ♦ పనులఁగనునొ
తాతకంటెఁబెద్ద ♦ తాతనునినుఁజేసి | బుద్ధిమలపురిత్త ♦ సుద్దితక్క
ఆతఁడిచ్చుసిరుల ♦ రీతియేమదిచెప్పు | పాటువడెడివారు ♦ వాటపడరొ! ౬౪.

కం నీకుఁగలయెల్లసిరులుం | జేకూరఁగఁజేసితేనె ♦ శ్రేష్ఠుండనటం
చేకొలఁదివారువల్కిన | నీకంటెన్నమ్మువారు ♦ నెరయుదురెభువిన్? ౬౫.

ఉ. ముందొకఁడుండుఁబెండ్లియయి ♦ ముద్దియరాజతయానికంగనం
గొందఱుబిడ్డలేర్పడఁగ ♦ గుంపగువారలునుద్వహింపఁబెం
పందుబలంగమామునుపె ♦ యాండ్రననేకులఁగట్టికొన్నచో
వందలువేలికేర్పడిన ♦ వాసియిదంతయుఁదాతెయిచ్చెనే? ౬౬.

కం తినఁగూడుఁగట్టగుడ్డయు | నొనగూడినఁజాలునందు ♦ వొప్పిదమానే
మనమితరజంతుతతులమె | ఘనులముగాఁబుట్టిచేయు ♦ కర్మంబిద్దే? ౬౭.

ఆ. మొన్నపుట్టుఁబెఱుఁగు ♦ నిన్ననుజూడంగ | నేఁడుసచ్చుఁబురువు ♦ లేడఁగన్న
వానిజాడఁగూడఁ ♦ గానియమింతువే | మమ్ముఁగూడఁదాత ♦ సమ్మతింగొన? ౬౮.

సీ. అంధునకెదురనౌ ♦ నందపునస్తువు ♦ బధిరునకునువీణ ♦ పాటవినికి
మూఁకచెప్పఁగనౌన ♦ నేకచరిత్రలు ♦ ముక్కిడికత్తరు ♦ ముందుఁదగుట
తగునపుంసకునకుఁ ♦ దరుణీమణులపొందు ♦ రోగికిబహుభక్ష్య ♦ రోచనంబు
బీదపండితునకుఁ ♦ బెనుహస్తిబహుమతి ♦ యాఁడుదానికిఁజిక్కు ♦ నర్థచయము
వలెనుమాకొప్పునట్టియా ♦ బలమువ్యర్థ | ముగనుదత్ఫలమందలే ♦ ముగదతండ్రి
లేనివారలుతేకేడ్వ ♦ నూనియిల్లు | హాయమందుదుమయ్యయో ♦ నీయుపేక్ష. ౬౯.

కం. ఏసంపదతనకబ్బునొ | యాసంపదఫలముఁగన్న ♦ నధికుఁడతండౌ
వాసిపడనేర్చుఁగనమిని | గాసునకుంగాడుపేరు ♦ గానకచచ్చున్. ౭౦.

కం. బలమొదవిభూమిఁబుట్టుట | బలులందఱికంటెనంచుఁ ♦ బ్రఖ్యాతిపడం
గలిగినకార్యములొనరుప | వలెఁగాకీమూలఁజేరి ♦ వాగుటకొఱకే? ౭౧.

ఆ. దూరమనకరమెంత ♦ మేరనున్నదియును | మెట్టిచూచివారిఁ ♦ బట్టియూఁచి
తద్ధనంబులెల్లఁ ♦ దయుఁగొనకున్నఁ | బుష్టియున్నదన్న ♦ తుష్టియున్నె? ౭౨.

శా. దోర్వీర్యంబిటులొప్పమాపికొనుచు ♦ న్దుఃఖించుచుద్రోయుచు
న్గర్వారంభమొనర్పమానియిటులం ♦ గాంక్షించియేమున్నెడం
బూర్వాచారములేదుమానుమనని ♦ న్బోధించెనాతాతయే
సర్వోపద్రవకారియాతఁడగుసూ ♦ సాధింతుమేతాతమున్? ౭౩.

కం. పనుపడునీబలమునకును | బనులేమొనరించియేమి ♦ పనిలేదందో
వినవింతజగములన్నియుఁ | జనదేనీవేలఁగామి ♦ సత్తువిదేలా? ౭౪.

చం. బలియురుమంత్రులున్హితులు ♦ బంధుచమూపతిపుత్రపౌత్రులు
న్బలములసంఖ్యలొప్పమన ♦ పాటియధీశులమిట్టులుండనే

తులునలుమున్నదారిఁగొని ♦ త్రొక్కుదురట్టిటులట్టులైన నే
తలఁపమదంటికార్యమునఁ ♦ దాతకునడ్డునుగోపమేమొకో! ౨౫.

కం. రానేరాఁడేఁడునురాఁ | గానేయిటఁజచ్చుఁగాక ♦ కదలివెనుకకుం
బోనేర్చునెయప్డాతని | తోనేగుటమనకునగునె? ♦ తోఁచెసుపథమై! ౨౬.

తే. ఇట్టులెప్పుడుఁగాఁబోవ ♦ దేఁటికింత | తాతమాటకునీవడ్డు ♦ దాఁటలేవు
నిన్ను వలదనెమముమాన్ప ♦ నిన్నడిగెనె | మమ్ముఁబంపుటకడ్డేమి? ♦ సమ్మతింపు. ౨౭.

వ. అనికుమారసమూహంబు సముల్లాససన్నాహంబున స్వాతంత్ర్యంబుపేర్మిని దమపైఁ బెంపుచెడఁగూడఁగాననిదై యొప్పునాతనివాత్సల్యంపుబల్మిని దమ్ముంబయనమ్ముంజేసి విజృంభణమ్ముంజూపనోపకుండెడినని భీషణంబులగురోషభాషణంబులెవేషంబుమార్చి నీతులరీతినిజాంతరననొప్పించి యిప్పొందికనాతనినొప్పించియైనందప్పించుకొనికప్పించి మరలనచ్చి మెప్పించునట్లునిశ్చయించి పలికినపలుకులకలరి యలమంత్రినరులును బలియురగుసకలసైన్యనాయకులును దమచెలగుబలముగను మెలఁకువఁదిలకింప వలనగునని యూర్ధ్వసహస్రాక్షుతో వినయంబునయంబును బెనఁగొలుపుచునిట్లనిరి. ౨౮.

ఆ. ధార్మికుండవీవు ♦ తగుతనయులెనీకు | ననఁగఁజాలినట్టి ♦ యనుఁగుసుతుల
ధర్మవచనసరణి ♦ మర్మంబుఁదెలిసితే | జాగుమానుమమ్ము ♦ వేఁగఁబంపు. ౨౯.

కం. శంకింపకురక్షోధిప | జంకునుబెడఁబెట్టియెల్ల ♦ జగములలోనం
బొంకములగునన్నియునీ | లంకకుఁజేర్చెదముపరుల ♦ లసుకుదుమటనే. ౩౦.

వ. అనియిట్లు అమాత్యశేఖరాదులెల్లం గుమారాలాపంబులె ప్రమాణంబులుగాఁగొనియవ్వమోఘంబులని యూదిపలుకుచుఁ బ్రమేయంబునకుసమీపింప నుంకించునట్లుప్రయాణంబునకు నమేయాసక్తినున్నదెల్లంబొడగాంచి సహస్రముఖరావణుండిట్లనియె. ౩౧.

కం. ఆలోచింతముచూతము | బాలురయత్నములుదుడుకు ♦ పాటులఁగూర్చుం
గాలమువెంబడినేము | న్నీలగనొకసారికాంచి ♦ లివఁగనియంతుఁగన్. ౩౨.

కం. అనునంతనెయాననములు | చినవోవఁబరస్పరంబుఁ ♦ జేసైగలచే
మనవిమఱొక్కటఁజేయఁగ | ననువొనరించుకొనియుండు ♦ నప్పట్టున నే. ౩౩.

## వనపాలకులుసభఁజేరి శ్రీరాముడు దండువిడిసినది చెప్పుట.

చ. వనపరిపాలకుల్గడుసు ♦ వారలురోజుచుఁబారినచ్చియా
మనుపరియల్లయోలగపు ♦ మండపమందుమహావిలాసియై

కనఁబడఁగాంచియాగమున ♦ కారణమారయకున్న ముందె తా
మనిరిటులంబ్రమేయమది ♦ యాగడమౌటను వేగపాటునన్. ౮౪.

తే. అయ్యవినుఁడిద్దపూర్వము ♦ నచ్చెరువగుఁ | గోతులాడించిబిచ్చము ♦ కొంద్రోయేమొ
నరులటంటొక్కసారికి ♦ నమలిమ్రింగఁ | జాలుసూక్ష్మశరీరులు ♦ చాలవచ్చి. ౮౫.

కం. తమకోతులఁగట్టికవిడ | నమరినఫలవృక్షతతుల ♦ నన్నిఁటిఁజెఱుచుం
దమినరులమ్రింగఁగలిగియుఁ | దమకెటిఁగించితిమికనఁగఁ ♦ దచ్చోద్యంబుల్. ౮౬.

కం. అనిసభనువాండ్రుదెల్పం | గనుబోదమెకాదిటాటఁ ♦ గనఁబిలుతమెయం
చనికొనుతఱిజయభేరుల | నినదమువినఁబడియెహృదుల ♦ నెమ్మదిచెడఁగన్. ౮౭.

సీ. మునుబోయిమొక్కవ్వ ♦ డినిమ్రింగుదమటంచు ♦ సందడిచేయుచుఁ ♦ గొందఱనఁగ
ఆటలేవిమొమున్ను ♦ పాటించియాపైనఁ ♦ గండముపనులంచుఁ ♦ గొందఱనఁగ
తులువమనద్దురవారిఁ ♦ దఱుముచుఁబోదము ♦ ముందీశుఁడనెనంచుఁ ♦ గొందఱనఁగ
పెంచుచుంచుచువిచా ♦ రించివార్తలెఱుంగ ♦ ముందుచూతమటంచుఁ ♦ గొందఱనఁగ
అందఱినిమాన్పియయ్యసు ♦ రాధిపుండు | బిచ్చగాండ్రైననాపంగఁ ♦ బెచ్చుతలఁపు
చాలకలిగినఁబాఱఁగాఁ ♦ దోలనాన | వెట్టియంతఃపురముదాఁటిఁ ♦ బట్టెనంత. ౮౮.

చం. దొనదొనరాక్షసేశ్వరుని ♦ దొడ్డబలంబఖిలంబుసాగియుం
గనుఁగొనరాఘవుల్ఘనులు ♦ కార్ముకహస్తులుఁగోమలాంగులు
న్మనుపగువానరోత్తముల ♦ మూకలుకేకలువెట్టువారలుం
డనెటిఁగినాతియత్నముస ♦ డాబునుగేరుచునవ్విరొక్కఁటన్. ౮౯.

ఆ. అప్పుఘంబుసంఖ్య ♦ యతికాయులటుమీఱి | యొక్కపెట్టనవ్వ ♦ బిక్కవోక
నిక్కియుండిపెక్క ♦ చక్కటులకుసెక్క | వారువీరులనియె ♦ వారటిఁగిరి. ౯౦.

## రాక్షస బలమర్బుదమును రాము నెదిరించుట.

కం. అవిచారణనందొఱుఁదమ | జనమునకునుపగినయుద్ధ ♦ సామగ్రులుగొం
చువడిని రాఁగావారల | కవురూపబలములుతమకు ♦ నాశ్చర్యముగాన్. ౯౧.

సీ. తవిలిచూచుచునుండు ♦ తరుచరవీరులఁ ♦ దొలిఁగాంచుభరతశ ♦ త్రుఘ్నులఁగని
శ్రీరామచంద్రుండు ♦ సింహనాదముచేసి ♦ యెచ్చటికకువారి ♦ కిట్టులనియె
మునుసింహళింబందుఁ ♦ బనిగొన్నయల్లది ♦ యెన్ననీలెక్కవి ♦ ఘ్నుశపూజ
అద్దిసాంతంబొయె ♦ నగునిదినిర్విఘ్ను ♦ పరిసమాప్తిగబల్ల ♦ పర్యఘుగుచు

భరతశత్రుఘ్నులక్ష్మణు ♦ పటిమఁగనరు | వారిమెప్పింపుఁడనిపుచ్చె ♦ వానరులను
మమ్మెఱిఁగికొల్చుకపివరు ♦ ల్మిమ్ముఁగొలువఁ| దవిలిడీకొనుఁడనిపుచ్చెఁ♦దమ్ములవేస.

వ. అట్టియెడ నూర్ధ్వవక్త్రుండు నఘశ్శిఖుండు దీర్ఘతరబాహుండు మహత్తమగాత్రుండునగు నలసహస్రాస్యాగ్రతనూభవుండు వీరాగ్రేసరుండ జేయుండను వాఁడు దర్పోద్ధతుండై శ్రీరామచంద్రుంగాంచియాసడింపుగనిట్లనియె. ౯౩.

రావణజ్యేష్ఠపుత్రుఁడు రామునితోఁ బ్రేలి యాతనిచేమడియుట.

ఉ. మిమ్ములమాభటుల్మిగురు ♦ ద్రిమింగఁగఁజాలినవాండ్రసాటిగా
సమ్మతిఁజేసిపెట్టుకొని ♦ సన్నిధిఁజేర్చినచింపఁబూనఁగా
నెమ్మదిమేమునిల్చుటది ♦ నిండినభాగ్యముమీకునాఁగదా
యిమ్మెయివచ్చినందులకు ♦ నీఫలమబ్బెనుముందుకంటివే ౯౪.

ఆ. ఇంకఁగలుగుభాగ్య ♦ మింటియాసకుఁబాసి | మాకునశనమగుటె ♦ కాకిఁకేమి
పెచ్చుపదముఁగోరి ♦ వచ్చితికాఁబోలుఁ | జచ్చుపదమెయీడ ♦ సంభవించు. ౯౫.

ఉ. ఎప్పనియిద్దిమీకగునె ♦ యింతటిహీనులుమీరుమాకునొ
గొప్పయెయుంగమాలియిటు ♦ కూడితిరింతటనైనఁబాసిపో
నొప్పినఁబోవనీయరిట ♦ నుద్ధతినొప్పినధీరులక్కటా
చెప్పఁగనున్ననేమయినఁ ♦ జెప్పుఁడువిందుముకందుమాపయిన్. ౯౬.

కం. మీకఁకుమాత్రశరీరము | లేకొలఁదినిజెప్పదయ్యూహా ♦ లేర్పడఁగల్గు
న్మీక్షించిజ్ఞతఁబట్టియె | కాకిట్టులురాకఁగంద్రడె ♦ ఘనులిటనుండన్. ౯౭.

కం. ఆగుదురెయాటలాడుచు | సాగుదురేతెలివితక్కి ♦ సమరంబునకు
న్నాగుమరెలేనిపోనివి | లోఁగుదురేయిప్పుడైన ♦ లోఁటొందుదురే? ౯౮.

చం. అపుడటభీకరాసురులు ♦ నారఘువీరులువానరోత్తము
ల్విపులమహోగ్రరోషముల ♦ విప్లవకారణయుద్ధకాంక్ష నే
యపరిమితోద్ధతిందవిలి ♦ యచ్చటఁజేరినయప్డెదేవత
ల్సపతులుమింటనిల్చిరిఁక ♦ జంకెడమాఁదమకంచుఁబొంగుచున్. ౯౯.

ఆ. అలసహస్రకంధ ♦ రాత్మజాగ్రేసరుఁ | డన్నపొగరుపల్కు ♦ లన్నివినియు
రామచంద్రుఁడప్పు ♦ డేమిపల్కునోయని | ప్రీతినున్నరాముఁ ♦ డాతఁడినను. ౧౦౦.

ఆ. బలిసియున్నమిమ్ముఁ ♦ దెలిసియేవచ్చినఁ | బలుకులన్నలొంగఁ ♦ గలుగుటెట్లు?
బలిమిఁగన్నమిమ్ముఁ ♦ దెలియకేవచ్చినఁ | బలుకువిన్నలొంగఁ ♦ గలుగుటెట్లు? ౧౦౧.

కం. అనరుగదశరణుజొచ్చిన | మనిచెదమనియొక్కమాట ♦ మాత్రంబైన
న్ననవులుమీతోఁజేసినఁ | గనుఫలమిఁక నేమిపోవఁ ♦ గానీమంద్రే! ౧౦౨.

కం. కూడంగలిగితిరొక్కఁట | నాడంగలమాఁటలెన్నొ ♦ యాడుచునిఁకమ
మ్మాడంగలరేయందురు | చూడంగలరేమొనిల్వఁ ♦ జూచికొనుండా. ౧౦౩.

ఆ. అనఁగనఱచినవ్వి ♦ యార్భాటములుచేసి | పొట్టివానిబుద్ధి ♦ పుట్టెడనఁగ
వింతపల్కులుగనె ♦ యెంతలంటిరయని | యాడువారినేమె ♦ చూడలేమె? ౧౦౪.

కం. సరిగదయొన్నఁడుయుద్ధపు | సరణియెవినికననియట్టు ♦ సాగితివే రా
తరుణిందోఁగొనివచ్చితి | సరసాలాపములెయుద్ధ ♦ సన్నాహంబుల్? ౧౦౫.

కం. ఇదెచూడుమెదిగిపైఁబడి | ముదితనుజేఁజిక్కఁగొందు ♦ ముందీవంత
న్వదనము వ్రాల్చెదువంత | న్నదడగునీయత్నమెల్లఁ ♦ బడిదుఃఖింపన్. ౧౦౬.

కం. ఈలీలననుచుఁగడఁగుడు | వాలమ్ముకఁటేసిరామ ♦ వసుధాధిపుఁడా
వాలింగూల్చినయట్టుల | నోలినజేయాఖ్యుఁగూల్చె ♦ నుర్వింబడఁగన్. ౧౦౭.

ఆ. అంత వ్రేలినట్టి ♦ బంతకాఁడగువాఁడు | కొంతయైనఁబెనఁగఁ ♦ గూడకపడ
వింతనొందిరుభయ ♦ పిరులుశ్రీరాము | బాహుబలమువైరి ♦ భయదమఁచ్యు. ౧౦౮.

ఉ. అంతటిదీర్ఘదేహుఁడవు ♦ డాచ్చితటాలునవ్రాలనప్పుడా
చెంతనుగల్గురక్కసుల ♦ సేనలనల్పులుమగ్గిరుద్ధతి
న్వింతగువానికాయమది ♦ వేఁగురుపట్టినదొగ్గదద్దిరే
యెంతగఁబెంచిరోతొలుత ♦ నేర్పడినాత్మజుఁడౌటఁబ్రీతితోన్. ౧౦౯.

చం. తమయువరాజుఁగూల్పఁగనె ♦ తాలిమివాసిచమూప్రతీంద్రుఁడౌ
హిమనగధీరసప్తముఖుఁ ♦ డేమరయంజనకామహీశుపై
నమరినగాఢకోపమున ♦ నద్భుతశబ్దముపుట్టనార్చుచు
న్వ్యముగతిఁబోయిపట్టికొన ♦ యత్నముచేయమరుత్సుతుండటన్. ౧౧౦.

## హనుమంతునియుద్ధప్రకారము.

ఆ. మున్నువార్ధిదాఁటఁ ♦ బన్నినరూపంబు | వడిగఁదాల్చియాడఁ ♦ బడినశవముఁ
జేతఁగొంచునేడు ♦ శిరములయాజెట్టి | దానబాదికూల్చి ♦ వానినూని. ౧౧౧.

ఉ. చిల్లరసేనలెల్లవెసఁ ♦ జిందరవందరచేసికూల్చుచో
నల్లదిచెడ్డనింకొకటి ♦ యప్పుడెక్కైకొనియల్లెయేసియా

బల్విదులెక్కి వీడినవి ♦ బల్మిరథంబులు గొంచువానిచే
నల్లరియాటలాడికొను ♦ నట్టులగొట్టిన నేకశీర్షులన్. ౧౧౨.

ఉ. ఆతతదేహమాతనికి ♦ నంతటివొప్పుటబల్మిపేర్మినా
రీతిఁబనుప్పుటించుటయుఁ ♦ బ్రీతిని గాంచిరి కైకపట్టియిం
కాతనితమ్ముఁడుంగనుట ♦ యప్పుడె కావుననంతరాక్షసు
ల్ఖ్యాతముగాఁదలంచితమ ♦ పొంగులు క్రుంగఁగనార్చిరొక్కటన్. ౧౧౩

ఆ. అంతలో నెతొంటి ♦ యంతటివాఁడయి | సంతసమున రాము ♦ చెంత్రఁజేర
గానియానలాదు ♦ లూనిరాచొప్పునె | పెఱుగకున్న శక్తి ♦ పేర్మికొలఁది. ౧౧౪.

కం. ప్లవగేంద్రులు మఱికొండలు | తవిలిమహావృక్షములను ♦ ద్వరఁగొనియేయ
న్జవముడిగ్గిచాలసేనలు | భువిఁబడఁ బైనెక్కి త్రొక్కి ♦ పొలియించిరటన్. ౧౧౫.

ఆ. తెఱపియయ్యెఁజాల ♦ వఱకుసేనలుచావ | సమరరంగమట్టువి ♦ శాలమైనఁ
దెలియఁబడఁగనైరి ♦ నిలిచినవీరులు | పేరుపరుసఁజచ్చు ♦ పెద్దలగుచు. ౧౧౬.

ఉ. వారలుశూరులున్నధిక ♦ వర్యులవార్యపరాక్రమోన్నతు
ల్మీఱినయస్త్రశస్త్రములు ♦ మేగలినేయఁగలారుబారుగాఁ
జేరినరేంద్రచంద్రునకుఁ ♦ జీవరవుట్టఁగబాణవర్షము
ల్ధారలువెట్టఁగాఁగురియు ♦ ధాటికనంబడఁజేసిరొక్కటన్. ౧౧౭.

ఉ. చక్కగవారలేయుశర ♦ జాలములన్నియునొక్కటొక్కట
న్మ్రక్కలుసేసియంతటన ♦ మోఘములైనశిలీముఖంబుల
న్నొక్కననేయనవ్వికన ♦ నిక్కటడంగుడుఁదాఁకనెత్తురు
ల్క్రక్కుచుఁగూలిరాసమర ♦ రంగమునంగవులార్చిపొంగఁగన్. ౧౧౮.

## లక్ష్మణాంగదులు రాక్షసులజంపినవిధము.

సీ. ఆలక్ష్మణస్వామి ♦ కాశ్చర్యకరులయి ♦ యతితరాంగులురాక్ష ♦ సాధనాథ
సూనులుం బ్రెగడలు ♦ సేనాధినాథులు ♦ షట్పంచశీర్షులు ♦ సాహసించి
ముస్నెగ్గులాడంగ ♦ మొదలిడగరోర్వక్తు ♦ లుద్ధతిఁబల్కుచు ♦ నుబ్బుచుండ
నొక్కొక్కయార్పున ♦ దిక్కులఁబ్రతిశబ్ద ♦ మెక్కువగానింగి ♦ వ్రక్కలుగను
జేయుచుండినవీరుల ♦ జేయునసుజు | లఘుడుభుజబలములుసూప ♦ నైనవారి
బాణపంక్తులుఖండించి ♦ జాణయతఁడు | వింతశరములుసంధించి ♦ వేయుటయును.

చం. శరములదీప్తిఁ గాంచినసె ♦ చాలభయంపడిరంతచేష్టలం
దొఱఁగిఘటించుకార్యములె ♦ తోఁపకయుండినవివ్వోయియా
యురములఁగంఠనాళముల ♦ నుద్ధతిఘాలములందుదూఱఁగా
మొరలిడుచ ప్రుక్కూలిరిల ♦ మూలములూడినఁ ద్రెళ్లుచెట్లమై. ౧౨౦.

ఆ. దొరలువడఁగనొచ్చి ♦ దొరలుచుఁ బైఁబడ | వీఁకవచ్చునయ్య ♦ నీకపతుల
కడ్డమేగియార్చి ♦ యంగదుండప్పుడు | తాకివారినటపి ♦ తాకుపఱప ౧౨౧.

ఆ. కోఁటకొమ్మయొండు ♦ గొబ్బునఁ బెఱికియు | ధాటిదాన నేయఁ ♦ దలలుడుల్లి
పెద్దమూల్గులొప్పఁ ♦ బెనుభూతములరీతి | నేలఁబడిరిసురలు ♦ గేలిగొట్ట. ౧౨౨.

కం. ధ్వజమొక్కటూడఁ బెఱికియు | గజములహయములనుమోదఁ ♦ గానవియెల్లం
గజిబిజిగొనిపడిచచ్చెను | భుజబలమునవంగదుండు ♦ పొగడఁబడంగన్ ౧౨౩.

మ. అలనీలాదులుచుట్టుఁబట్లఁదగిబ ♦ హూవ్వన్నత్యముంగాంచునా
ఫలవృక్షంబులుపెల్లగించికొనుచుం ♦ బాహాబలంబొప్పఁట
న్బలముందట్టముమాపిమట్టుగొనఁగా ♦ ఖండించిరొక్కుమ్మడిం
దలలుంగాళులునేతులూడిపడిరా ♦ దైత్యుల్గతప్రాణులై. ౧౨౪

ఆ. ఇంకమిగిలియుండి ♦ అంకలేయుచునుండు | మిన్నపేర్లుగొన్న ♦ యన్నరాని
వీరవరులబాణ ♦ ధారలముంచెను | లక్ష్మణుండుశౌర్య ♦ లక్ష్మణుండు ౧౨౫

## భరతశత్రుఘ్నులు రాక్షస సంహారమునజూపిన నేర్పు.

సీ. భరతశత్రుఘ్నులు ♦ పటుబాహుశక్తుల ♦ పారంబుగాఁగల ♦ ధీరులైయు
అన్నలుమిన్నలు ♦ వన్నెకన్నారన్నొ ♦ యెన్నికొఁపట్టను ♦ దెన్నవడిరి
వారలతోనీడు ♦ తారువత్తురొలేదొ ♦ తారసిల్లినదన్న ♦ మీఱినపని
ముందెయుత్సాహంబుఁ ♦ బొందించునప్పుడే ♦ యందించెఁబతితమ ♦ కందఱుపిన
నెట్టులైననుమితిమీఱి ♦ నట్టులఁబని | జెట్టితనమునుగాన్పింప ♦ గట్టివార
అట్టిరామునితోడనే ♦ పుట్టినార | యంద్రుకాకున్ననగుదురే ♦ యనుచుఁదలఁచి

సీ. దోశ్శక్తికిలనున్నె ♦ దుస్సాధ్యమనునమ్మ ♦ కమ్మనుగవిసంత ♦ సమ్మనుగని
శ్రీరామపదభక్తి ♦ చిత్తమునఁగలట్టై ♦ ర్యమ్మునుగనిపాహ ♦ సమ్మనుగని
తమకండపతియిచ్చెఁ ♦ దగుమహావీరుల ♦ నెమ్మినినసిసాఁగ ♦ నమ్మఁగఁగొని
షైఁగాపురాజుండుఁ ♦ బవనాత్మజుండుండు ♦ లెమ్మనియపిరక్ష ♦ ణమ్మలుగొని

యుద్ధమునకునువారుస ♦ న్నద్ధులగుడు | రూపములనెట్లుపోలిరో ♦ యాపగిదినె
రామలక్ష్మణులకుమాఱు ♦ రామెలఁగిరి | వానరులుమీఱినుతియింపఁ ♦ గానపుడట.

ఉ. రావణుకూర్మినందనులు ♦ అంతులు సేయుచుమంత్రిపుంగవు
ల్గావరులైనసైన్యపులు ♦ లంకెలఁగొల్వఁగమీఱిపైఁబయిం
జేవశరంబులేసిరవి ♦ చిత్తముతత్తరవెట్టువారికిం
దావులుతప్పిరాఁగనిన ♦ దారులువట్టుదురన్నకాంక్షలన్ ౧౨౮.

తే. భరత శత్రుఘ్నులప్పుడా ♦ బాణములను | వచ్చునప్పుడెచేసిరి ♦ ప్రక్కలుగను
గానియామేయువీరుల ♦ మేననవయ | వమ్ములేవెటనున్నవో ♦ వానినెఱుఁగ ౧౨౯.

కం. వింతగనారయఁజొచ్చిన | యంతటనొకకొంతవడికి ♦ నాయావిషరం
బంతయుఁగనఁగలుగంగా | సంతసపడిజరములొత్తి ♦ సన్నాహమునన్ ౧౩౦.

ఉ. వాడిశిలీముఖంబులను ♦ వారపుడెక్కిడిలెక్కవెట్టఁగాఁ
గూడనిధాటిసేయుడును ♦ గొంపలమందుచజేయుతమ్ములా
పోడినయన్నపోనయిన ♦ వీధినిబట్టిరిమర్మదేశము
ల్గాడఁలుపడ్డపైలుపెను ♦ గాడ్పునఁబడ్డతెరుల్గఁగూలఁగన్ ౧౩౧.

తే. భరతశత్రుఘ్నులునుబాహు♦పటిమలందు | బాణములనేయువడియందుఁ♦బరులఁగెల్చు
లాఘవంబునుదెలిసిన♦లాగునందు | నన్నలకుడీఁటయనికపు♦లెన్నరయ్యె ౧౩౨.

కం. భరతునిఁదామెదిరించిన | చిలుతదొరల్గాలరోసి ♦ చిడిముడిపడుచుం
గలుతముపాడుతమటంచును | జలచలచతురాస్యరాక్ష♦సచమూనాథుల్ ౧౩౩.

## జాంబవంతునియుద్ధప్రకారము.

సీ. పడిఁబోవఁగాజాంబ ♦ వంతుఁడడ్డమువారి♦యొక్కనిపైఁబడి ♦ త్రొక్కిచంపి
యింకనొక్కనినింగి ♦ కెగురవైచుచుఁగూల్చి ♦ వేఱొక్కనింబట్టి ♦ గీఱిపాలిపి
అంతనొక్కరథంబు ♦ హస్తంబునంగొని ♦ దానమత్తేభంబుఁ ♦ దానుగూల్చి
యయ్యిభంబుంగొని ♦ హతులనుగాసైన్య ♦ పతులఁజేసెనువింత ♦ పద్ధతులను
గడమసేనలప్రతాపులఁ ♦ బిడుగుపగిద్దు | లేయుటలఁగూల్చిగవయాదు ♦ లాయుపాయ
ముననురంగిమురెట్టపిగా ♦ నొనరిచిరిఁక | మిగిలిచిక్కినబలియురు ♦ మీఱియున్న.

కం. భరతుండంబకతతులను | గురిపించినముగ్గ చంద్రుఁ ♦ గూత్రలుమూల్లు
ల్విరివిగఁబెట్టుచుమడిసిరి | దొరలేగిరిగానఁదాముఁ ♦ దోడుపడుటకై. ౧౩౪.

కం. చిఱుదొరలను శత్రుఘ్నుఁడు । పొరిగొనుటను సైన్యపతుల ♦ బుద్ధులు చెడఁగా
బిరబిర నాతని పైఁబడఁ । బరువిడఁగా దారి నడ్డఁ ♦ బాటిన వాఁడై. ౧౩౬.

## సుగ్రీవుని యుద్ధప్రకారము.

కం. సుగ్రీవుం డఖిలానే । కగ్రీవులఁ ద్రుంచె నపుడు ♦ ఘనబాహుబలో
దగ్రములగు పెనుముష్టుల । యుగ్రహతిం గొందఱ నిక ♦ నున్నారలలోన్. ౧౩౭.

సీ. ఒకనిఁ జేఁగొని త్రిప్పి ♦ యుంకించి పైకేయు ♦ వేఱొక్కనిం గొని ♦ విసరునట్లె
పైవాఁడు పడునల్ల ♦ పథమునఁ గ్రిందివాఁ ♦ డేగుచో వీని పై ♦ నెత్తునుండి
వచ్చు వాఁ డుల్కయై ♦ పడిఁ బడ్డ నుభయులా ♦ తాకునఁ బ్రాణము ♦ ల్తలఁగి నేల
బడ నింక నూపిరి ♦ పట్టండనో యని ♦ యొక్కఁ ద్రొక్కఁడి వారి ♦ నొక్క కూటి
కొండ దెంగొని యటఁ గల ♦ కుధర మందు । బాటుగొని చావఁగా నేయుఁ ♦ బాటవమున
మేఁటి గాపున నీరీతి ♦ మెలపి నలిపి । డులిపి పొలిపెను బంతులా ♦ టలుగఁ జెలఁగి. ౧౩౮.

ఉ. ఆడను బడ్డ మేఁటులకు ♦ హస్తములం గల పెన్నదల్తరు
ల్గాడను జేతఁ గైకొనుచుఁ ♦ గూటము లైతగు సేన ప్రాణము
ల్వీడ సుషేణ ముఖ్యులట ♦ వేడుక శౌర్యముఁ జూపి రంతట
న్బిడ మురంగ మేర్పడిన ♦ ఓంక పులావరులింకనుండఁగన్. ౧౩౯.

కం. శత్రుఘ్నుఁ డమ్ము లేయఁగ । గాత్రములం దూట్లు పడఁగఁ ♦ గడు వడిఁ బడి యా
శత్రుఫలాక్రమయమపుర । యాత్రికు లెందరు వెలుఁగఁగలిగి ♦ యరిగిరయారే. ౧౪౦.

## విభీషణయుద్ధప్రకారము.

సీ. వారు పిరటనిట ♦ వడి నేటు లేయంగ ♦ బారికిఁ దొలఁగుచుఁ ♦ బాటినారు
కొంద ఱురక్కసు ♦ లక్కందు చునటుపోయి ♦ మనుజసంతతిఁ గాంచి ♦ మందబుద్ధి
భ్రమఁగుడమని పోవ ♦ నిఁగిఁగా పుండియు ♦ నెల్ల నీ క్షేంచెడి ♦ బల్లిదుండు
అలవిభీషణుఁ డప్డ ♦ బలములఁ బురికొల్పి ♦ మారణమప్పుడు ♦ వారిఁ జేసి
మునులనర సేనమంత్రుల ♦ ముఖ్యజనుల । జెదరకుండఁగఁ గాపాడె ♦ నిదియె కాక
తానియుక్తుఁడు గానేడఁ ♦ గానఁబడదు । తలుగులే దేడ జవమున ♦ మెలుగె విరివి. ౧౪౧

తే. ఇద్ది మేలయ్యె సందీన ♦ నిష్ఫు తెలిసి । యల విభీషణుఁ డసురుఁడై ♦ యరులనరుల
గొలిచి నిజజాతి కగ్గను ♦ గూడఁ జేయు । వనచరో పించి యూరావ ♦ ణాసురజులు.

కం. నరులకు వానరులకు బల । మరయఁగ నెటనుండు పిఁడె ♦ యరులమరుగుచుం
బురికొల్పి యింత చేసెను । బొరిగొనుఁ గీముందు పినిఁ ♦ బూన్కి నటంచున్. ౧౪౩.

తే. ఒక్క పెట్టున నుమిగ్గాడి ♦ యుక్కుగదలు | విసరిపైకేయనవ్వియే ♦ వీకఁబట్టి
మరల నేయుడు దెబ్బకుఁ ♦ దిరుగులేక | నేలఁగూలిరి యాకక్షు ♦ లేలినారు. ౧౪౪.

ఉ. అంతట భూమికిం దిగియు ♦ నల్ల విభీషణుఁ డార్చి పెన్గద
న్వింతగఁ ద్రిప్పి యేర్పడిన ♦ వేడుక నాడుచుఁ జింత వీడుచుం
బంతము వల్కి యేఁటునకు ♦ బల్మిగలాఁ డొకఁ డీల్గుచుండఁగా
నంతు పనుల్ఘటించెడుగు ♦ వాసియుఁ గాంచెను రామసేనలోన్. ౧౪౫.

వ. అల్లయర్బుదసంఖ్యగల కర్బురపరివారంబెల్లను దమకర్బురచింతల నెదుర్బలంబు నొంది యుండుగాన నతిశీఘ్రంబుగ హరించుట నప్పటికిఁ జాతుర్భాగశేషంబయ్యె. చిల్లర సైన్యంబులు కొల్లలుగను వీరులును సగము మీఱు సుమారుగను మడిసిరి. కదనరంగం బెల్లఁ బీనుంగుపెంటలను రక్తప్రవాహంబులను నిలువఁ దావలేకయుండె. సహస్రవక్త్ర ముఖ్యమంత్రియగు కోటీశుండప్పటికి నడచిన చొప్పెల్లను దమ గొప్పయేలికకు విప్పి చెప్పందగు నొక్కనిబలిమి రక్కసు వీఁటికింబుచ్చి యున్నవీరుల నెల్లర నొక్కచక్కటికిం జేరనట్టుఁ దీరిచె. శ్రీరామచంద్రుండును దమవారి నెల్లం దదభిముఖులై నిల్వ నేమించుటయు న్మరల సమరారంభంబయ్యె నిందుం గొందఱు కామరూపులుండి మాయా మోహావేశంబు లొందింపం జాగిన హనుమద్విభీషణ లక్ష్మణులు రామచంద్రుండును మిగుల జాగరూకులై యుండ వలసె నెట్లనిన. ౧౪౬.

## మాయాయుద్ధచమత్కారవర్ణనము.

చం. ఒకఁ డొకఁ డున్నతాంగుఁడయి ♦ యున్న కపీంద్రుల మ్రింగుచుండఁ లో
నికిఁ జని ముక్కునం జెవుల ♦ నిక్కుచు వెల్వడి వచ్చుచుం ద్రువా
రకటమరుత్కుమారుఁడటు ♦ లందుడు మ్రింగినలోని కేగియా
ప్రకటబలుండు మేన్పెనిచె ♦ రక్కసుఁడొక్కలు వ్రక్కలై పడన్. ౧౪౭.

చం. ఒకఁడు వశిష్ఠరూపమున ♦ నొప్పుచు రామునిఁ జేరఁబోవఁగా
సకలమెఱింగియా హనుమ ♦ చావఁగ మోదెను మున్నె యాతఁడ్డీ
తికమకలెన్ని యేఁబడిన ♦ ధీరుఁడుగావున లక్ష్యముంచియా
వికృతులఁ గాంచినారలను ♦ వేలకొలందులఁ ద్రుంచెనిట్టులే. ౧౪౮.

చం. ఒకఁడటు పెద్దపాముగుచు ♦ నుద్ధతి రాఁగ విభీషణుండు వా
నికి నెదురేగి తా గరుడు ♦ నింబలె వేసము నూనిపట్టుచు
న్నకనకపాటువాఁడుగన ♦ నట్టి వతానొనరించియంతలో
నికనొకకార్యమేర్పడిన ♦ నీలుగ నొక్కను వానికుత్తుకన్. ౧౪౯.

చం. ఒకఁడు మహేభరూపమున ♦ నుగ్రుఁడు గాఁగనుపించి వచ్చి పాం
దికను విభీషణుండుకని ♦ తీవ్రపుసింగపురూపుతానవై
చికొనుచు నడ్డమేగి యరి ♦ సింధురకుంభము ప్రక్కలోఁగతిం
ప్రకరములార్వఁ జేఁజఱచి ♦ ప్రాణము వాపెను వానినప్పుడే. ౧౫౦.

చం. ఒకఁడట వాయురూపుఁడయి ♦ యూదరవీవఁ దొడంగ నెల్లరుం
జకితులు గాఁగ నేర్పడిన ♦ జాడఁగనుంగొని లక్ష్మణుండు సా
ధకమగు నారగాస్త్రము మొగిఁ ♦ దారసిలం బడ నేయ సర్పము
ల్సకలమరుద్విశేషమును ♦ జయ్యన మ్రింగెను వాఁడరూపిగాన్. ౧౫౧.

చం. ఒకఁడిసుమూచరేగఁగని ♦ యొయ్యన లక్ష్మణుఁడప్పుడే సెఁదా
నకలుషసత్త్వమూర్తిపవ ♦ నాస్త్రముఁ దానవదాడఁ బాసిపో
యికడలిలోఁబడెన్మరిఁగ ♦ నిట్టుల నేకములింద్రజిత్తుతో
లకలుకలందు నాఁడెఱుఁగు ♦ లావరికావున మాయలార్చెడిన్. ౧౫౨.

చం. ఒకఁడపుడగ్నియై శిఖల ♦ నున్నతదీప్తులఁ జేసి వెల్గఁగాఁ
బ్రకటితతేజుఁడై యెసఁగు ♦ రామమహీపతి వారుణాస్త్రము
న్సకరము నేయ వాఁడపుడు ♦ చొక్కనువానకుఁ బాసెఁ బ్రాణము
ల్వికటములిట్టులెవ్వరివి ♦ వీఁక నొనర్చిన వ్యర్థమై చనన్. ౧౫౩.

చం. ఒకఁడటు బ్రహ్మరూపుఁడయి ♦ యొద్దికనంచపయిన్వసించి యా
యకుటిలు రామచంద్రుఁగని ♦ యయ్యోరి యెఱుంగవె నాకుస్వీయుతే
సుకరులు వీరు వీరినిటుఁ ♦ జొక్కఁగఁజేయఁగ నాయమా నెనాఁ
దికమకనొందె రాఘవుఁడు ♦ తెల్పె విభీషణుఁడద్దిమాయగాన్. ౧౫౪.

తే. తెలియఁగా నైన వెంటనే ♦ దీప్తబాణ। మొక్కఁడేయుడు వాఁడాడ ♦ నిక్కుటుఁడిగి
పక్కితోఁగూడ నెత్తురు ♦ గ్రుక్కుచుఁబడె। నింగిఁగన్గొను దేవత ♦ ల్పొంగియార్వ

అర్బుదసంఖ్యరాక్షసులుంజావఁగా రాముఁడు పొగడ్తగనుట.

సీ. మాయలరక్కసు ♦ ల్మాయమీతెఱఁగునఁ ♦ గానైరి తెలిసిన ♦ ఘనులవలన
ఇఁకఁబుష్టిగలవీరు ♦ లొకఁటఁబెనంగుడు ♦ మల్లుర నెల్లర ♦ మడిపిరల్ల
ఘనుఁడు సుగ్రీవుఁడం ♦ గదకుమారుఁడు జాంబ ♦ వంతుండుఁ దక్కిన ♦ వనచరులును
రథికులు మీఱుచు ♦ నధిక వేగంబున ♦ బాణపరంపర ♦ ల్పఱపనెదిరి

భరతశత్రుఘ్నులావచ్చు ♦ పటుశరముల । నెల్లఖండించిదేవత ♦ లుల్లసిల్ల
మోహవీరులనందఱ♦నుర్విఁబడఁగ । గూల్చియన్నకుఁ బ్రెమ్మొక్కి రి♦కూర్మిఁగనిరి. ౧౫౬.

తే. కనఁగనొకఁడైనలేఁడేడఁ ♦ గర్బురుండు । అర్బుదముసంఖ్యవారెల్ల ♦ హతులిరైరి
నిర్భయంబుగనుందుము♦నేమటంచుఁ । బొంగిశ్రీరాముదేవత ♦ ల్పొగడిపొగడి. ౧౫౭.

కం. పూవులవానలువారల । పైవేడుకకొలఁదికురిసి ♦ బహుహర్షముతో
దీవించిపాడిరాడిరి । దేవతలునువారిహితులు ♦ దేవమునీంద్రుల్. ౧౫౮.

కం. వానరవరులవిభీషణు । మానవనాయకుఁడుగాంచి ♦ మహితులుమీర
ల్పానికఁదగినంగాదే । యేనిట్టులవినుతిఁగనఁగ ♦ నేర్పడెననియెన్. ౧౫౯.

ఉ. మానవసేనలంగొనుచు ♦ మంత్రులుమానులుఁగూడికొంచురా
గానఁగనైనయామిలయు ♦ కర్మనుదైత్యమహోన్నతాకృతు
ల్పానినడంపఁగాఁబతులు ♦ వానరవీరులుఁజూపునేర్పులు
న్మానసహర్షదంబులగు ♦ మాటలవేవిధులన్నుతించిరా. ౧౬౦.

తే. ఇట్టులనుజెట్టులనుగొట్టు ♦ టిట్టెకాఁగ । బట్టుచిక్కమహోత్సాహ ♦ భరితులగుచు
వానరేంద్రులురాఘవు ♦ ల్మానవులును । జేయుపనిలేకముచ్చట ♦ లెప్పుకొనఁగ.

## సహస్రముఖరావణుడు యుద్ధమునకు వెడలుట.

సీ. అప్పుడుకోటీశుఁ ♦ డంపినరక్కసుం ♦ డతిగియంతిపురంబుఁ ♦ జొరఁగఁగలిగి
యంద్రుమహావిభ ♦ వాతిశయంబున ♦ మేనెలుంగ్గకయున్న ♦ మేఁటిపేరుఁ
బొడఁగనియంతకు ♦ నడచినదెటిఁగింప ♦ నడలుచునప్పటి ♦ కొడలుతెలిసి
పయనమానంతవే ♦ హయములనూన్చిన ♦ రథమాయితంబొడు ♦ రాజీవిఁ
దనకుఁగలిగినయుద్ధసా ♦ ధనముచెల్ల । రెండువేలకరంబుల ♦ నిండుకొలిపి
బండులొకవేయునిండఁగ♦దండిశరము । లింకఁగైకొనిరణభూమి ♦ వంకకరుగ. ౧౬౨.

చం ఉదయకులాచలంబిటకు ♦ నుద్ధతివచ్చునిదేమనంగనా
పదిపదుటామడల్పొడవు ♦ బాఱునకుందగులావుగల్గుగొ
ప్పదియగుస్యందనంబపుడు ♦ బంగరుచెల్వునరత్నదీప్తుల
న్మొదటఁగనంగనైననర ♦ ముఖ్యులుగాంచిరిక్రొత్తవింతగన్ ౧౬౩.

చం. అందికకద్దిరాఁగనెస ♦ హస్రముఖంబులురెండువేలుబా
హొంధినచేతులందులమ ♦ హోద్ధతశఖడ్గగదాదులబ్టెపె

న్కంపలుగూడు మేనుగల ♦ మానవభక్షకనాథుఁగాంచియా
యందఱుఁగొందలంబుఁగని ♦ యప్పుడరాముని యండకేగఁగన్. ౧౬౫.

సీ. వాఁడటకేతెంచి ♦ వసుధాతలంబెల్ల ♦ రక్తసముద్రమై ♦ రాణఁజెడఁగ
అంతటఁబడియున్న ♦ యంగంబులాంగికా ♦ నయనముల్చూపట్ట ♦ భయదములుగ
కండలునెమ్ములు ♦ దండిప్రేవులుఁదిత్తు ♦ లొండొంటిపైఁబడి ♦ యోలలాడ
బహువిధాయుధములుఁ ♦ బలువాహనంబులు ♦ నామరూపములులే ♦ కేమొకాఁగ
వృకసృగాలాదులును గాక ♦ వితతులెసఁగ । బలుపిశాచములాడాడఁ ♦ బ్రబలియాడ్డ
జూడభయకంపరంబులు ♦ తోడసేయగు । యుద్ధభూమినిగన్నఁనే ♦ యుద్ధతిచెడె.

తే. మాటమైయెనను జెప్పెడి ♦ పాటికైన । దక్కఁ దొక్కఁడునట్లుర్వ ♦ దంబుఁజూవ
నిట్టికననైనమూర్ఛిల్లె ♦ నెప్పటికినో । తెలిసియార్పుచు విలపించి ♦ మలపిబుద్ధి ౧౬౬.

వ. విధాత్రోక్తవచనంబులెల్లను విధివిధానంబులెకా నవిహితధర్మంబులని నమ్మియున్న వాఁడు కాన నప్పరమేష్ఠి చెప్పినచొప్పున నడచునన్నాళ్లొప్పిదంబును వానిం దప్పఁగుప్పించునప్పట్టున నే తప్పునిముప్పును గలుగునని యెప్పుడొ చెప్పంబడిన యప్ప లుకు గుప్పునమనోగోచరంబగుడుం దెలివితెచ్చికొని పలవించుట తొలఁగించికొని సలలితవైరాగ్యభావంబలవరచికొని సద్ధర్మంబు నళపఱచికొని యట్టియప్పు డిట్టులనియె.

## సహస్రశీర్షుఁడు విరాగమున జెప్పినపరమధర్మములు.

కం. ఇయ్యణుమాత్రపునరులే । దయ్యమ్ములఁబోలునట్టి ♦ దైత్యులఁజంపం
గయ్యమునందును గాలం । బియ్యెడకిట్లయ్యెవీరి ♦ యెగ్గుతలఁపులన్. ౧౬౭

ఆ. బాహుపాముల్లు ♦ పరగుదైత్యులకును । నరులునకులములయి ♦ జరగిరకట
మత్తసింధుసదృశ ♦ మహితదానవులకు । జనులుహరులనంగఁ ♦ జనునెకట్టు! ౧౬౯.

ఆ. బుద్ధిమాలినట్టి ♦ సుద్దులుకూయుచుఁ । బెద్దలైనవారి ♦ పేర్మిఁగనక
హద్దుమీఱిచెలఁగ ♦ నాసింపఁగానిట్టి । పద్దునడియెమీఱి ♦ పదరుటగునె? ౧౭౦.

ఆ. ఎత్తరానిపరువు ♦ లెత్తెదమనినన్ను । నొత్తియొత్తియడుగ ♦ నూరకున్న
బత్తిమాలిజనకు ♦ బ్రహ్మదేవునిదూఱి । జిత్తవిత్తులుగను ♦ జెడరెయిట్లు? ౧౭౧.

ఆ. చెట్టలైనవీంద్రు ♦ చెదెదరువిడిచినఁ । బట్టియుంతమనుచుఁ ♦ బాటువడితి
గుట్టుదేవుఁడెఱిగి ♦ కుదిరిచెనీడనే । చెట్టఁదలఁచువాండ్రు ♦ చెందుఫలము. ౧౭౨.

ఆ. పేర్మియొరులదెఱుఁగఁ ♦ బ్రియపడకెప్పుడు । కూర్మినాత్మబలమె ♦ గొప్పదనుచు,
మర్మమెఱుఁగలేక ♦ మాటలాడెడివార । ధర్మపరులుగారె ♦ దళనఁగనరె? ౧౭౩.

ఆ. కన్నులుండు రెండు ♦ కలవట్లె చెవులును । ఎన్నొకనఁగ వినఁగ ♦ నేర్పడునని
ఉన్నదొక్క నోరె ♦ సన్నయిద్దెటేఁగిన । మిన్నమాటలాడి ♦ మన్నగుదురె? ౧౭౪.

ఆ. దుష్టపథము తమకుఁ ♦ దృష్టిగానబ్బిన । శిష్టజనులమీఁటి ♦ దుష్టులండ్రు
కష్టకాలమొదవుఁ ♦ గట్టడివీడిన । నష్టపడఁగఁగండ్రు ♦ నాశనంబె ౧౭౫.

ఆ. యోగ్యులైనవారి ♦ యుక్తులువినఁగల్లు । భాగ్యమునకుఁదులయె ♦ పరమపదము?
భోగ్యవస్తుకాంక్ష ♦ బుధులధర్మముమీఱు । వృగ్యహానియరయ ♦ వృతియుపడయు

ఆ. పెక్కుమాఱ్లునన్ను ♦ మిక్కిలితాతను । దక్కుపఱచు నెక్క ♦ సక్కియములు
తిక్కననఁగదేవుఁ ♦ డెక్కడవినెనోకో । యిక్కడికినెతెచ్చె ♦ యెగ్గుతగదె? ౧౭౭.

ఆ. సర్వలక్షణముల ♦ సదుపాయములుగల । పూర్వధర్మములను ♦ బూనరోసి
గర్వులగుచునైజ ♦ ఘనతనుమితిమీఱు । దుర్విచారులకును ♦ దోసఁగుపోసఁగు ౧౭౮.

ఆ. పేర్మిఁగన్నవారు ♦ పెద్దలముదులఁగా । దుర్మదంబుగలిగి ♦ తొలఁగవిడువ
ధర్మహీనమైన ♦ తగవులువల్కిరి । కర్మఫలమదేలఁ ♦ గాకమానుఁ? ౧౭౯.

ఆ. వృద్ధులింటనిలిచి ♦ విశ్రాంతిఁగనఁజెప్ప । బద్ధకులయివారు ♦ పలికిరటని
యుద్ధపదవికెక్క ♦ నుద్ధతిఁదలపడు । బుద్ధిమాలినారు ♦ పొలియరెట్లు? ౧౮౦.

ఆ. చిన్నప్రాయమపుడె ♦ చెప్పినవినవలె । మిన్నలైనమీఁటి ♦ మెలఁగవలెను
ఎన్నకేరిననుచు ♦ నెన్నినదుష్టాత్ము । లెన్నిహానులెట్లు ♦ కన్నఁదగదె? ౧౮౧

ఆ. దృష్టిదూరముగను ♦ దెసలుఁబెద్దలకని । పుష్టిఁగన్నవారె ♦ బుధవరులని
స్పష్టముగనుబలుక ♦ సాహసించినవాండ్రు । దుష్టులగుటఁగనరె ♦ దొడ్డహాని? ౧౮౨.

ఆ. ఉన్నచోటనున్క ♦ యూరడిఁగనుమన్క । పన్నెగాకయల్ప్ర ♦ వాసములను
మిన్నఁదనమువచ్చు ♦ మీఱఁగఁదగునంచు । నెన్నికొన్నవార ♦ లెగ్గఁగనరె ౧౮౩.

ఆ. పొందనైనఁబేర్లు ♦ పొరుగులఁగలవారి । గొందలంబుపఱపఁ ♦ గూడెడినని
చెందవచ్చుసిరులు ♦ శ్రేష్ఠమాపనియను । మందబుద్ధులకును ♦ మరణమెగతి ౧౮౪.

ఆ. తేజమనఁగదూర ♦ దేశములంగల । భూజనులనెకొన్న ♦ భోజనముగ
నౌజగంబునందు ♦ నంచుఁదలంచెడి । వ్యాజములనెకనిరె ♦ వాయరెట్లు? ౧౮౫.

ఆ. దేవుఁడిచ్చుననఁగ ♦ సేవయాతఁడుసేత । యేవియెట్లుకన్న ♦ నెచ్చుతమది
గావచించినట్టి ♦ కాపురుషులువోరె । చేవయెంతయున్నఁ ♦ జెడిచెడుగతి? ౧౮౬.

ఆ. సంతతులనుబడయ ♦ సతులనుగట్టికో । నంతకూడుననుచు ♦ వింతలనిరి
యెంతకైనఁదాత ♦ యొచ్చునదలఁపరే । చింతపడఁగనేలఁ ♦ జెడరెవీరు? ౧౮౭.

30. కం. సారసగంధీసంతతత | సారాసరసిజరిపుముఖి ♦ సమరము నేర్తే
సారసగంధీసంతతి | సారాసరళిసదుడునఖి ♦ శ్రమఁదమినోర్తే.

31. సారసగంధీసంతతత | సారాసరసిజరిపుముఖి ♦ సమరము నేర్తే
ధారణకంధీతంత్రితత | ధారాతరుణసుఘనశిఖి ♦ దమమునుగూర్తే.

32. సారసగంధీసంతతత | సారాసరసిజరిపుముఖి ♦ సమరము నేర్తే
కారణసంధీక్షాంతివి | కారాఖరకరనిభసఖి ♦ క్రమణమునార్తే.

33. సారసగంధీసంతతి | సారాసరళిసదుడునఖి ♦ శ్రమఁదమినోర్తే
ధారణకంధీతంత్రితత | ధారాతరుణసుఘనశిఖి ♦ దమమునుగూర్తే.

34. సారసగంధీసంతతి | సారాసరళిసదుడునఖి ♦ శ్రమఁదమినోర్తే
కారణసంధీక్షాంతివి | కారాఖరకరనిభసఖి ♦ క్రమణమునార్తే.

35. సారసగంధీసంతతి | సారాసరళిసదుడునఖి ♦ శ్రమఁదమినోర్తే
సారసగంధీసంతతత | సారాసరసిజరిపుముఖి ♦ సమరము నేర్తే.

36. ధారణకంధీతంత్రితత | ధారాతరుణసుఘనశిఖి ♦ దమమునుగూర్తే
కారణసంధీక్షాంతివి | కారాఖరకరనిభసఖి ♦ క్రమణమునార్తే.

37. ధారణకంధీతంత్రితత | ధారాతరుణసుఘనశిఖి ♦ దమమునుగూర్తే
సారసగంధీసంతతత | సారాసరసిజరిపుముఖి ♦ సమరము నేర్తే.

38. ధారణకంధీతంత్రితత | ధారాతరుణసుఘనశిఖి ♦ దమమునుగూర్తే
సారసగంధీసంతతి | సారాసరళిసదుడునఖి ♦ శ్రమఁదమినోర్తే.

39. కారణసంధీక్షాంతివి | కారాఖరకరనిభసఖి ♦ క్రమణమునార్తే
సారసగంధీసంతతత | సారాసరసిజరిపుముఖి ♦ సమరము నేర్తే.

40. కారణసంధీక్షాంతివి | కారాఖరకరనిభసఖి ♦ క్రమణమునార్తే
సారసగంధీసంతతి | సారాసరళిసదుడునఖి ♦ శ్రమఁదమినోర్తే.

41. కారణసంధీక్షాంతివి ♦ కారాఖరకరనిభసఖి ♦ క్రమణమునార్తే
ధారణకంధీతంత్రితత | ధారాతరుణసుఘనశిఖి ♦ దమమునుగూర్తే.

42. రగడ. సారసగంధీ ♦ సరసిజరిపుముఖి | సారసగంధీ ♦ సరళిసదుడునఖి

43. ధారణకంధీ ♦ తరుణసుఘనశిఖి | కారణసంధీ ♦ ఖరకరనిభసఖి

44. సంతతసారా ♦ సరసిజరిపుముఖి | సంతతిసారా ♦ సరళిసదుడునఖి

45. తంత్రితధారా ♦ తరుణసుఘనశిఖి | క్షాంతివికారా ♦ ఖరకరనిభసఖి

46. సమరమునేర్తే ♦ సరసిజరిపుముఖి । శ్రమదమినోర్తే ♦ సరళసదుదునఖీ
47. దమమునుగూర్తే ♦ తరుణసుఘనశిఖ । క్రమణమునార్తే ♦ ఖరకరనిభసఖి

వ. అనియిట్లు శ్రీరామచంద్రుండు ప్రౌఢదాండవంబొనర్చు నప్పరాశక్తిని దన్నాట్యోత్సాహానుకూల విధంబుగఁ బెద్దకాలంబు ప్రార్థించియు నొక్కప్పటికి విన్నపముగ నడిగి కొన్నవాక్కును బట్టి యామహామాయ తదుత్క్రమణౌత్సుక్యంబు నాపియూరకయ నిలువంజూచి యారఘుకులావతంసుండు మరలనిట్లనిప్రార్థించె. ౧౪౨.

## సగర్భకందగీతీచంపకమాల.

శివినినునమ్మినెమ్మదిని ♦ జింతనచేయసమర్చనంబుఁదా
నవమతితోలసత్కుసుమ ♦ హారముఖంబులుగూర్చికొంచునీ
భువిఘనసన్నుతిన్మనసు ♦ పూర్తినిజేసినమానవుండుదే
వవినుతుఁడౌమహింగనెడి ♦ వర్ణితకీర్తినిగాఢయమ్మరో. ౧౪౩.

1కం. నినునమ్మినెమ్మదినిజిం । తనచేయుసమర్చనంబుఁ ♦ దానవమతితో
ఘనసన్నుతిన్మనసుపూ । ర్తినిజేసినమానవుండు ♦ దేవవినుతుఁడౌ.
2గీ. మదినిజింతనచేయుస ♦ మర్చనంబు । కుసుమహారముఖంబులు ♦ గూర్చికొంచు
మనసుపూర్తినిజేసిన ♦ మానవుండు । కనెడివర్ణితకీర్తిని ♦ గాఢయమ్మ.

## కందగీతగర్భితోత్పలమాల.

ఓశివరూపిణీమహిత ♦ యోభువనేశ్వరిమానివంద్యభూ
తేశసతీసదాఫణినృ ♦ దేవజగంబులపాలనంబొన
ర్తౌశివదాయినీసతత ♦ హాళివిధింగనుసాధుపాళిలే
దేశరణున్గదాముదము ♦ నెచ్చుమఱిచ్చుసముచ్ఛ్రయంబదే. ౧౪౪.

1. కం. శివరూపిణీమహితయో । భువనేశ్వరిమానివంద్య ♦ భూతేశసతీ
శివదాయినీసతతహా । ళివిధింగనుసాధుపాళి ♦ లేదేశరణుఁగా.

2. గీ. మహితయోభువనేశ్వరి ♦ మానివంద్య । ఫణినృదేవజగంబుల ♦ పాలనంబు
సతతహాళివిధింగను ♦ సాధుపాళి । ముదమునెచ్చుమఱిచ్చుస ♦ ముచ్ఛ్రయంబ.

## సగర్భమత్తేభకందసీసము.

సమదహస్తీంద్రగ ♦ సారసేక్షణవచో ♦ మాధుర్యగాంభీర్య ♦ మాతృదేవి
లసదుపాధ్యాయిని ♦ లాగునన్సతతము ♦ న్సంపూర్ణకారుణ్య ♦ సంవిధాత్రి
ప్రముదమొప్పారఁగ ♦ బాంధ్యతన్నయవిధు ♦ లూర్మిభత్వనాశంబు ♦ మున్నొసంగ

సుసుధియందందఁగ ♦ సూరిబోధలవిధిం ♦ జూపట్టఁగావింతు ♦ సూటిఁగాంచి
గిరితనయక్షీరసాగర ♦ వరసుతశుక | కరవిపంచివాఙ్మనిహారి ♦ గామినిసతి
హారతరుణికేశవప్రియ ♦ సరసిజభవ | తరణికంజసామ్యమునిను♦తాశుభయుత.౧౪౫.

1. మ. మదహస్తీంద్రగసారసేక్షణవచో ♦ మాధుర్యగాంభీర్యమా
సదుపాధ్యాయినిలాగునన్నుతతము ♦ న్సంపూర్ణకారుణ్యస
మ్మదమొప్పారఁగ బాధ్యతన్నయవిధు ♦ ల్మాధత్వనాశంబుము
న్సుధియందందఁగసూరిబోధలవిధిం ♦ జూపట్టఁగావింతుసూ.

2 కం. గిరితనయక్షీరసాగర | వరసుతశుకకరవిపంచి ♦ వాఙ్మనిహారిగా
హారతరుణికేశవప్రియ | సరసిజభవతరణికంజ ♦ సామ్యమునినుతా.

* మణిగణనికరగర్భితషోడశముఖీకందరాజేంద్రము *

ధరజవుతెఱుచవుతెఱటుఁను | దఱుగను దటిగోనఁదటికను ♦ తెఱుఁగనుదరుతున్
ధరజనుదరిఁగోనదరమును | దరమునుదఱుమనుదటియను ♦ దఱలునుద్వరగన్.౧౪౬

ఇందాయావరుసలబోయిన పోడవునముండుమణిగణనికరము.

ధరజవుతెఱుచవు ♦ తెఱటునుదఱుగన్ | దటిగోనఁదటికను ♦ తెఱుఁగనుదరుతున్
ధరజనుదరిఁగోన ♦ దరమునుదరమున్ | దఱుమనుదటియను ♦ దఱలునద్వరగన్.

(ఇంకనిట్లయిందలికందములనీవృత్తముంచుండును.)

1. తెఱుచవుతెఱటునుదఱుగను | దటిగోనఁదటికనుతెఱుఁగను ♦ దరుతునుధరజన్
దరిఁగోనదరమునుదరమును | దఱుమనుదటియనుదఱలును ♦ ద్వరగనుధరజా.

2. తెఱటునుదఱుగను దటిగోనఁ | దటికనుతెఱుఁగనుదరుతును ♦ ధరజదరిఁగోనన్
దరమునుదరమునుదఱుమను | దటియనుదఱలునుద్వరగను ♦ ధరజవుతెఱుచా.

3. తెఱుగనుదటిగోనఁదటికను | తెఱుఁగనుదరుతునుధరజను ♦ దరిఁగోనదరమున్
దరమునుదఱుమనుదటియను | దఱలునుద్వరగనుధరజవు ♦ తెఱుచవుతెఱటున్.

4. తటిగోనఁదటికనుతెఱుఁగను | దరుతునుధరజనుదరిఁగోన ♦ దరమును దరమున్
దఱుమనుదటియనుదఱలును | ద్వరగనుధరజవు తెఱుచవు ♦ తెఱటునుదఱుగన్.

5. తటికనుతెఱుఁగనుదరుతును | ధరజనుదరిఁగోనదరమును ♦ దరమునుదఱుమన్
దటియనుదఱలునుద్వరగను | ధరజవుతెఱుచవుతెఱటును ♦ దఱుగనుదటిగోన్.

6. తెఱుఁగనుదరుతును ధరజను | దరిఁగోన దరమునుదరమును ♦ దఱుమనుదటియన్.
దఱలును ద్వరగనుధరజవు | తెఱుచవుతెఱటునుదఱుగను ♦ దటిగోనఁదటికన్.

7. తరుతునుధరజనుదరిఁగొన | దరమునుదరమునుదఱుమును ◆ దఱియనుదఱలున్
ద్వరగనుధరజవుతఱుచవు | తఱటునుదఱుగనుదఱిఁగొనఁ ◆ దఱికనుతఱుఁగన్.

8. ధరజనుదరిఁగొనదరమును | దరమునుదఱుమనుదఱియను ◆ దఱలునుద్వరగన్
ధరజవుతఱుచవుతఱటును | దఱుగను దఱిఁగొనఁదఱికను ◆ తఱుఁగనుదరుతున్.

9. దరిఁగొనదరమునుదరమును | దఱుమనుదఱియనుదఱలును ◆ ద్వరగనుధరజా
తఱుచవుతఱటునుదఱుగను | దఱిఁగొనఁదఱికనుతఱుఁగను ◆ దరుతునుధరజన్.

10. తరమునుదరమునుదఱుమను | దఱియనుదఱలునుద్వరగను ◆ ధరజవుతఱుచా
తఱటునుదఱుగనుదఱిఁగొనఁ | దఱికనుతఱుఁగనుదరుతును ◆ ధరజదరిఁగొనన్.

11. దరమునుదఱుమనుదఱియను | దఱలునుద్వరగనుధరజవు ◆ తఱుచవుతఱటున్
దఱుగనుదఱిఁగొనఁదఱికను | తఱుఁగనుదరుతునుధరజవు ◆ దరిఁగొనఁదరమున్.

12. తఱుమనుదఱియనుతఱలును | ద్వరగనుధరజవుతఱుచవు ◆ తఱటునుదఱుగన్
దఱిగొనఁదఱికనుతఱుఁగను | దరుతునుధరజనుదరిఁగొన ◆ దరమునుదరమున్

13. దఱియనుదఱలునుద్వరగను | ధరజవుతఱుచవుతఱటును ◆ దఱుగనుదఱిగోఁ
దఱికనుతఱుఁగనుదరుతును | ధరజనుదరిఁగొనదరమును ◆ దరమునుదఱుమన్.

14. తఱలునుద్వరగనుధరజవు | తఱుచవుతఱటునుదఱుగను ◆ దఱిగొనఁదఱికన్
దఱుఁగనుదరుతునుధరజను | దరిఁగొనదరమును ◆ దఱుమనుదఱియన్.

15. త్వరగనుధరజవుతఱుచవు | తఱటునుదఱుగనుదఱిగొనఁ ◆ దఱికనుతఱుఁగన్.
దరుతునుధరజనుదరిఁగొన | దరమునుదరమునుదఱుమను ◆ దఱియనుదఱలున్

వ. అనియిట్లు శ్రీరామచంద్రుండు ప్రార్థింప నమ్మహాదేవి వామజానువుమోకరించి యధివసించి దరహాసితవదనాంచితయై యొప్పుచున్నంజూచి విభుండు మరలనిట్లు విస్తారామోదంబుగాఁ బ్రస్తుతింపందొడంగె.

## చతుర్థపాదగోపనకందము.

నినునుపమరిదిన్నుడిన్ | మనువాఙ్మణిచేరఁగామ ◆ మగతినిజోరఁజిం
తనమునఁదగులక్షింతున్ | నినుమదినమవాణిరమగ ◆ నిరతముఁదలఁతున్. ౧౪౭.

(ఇందు మొదటిమూడు చరణములందలి బేసియక్షరములను మాత్రమువరుసగ జదివిన నాలుగవపాదము తేలనగును.)

## గోపుర బంధ కందము.

శ్రీమాసీదర నెతలుము | హైమనగజతులు ఝుఁగీడు ♦ నగిముఱిఁజిలుముం
దామరసమహితయజ్ఞశ | రామోత్సాహంబునమును ♦ రంజిలనొప్పన్. ౧౪౯.

(ఇందలి యేడంతస్థులలోను నడిమివరుసను 'శ్రీసీతగరిమము' అనియేర్పడగా అడుగు బారుననుండు నాల్గవపాదము అందలి రామశబ్దమునకుగల యర్థశ్లేషచేతను ఉభయత్ర అనుకూలాన్వయమునిచ్చును).

## రథబంధ సీసము.

అత్యద్భుతమయితో ♦ యధిమధ్యని త్తతి ♦ రంజిల్లుమేట్లకు ♦ రక్కసులకుఁ
జాలినదొడ్డరా ♦ జనఁదగియౌ శ్రీకి ♦ సంతతికీమాడ్కి ♦ సైచునన్న
పుష్టిరాజిల్లంగఁ ♦ బుట్టియత్యానంద ♦ మమరుడుఁబెన్నేర్చిమ ♦ నజాఁడుకరుణఁ
బ్రాపకుఁడైవిషో ♦ రగముచందమునాక ♦ బగళమొందనిక్రొత్త ♦ భద్రములిడ
మహితమాకీవిదండిమ ♦ మతనువీఁడు | సీమలెల్లను నేలంగ ♦ జెట్టితాన
కానెమున్వింటివాదేవ ♦ మానిచెప్ప | విన్నదానను మతి(నిట్టె ♦ వెలయఁబుట్టె) ౧౫౦.

(ఇదినడిమికొలతను పదియేడుగదులుగలచౌకపురథము. కుడివైపుమూడవబారున! 'శ్రీరామచంద్ర' అనియు నెడమదెస మూడవ చాలున. 'పురుషోత్తము.' అనియు నుండినడుమను బొడమునైనది "అద్భుతోత్తరరామాయణగతసీతాదేవినుతి" ఇదంత యుంగాకవాళీగామిగులనైనది(నిట్టె వెలయబుట్టె), ఇదియుభయత్రసమానార్థకమైయొప్పునగు.)

## తృతీయపాద గోపన రథబంధ కందము.

వేగగనమణిమహితమా | బాగాసీమంతినీత్వ ♦ భావముతలఁగన్
వేగమసీతవుకాఁగదె | యాఁగాకానందభోగ ♦ మందే(దేవి.) ౧౫౧.

(ఇందుమూడవపాదముమధ్యస్థముకాఁగా (దేవి) అనునదిసమానార్థకమై శోభించును)

## పంజర బంధ కందము.

నిపుణతరాజిలుసీతా | కృపతావరమయ్యెఁదీరు ♦ కృతషోడశచం
ద్రపదేడ్యాకృతివగుమీ | ద్రుపదాత్తమునామనికిదు ♦ తుష్టితకున్. ౧౫౨.

(నిలువుతొమ్మిది అడ్డము అయిదుగదులు గలిగిపైనికొంకిగల పంజరములో వ్రాసి నంబయురెండవ బారున 'సీతాదేవత' నడుమను 'రామచంద్రుడు' క్రిందిరెండవచాలున 'పురుషోత్తమ' అనియేర్పడనగును.)

### చక్రబంధశార్దూలవిక్రీడితము.

సిత్యారాధ్యవుసీతవన్ననసదా ♦ నీవిస్ఫురద్రక్షణన్
దైత్యామర్షగతారిదండనముచేఁ ♦ తన్నుర్విస్వీకృత్యమా
నిత్యాచంచలదేశదేశనటుఁడు ♦ న్నీతిప్రభాతిప్రజా
స్తుత్యంబైనయశంబునాకుఁగదవే ♦ శోభిల్లఁగానీభువిన్

(ఇందుమూఁడవవలయమున 'రామచంద్రకృతి' యనియు నారవచుట్టున 'సీతాదేవిన్నుతి' యనియు పరిపాటిననుసరించి యేర్పడియుండనయ్యెడిని.)

### కించిద్విశేషయుక్తరథపదబంధకందము.

విపులపునరవఘహరణత । గిపరవనుత్తదనిరుద్ధ ♦ గిరణభరచర
ల్లపనమునుడయముపురుషో । చ్చపవమునిసుమారఁబర్వు ♦ జనుతిరుగుడునన్ ౧౫౪.

(ఇదియుంబైదానివలెనే ఆరుగీఱలు తొమ్మిదిచుట్లునుగల చక్రమైయుండఁగా నెనిమిదవబారున 'ధరసుతపర్వ' ఆరవపంక్తిని 'రణముపమును' ఏదవచాలున 'నరవరనుతి' రెండవవరుసను 'పురుషోత్తముఁడు' అనియునురానేర్పడును.)

### నాగపాశబంధ చంపకమాల.

సరసిజగంధినీరపమ ♦ సామజరక్షకసంహరాజని
గ్జరపతులైనయారయఁగ ♦ సాగదనన్బ్రిధితంబుసారగా
ధరరుహయాప్రకారమున ♦ దానవఘట్టనరాజమానతన్
జరగఁబులాకధారహతి ♦ శాంతినిఁజచ్చెప్రభీతుఁడైధరన్ ౧౫౫.

### ఫణిరాజబంధచంపకమాల.

వనజదళాయతేక్షణసు ♦ హాసినిసిద్ధసుహాసినీళవా
కవెదముసుమ్మనిన్నుఁదగు ♦ క్రమకళాశయుక్తరమ్యసు
స్వనిఁగళబిందునాదమని ♦ సానివెతద్ధ్వనిసంయమీశవై
సునిరతసిద్ధినిత్తుశుచి ♦ శుద్ధికనందుదిసువ్రతమ్మునన్. ౧౫౬.

### గోమూత్రికాబంధపంచచామరము.

భవానివిష్ణురాణివాణి ♦ భవ్యహృద్యదామినీ
పవిత్రితాఖిలాబ్జగోళి ♦ పాళినీబుధావనీ
ప్రవాసవిస్తరాఢ్యవాక్య ♦ భద్రవ్యాప్తిదాయినీ
ప్రవిష్టితాఖిలాయుఁగోర్వు ♦ పావనీవిధాయినీ. ౧౫౭.

## పుష్పమాలికాబంధకందము.

వనజనయనభూసుతసుర । సునయభయదయతనమాన ♦ సునటఁగడుగలా
గనుదగుదనఁదలఁచితిచిని । చినోఁ డలెడఁబడనతిభీతి ♦ చితిఁబడ వెడలెన్

## చంపకపుష్పమాలికాబంధము.

సురవరతారణన్ముఖము ♦ సోముఁడునిత్యనిదానియైసదా
సరసతసప్రసక్తిసహ ♦ సత్వసహాసతగల్గగచ్ఛగ
న్బరగరజోరసాంగముగ ♦ నంగఁగడన్నడజాడనేకదా
కలకరివన్నవన్నెవడఁ ♦ గన్బగకాఁగఁదమస్సుమచ్ఛమ+డో. ౧౫౯.

## * గోమూత్రికాబంధచతుర్ముఖికందరాజము. *

1. వరదాత్రిమాతవారణ । హరగాబలుపీరునిటుల ♦ నార్చితివలతే
ధరపుత్రిసీతహారక । హరగావిలుపీరునటుల ♦ నాగితివలతే. ౧౬౦.

2. విలుపీరునటులనాగితి । వలతేవరదాత్రిమాత ♦ వారణహరగా
బలుపీరునిటులనార్చితి । వలతేధరపుత్రి సీత ♦ హారకహరగాన్.

3. ధరపుత్రిసీతహారక । హరగావిలుపీరునటుల ♦ నాగితివలతే
వరదాత్రిమాతవారణ । హరగాబలుపీరునిటుల ♦ నార్చితి వలతే.

4. బలుపీరునిటులనార్చితి । వలతేధరపుత్రిసీత ♦ హారకహరగా
విలుపీరునటులనాగితి । వలతేవరదాత్రిమాత ♦ వారణహరగా

## మహాదేవిప్రసన్నయై సీతారూపమున రాముదరి జేరుట.

వ. అనియిట్లు బహుప్రకారంబుల సహస్రముఖరావణాసురాధిప సంహారంబొనర్చిత్రిజ గజ్జేగీయమానప్రభావంబునరంజిల్లుమహాదేవికాప్యాయనంబుగలుగుపాటిగనపూర్వస్త వంబొనర్చి యారఘువంశదీపకుండంత నిమీలితలోచనుండయి సీతారూపంబుమనంబు ననెక్కొలిపిధ్యానింపఁదొడంగిన నంతనయమ్మాయాశక్తియంతర్ధానంబునొంది మా యామానుషవిగ్రహుండయిన శ్రీరామచంద్రునిభక్తి వినయసంభ్రమంబులునాపెనె వెన్నంటె యూరకయకనుదెరచునప్పటికి. ౧౬౧.

ఉ. జానకిప్రోలనిల్వఁగని ♦ సారసమిత్రకులావతంసుఁడా
మానినిఁక్షేమఁగాంచుడును ♦ మాన్యతదంగనభర్తృపాదయు
ల్మానికనేత్రపద్మములఁ ♦ బూజలొనర్చుచుమ్రొక్కిదీవన
ల్గానటొసంగిరెత్తెబతి ♦ ధాతృముఖుల్వెలుగొండిమాడఁగన్. ౧౬౨

ఆ. ఆలుమగఁడుఁగూడి ♦ యానందములఁబొంగి । వచ్చెఁబుష్పకంబు ♦ వారికడకు
దానవారలెక్క ♦ ధాతయంజలిచేసి । యనియెనిట్లుతెలిపి ♦ తనదువాక్కు. ౧౬౩.

## సీతారాములబ్రహ్మస్తుతించుట.

కం. అయ్యావేయిమొగంబుల । యయ్యాసురాగ్రణిజనింప ♦ నేగితినాఁడే
నయ్యెడకునదియెమొదలుగఁ । గయ్యంబునఁజచ్చుదనుకఁ ♦ గాచుచునుంటిన్. ౧౬౪

ఆ. నాకుఁదోఁచునవ్వు ♦ లీకొలఁదిగఁగూర్చి । యానవెట్టినాఁడ ♦ నవ్విధమున
నైనఁగాచియుంటిఁ ♦ బైనేమగునోయని । నేఁటికుడిగెనంత ♦ మేఁటిచింత. ౧౬౫.

మత్త. తల్లిదండ్రులుమీరలీభువి ♦ ధార్మికావళిఁబ్రోవఁగా
నెల్లక్రూరులసంహరింపఁగ ♦ నిట్లుపుట్టినిజాగమం
బల్లదిర్చితిరేలుఁడీభువి ♦ నజ్ఞతంబెడఁబాపుచుం
గొల్లగాబహుధర్మనిష్ఠలు ♦ గుప్పచొప్పెడుచొప్పునన్. ౧౬౬.

ఉ. మాకుసుఖంబుగల్గెనిల ♦ మాయఁగనైరిసమస్తరాక్షసా
నీకముమీఁకమున్నృపుల ♦ నెవ్వగఁబుచ్చినపాపకర్మము
లోస్సకి, మహాత్ములారభువి ♦ సుస్థిరులౌదురుకీర్తిశేషతన్.
లోకములెల్లమిమ్ముమది ♦ లోనెఱనమ్మిఁగృతార్థతన్గనున్. ౧౬౭.

తే. అవతరింతువుపెక్కుమా ♦ ర్గననియందు । నైననీయవతారమ ♦ నూనమహిమ
గలదివెలఁదియునలరెడిఁ ♦ జెలఁగవెలసి।తారకబ్రహ్మమననౌదు♦ధారుణినిఁక. ౧౬౮.

కం. మాతల్లిలోకరక్షక । సీతానామముననీదు ♦ చిత్తప్రియయై
యీతెలుఁగునఁదోడ్పడుఁగద । భూతలమునదివ్యవిద్య ♦ బోధింపుండీ. ౧౬౯.

తే. హరునిదేవునిఁగానెంతు ♦ వయ్యనీవు । నిన్నుదేవునిఁగానెంచు ♦ మిన్నయతఁడు
గురునకౌనట్టిగురుఁడవు ♦ గుణనిధాన। పరుఁడవౌటనుసర్వంబుఁ ♦ బరగలోన. ౧౭౦.

చం. అనియజుఁడింతసేపుహృద ♦ యంబుననెచ్చగుహర్షమొప్పఁగా
మునుకొనిస్తోత్రముల్సలుప ♦ మోదమునొందుచుమాయనుత్యఁడా
వనజజుపాదకంజముల ♦ వ్రాల్చిశిరంబునమస్కరింపదీ
వనలతఁడిచ్చియేగెసుర ♦ వారముతోమరలెన్నపాలుఁడున్. ౧౭౧.

## హనుమంతుడయోధ్యనుండి సీతారాముల వెదక వెడలుట.

సీ. అపుడయోధ్యనుఁబ్రాలు ♦ నందటిలోవాయు ♦ నందనుఁడొక్కఁడ ♦ ముందు లేచి
యీడనాడనుబద్ధ ♦ ప్రోడలనెల్లర ♦ జాడలఁగనమేఁటి ♦ జోడెలేమి
గావెసలేచుసు ♦ గ్రీవవిభీషణ ♦ జాంబవదంగద ♦ జనపసోద
రాళికెటింగింప ♦ హాళిరోసెయుఁగాన ♦ కంపటొక్కఁటఁగూడి ♦ యంజనసుతు [యె
నయ్యామనయయ్యతనతోడ ♦ నయ్యబలయు | నెయ్యమునఁగూడఁజయ్యన ♦ నియ్యకొని
నయ్యెయేజాడనేమికా ♦ నయ్యెనొక్కఁ | యెయ్యెదెటనున్న నీకయా ♦ నొయ్యనఁగన

కం. నినుఁబోలువారుపుట్టిన | ఘనులందును లేరుముందుఁ ♦ గలుగరునీవే
నినుబోలుఘనుఁడవన్నా | మనయన్ననుజూపుమన్న ♦ మనవేమన్నా. ౧౭౩.

ఉ. ఇందులకేగమేమిచట ♦ నేపడియుండెదమీవుపోయియా
దండిప్రభుండుఁదత్సతియు ♦ దైన్యము హైన్యము శూన్యముల్గఁదా
రుండినచొప్పునారసిమ ♦ హోత్సుకతన్మనుపంగదేమము
న్నొండువిధంబెయైనఁగన ♦ కుందుమెకల్గొకరిన్నిటింతటన్. ౧౭౪.

వ. అనవిని హనుమంతుండు విషాదోద్రేకభీషణరోషంబు లెడఁబెడఁబెనంగొనఁబ్రోత్సాహకులమూఁటపాఁటికంటె సోత్సాహంపు ధాటిపోఁట వాటంబుగమీఁట నాపోఁటుమేఁటుల యోటమిఁదూఁటు మాటగనిట్లనియె. ౧౭౫.

సీ. పుష్కరంబునకుము ♦ న్నుబ్బపుకారూఢతేఁ ♦ బోవనెఱుంగను ♦ ద్రోవయిప్పు
డైనమున్నెగెద ♦ నర్కమండలమున ♦ కాడనారయనెల్ల ♦ జాడదెలియు
నప్రయత్నంబున ♦ నటనుండరావణు ♦ నేటువడ్డదిమది ♦ గాటుపఱచు
వాఁడింకజీవించి ♦ యేడనుండినఁబట్టి ♦ వాలంబునొగిఁజుట్టి ♦ వసరఁగట్టి
క్రిందవ్రేలాడఁగాఁగొని ♦ కిన్కమాన్పి | యయ్యనమ్మనుహస్తద్వ ♦ యాంబుజముల
నధివసింపించిపుష్పకం ♦ బమరఁదలను | వత్తుఁజూడుండినిర్భయ ♦ చిత్తులరయ. ౧౭౬.

కం. అనుచు నెపెటిగెనుశతయో | జనపరిమాణోన్నతముగఁ ♦ జయ్యననెగసెం
గనువార్లెరునచ్చెరు | వునుగొననిమిషముఁనజూడ్కి ♦ పొలయికఁగడచెన్. ౧౭౭.

ఆ. అట్లుపోయిపోయి ♦ యంతరిక్షమ్మున | నండికనఁగరాఘు ♦ వుండుసతియుఁ
బుష్పకంబునెక్కి ♦ పురిచాయమరలుట | కనఁగనైనసాగి ♦ కలిసికొనియె. ౧౭౮.

## సీతారాములు మరలిరాగ హనుమకలిసి యయోధ్య జేరుట.

కం. ఆగ్నాతంబాయాత్రం । బాగోత్రాగసమధీరు ♦ హార్దముఁగనియా
సాగరగంభీరుఁడుపతి । నాగేశ్వరవేణియెడల ♦ ననువుఘనముగన్. ౧౨౦.

ఆ. ప్రేమఁగాంచునంత ♦ సామాన్యరూపుఁడై । పుష్పకంబుఁజేరి ♦ పూర్ణభక్తి
నుభయులకున్మ్రొక్కి ♦ విభుఁడాదరించుచు । నిమిరె మేనుహస్త ♦ కమలముననుం.

వ. అంతంబరస్పర క్షేమసమాచారవివరణంబున శ్రీరాముండా ద్విసహస్రకరరావణున స్త్రప్రయోగపాటనంబునకును దానవమ్మోటి వీరులెల్లం దమవీటంబడ సైనపాటునకు నచ్చెరువందుచు నింకన నేకులుస్మృతిదెలియమి లేనకయయుండ నైనది విన్కికిఁ జింతింపుచు నుంటయు శ్రీమదాంజనేయుండు రామునంతమహానుభావు నామెయిఁగూల్పఁ గలిగిన యామేఁటిరక్కసునామాడ్కి హతుంగజేసి పుష్కరంబెల్ల నీటఁగలిపినపాటి ఘాటి సీతావఘాటికాంచెనన్న మాటకు నత్యాశ్చర్యమగ్నుండైయంతటి హెంతకత్తె యని సుంత యేనెఱుంగరానంతగ నొకయింతిగ వింతగాఁ గాంతు చెంతనున్నఁగని యెంతయుఁ బ్రీతిన్మరల మ్రొక్కుచు నక్కోమలియుం జక్కని చిక్కనిమక్కువ నెక్కొలిపి యెక్కువ యక్కటికంబున దృక్కులసారింపుచు వాక్కులనూరింపుచు నుక్కులంబూరింపుచు నుండనంతలో నయోధ్యాపురప్రాంతంబు దరియనరుగుటయు నాడ నంతటఁజేరి బంతులుతీరి చింతలుమీఱి నంతలుపాఱి యున్న యన్నరవరులు మన్నదొరలున్న గచరవరులు నెన్నికగొన్న మునివరులు మున్నునువచ్చినవారలిండ్లకు రామిఁబొచ్చె మెఱుంగనైననొచ్చికొని యెచ్చటనున్న వచ్చటవిడిచి యచ్చటికే వచ్చి చేరి ముచ్చిచ్చులదరి నున్నమచ్చున వెచ్చనూర్చుచు నెచ్చువగలనున్న యచ్చపలాత్ములు వెనుకను దగి యెల్లవారు నెల్లెడలనూర్ధ్వముఖులై శ్రీసీతారామాంజనేయనిరీక్షణ తత్పరులైయుంటంజేసి తత్సమయంబునఁ బుష్పకప్రవేశంబందఱకును బ్రాణసంధానకారణంబయ్యె నంతనట నెడిగ్గి యెడనెడ మ్రొక్కువారల మక్కువదీవింపుచుఁ జక్కనరిగి శ్రీరామచంద్రుండు తల్లులకును మునివల్లభులకును సీతామహాదేవి యత్తలకును మహర్షిసత్తములకును నమస్కరించిరంత మంతనంబులఁజింతలువాసి యెక్కటం దీఁడవారియెడ నెనిలిచి యింకను విస్మృతినొందియుండినచులుకనరులఁబిలిచి లేపి బలుపుగెలుపులు దెలిపి యలపుమాపిచెలఁగి యాపైనాపురిఁ బ్రవేశించి నిజాస్థాన మండపంబున వెలసి యలపుష్కరద్వీపంబున నడచిన దెల్లం దెలిపిన నటఁగలవారెల్ల నల్లలనామణీ విలాసవిశేషంబునకు నంతటి బలియుఁబొలుపఁగలిగినకోలఁదికి వెఱగందుచు నుండనందు ముందున్న మునిసందోహంబ మందానందంబు బిందువులఁ జిందింపుచు డెందంబుల వంచనంబులువందలిడుచున్నిల్లనియె. ౧౨౧.

## మునివరులుసీతామహాదేవినిస్తుతించుట.

ఉ. అమ్మపరాంబవీవనుచు ♦ నాత్మనెఱుంగుదుమైనరాముమై
నిమ్మహిఁబుట్టిమాయఁబడ ♦ నేర్పడనైతనికొంటిమిట్టిచం
దమ్మనికానమైతిమిము ♦ దమ్మదినెమ్మదిఁగ్రమ్మెనిఘ్నమా
యమ్మనముంపకేమువిన ♦ యమ్మనయమ్మనుజూపనిమ్మటన్. ౧౮౨.

## ద్వ్యక్షరకందము.

నెమ్మనముననీనామము | నమ్మిమనన్నెమ్మినైన ♦ నమనమునూన
న్నమ్మామానమునిమ్న | మ్మెమ్మానమునామనమ్మ ♦ నెన్నుమననమున్. ౧౮౩.

## ఏకాక్షరకందము.

నిన్నునృనన్ననినిన్నను | నెన్నిననౌనానృనన్ను ♦ నేనన్ననునే
నన్నౌనిన్ననినౌనా | నున్ననునానాననన్ను ♦ నూనుననూనా. ౧౮౪.

ఉ. తల్లిజగమ్ముఁబ్రోచుటకె ♦ ధారుణిజాతవైతివల్లనా
డల్లననామహేశ్వరుఁడ ♦ యంతయుఁదాయతిరూపధారియై
వెల్లడిచేసెనీకునెఱి ♦ వేర్పుఁగఁబుట్టితినన్ననమ్మికం
జెల్లఁగఁజేసితెల్లపనిఁ ♦ జేయఁగఁజేసితిచేసితెచ్చుగాన్. ౧౮౫.

## మంగళమహాశ్రీవృత్తము.

మంగళమొసంగుచును ♦ మాన్యవయిలోకముల ♦ మన్నుజగదంబపరిపూతా
మంగళమొసంగఁగను ♦ మానవపుపాలనను ♦ మన్నుజగమెల్లనిఁకసీతా
సంగరపటిష్ఠులయి ♦ సజ్జనవరిష్ఠులయి ♦ సంతతగరిష్ఠులగుపుత్రుల్
రంగుగజనించెదరు ♦ రంజిలెడినీకుమహి ♦ రమ్యదృఢభవ్యతరగాత్రుల్. ౧౮౬

## గ్రంథఫలితార్థమును మునివరులు ముద్దుగ దెలియ జెప్పుట.

కం. శ్రీరామచంద్రవింటే | నీరామయునీవుఁగూడి ♦ నెఱవేర్చినయీ
ఘోరారిమర్దనంబున | సారముజగమునకుఁజిక్కె ♦ సంతోషదమై. ౧౮౭.

ఆ. బుద్ధికుదిరికొప్పఁ ♦ బుట్టినజీవుని | రీతినీవురిపుఁడు ♦ వేతలలను
హావమొందనౌన ♦ హంకృతివిధమగు | జానకీపరాంబ ♦ జ్ఞానమనఘ. ౧౮౮.

సీ. బుద్ధినినిలుకడ ♦ పొసఁగినజీవుండు ♦ తానహంకృతిఁబుట్టె ♦ నైనవెల్ల
నింద్రియస్వాధీన ♦ మేర్పడ్డబలిమిని ♦ బాపునహంకృతి ♦ మాపలేఁడు
జ్ఞానమెక్కుడయ ♦ నూనదార్ఢ్యముగల్గి ♦ మాపునహంకృతి ♦ మనుపుజీవు
నిశ్చింతగానట్టి ♦ నీకింద్రియంబుల ♦ గతినొప్పుబలములు ♦ గాదెదేశ
వారిఁగొనిచనవైరిసం ♦ హారమునకు | బ్రజలఁద్రుంచితహంకృతి ♦ ప్రబలనింద్రి
యంబులడుగంటెబుద్ధిల ♦ యంబునొందె | జ్ఞానమహామార్గ్గితమెల్ల ♦ జానుగఁదగె. ౧౫౯.

ఉ. అయ్యమహాత్మయీచరిత ♦ మాదరభావముతోఁ దెలుంగునే
రెయ్యెడనైనమీభజన ♦ నేర్పడఁజేసినఁబన్నదున్నదా
చయ్యనబుద్ధినెమ్మదియుఁ ♦ జక్కని జ్ఞానముదానిఁబట్టియే
యయ్యహమీనువానినిఁక ♦ హంకృతిఁగూడహరించివీఁడనో. ౧౬౦

ఆ. అద్భుతంబుతోలియ ♦ హంకృతిరూపంబ | యద్భుతములుదాన ♦ నగునవెల్ల
నద్భుతంబయట్టి ♦ దార్పఁగనూనుట ♦ యద్భుతంబెజ్ఞాన ♦ మాదికోలు. ౧౬౧.

కం. జ్ఞానముసాధనముగఁగొని | తానహమునుంజంపుటొప్పుఁ ♦ దగనదియంచు
న్నీనీమము నెఱిఁగించితి | మానవులీయర్థమెఱిఁగి ♦ మనెదరటంచున్. ౧౬౨.

పంచ. పరాత్పరుండవీవురామ ♦ ప్రక్కభామవీవుగదా
పరాంబమీరుసర్వలోక ♦ పాలకాళికేలికల్
నరుల్గఁగోరియిట్టుపుట్టి ♦ నారలీధరాస్థలిం
దిరంబుగాఁజెలంగుచుంద్రు ♦ దీనులన్భరింపుచున్. ౧౬౩.

## సీతారాములమాటపాటులు.

చం. అనివినుతించుమౌనులకు ♦ నంజలిచేసిసతీపతుల్మహా
వినయముతోడనిట్లనిరి ♦ వేడుకమీమదికైనఁజాలుమా
మనుగడపావనంబగును ♦ మాన్యతమాకగుబ్రహ్మవేత్తలీ
రనఁగనమోఘవాఙ్మహిత ♦ హర్షమనస్కులుకారెసర్వదా. ౧౬౪.

కం. కావింపరెమహిమలుసం | భావింపఁగనేలమమ్ముఁ ♦ బరిపరివిధులం
దీవింపుఁడదియెకోరెద | మేవంపునులేకమనికి ♦ యేర్పడుననుచున్. ౧౬౫.

సీ. అనిపల్కిసంతోష ♦ మునమీఱుటఁటీగాన ♦ బహుదానములుసేసెఁ ♦ బార్థివుండు
భూరిదక్షిణలను ♦ భోజనంబులమహీ ♦ గీర్వాణులకుఁదృప్తి ♦ పర్వఁజేసె

పారితోషికములు ♦ బహువిధంబులొసంగె ♦ వానరాసురనర ♦ వరులకరసి
యెల్లెడఁబురమెల్ల ♦ సల్లక్షణంబుల ♦ నుల్లాసములనురం ♦ జిల్లనయ్యె
పరగుసీతామహాదేవి ♦ ప్రథితిదిశల । కెక్కనైననుశ్రీరాముఁ ♦ డక్కలఁదిని
మాయమఱచియుమానిని♦మాత్రముగనె।తలఁచుఁబోలిచినఁబెలుచను♦బిలుచువలచు.

కం. పనిచెంబుష్పకమట్టులె । యనిచెందగువారినిండ్ల ♦ కరిగిమరలఁగా
ననిచెనుస్థిరముగనటనే । వనచరదనుజాధిపతులు ♦ వాంఛించుటనే. ౧౯౭.

శ్రీరామరక్ష.

కం. తల్లులకుల్లాసమునుని । వల్లభులకునొల్లబాటు ♦ నల్లడిశుభము
ల్వల్లాయనంబువాంఛని । యెల్లరకునుగలుగఁజేయు ♦ చేలెఘరిత్రిన్. ౧౯౮.

కం. శ్రీరామ రామయనుచుం । జేరత్తినఁజాలునెట్టి ♦ పేదలకైనం
గూరిచెడిసకలసంపద । లారామాదరణధరణి ♦ యభిరామముగాన్. ౧౯౯.

తే. ఆమనోరూఢిపటిమనే ♦ యప్పుడిప్పు । డెప్పుడైననుజొప్పడు ♦ గొప్పపదవి
రామనామముఁబఠియించు♦నీమముఁగను।మనుజముని సురనరులకు♦మానలార! ౨౦౦.

కం. మదినేదికోరియీకథ । వదలకపఠియింపనైన ♦ వాంఛనువిన్న
న్మదమొదవఁగోర్కెతీరుట । యదియుండఁగధర్మవేత్త ♦ లగుదురుధరణిన్. ౨౦౧.

ఆ. కామితంబుఁదీర్పఁ ♦ గలదేయిపందురేఁ । గామితంబెయగును ♦ గామితంబు
దీనియర్థమెల్లఁ♦దేటగాఁదెలిసిన । దీనియర్థమదియె ♦ తేఁటపడెడి. ౨౦౨.

కం. మారీదుర్భిక్షాదుల । భూరిభయంబొదవినపుడు ♦ పూనికనిదియే
వారలుసదివినజగదుప । కారకులయ్యెదరుభయముఁ ♦ గడఁబట్టింపన్. ౨౦౩.

ఆ. రామచంద్రుఁడేద ♦ యామహోదధికాంత ♦ యంతకంటెవేయి ♦ యంతలంటె
వారివిజయమిదియె ♦ కూరిమిఁబఠియించు । వారినరయరెట్లు ♦ వలసినట్లు? ౨౦౪.

కం. మూర్తులుమువ్వురునుశక్తియుఁ । గీర్తింపంబడిరిదీనఁ ♦ గేవలభక్తిం
బూర్తిగనార్తిగఁజదివినఁ । గూర్తురుసర్వార్థసిద్ధి ♦ కొనకైక్యంబున్. ౨౦౫.

మ. అనివాల్మీకమహామునీంద్రుఁడనఁగా ♦ నాశ్చర్యసంతోషము
ల్పెనగొన్నంబెనుభక్తియుట్టిపడుడుం ♦ బ్రీతాత్ములైతొల్లియా
మునిసింహుస్గురుగౌరవించితమితో ♦ మ్రొక్కంగశ్రీరామమం
త్రనిధానంబుజపించిమేల్మిఁగనఁగాఁ ♦ దన్మానులైరోశివా! ౨౦౬.

కవికృతిపతితోఁ జేసికొనుమనవి.

సీ. నీకృపఁబడసితి ♦ శ్రీకరంబైనట్టి ♦ యీకవిత్వముఁగాన ♦ నీకెవిరప
నీకథహాలాస్యా ♦ మేకోనవింశతి ♦ శతసంఖ్యపైనాఱు ♦ జతగఁబరగ
నాపరాభవమున ♦ నాషాఢమునఁబూని ♦ శ్రావణాంతమునకె ♦ చాలఁజెప్పి
ప్రార్థనాదికమునె ♦ భాద్రపదాదిని ♦ జెప్పితిఁగలపను ♦ ల్సేసికొనుచు
దాఱుమాఱైనఁదప్పులు ♦ మీఱియున్న | దీరుపుముదీని ముద్దుగా ♦ సూరులెన్న
వేమిచదువవెగొప్పనీ ♦ కెట్టులనకు | నీదుమంత్రమెచదివితిఁ ♦ కేదిచిలుకు? ౨౦౮.

కం. కలఁగానఁబడవుపాసీ | కలమెయధిష్ఠింతొహృదయ ♦ కమలమెచోత్తో!
తలఁచినయంతకుమిన్నగ | నలరించితికబ్బమీవె ♦ యయ్యాకావే? ౨౦౯.

మాలిని. గిరిజకమలమిత్రా ♦ గీష్పతిస్తోత్రపాత్రా | హరపరమపవిత్రా ♦ అర్క సోమాగ్ని నేత్రా
శరణునిగమధామా ♦ చంద్రమౌళీశసోమా | తరునికటవిరామా ♦ దక్షిణామూర్తినామా

పుష్పమాలికాగోమూత్రికాద్యనేకబంధవిరాజమాన

కందరాజరాజము.

మురహరశరపురహరదార | ధరధరధరస్మరహరహర ♦ ధరగిరఖరభా
చరిరక్షరహరసురవర | దరకరగరగిరధరదర ♦ ధరనరవరదా. ౨౧౦.

బహువిధమృదుమధురగానఫణితిపఠనానుకూల, చిత్రపద ద్విపద
నవవిధరగడ బహుసీస తేటగీత్యాటవెలది కంద
చంపకమాలాద్యనేకసహస్రపద్య
గర్భితాద్భుత.

సీసచక్రవర్తిని.

కరిహర ♦ గరహారి ♦ గరుడగమిత్ర ♦ నీ ♦ కరుణను ♦ వేడెద ♦ వెరపుఁ ♦ దీర్పు.
హరిశర ♦ హరిహారి ♦ హరివరనేత్ర ♦ నీ ♦ చరితను ♦ బాడెదఁ ♦ బరగఁ ♦ దీర్పు.
దరహర ♦ ధరధారి ♦ తరళసుగాత్ర ♦ నీ ♦ మరుగునఁ ♦ గూడెదఁ ♦ గొఱత ♦ నార్పు.
హరిహర ♦ హరిధారి ♦ హరినుతిపాత్ర ♦ నీ ♦ గరిమను ♦ వాడెద ♦ వరముఁ ♦ జేర్పు.
ధీరసోదారధీ ♦ ధిత ♦ దివ్యమూర్తి | వీరమానీంద్రసే ♦ విత ♦ వేదవర్తి.
తారలూప్పారుసనం ♦ తను ♦ దండికీర్తి | నీరహిన్గ్రింథమీ ♦ నిల ♦ నిష్టపూర్తి. ౨౧౧.

## ఇందలి సమచిత్రపదములు.

1 కరిహరగరహా ♦ హరిశరహరిహా | దరహరధరధా ♦ హరిహరహరిధా

2. గరుడగమిత్రా ♦ హరివరనేత్రా | తరళసుగాత్రా ♦ హరినుతిపాత్రా

3. కరుణనువేడెదఁ ♦ జరితనుబాడెద | మరుగునఁగూడెద ♦ గరిమనువాడెద

4. వేడెదఁగరుణన్ ♦ బాడెదఁజరితన్ | గూడెదమరుగున్ ♦ వాడెదగరిమన్

5. వెలిపుందీర్పుము ♦ పరగందీర్పుము | గొలితన్నార్పుము ♦ వరముంజేర్పుము

6. తీర్పుమువెలిపున్ ♦ దీర్పుముపరగ | న్నార్పుముగొలితన్ ♦ జేర్పుమువరమున్

7. కరిహరగరహా ♦ గరుడగమిత్రా ♦ హరిశరహరిహా ♦ హరివరనేత్రా
దరహరధరధా ♦ తరళసుగాత్రా ♦ హరిహరహరిధా ♦ హరినుతిపాత్రా

8. గరుడగమిత్రా ♦ కరిహరగరహా ♦ హరివరనేత్రా ♦ హరిశరహరిహా
తరళసుగాత్రా ♦ దరహరధరధా ♦ హరినుతిపాత్రా ♦ హరిహరహరిధా

9. కరిహరగరహా ♦ కరుణనువేడెద ♦ హరిశరహరిహా ♦ చరితనుబాడెద
దరహరధరధా ♦ మరుగునఁగూడెద ♦ హరిహరహరిధా ♦ గరిమనువాడెద

10. కరుణనువేడెదఁ ♦ గరిహరగరహా ♦ చరితనుబాడెద ♦ హరిశరహరిహా
మరుగునఁగూడెద ♦ దరహరధరధా ♦ గరిమనువాడెద ♦ హరిహరహరిధా

11. కరిహరగరహా ♦ వెలిపుఁదీర్పుమీ ♦ హరిశరహరిహా ♦ పరగఁదీర్పుమీ
దరహరధరధా ♦ కొలితనార్పుమీ ♦ హరిహరహరిధా ♦ వరముఁజేర్పుమీ

12. వెలిపుఁదీర్పుమీ ♦ కరిహరగరహా ♦ పరగఁదీర్పుమీ ♦ హరిశరహరిహా
కొలితనార్పుమీ ♦ దరహరధరధా ♦ వరముజేర్పుమీ ♦ హరిహరహరిధా

13. గరుడగమిత్రా ♦ కరుణనువేడెద ♦ హరివరనేత్రా ♦ చరితనుబాడెద
తరళసుగాత్రా ♦ మరుగునఁగూడెద ♦ హరినుతిపాత్రా ♦ గరిమనువాడెద

14. కరుణనువేడెదఁ ♦ గరుడగమిత్రా ♦ చరితనుబాడెద ♦ హరివరనేత్రా
మరుగునఁగూడెదఁ ♦ తరళసుగాత్రా ♦ గరిమనువాడెద ♦ హరినుతిపాత్రా

15. గరుడగమిత్రా ♦ వెలిపుఁదీర్పుమీ ♦ హరివరనేత్రా ♦ పరగఁదీర్పుమీ
తరళసుగాత్రా ♦ కొలితనార్పుమీ ♦ హరినుతిపాత్రా ♦ వరముఁజేర్పుమీ.

16. వెలిపుదీర్పుమీ ♦ గరుడగమిత్రా ♦ పరగఁదీర్పుమీ ♦ హరివరనేత్రా
కొలితనార్పుమీ ♦ తరళసుగాత్రా ♦ వరముఁజేర్పుమీ ♦ హరినుతిపాత్రా

17. కరుణనువేఁడెద ♦ వెలుపుఁదీర్పుమీ ♦ చరితనుబాడెదఁ ♦ బరగఁదీర్పుమీ
మరుగునఁగూడెదఁ ♦ గొఱతనార్పుమీ ♦ గరిమనువాడెద ♦ వరముఁజేర్పుమీ.

18. వెలుపుఁదీర్పుమీ ♦ కరుణనువేడెద ♦ బరగఁదీర్పుమీ ♦ చరితనుబాడెద
గొరతనార్పుమీ ♦ మరుగునఁగూడెద ♦ వరముజేర్పుమీ ♦ గరిమనువాడెద.

19. గరహాకరిహర ♦ గరుడగమిత్రా ♦ హరిహాహరిశర ♦ హరివరనేత్రా
ధరధాదరహర ♦ తరళసుగాత్రా ♦ హరిధాహరిహర ♦ హరినుతిపాత్రా.

20. గరహాకరిహర ♦ కరుణనువేడెద ♦ హరిహాహరిశర ♦ చరితనుబాడెద
ధరధాదరహర ♦ మరుగునఁగూడెద ♦ హరిధాహరిహర ♦ గరిమనువాడెద.

21. గరహాకరిహర ♦ వెలుపుఁదీర్పుమీ ♦ హరిహాహరిశర ♦ పరగఁదీర్పుమీ
ధరధాదరహర ♦ కొఱతనార్పుమీ ♦ హరిధాహరిహర ♦ వరముఁజేర్పుమీ

22. వేడెదఁగరుణను ♦ వెలుపుందీర్పన్ ♦ బాడెదఁజరితను ♦ బరగందీర్పన్
గూడెదమరుగనఁ ♦ గొఱతన్నార్పన్ ♦ వాడెదగరిమను ♦ వరముంజేర్పన్

23. వెరపుందీర్ప ♦ న్వేడెదఁగరుణన్ ♦ బరగందీర్ప ♦ న్బాడెదఁజరితన్
గొఱతన్నార్ప ♦ న్గూడెద మరుగున్ ♦ వరముంజేర్ప ♦ న్వాడెదగరిమన్

24. కరిహరగరహా ♦ గరుడగమిత్రా ♦ కరుణవేనుడెద ♦ వెలుపునదీర్పన్
హరిశరహరిహా ♦ హరివరనేత్రా ♦ చరితనుబాడెదఁ ♦ బరగనదీర్పన్
దరహరధరధా ♦ తరళసుగాత్రా ♦ మఱుగునఁగూడెదఁ ♦ గొఱతనునార్పన్
హరిహరహరిధా ♦ హరినుతిపాత్రా ♦ గరిమనువాడెద ♦ వరమునుజేర్పన్

25. కరిహరగరహా ♦ కరుణనువేడెద ♦ గరుడగమిత్రా ♦ వెలుపునదీర్పన్
హరిశరహరిహా ♦ చరితనుబాడెద ♦ హరివరనేత్రా ♦ పరగనుదీర్పన్
దరహరధరధా ♦ మరుగునఁగూడెదఁ ♦ దరళసుగాత్రా ♦ కొఱతనునార్పన్
హరిహరహరిధా ♦ గరిమనువాడెద ♦ హరినుతిపాత్రా ♦ వరమునుజేర్పన్.

వరా. ఇట్లు ఇందొప్పు ప్రతిచిత్రపదముయొక్క ప్రథమచరణముమాత్రము ఈ క్రింద కనబరపబడును. దానింబట్టి తక్కిన పద్యమెల్ల నామార్పు ననుసరించి చదివి కొననగును.

26. కరిహరగరహా ♦ కరుణనువేడెద ♦ వెలుపునుదీర్ప ♦ న్గరుడగమిత్రా.

27. కరిహరగరహా ♦ వెలుపునుదీర్పుము ♦ కరుణనువేడెద ♦ గరుడగమిత్రా.

28. గరుడగమిత్రా ♦ కరిహరగరహా ♦ కరుణను వేడెద ♦ వెఱపునుదీర్పఁగా.

29. గరుడగమిత్రా ♦ కరుణను వేడెద ♦ కరిహరగరహా ♦ వెఱపునుదీర్పఁగా.

30. గరుడగమిత్రా ♦ కరుణను వేడెద ♦ వెఱపునుదీర్ప ♦ న్గరిహరగరహా.

31. గరుడగమిత్రా ♦ వెఱపునుదీర్ప ♦ న్గరుణను వేడెద ♦ గరిహరగరహా.

32. కరుణను వేడెద ♦ గరిహరగరహా ♦ గరుడగమిత్రా ♦ వెఱపునుదీర్పఁగా.

33. కరుణను వేడెద ♦ గరుడగమిత్రా ♦ కరిహరగరహా ♦ వెఱపునుదీర్పఁగా.

34. కరుణను వేడెద ♦ వెఱపునుదీర్ప ♦ న్గరిహరగరహా ♦ గరుడగమిత్రా.

35. కరుణను వేడెదఁ ♦ గరిహరగరహా ♦ వెఱపునుదీర్ప ♦ న్గరుడగమిత్రా.

36. కరుణను వేడెద ♦ వెఱపునుదీర్ప ♦ న్గరుడగమిత్రా ♦ కరిహరగరహా.

37. కరుణను వేడెద ♦ గరుడగమిత్రా ♦ వెఱపునుదీర్ప ♦ న్గరిహరగరహా.

38. వెఱపునుదీర్ప ♦ న్గరుణను వేడెద ♦ గరుడగమిత్రా ♦ కరిహరగరహా.

39. వెఱపునుదీర్ప ♦ న్గరుడగమిత్రా ♦ కరుణను వేడెదఁ ♦ గరిహరగరహా.

40. వెఱపునుదీర్ప ♦ న్గరుణను వేడెదఁ ♦ గరిహరగరహా ♦ గరుడగమిత్రా.

41. వెఱపునుదీర్ప ♦ న్గరిహరగరహా ♦ కరుణను వేడెద ♦ గరుడగమిత్రా.

42. వెఱపునుదీర్ప ♦ న్వేఁడెదఁగరుణ ♦ న్గరుడగమిత్రా ♦ కరిహరగరహా.

43. వెఱపునుదీర్ప ♦ న్వేఁడెదఁగరుణ ♦ న్గరిహరగరహా ♦ గరుడగమిత్రా.

ఇందలి చంపకమాల.

44. వెఱపునుదీర్పనీకరుణ ♦ వేఁడెదనోగరహారిమిత్రుఁడా
పరగనుదీర్పనీచరితఁ ♦ బాడెదనోహరిహారినేత్రుఁడా
కొఱతనునార్పనీమఱుగుఁ ♦ గూడెదనోధరధారిగాత్రుఁడా
పరమునుజేర్పనీగరిమ ♦ వాడెదనోహరిధారిపాత్రుఁడా.

ఇది ఇంకేమువిధముల జదువదగిన క్రమము.

పరగనుదీర్పనీచరితఁ ♦ బాడెదనోహరిహారినేత్రుఁడా
కొఱతనునార్పనీమఱుగుఁ ♦ గూడెదనోధరధారిగాత్రుఁడా
పరమునుజేర్పనీగరిమ ♦ వాడెదనోహరిధారిపాత్రుఁడా
వెఱపునుదీర్పనీకరుణ ♦ వేఁడెదనోగరహారిమిత్రుఁడా.

ఇట్లే మూడవనాల్గవ పాదములతో మొదలిడిన మఱిరెండగును.

పరమునుజేర్పునీగరిమ ♦ వాడెదనోహరిధారిపాత్రుఁడా
కొఱతనునార్పునీమరుగుఁ ♦ గూడెదనోధరధారిగాత్రుఁడా
పరగనుదీర్పునీచరితఁ ♦ బాడెదనోహరిహారినేత్రుఁడా
వెఱపునుదీర్పునీకరుణ ♦ వేడెదనోగరహారిమిత్రుఁడా.

ఈల్యాస్టు ఫస్టు పద్యమును సహా 2, 3, 4 చరణములతో మొదలిడినమరి 3 అగును. ఇట్లు ప్రతిపద్యమును 8 లెక్కనుకాదగునుగాన ఇప్పటికి అయిన 44 ను 352 అగును. పైవన్నియు నిట్లేచదువ వీలైయుండుఁగదా.

ఇందలి కందములు.

1. కరిహారగరుడగమిత్రా । వెఱపునుదీర్పుగరహారి ♦ వేడెదఁగరుణన్
హరిశరహరివరనేత్రా । పరగనుదీర్పుహరిహారి ♦ పాడెదఁజరితన్.

2. దరహారతరళసుగాత్రా । కొఱతనునార్పుధరధారి ♦ కూడెదమరుగున్
హరిహరహరినుతిపాత్రా । వరమునుజేర్పుహరిధారి ♦ వాడెదగరిమన్.

3. కరిహారగిరుడగమిత్రా । పరగను దీర్పుహరిహారి ♦ పాడెదజరితన్
హరిశరహరివరనేత్రా । కొఱతనునార్పుధరధారి ♦ కూడెదమరుగున్.

4. దరహారతరళసుగాత్రా । వరమునుజేర్పుహరిధారి ♦ వాడెదగరిమన్
హరిహరహరినుతిపాత్రా । వెఱపునుదీర్పుగరహారి ♦ వేడెదఁగరుణన్

5. కరిహారగరుడగమిత్రా । కొఱతనునార్పుధరధారి ♦ కూడెదమరుగున్
హరిశరహరివరనేత్రా । వరమునుజేర్పుహరిధారి ♦ వాడెదగరిమన్.

6. దరహారతరళసుగాత్రా । వెఱపునుదీర్పుగరహారి ♦ వేడెదఁగరుణన్
హరిహరహరినుతిపాత్రా । పరగనుదీర్పుహరిహారి ♦ పాడెదఁజరితన్.

7. కరిహారగరుడగమిత్రా । వరమునుజేర్పుహరిధారి ♦ వాడెదగరిమన్
హరిశరహరివరనేత్రా । వెఱపునుదీర్పుగరహారి ♦ వేడెదఁగరుణన్.

8. దరహారతరళసుగాత్రా । పరగనుదీర్పుహరిహారి ♦ పాడెదఁజరితన్
హరిహరహరినుతిపాత్రా । కొఱతనునార్పుధరధారి ♦ కూడెదమరుగున్

ఉత్తరార్థచరణములను మొదటినుండి యొకటి విడుచుచు జదువగానీ 4 జోళ్ళు అయినవి. వానినే చివరనుండి యొక్కొక్కటి విడుచుచు జదివిన యెడమరి 4 జోళ్ళు అగును. అనగా ఆజోడుపద్యములె 8 జోళ్లయినవి. ఈగ్రంథమునందె వెనుక రెండువృత్తములందు చేసినమాదిరిని ఈ ప్రతిజోడును ఆరేసిజోళ్లుగా జేసినచో ఈ జోడే మొత్తమున 96 కందములగును. అందు పదియారు మాత్రము వచ్చినవి వచ్చి యెనుబది శేషించును. ఇంక నెన్ని జోళ్లు కందము లిందులభించితే అన్ని యెనుబదులగునుగదా.

## ఇంక నిందలి కందములజోళ్లు.

**2.** కరిహరకరుణను వేడెద । గరహారీ వెఱపుఁదీర్పు ♦ గరుడగమిత్రా
హరిశరచరితను బాడెద । హరిహారీ పరగఁదీర్పు ♦ హరివరనేత్రా.
దరహరమరుగునగూడెద । ధరధారీ కోతఱనార్పు ♦ తరళసుగాత్రా
హరిహరగరిమను వాడెద । హరిధారీ వరముఁజేర్పు ♦ హరినుతిపాత్రా.

**3.** గరహారి వెఱపుఁదీర్పుము । కరిహర వేడెదను గరుణ ♦ గరుడగమిత్రా
హరిహారి పరగఁదీర్పుము । హరిశర పాడెదను జరిత ♦ హరివరనేత్రా
ధరధారి కోఱతనార్పుము । దరహర కూడెదమమరుగు ♦ తరళసుగాత్రా
హరిధారి వరముఁజేర్పుము । హరిహర వాడెదను గరిమ ♦ హరినుతిపాత్రా.

**4.** కరుణను వేఁడెదఁగరిహర । గరహారీ వెఱపుఁదీర్పు ♦ గరుడగమిత్రా
చరితను బాడెదఁహరిశర । హరిహారీ పరగఁదీర్పు ♦ హరివరనేత్రా
మరుగునఁగూడెద దరహర । ధరధారీ కోఱతనార్పు ♦ తరళసుగాత్రా
గరిమను వాడెద హరిహర । హరిధారీ వరముఁజేర్పు ♦ హరినుతిపాత్రా

**5.** కరుణను వేడెదగరహా । కరిహర తీర్పుము వెఱపును ♦ గరుడగమిత్రా
చరితను బాడెదహరిహా । హరిశర తీర్పుము పరగను ♦ హరివరనేత్రా
మరుగునఁగూడెదధరధా । దరహర యార్పుము కోఱతను ♦ తరళసుగాత్రా
గరిమను వాడెదహరిధా । హరిహర చేర్పుము వరమును ♦ హరినుతిపాత్రా.

**6.** వెఱపును దీర్పుము కరుణను । గరహారీ యోకరిహర ♦ గరుడగమిత్రా
పరగను దీర్పుము చరితను । హరిహారీ యోహరిశర ♦ హరివరనేత్రా
కోఱతను నార్పుము మరుగున । ధరధారీ యోదరహర ♦ తరళసుగాత్రా
వరమును జేర్పుము గరిమను । హరిధారీ యోహరిహర ♦ హరినుతిపాత్రా.

7. వెఱపునుదీర్పుము వేడెద ♦ గరహారీయోకరిహర ♦ గరుడగమిత్రా
పరగనుదీర్పుముపాడెద । హరిహారీయోహరిశర ♦ హరివరనేత్రా
కోఅతనునార్పుముకూడెద । ధరధారీయోదరహర ♦ తరళసుగాత్రా
వరమునుజేర్పుమువాడెద । హరిధారీయోహరిహర ♦ హరినుతిపాత్రా.

8. గరహాగరుడగమిత్రా । వెఱపునుదీర్పుముకరిహర ♦ వేడెదఁగరుణన్
హరిహాహరివరనేత్రా । పరగనుదీర్పుముహరిశర ♦ పాడెదఁజరితన్
ధరధాతరళసుగాత్రా । కోఅతనునార్పుముదరహర ♦ కూడెదమరుగున్
హరిధాహరినుతిపాత్రా । వరమునుజేర్పుముహరిహర ♦ వాడెదగరిమన్.

9. గరుడగమిత్రాగరహా । వెఱపునుదీర్పుముకరిహర ♦ వేడెదఁగరుణన్
హరివరనేత్రాహరిహా । పరగనుదీర్పుముహరిశర ♦ పాడెదఁజరితన్
తరళసుగాత్రాధరధా । కోఅతనునార్పుముదరహర ♦ కూడెదమరుగున్
హరినుతిపాత్రాహరిధా । వరమునుజేర్పుముహరిహర ♦ వాడెదగరిమన్.

10. గరుడగమిత్రాకరిహర । వెఱపునుదీర్పుగరహారి ♦ వేడెదఁగరుణన్
హరివరనేత్రాహరిశర । పరగనుదీర్పుహరిహారి ♦ పాడెదఁజరితన్
తరళసుగాత్రాదరహర । కోఅతనునార్పుధరధారి ♦ కూడెదమరుగున్
హరినుతిపాత్రాహరిహర । వరమునుజేర్పుహరిధారి ♦ వాడెదగరిమన్.

ఇప్పటికి పై లెక్కనగునవి 800 ఇవికాక.

1. వెఱపునుదీర్పుమువేడెద । గరుడగమిత్రాకరుణను ♦ గరిహరగరహా
పరగనుదీర్పుముపాడెద । హరివరనేత్రాచరితను ♦ హరిశరహరిహా
కోఅతనునార్పుముకూడెద । తరళసుగాత్రామరుగున ♦ దరహరధరధా
వరమునుజేర్పుమువాడెద । హరినుతిపాత్రాగరిమను ♦ హరిహరహరిధా.

2. కరుణనువేడెదఁదీర్పుము । గరుడగమిత్రావెఱపును ♦ గరిహరగరహా
చరితనుబాడెదఁదీర్పుము । హరివరనేత్రాపరగను ♦ హరిశరహరిహా
మరుగునఁగూడెదనార్పుము । తరళసుగాత్రాకోఅతను ♦ దరహరధరధా
గరిమనువాడెదఁజేర్పుము । హరినుతిపాత్రావరమును ♦ హరిహరహరిధా.

3. గరుడగమిత్రావేడెదఁ । గరిహరనీకరుణఁదీర్పు ♦ గరహావెఱపున్
హరివరనేత్రాపాడెద । హరిశరనీచరితఁదీర్పు ♦ హరిహాపరగన్

తరళసుగాత్రాకూడెద | దరహారనీమరుగునార్పు ♦ ధరధా కొఱతన్
హరినుతిపాత్రావాడెద | హరిహారనీగరిమఁజేర్పు ♦ హరిధా వరమున్.

4. వెఱపునుదీర్పుము వేడెద | గరహారీనీదుకరుణ ♦ గరుడగమిత్రా
పరగనుదీర్పుముపాడెద | హరిహారీనీదుచరిత ♦ హరివరనేత్రా
కొఱతనునార్పుముకూడెద । ధరధారీనీదుమరుగు ♦ తరళసుగాత్రా
వరమునుజేర్పుమువాడెద | హరిధారీనీదుగరిమ ♦ హరినుతిపాత్రా.

ఈ 4 జోళ్లను పూర్వోత్తర పాదములర్థాను బంధముగలవిగనుక 4 డజనులకంటె ఎక్కువ కావు. కావున కందపద్యములు 848 మాత్రమెయైనవి.

## ఇంక నిందలి ఆటవెలదులు.

1. కరిహరగరహారి ♦ గరుడగమిత్రనీ | కరుణవేడెదనుర ♦ వెఱపుఁదీర్పు
హరిశరహరిహారి ♦ హరివరనేత్రనీ | చరితఁబాడెదనుర ♦ పరగఁదీర్పు
దరహరధరధారి ♦ తరళసుగాత్రనీ | మరుగుఁగూడెదనుర ♦ కొఱతనార్పు
హరిహరహరిధారి ♦ హరినుతిపాత్రనీ | గరిమవాడెదనుర ♦ వరముజేర్పు.

2. కరిహరగరహారి ♦ గరుడగమిత్రుఁడ | వెఱపుఁదీర్పుకరుణ ♦ వేడెదనుర
హరిశరహరిహారి ♦ హరివరనేత్రుఁడ | పరగఁదీర్పుచరితఁ ♦ బాడెదనుర
దరహరధరధారి ♦ తరళసుగాత్రుఁడ | కొఱతనార్పుమరుగుఁ ♦ గూడెదనుర
హరిహరహరిధారి ♦ హరినుతిపాత్రుఁడ | వరముఁజేర్పుగరిమ ♦ వాడెరనుర.

3. కరిహరగరహారి ♦ గరుడగమిత్రుఁడ | వేడెదనురకరుణ ♦ వెఱపుఁదీర్పు
హరిశరహరిహారి ♦ హరివరనేత్రుఁడ | పాడెదనురచరితఁ ♦ బఱగఁదీర్పు
దరహరధరధారి ♦ తరళసుగాత్రుఁడ | కూడెదనురమరుగుఁ ♦ గొఱతనార్పు
హరిహరహరిధారి ♦ హరినుతిపాత్రుఁడ | వాడెదనురగరిమ ♦ వరముఁజేర్పు.

ఈ మూడుజోళ్లను కందములవలె మూడు ఎనుబదులగును ఈలెక్కను ఆటవెలదులు 240 అగునుగదా.

## ఇంక నిందలి తేటగీతులు.

1. కరుణవేడెదఁగరిహర ♦ వెఱపుఁదీర్పు | చరితఁబాడెదహరిశర ♦ పరగఁదీర్పు
మరుగుఁగూడెదదరహర ♦ కొఱతనార్పు | గరిమవాడెదహరిహర ♦ వరముఁజేర్పు.

2. కరుణవేడెదగరహారి ♦ వెలఁపుదీర్పు | చరితఁబాడెదహరిహారి ♦ పరగఁదీర్పు
మరుగుఁగూడెదధరధారి ♦ కొలఁతనార్పు | గరిమవాడెదహరిధారి ♦ వరముఁజేర్పు.

3. వేడఁగరుణనుగరిహర ♦ వెలఁపుదీర్పు | పాడఁజరితనుహరిశర ♦ పరగదీర్పు
కూడమరుగునదరహర ♦ కొలఁతనార్పు | వాడగరిమనుహరిహర ♦ వరముజేర్పు.

4. వేడఁగరుణనుగరహారి ♦ వెలఁపుదీర్పు | పాడఁజరితనుహరిహారి ♦ పరగదీర్పు
కూడమరుగునధరధారి ♦ కొలఁతనార్పు | వాడగరిమనుహరిధారి ♦ వరముజేర్పు,

5. వెలఁపుఁదీర్పుముకరిహర ♦ వేడఁగరుణ | పరగఁదీర్పుముహరిశర ♦ పాడఁజరిత
కొలఁతనార్పుముదరహర ♦ కూడమరుగు | వరముఁజేర్పుముహరిహర ♦ వాడగరిమ.

6. వెలఁపుఁదీర్పుముగరహారి ♦ వేడగరుణ | పరగఁదీర్పుముహరిహారి ♦ పాడఁజరిత
కొలఁతనార్పుముధరధారి ♦ కూడమరుగు | వరముఁజేర్పుముహరిధారి ♦ వాడగరిమ.

ఈ యారును చంపకమాలలెక్కనుచూచినను 48 అగునుగదా.

## ఇంక నిందలి ద్విపదలు.

1. కరిహరగరహారి ♦ గరుడగమిత్ర | హరిశరహరిహారి ♦ హరివరనేత్ర.
2. దరహరధరధారి ♦ తరళసుగాత్ర | హరిహరహరిధారి ♦ హరినుతిపాత్ర.
3. గరహారికరిహర ♦ గరుడగమిత్ర | హరిహారిహరిశర ♦ హరివరనేత్ర.
4. ధరధారిదరహర ♦ తరళసుగాత్ర | హరిధారిహరిహర ♦ హరినుతిపాత్ర.
5. వెలఁపునుదీర్పుము ♦ వేడెదఁగరుణ | పరగనుదీర్పుము ♦ పాడెదఁజరిత.
6. కొలఁతనునార్పుము ♦ గూడెదమరుగు | వరమునుజేర్పుము ♦ వాడెదగరిమ.
7. వేడెదఁగరుణను ♦ వెలఁపునుదీర్పు | పాడెదఁజరితను ♦ బరగనుదీర్పు
8. కూడెదమరుగును ♦ గొలఁతనునార్పు | వాడెదగరిమను ♦ వరమునుజేర్పు.
9. ధీరసోదారధీ ♦ ధితదివ్యమూర్తి | వీరమానీంద్రసే ♦ వితవేదవర్తి.
10. తారలాప్వారునం ♦ తకుదండికీర్తి | నీరహిగ్రంధమీ ♦ నిలనిష్టపూర్తి.

ఇందు మొదటి 8 యుపూర్వార్థచరణము లట్టె యుంచుచు ఉత్తర చరణములనె మొదటి నుండి యొక్కొకటివంతున ముందును చివరనుండి యాలెక్కనె యటుపిమ్మటను వి డుచుచు జదివిన 128 కాగా చివర రెండుచేరి ద్విపదలు 130 యగునాయెను. ఈయు న్నియు దసరాచెపదుల్లుగను, పలువిధములైన స్త్రీలపాటలుగను పాడదగునవగును.

## ఇంకనిందలి నవవిధ రగడలు.

### హయప్రచారము.

1. కరిహరుండ ♦ గరళహారి | హరిశరుండ ♦ హరిజహారి.

2. దరహరుండ ♦ ధరజధారి । హరిహరుండ ♦ హరిజధారి.

3. కరుణవేడ ♦ వెలుపుఁదీర్పు | చరితఁబాడఁ ♦ బరగఁదీర్పు.

4. మరుగుఁగూడఁ ♦ గొలుతనార్పు । గరిమవాడ ♦ వరముఁజేర్పు.

ఈ నాలుగు 40 అగును.

### తురగ వల్గనము.

1. కరిహరాగరుడగమిత్ర ♦ కరుణవేడ వెలుపుఁదీర్పు
హరిశరాహరివర నేత్ర ♦ చరితఁబాడఁబరగఁదీర్పు

2. దరహరాతరళసుగాత్ర ♦ మరుగుఁగూడఁగొలుతనార్పు
హరిహరాహరినుతిపాత్ర ♦ . గరిమవాడవరముఁజేర్పు.

ఇది కందములజోడువంటిది మాత్రమెకాక సమచతుష్పదకూడనైనందున సర్వ సామాన్యము
గానె 160 కా జెల్లును.

### విజయమంగళము.

కరిహరాగరుడగమిత్రకరుణవేడవెలుపుదీర్పు ♦ హరిశరాహరివర నేత్రచరితఁబాడఁబరగఁదీర్పు
రాతరళసుగాత్రమరుగుఁగూడఁగొలుతనార్పుదరహ ♦ హరిహరాహరినుతిపాత్ర గరిమవాడ
వరముజేర్పు.

ఇది 16 అగుటకు అభ్యంతరమేమి ?

### ద్విరదగతి.

1. కరిహరాగరహారి ♦ కరుణవెలుపునుదీర్పు | హరిశరాహరిహారి ♦ చరితఁబరగనుదీర్పు.

2. దరహరాధరధారి♦మరుగుకొలుతనునార్పు| హరిహరాహరిధారి♦గరిమవరమునుజేర్పు.

ఇదియును 160 సాధారణమే.

## విజయభద్రము.

1. కరిహారాగరహారికరుణవెలుపునుదీర్పు ♦ హరిశరాహరిహరిచరితంబరగనుదీర్పు
దరహారాధరధారిమరుగుకొలుతనునార్పు ♦ హరిహరాహరిధారిగిరిమువరమునుజేర్పు.

ఇవియును 16 కానె అగునుగదా.

## మధురగతి.

1. కరిహారగరహా ♦ గరుడగమిత్రా ♦ హరిశరహరిహా ♦ హరివరనేత్రా.
2. కరుణనువేడెద ♦ వెలుపునుదీర్పుము ♦ చరితనుబాడెదఁ ♦ బరగనుదీర్పుము.
3. గరుడగమిత్రా ♦ కరుణనువేడెద ♦ హరివరనేత్రా ♦ చరితనుబాడెద.
4. కరుణనువేడెదఁ ♦ గరిహారగరహా ♦ చరితనుబాడెద ♦ హరిశరహరిహా.

ఇంక అసలుపద్యములో ఉత్తరార్థములట్టెయున్నది.

ఇట్లు చిల్లరలెక్కను 24 బయలువెడలి మార్పున 960 అయినను కాకుండవు.

## హరిగతి.

1. కరిహారగరహాగరుడగమిత్రా ♦ కరుణనువేడెదవెలుపునుదీర్పుము
హరిశరహరిహాహరివరనేత్రా ♦ చరితనుబాడెదఁబరగనుదీర్పుము.

ఇంక నుత్తరార్థముకద్దు ఇవియు 160 యగుంగదా.

## హరిణగతి.

1. గరుడగమిత్ర ♦ వెలుపునుదీర్పు ♦ హరివరనేత్ర ♦ పరగనుదీర్పు.
2. వేడెదఁగరుణ ♦ వెలుపునుదీర్పు ♦ పాడెదఁజరితఁ ♦ బరగనుదీర్పు.
3. కరిహారగరహా ♦ గరుడగమిత్ర ♦ హరిశరహరిహా ♦ హరివరనేత్ర.
4. కరుణనువేడ ♦ వెలుపునుదీర్పు ♦ చరితనుబాడఁ ♦ బరగనుదీర్పు.

దీనింగూడ మధురగతివలెనె 960 లెక్కచూచుకొనవచ్చును.

## వృషభగతి.

1. గరుడగమిత్రవెలుపునుదీర్పు ♦ హరివరనేత్రపరగనుదీర్పు
తరళసుగాత్రకొలుతనునార్పు ♦ హరినతిపాత్రవరమునుజేర్పు.

ఇట్టివి 240 అయినను ఉండకుండవు.

ఇందలి సీసములు.

1. కరిహరగరహారి ♦ గరుడగమిత్రుఁడ ♦ కరుణను వేఁడెద ♦ వెఱపుఁదీర్పు.

2. గరహారికరిహర ♦ గరుడగమిత్రుఁడ ♦ కరుణను వేఁడెద ♦ వెఱపుఁదీర్పు.

3. గరుడగమిత్రుఁడ ♦ కరిహరగరహారి ♦ కరుణను వేఁడెద ♦ వెఱపుదీర్పు.

4. గరుడగమిత్రుడ ♦ గరహారికరిహర ♦ కరుణను వేఁడెద ♦ వెఱపుదీర్పు.

5. కరిహరగరహారి ♦ గరుడగమిత్రుఁడ ♦ వేఁడెదఁగరుణను ♦ వెఱపుఁదీర్పు.

6. కరిహరగరహారి ♦ గరుడగమిత్రుఁడ ♦ వెఱపునుదీర్పుము ♦ వేఁడఁగరుణ.

7. కరిహరగరహారి ♦ గరుడగమిత్రుఁడ ♦ వెఱపునుదీర్పుము ♦ కరుణ వేఁడ.

ప్రథమపాదములుమాత్రమీయబడినవి. చంపకమాలలలెక్కను 56 కాఁగా.

ప్రధానపద్యముగాక 55 శేషించికాన్పించును.

ఓపికయుండి లెక్కచూచువారికి కందములు రగడలును
ఇంకఁ గొన్నియందలైనను తేలునట్లు
స్ఫురించును.

శ్రీమేధాదక్షిణామూర్తీశ్వరార్పణమస్తు.

ఇదిశ్రీమన్మేధాదక్షిణామూర్తీశ్వరాక్షీణకరప్రసాదలబ్ధకవితాభాగధేయ
నాదెళ్లపురుషోత్తమనామధేయబుధవిధేయ ప్రణీతంబయిన
శ్రీమదద్భుతోత్తరరామాయణమున
సర్వము సప్తమాశ్వాసము
సంపూర్ణము.

THE "KAPALEE" PRESS, MADRAS.